బి.ఎడ్/పండిట్/సెకండరీ గ్రేడ్ కోర్సులకు





# తెలుగు భాష బోధనా ప్రకాశిక

## TELUGU LANGUAGE & METHODS OF TEACHING

**Content & Methodology in Telugu**
**(For B.Ed. & Telugu Pandit Courses)**



రచన

**డాక్టర్ వడ్డి బాలిరెడ్డి**

ఎం. ఏ.(తె) ఎం. ఏ.(ఇం) ఎం. ఏ.(సం) ఎం.ఎడ్. పిహెచ్.డి

ఆంధ్రోపన్యాసకులు

గిద్దలూరు

**TELUGU LANGUAGE & METHODS OF TEACHING**

Dedicated to My Father

*Sri V. Narayana Reddy Garu*



First Edition - 1995



**Price :**

Student Edition : Rs. 43

Library Edition : Rs. 50

Publisher :-

Mrs. I. Naga Sujatha M.A., M.A., M.Ed

W/o Dr. V. Bali Reddy

Satyavolu (Po)

Racharla (Mandal)

Prakasam (Dt) A.P.



Type Setting by :

***Crystal Graphics***

# అభిలాష

అపు ఎడెపు ఎడో చిన్నపు ఎడు తెలుగు భాషా - సాహిత్యాల స్వరూప - స్వభావాల గురించి మాటాడాలనుకొన్న నా ఆ కోరిక నేటికి గట్టెక్కుతున్నందుకు సంబరపడుతున్నాను. అంతే కాదు ఈ తెలుగు భాషా-సాహిత్యాల స్వరూప-స్వభావాలను విద్యార్థుల హృదయాల్లో పదిల పఱిచి వారి మేధకు పదును పెట్టించే తీరును గురించి కూడా మాటాడే మహద్భాగ్యం కలిగినందుకు మహానంద సంభరితుడనౌతున్నాను. ఏ ఋణం తీరినా కన్నతల్లి ఋణం తీరనట్లు ఎంతగా తీర్చుకొన్నా మాతృభాషా ఋణం అంతగా తీర్చుకోలేనిది. మాతృ మూర్తిని మమతల సుమాలతో అలంకరించటమెంత ఆనందదాయకమో మాతృ భాషను మధుర భాషణాలతో అలరించటం అంత ఆనందదాయకం. అందుకే ఇంతకు ముందెందరో మహనీయులు మాతృ భాషను గుర్చి మాటాడినా, ఇపుడు నేనూ మాటాడుతున్నాను. నేను మాటాడడమే కాదు. మీతో మాటాడింప చేయాలన్నదే నా అభీష్టమైన అభిలాష.

నా ఈ మాటలకు రూపాన్ని ఇచ్చిన నా అర్ధాంగి శ్రీమతి నాగ సుజాత గారికి, ఈ మాటలను నామాటలుగా మీకు అందిస్తున్న "క్రిస్టల్ గ్రాఫిక్స్" వారికి, ఈ మాటల నిజానిజాలను నిగ్గుతేల్చే మేధావులైన సోదర అధ్యాపక బృందానికి, "ఆదర్శ విద్యా సంస్థ " యాజమాన్యం వారైన శ్రీ బి. తిమ్మయ్య మాస్టర్ గారికి, ఉత్సుకతతో ఎదురు చూసే విజ్ఞాన గుళికలైన విద్యార్థిలోకానికి సర్వధా కృతజ్ఞతలు.

దేవుడు పిలిస్తే 'పలికే శక్తి' కావాలి. ఆ 'పలికే శక్తి' ప్రసన్నం కావాలని, అందుకీ మాటలు ప్రసాదమైతే అంతకన్నా నాకింకొక ఆనందం లేదని ఆకాంక్షిస్తూ, ఈ మాటల గుణావగుణాల సూచనలకు స్వాగతం పలుకుతున్న

మీ

*డా. వి. బాలి రెడ్డి.*

# విషయ సూచి (INDEX)

## I. భాష 1 -10



## II. తెలుగు భాష 12-39



## III. తెలుగు సాహిత్యం 40-69

## IV. మాతృ భాషగా తెలుగు 70-94



## V. భాషా నైపుణ్యాలు 94-128

## VI. వివిధ బోధనా పద్ధతులు 128 - 172

**VII. బోధనా సహాయకారులు 172 - 192**



**VIII. మూల్యాంకనం 192 - 208**

# తెలుగు భాషా బోధనా ప్రకాశిక

# I. భాష

### భాష నిర్వచనం

బ్రహ్మ స్వరూపంగా భావింరబడుతున్న ఈ సృష్టి అనేక జీవులకు ఆధారభూతమైనట్టిది. ప్రతి జీవి తన నిత్యదైనందిన కార్యకలాపాల కోసం మరొక జీవి మీద ఆధారపడక తప్పటం లేదు అందుకోసమే ఒక జీవి మరొక జీవితో సహసంబంధ బాంధవ్యాలను ఏర్పరుచుకొంటున్నది. ఇలా జీవుల మధ్య ఏర్పడిన పరస్పర సంబంధానికి ప్రధాన కారణం ఆయా జీవులు సృష్టించుకొన్న 'సంజ్ఞలే' ఇట్టి ఈ సంజ్ఞలే లేకుంటే జీవుల మధ్య సన్నిహిత సంబంధం కనిపించదు. ఇలాంటి జీవుల్లో మానవుడు కూడ ఒకడు కనుక తదితర ప్రాణుల్లాగే ఇతడు కూడ వివిధ ప్రాణులతో సాన్నిహిత్యం కోసం, తన జీవన వ్యాపారం కోసం కొన్ని సంజ్ఞల్ని సృజించుకొన్నాడు. డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం ప్రకారం జంతువు (కోతి) రూపంలో ఉన్నట్టి మానవుడు క్రమంగా మానవునిగా పరిణమించడంలో అతని భౌతికాకారంలో పెను మార్పులు వచ్చినట్లుగనే ముఖ్యంగా అతని మానసిక శక్తుల్లో కూడ విప్లవాత్మకకమైన మార్పులు సంభవించాయి. అట్టి వాటిల్లో అత్యంత ప్రధానమైనది భాష. ఇతర ప్రాణుల్లాగా ఒకప్పుడు అవసరాలకోసం సంజ్ఞల్ని వాడుకున్న మానవుడు తన మానసిక శక్తిని ఉపయోగించుకొని వానికి కొన్ని సంకేతాల్ని తయారు చేసికొన్నాడు. అవే ధ్వని సంకేతాలు. ఇట్టి ఈ వ్యక్త రూప ధ్వని సంకతేతాల్ని స్థిరపరచటం కోసం, పదికాలాల పాటు నిలపడం కోసం తరువాతి దశలో మానవుడు వానికి లిఖిత రూప ధ్వని సంకేతాల్ని సిద్ధపరచాడు. ఇట్టి లిఖిత రూప ధ్వని సంకేతాల్నే మనం 'అక్షరాలు' అంటున్నాం. ఆ తరువాత ఒక అక్షరాన్ని మరొక అక్షరంతో కూర్చి కొన్ని పదాల్ని, ఒక పదాన్ని మరొక పదంతో కలపటానికి కొన్ని విభక్తుల్ని, పదాల విభక్తుల సహాయంతో కొన్ని వాక్యాలను తయారు చేయటంతో భాషకొక రూపం ఏర్పడింది.

కాబట్టి భాషను "సంఘజీవిమైన మానవుడు నిత్యదైనందిన జీవన వ్యాపారం కోసం తన భావాలను ఇతరులకు వ్యక్తీకరించటం కోసం ఇతరుల భావాలను తాను గ్రహించటానికి సృజించుకొన్న వ్యక్త రూప, లిఖిత రూప ధ్వని సంకేతాల క్రమబద్ధమైన అమరిక" గా భావింప వచ్చు.

ప్రాచీన పండితులు "భాషింప బడేది భాష, (భాష్యత ఇతి భాష) వ్యక్తమైన వాక్కే భాష"

(భాషా వ్యక్తాయాం వాచి) అని భాషను నిర్వచించారు.

పాశ్చాత్య పండితుల్లో పావ్‌లోవ్ భాషను "సంజ్ఞలను గురించిన సంజ్ఞ"గా నిర్వచించాడు.

Sturtvert అనే శాస్త్రవేత్త "యాదృచ్ఛికమైన నిర్మాణ సౌష్టవం కలిగి మానవ సమాజంలో భావ వినిమయానికి ఉపకరించే వాగ్రూప ధ్వని సంకేత సముదాయం" (Language is a system of arbitrary Vocal symbols through which members of a social group interact, co-operatae and transmit their culture) గా భాషను నిర్వచించాడు.

"మానవులు పరస్పరం తమ ఆలోచనలను యాదృచ్ఛిక నిర్మాణం కలిగినట్టి వాగ్రూప ధ్వనుల ద్వారా వ్యక్తం చేయగలిగినట్టి విధానమే భాష" (Language is a system of orbitrary Vocal symbols by which thought is conveyed from one human being to another) అని John P. Hurges నిర్వచించాడు.

Jesperson అనే పండితుడు "మానవుని అలవాట్లలో భాష విశిష్టమైనది. తన ఆలోచనలను. భావనలను ఇతరులకు తెలియ చేయటమే భాష యొక్క ఉద్దేశ్యం" (Language is a set of human habits, the purpose which is to give expression to thoughts and especially to impart them to others) అని భాషను గురించి వివరించాడు. అందుకే ఆంగ్లంలో దీనిని Vehicle of thought గా పిలిచారు. ఇట్టి ఈ పరమోన్నతమైన భాష సృష్టిలో మానవునికి మాత్రమే దక్కింది. కాబట్టే william James పండితుడు మానవుణ్ణి "భాషించు జంతువు" గా అభివర్ణించాడు.

# భాష పుట్టుకను గూర్చిన వాదాలు

(భాషోత్పత్తి వాదాలు)

భాష పుట్టుకను గూర్చి అనేక వాదాలున్నాయి.

1. భగవద్దత్తవాదం,
2. ధాతు వాదం.
3. విమర్శనా వాదం.
4. ప్రకంపనా వాదం.
5. యోహీవరో వాదం.
6. వ్యక్తీకరణ వాదం.
7. భౌవౌ వాదం.
8. పూపూ వాదం.

## 1. భగవద్దత్తవాదం (దైవ ప్రసాద వాదం)

భగవంతుడే భాషను సృష్టించి మానవులకు అందించాడని ఈ వాద సారం. హిందువులకు సంస్కృత భాష, మహమ్మదీయులకు అరబ్బీ భాష, క్రైస్తవులకు హిబ్రూ భాషలు దేవ భాషలని ఈ వాద నమ్మిక. ఈ వాదనే నిజమైతే మానవుడు పుట్టిన వెంటనే భాషను ఉపయోగించాలి. కాని అది జరగడం లేదు. అలాగే భగవంతుడే భాషను సృష్టించి ఉంటే అందరికి ఒకేరకమైన భాష ఉండాలి. కాని అలా జరుగలేదు, కాబట్టి ఈ వాదన హేతుబద్ధమైనది కాదు.

## 2. ధాతు వాదం

క్రియా బోధకాలగు ధాతువుల నుండి భాష పుట్టిందని ఈ వాదం వివరిస్తున్నది. కాని ధాతువులెలా పుట్టాయో ఇది వివరించదు. అలాగే ధాతువులే లేని భాషలు కొన్ని ప్రపంచంలో కనిపిస్తున్నాయి. వానిని గురించి ఈ వాదం ప్రస్తావించదు. అందుకే ఇది కూడా యుక్తి వంతం కాలేక పోయింది.

## 3. విమర్శనా వాదం. (సమాలోచన వాదం)

మానవులు పరస్పరం విమర్శించుకోవడం వలన భాష పుట్టిందని ఈ వాద తాత్పర్యం. భాషయే లేనప్పుడు వారెలా విమర్శించుకోవడం జరిగిందో ఇది వివరించలేక పోతున్నది కాబట్టే ఇది కూడ తర్కవంతం కాలేదు.

## 4. ప్రకంపనా వాదం (డింగ్ డాంగ్ వాదం)

ప్రకృతి అంతా లయాత్మకమని, అందుచేత ప్రతి పదార్థం ప్రకంపనాలను కలిగి ఉంటుందని,

ఇట్టి ఈ ప్రకంపనాలకు అనుకూలంగా మానవుని నోటి నుండి శబ్దాలు వెలువడతాయని. ఈ శబ్దాలే భాషకు ఆధారమని ఈ వాదం తెలుపుతున్నది. కేవలం ప్రకంపనాల ఆధారంగానే భాషా రూపాలైన శబ్దాలు పుడతాయనడం శాస్త్రసమ్మతమైన విషయం కాలేదు.

### 5. యోహిహో వాదం

బరువులు మోయుట, బట్టలుతుకుట, పరుగెత్తుట మొ.. పనులను మానవుడుచేస్తున్నప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు దీర్ఘంగా సాగడంతో ముఖ యంత్రమందలి కండరాలు బిగిసి నాద తంత్రులు ప్రకంపించడంతో కొన్ని ధ్వనులు పుడతాయని, అవే భాషకు మూలమని ఈ వాదసారాంశం. పనులు చేస్తున్న పుడు ధ్వనులు పుట్టినప్పటికీ, అవన్నీ అర్థవంతాలని చెప్పడం సమంజసం కాదు. అలాగే ఏదో ఒక పని చేస్తున్నప్పుడే భాష పుడుతుందనుకోవడం కూడ సరైనది కాదు.

### 6 వ్యక్తీకరణ వాదం (వివక్షావాదం)

భయం, కోపం, సంకోచం, సంతోషం మొ.. భావాలను వ్యక్తీకరించాలనే అభిలాష కొన్ని శబ్దాలను ఉచ్చరించటానికి కారణమై క్రమంగా భాష పుట్టిందని ఈ వాద తాత్పర్యం. అయా భావాలను వ్యక్తీకరించటానికి నేరుగా శబ్దాలను ఉచ్చరించడం జరిగిందనడం యుక్తం కాదు.

### 7. భౌవౌ వాదం (ధ్వన్యనుకరణ వాదం)

ధ్వనిని అనుకరించటం వలన భాష పుట్టిందని ఈ వాదం వివరిస్తున్నది. కా కా అనే కాకం, బే బే అనే భేకం, కూకూ అనే కోకిల. మే మే అనే మేక మొ.. పశు పక్ష్యాదులను అనుకరిస్తూ మానవుడు భాషను పుట్టించాడని ఈ వాదం నమ్ముతుంది. ధ్వన్యుత్పత్తి కారకాల వలననే భాష పుట్టిందనుకుంటే మౌన పదార్థాలైన నక్షత్రాలు, సూర్య చంద్రాదులు, పర్వతాలు మొ.. వానికి సంబంధించిన భాషను గురించి ఇది అసలు వివరించటమే లేదు.

### 8. పూపూవాదం (టక్ టక్ వాదం)

ప్రాక్తన మానవుడు తన భావాలను వెల్లడించటానికి వివిధ అవయవాలను క్రమ పద్ధతిలో కదుపుతూ, ఆ కదలికతో పాటు కొన్ని ధ్వనులను కూడ చేశాడని, అట్టి ధ్వని సంకేతాల వలననే భాష పుట్టిందని ఈ వాదం యొక్క వాదన. ధ్వని సంకేతాలకు అవయవ కదలికలే ఆధారమనడం సమంజసం కాదు.

భాషోత్పత్తికి సంబంధించిన పై వాదాలన్నీ లోప భూయిష్ఠాలే అయినప్పటికి భాష పుట్టుకను గూర్చి వివరించడంలో ఎంతో కొంత మేరకు దోహద పడుతూనే ఉన్నాయి.

## భాషావశ్యకత - ప్రయోజనాలు

సృష్టిలోని జీవరాశులన్నింటిలోకన్నా అత్యంత మేధావంతమైన జీవి మానవుడు. ఇట్టి మానవుడు ఇతర జీవరాశుల నుండి వేరు పడటానికి ప్రధాన కారణం అతడి భాషయే. భాష వలననే మానవుడు మానవుడనిపించుకొంటున్నాడు. (Man is man because of his speech)

భాషయే లేకపోతే మానవుడి మనుగడే లేదు. ఇటువంటి భాషావశ్యకతను మనం రెండు విధాలుగా గణించవచ్చును.

### 1. నిత్య జీవితంలో భాషావశ్యకత

మానవుడు సంఘజీవి. సమాజంలో అతడు బ్రతకాలంటే మరొక వ్యక్తితో సంబంధాన్ని ఏర్పరుచుకోవడం అతి సాధారణమైన విషయం. ఇలా వ్యక్తుల్ని ఒకరితో మరొకరిని కలిపే ప్రధాన సాధనం భాష. వ్యక్తి తన భావనల్ని, ఆలోచనల్నీ, అభిరుచుల్ని, ఆసక్తుల్నీ ఎదుటి వారికి చెప్పాలన్నా, ఎదుటివారి ఆయా విషయాదులను తాను గ్రహించాలన్నా ప్రధాన ఆధార భూమిక కేవలం భాష ఒక్కటే. లోకవ్యవహారానికి ప్రధాన రంగభూమి భాషయే. ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా, సామాజికంగా సాంస్కృతికంగా నూతన అంశాలను తెలిసికోవాలన్నా, తెలిసిన అంశాల ఆధారంగా అభివృద్ధిని సాధించాలన్నా ముఖ్యమైన హేతువు భాషయే. గతకాలపు జ్ఞానాంశాలను పొందాలన్నా, పొందిన జ్ఞానాంశాలను దూరప్రాంతాలకు చేరవేయాలన్నా భాషయే ఆధారం. వ్యక్తిని, అతని కుటుంబాన్ని, అతని సమాజాన్ని అభివృద్ధి మార్గం వైపు పయణింప చేసే మేటి సాధనం భాషయే. ఇలా భాష లేక వ్యక్తే లేడు. వ్యక్తి లేక సమాజమే లేదు. సమాజం లేక జీవితమే లేదు. అందుకే నిత్యజీవితంలో భాష అనేది మనిషికి ఆయువు పట్టు.

### విద్యార్జనలో భాషావశ్యకత

"విద్య లేని వాడు వింత పశువు' అనేది ఆర్యోక్తి. కాబట్టి ప్రతి వ్యక్తి విద్యను ఆర్జించి తీరవలెను. ఇట్టి విద్యార్జనకు భాష తొలి మరియు తుది మెట్టు. గురుముఖంగా నూతనాంశాలను విని తెలిసికోవాలన్నా, పాఠాల ముఖంగా క్రొంగ్రొత్త విషయాలను పఠించి గ్రహించాలన్నా ఏకైక సాధనం కేవలం భాష ఒక్కటే. మేధావులు, తత్త్వవేత్తలు, సంస్కర్తలు తాము గ్రహించిన తాత్త్వికాంశాలను, ప్రాపంచిక విషయాలను భావితరాల వారికి అందించటానికై నిక్షిప్తం చేయాలన్నా, అలా నిక్షిప్తం చేయబడిన వానిని గుర్తించాలన్నా భాష ఒక్కటే ఆధారం. "విద్యాయాం అమృత మశ్నుతే" శ్రీవిద్య అమృతం వంటిదని పెద్దల అభివాక్కు. అట్టి విద్యకు మూల సూత్రధారి కేవలం భాషయే. కాబట్టే భాష అమృత తుల్యమై విద్యాభవనానికి మూలపీఠంగా ఆధారభూతమౌతున్నది. ఒక్కమాటలో చెప్పాలంటే విద్య ఉత్సవ విగ్రహమైతే భాష దానికి మూల విరాట్టు.

## భాషా ప్రయోజనాలు

1. వ్యక్తి భావ జాలాన్ని ఇతరులకు వ్యక్తీకరించటానికీ, ఇతరుల భావ జాలాన్ని తాను గ్రహించటానికీ భాష చక్కగా ఉపయోగపడుతున్నది.
2. లోక వ్యవహారాన్ని ఇది చక్కగా సరళీకృతం చేస్తున్నది.
3. సమాజంలో వ్యక్తుల మధ్య సుహృద్భావానికిది తోడ్పడుతున్నది.

4. సంస్కృతి నాగరికతలను పెంపు చేయడంలో ఇది వినియోగపడుతున్నది.
5. సమాజంలో వ్యక్తుల మధ్య పరస్పర అవగాహనకిది చక్కగా దోహదపడుతున్నది.
6. విజ్ఞానాభివృద్ధికిది శక్తివంతంగా చేయూతనిస్తున్నది.
7. ఆలోచనా శక్తిని రేకెత్తించడంలో ఇది పని చేస్తున్నది.
8. వ్యక్తిత్వాన్ని, మూర్తిమత్వాన్ని పెంపుచేయడంలో ఇది ఉపకరిస్తున్నది.
9. లోకజ్ఞతకు, వ్యక్తుల మధ్య సన్నిహిత సంబంధానికి ఇది సాధనంగా ఉపయోగ పడుతున్నది.
10. ఇది జీవితాన్ని సుఖప్రదం చేస్తున్నది.
11. గత కాలపు జ్ఞాన విజ్ఞానాల నిధి తెలియ చేస్తున్నది.
12. గతకాలం నాటి, వర్తమాన కాలం నాటి జ్ఞానాంశాల నిధి భవిష్యత్కాలం వారికి అందిస్తున్నది.
13. ఎదురుగా ఉన్న వారితో పాటు ఎక్కడ ఉన్న వారితో కూడా ఇది సహ సంబంధాలను ఏర్పరుస్తున్నది.
14. సమస్త వస్తు పరిజ్ఞానాన్ని పొందటానికిది వినియోగపడుతున్నది.
15. సత్ప్రవర్తనకిది చక్కటి బాటగా నిలుస్తున్నది.

## ప్రపంచ భాషల వర్గీకరణ

మానవ జాతి అవసరాన్ని బట్టి, జీవన సౌకర్యాన్ని బట్టి ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో వివిధ వాతావరణాల్లో విస్తరించినట్లే, వారి దైనందిన కార్యకలాపాల్లో ప్రధాన భూమికను వహిస్తున్న భాష కూడ వివిధ రీతుల్లో వివిధ భేధాలతో విస్తరించినది. ఇలా నేటికి ప్రపంచ వ్యాప్తంగా ఉన్నట్టి భాషలను దాదాపు నాలుగు వేలుగా భాషా వేత్తలు భావిస్తున్నారు. ఇట్టి ఈ భాషలన్నీ వేరు వేరుగానే కనిపిస్తున్నప్పటికీ పుట్టుకలో కాని, రూపంలో కాని ఒకదానితో మరొకటి సంబంధాన్ని కలిగి ఉన్నట్లుగా తెలుస్తున్నది. ఈ ఆధారంతోనే ప్రపంచ భాషలను 1. జాత్యాశ్రిత వర్గీకరణ 2. రూపాశ్రిత వర్గీకరణ అని ప్రధానంగా రెండు వర్గాలుగా భాషావేత్తలు వర్గీకరించారు.

### I. జాత్యాశ్రిత వర్గీకరణ : (Geneological classification)

పుట్టుకలేదా జాతి ఆధారంగా భాషలను కొన్ని కుటుంబాలుగా వర్గీకరించటాన్ని జాత్యాశ్రిత వర్గీకరణ అంటారు. ఉదా.. సంస్కృతంలోని 'పితృ' అనే రూపానికి జందు భాషలోని 'పిత' లాటిన్‌భాషలోని 'ఫేతర్', పారసీకంలోని 'పిదర్' ఆంగ్లంలోని 'ఫాదర్', జర్మన్‌లోని 'పాటిర్' అనేవి

సాదృశ రూపాలు. అనగా ఈ పదాలన్నీ ఒకే మూల ధాతువు నుండి ఉద్భవించాయని తెలుస్తున్నది. దీనిని బట్టి ఈ భాషలన్నీ ఏదో ఒక ప్రాచీన భాష నుండి పుట్టాయని ఊహించవచ్చు. పుట్టుకలో ఇట్టి సాదృశ సంబంధం కలిగిన ఇలాంటి భాషలన్నింటినీ ఒక కుటుంబంగా నిర్ణయించారు. ఇలా జాత్యాశ్రిత వర్గీకరణననుసరించి ప్రపంచ భాషలను కొన్ని కుటుంబాలుగా విభజించారు.

**1. ఇండో యూరోపియన్ కుటుంబం:**

యూరోపియన్, నైబుతి ఆసియా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, తాస్మానియా, దక్షిణాఫ్రికా, ఈశాన్య భారతం మొ.. చోట్ల ఈ భాషలు కనిపిస్తున్నాయి. సంస్కృతం, జర్మని, ఇటలి, లాటిన్, గ్రీకు, కెల్టిక్, ఆల్బేనియ, ఆర్మీనియా, బాల్టోస్లోవిక్, ఇరాని, మొ.. ఈ కుటుంబంలో కనిపించే ముఖ్యమైన భాషలు. ప్రపంచంలో అత్యధికమంది ప్రజలు ఈ కుటుంబ భాషలనే ఉపయోగిస్తున్నారు. ఇవి ప్రత్యయాత్మకాలు.

**2. సెమిటో హెమిటిక్ కుటుంబం:**

అరేబియా, ఇరాక్, పాలస్తీనా, సిరియా, ఉత్తరాఫ్రికా, మడగాస్కరు, ఎతియోపియా, మాల్టా మొ.. ,చోట్ల ఈ భాషలు కనిపిస్తున్నాయి. హిబ్రూ, అరబ్బీ, ఎతియోపియా,కుషిటిక్, కోప్టిక్, లిబికోబెర్బర్, మొ.. ఇందులోని ముఖ్యమైన భాషలు. ఇవి కూడ ప్రత్యయాత్మకాలే.

**3. సీనో టిబెటన్ కుటుంబం.**

టిబెట్, బర్మా, సయాం, ఇండోచైనాలోని ఉత్తర భాగం, సింకియాంగ్ మొ.. ,చోట్ల ఇవి కనిపిస్తున్నాయి. ఇవి ప్రతి పదాత్మకాలు.

**4. జపానీ కొరియన్ కుటుంబం**

జపాన్, కొరియా, డచ్, ఈస్టిండిస్, ఫ్రెంచి, ఇండోచైనా, మలయా, మార్షల్ దీవులు, సయాం, బర్మా ఫిలిప్పీన్ మొ.. చోట్ల ఇవి కనిపిస్తాయి. ఇవి సంయోగాత్మకాలు.

**5. ఆఫ్రికన్ నీగ్రో కుటుంబం**

దక్షిణ మధ్య సహారా, పశ్చిమ ఎతయోపియామొ.. చోట్ల ఈ భాషలు కనిపిస్తున్నాయి. ఇవి ప్రతి పదాత్మకాలు.

**6. ద్రావిడ కుటుంబం**

దక్షిణ మధ్యభారతం, ఉత్తర సింహళం మొ.. చోట్ల ఈ భాషలు కనిపిస్తాయి. తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు మొ.. ఈ భాషా కుటుంబంలో ముఖ్యమైన భాషలు. ఇవి సంయోగాత్మకాలు.

**7. మలయో పోలినీషియన్ కుటుంబం**

మలయా, జావా, సుమత్రా, బోర్నియో, ఫిలిప్పీన్, మడగస్కర్, న్యూజిలాండ్ మొ.. ,చోట్ల ఈ భాషలు కనిపిస్తున్నాయి. ఇవి ప్రతి పదాత్మకాలు.

**8. ఊరల్ ఆల్టాయిక్ కుటుంబం**

ఫిన్‌లాండ్, ఎస్తోనియా, మొ.. చోట్ల ఈ భాషా కుటుంబాలు కనిపిస్తున్నాయి. ఇవి సంశ్లిష్టకాలు.

**9. అమెరికన్ ఇండియన్ కుటుంబం**

పశ్చిమార్ధ గోళమందంతటా ఈ కుటుంబ భాషలు కనిపిస్తున్నాయి. ఇవి బహు సంశ్లేషకాలు.

**10. కకేసియన్ కుటుంబం**

సోవియట్ యూనియన్ లోని కాకసస్ ప్రాంతంలో ఈ కుటుంబం భాషలు వాడుకలో ఉన్నాయి. ఇవి సంయోగాత్మకాలు.

**11. బాస్క్ కుటుంబం**

ఈశాన్య స్పెయిన్, నైఋతి ఫ్రాన్స్‌లలో ఈ కుటుంబ భాషలు కనిపిస్తున్నాయి. ఇవి సమ్మిశ్రణాత్మకాలు.

**12. ఇతర భాషలు**

పై కుటుంబాలలో ఏ ఒక్కదానికి చెందక ప్రత్యేకంగా ఉన్నట్టి భాషలే ఇతర భాషలు. ఇటలీలోని అత్యంత ప్రాచీనమైన ఎట్రుస్కన్, సుమేరియాలోని సుమేరియన్, ఈశాన్య సైబీరియాలోని హైపర్ బోరియన్, ఉత్తర జపాన్‌లోని ఐనూ, ఆగ్నేయాసియాలోని మోన్‌ఖ్మేర్, అన్నామీ, ముండ మొ.. ఈ రకమైన భాషలు.

## II రూపాశ్రిత వర్గీకరణ: (Syntactical or Morphological Classification)

రూపం లేదా ఆకృతి ఆధారంగా భాషలను కొన్ని వర్గాలుగా విభజించటాన్ని రూపాశ్రిత వర్గీకరణ అంటారు. అనగా ఇంచుమించు ఒకేరూపం కలిగిన భాషలను ఒక వర్గంగాను, అలాగే మరొక రూపం కలిగిన భాషలను మరొక వర్గంగాను విభజించడం. ఇట్టి ఈ రూపాశ్రిత వర్గీకరణననుసరించి ప్రపంచ భాషలన్నిటినీ ప్రధానంగా నాలుగు వర్గాలుగా విభజించారు.

**1. ప్రతి పదాత్మక భాషలు**

ఈ రకమైన భాషా పదాలు విభక్తులను కాని, ప్రత్యయాలను కాని పొందక, మరొక పదంపై ఆధారపడక స్వతస్సిద్ధంగా ప్రయోగింపబడును. ఒకే పదం దాని స్థానాన్ని, ఉచ్చారణను బట్టి వాక్యంలో భిన్న అర్థాలను ఇస్తుంది. చైనా, టిబెట్, బర్మాల భాషలు, సయామి, మలయా, సూడాని, మొ.. భాషలు ఈ రకమైన వానికి ఉదాహరణలు. ఇవన్నీ ఏకాచ్కాలు.

**2. సంయోగాత్మక భాషలు**

ఇవి ప్రకృతి, ప్రత్యాయాల సంయోగాల వలన ఏర్పడునట్టివి. ప్రకృతి ప్రత్యయాలను విడదీయటానికి వీలు కూడా ఉంటుంది. కాఫిర్, జులూ, తుర్క, మఘార్, సంతాలీ, ద్రావిడ భాషలు ఈ రకమైన వానికి ఉదాహరణలు. వీనికే సంచయాత్మక భాషలు., పదరూప భాషలు, ఆంగ్లంలో Agglutinative Languages అని పేరు.

### 3. ప్రత్యయాత్మక భాషలు

ఇవి కూడ సంయోగాత్మక భాషల వలెనే ప్రకృతి, ప్రత్యయాల సంసర్గం వలననే ఏర్పడతాయి. కాని ఈ ప్రకృతి ప్రతయయాల సంసర్గాన్ని సాధారణంగా విడదీయటానికి వీలుండదు. సంస్కృతం, పారశీకం, గ్రీకు, లాటిన్, మొ.. భాషలు ఉదాహరణలు. ఈ స్థితిని అనుసరించే సంస్కృతంలోని 'రామఅనే ప్రాతిపదిక విభక్తులను చేర్చుకొని రామః, రామమ్, రామేణ,రామాయ, రామాత్ అనే రూపాంతరల్లో కనిపిస్తుంది. విభక్తి రహితమైన రామ పదానికి సంస్కృతంలో ప్రయోగం లేదు.

### 4. సమ్మిశ్రణాత్మక భాషలు

ఈ రకమైన భాషల్లో వేరువేరు పదాలు ఒకటిగా కలిసిపోయి వాక్యంగాతయ్యారై, మొత్తం వాక్యమంతా ఒకే పదంగా కనిపిస్తుంది. ఉ.. దక్షిణ అమెరికాలోని చైరీ భాషలో "నాథోలితిన్" అనేది ఒక వాక్యం. "మా కొఱకు నావను తెమ్ము" అనేది దీని అర్థం. ఈ అర్థాన్ని ఇవ్వటానికి నాతేన్ (తెమ్ము) అమోఖల్ (నావ), నిన్, (మేము, మాకు) అనే మూడు పదాలు కలిసి ఒకేపదంగా మారి వాక్యంగా ప్రయోగింపబడుతున్నది. వీటినే ఆంగ్లంలో Poly - synthetic languages అని పిలుస్తారు.

## III. భౌగోళిక వర్గీకరణ (Geographical Classification)

పై విధంగా ప్రపంచ భాషలను ప్రధానంగా జాత్యాశ్రిత. రూపాశ్రిత. వర్గాలుగా విభజిస్తే, కొంత మంది మాత్రం ఆయా భాషలు మాట్లాడబడే భౌగోళిక ప్రదేశాలను బట్టి కొన్ని వర్గాలుగా విభజించారు. దీనకే భౌగోళిక వర్గీకరణ అని పేరు. ప్రపంచమంతా స్థూలంగా ఐదు ఖండాలుగా విభజింపబడటం వలన ఆయా ఖండాలలో ఉచ్చరింపబడే భాషలను ఆయా ఖండాల పేర్లతోనే వీరు పిలిచారు. ఉదా.. ఆసియా ఖండభాలు, ఆఫ్రికా ఖండ భాషలు, అమెరికా ఖండ భాషలు, ఆస్ట్రేలియా ఖండ భాషలు, యూరప్ ఖండ భాషలు.

## భారత దేశ భాషలు

ఉపఖండంగా భావింపబడుతున్న విశాల భారత దేశం విభిన్న భాషలకు ఆలవాలంగా ఉన్నది. దాదాపు 800 దాకా భారత దేశంలో భాషలున్నట్లు తెలుస్తున్నది. అయితే వీటిల్లో భాషా పరంగా. సాహిత్యపరంగా మిక్కిలి నుసంపన్నమైనవిగాబహుకొద్ది మాత్రమే కనిపిస్తున్నది. ఇప్పటి వరకు భారత రాజ్యాంగం గుర్తించిన భాషలు కూడ కేవలం 18మాత్రమే. ఇలా విస్తృతంగా ఉన్నట్టి భారతీయ భాషలను భాషావేత్తలు ఐదు కుటుంబాలుగా విభజించారు. అవి.. 1. ఆర్య కుటుంబం. 2. ద్రావిడ కుటుంబం. 3. ఆస్ట్రిక్ కుటుంబం. 4. ఏకాక్షర కుటుంబం. 5. అనిశ్చిత సముదాయం.

వీటిల్లో ఆర్య ద్రావిడ భాషా కుటుంబాలే అత్యంత ప్రముఖమైనవి.

### ఆర్య భాషా కుటుంబం

భారతదేశంలో అత్యధిక ప్రజలు మాట్లాడే భాషలు ఈ కుటుంబానికి చెందినవే. ఈ ఆర్య భాషలన్నీ ముఖ్యంగా ఉత్తర దేశానికి సంబంధించినవి. హింది. పంజాబి, గుజరాతి, రాజస్థాని, బీహారీ, బెంగాలి, అస్సామి, మరాఠి, కాశ్మీరి, సింధి, ఒరియా, లహందా మొ.. ఈ కుటుంబంలో ప్రముఖమైనవి. ఈ భాషలన్నింటికి మూల భాష సంస్కృతమని భారతీయుల అభిజ్ఞత. అందుకే "తల్లి సంస్కృతంబె ఎల్ల భాషలకన్" అనే మాట స్థిర పడి పోయింది.

### ద్రావిడ భాషా కుటుంబం

ఇవి ముఖ్యంగా దక్షిణ భారత దేశానికి సంబంధించిన భాషలు. తమిళ, కన్నడ, తెలుగు, మలయాళాలనేవి ఈ కుటుంబంలో ప్రముఖ భాషలు కాగా తుళు, తుద, బడగ, కొడగు, కోయ, కొండ మొ.. 23 భాషలు ఈ కుటుంబంలో కనిపిస్తున్నాయి. వీటన్నింటికీ ప్రాచీన ద్రవిడ భాష మూలమని చెబుతుంటారు.

## ద్రావిడ భాషల్లో తెలుగు ప్రాధాన్యం

ఆధునిక కాలంలో అనేక రంగాలతో పాటు భాషా రంగంలో కూడ తీక్షణ పరిశోధనలు సాగాయి. కొంతమంది భాషా వేత్తలు భాషా నిర్మాణాలపై కృషి చేస్తే, మరికొంతమంది వివిధ భాషల సంబంధంపై దృష్టిని నిలిపారు. బహుభాషా పరిచయస్తుతనైన రాస్మస్ రాస్క్ అనే భాషా శాస్త్రజ్ఞుడు క్రీ. శ. 181 8ప్రాంతంలో మొదటిసారిగా భారతదేశంలోని ద్రావిడ భాషల ఉనికిని గూర్చి ప్రస్తావించాడు. ఇతడు వీనిని 'మలబారు' భాషగా పిలిచాడు. ఫ్రాన్సిస్ W.ఎలిస్ అనే భాషా వేత్త ద్రావిడ భాషల గురించి క్రీ. శ. 1816 లోనే పేర్కొన్నాడని కొందరి భావన. కాని ద్రావిడ భాషల గురించి సమగ్రంగా పరిశోధించి, వానిని సిద్ధాంతీకరించిన ఖ్యాతి మాత్రం క్రీ. శ. 1857 లో బిషప్ కాల్డ్వెల్ కే దక్కింది. అయితే ఈయన అప్పటికి సిద్ధాంతీకరించిన భాషలు కేవలం 12 మాత్రమే ఈనాటికవి 23 అయ్యాయి. అవి 1.తెలుగు, 2.తమిళం, 3. కన్నడం, 4. మలయాళం, 5. కొడగు, 6. తుద, 7. తుళ, 8. బడగ, 9. ఇరుళ, 10. గోండి. 11. కోయ, 12. కొండ, 13. కుయి, 14. కులి, 15. పెంగో, 16. మండ, 17. కొలామి, 18. పర్జి, 19.ఒల్లారి, 20. గదబ, 21. కురుఖ్, 22. మాల్తో, 23. బ్రహుయి.

పై 23 ద్రావిడ భాషల్లో అన్ని విధాలుగా అభివృద్ధి చెందిన భాషలు తెలుగు, తమిళ, కన్నడ, మలయాళాలనే నాలుగు భాషలు మాత్రమే . వీటిల్లో కూడా తెలుగుదే స్థానమధికంగా

ఉన్నది. అందుకు క్రిందివి కొన్ని కారణాలు:-

1. మొత్తం భారత దేశంలోనే హింది తరువాత ఎక్కువమంది ప్రజల చేత మాట్లాడబడేది తెలుగు భాషయే! 2. ద్రావిడ భాషల్లో అన్నింటికన్నా అధిక వర్ణాలు తెలుగులోనే ఉండడం వలన అత్యంత సున్నితమైన. తీవ్రమైన భావజాలాన్నంతటిని సులభంగా వ్యక్తీకరించవచ్చు. 3. అర్ధానుస్వారం, దంత్య చ, జ లు తెలుగులోనే ఉన్నాయి. వీనివలన ధ్వనిని ఉన్నదున్నట్లుగా Record చేస్తు తెలుగుభాష శక్తివంతమౌతున్నది. 4. అభివృద్ధి చెందిన సంస్కృత భాషతో సాన్నిహిత్యాన్ని పొందితన పదజాలాన్ని విశేషంగాపెంచుకొన్నది. 5.య , ర , ల , వ ల లఘు అలఘుత్వం తెలుగులోనే విశేషంగాఉండడం వలన ధ్వనికి తగిన ఉచ్చారణ సాధ్యమౌతున్నది. 6. అన్య దేశీయ పదజాలాన్ని సులభంగా గ్రహించుకొనే శక్తి తెలుగు భాషకు అధికంగా ఉన్నది. ఈ విషయాన్నే జె. బి. యన్. హాలెన్ వివరిస్తూ మిగిలిన భారతీయ భాషలకంటె తెలుగుభాష విదేశీ పదాల్ని సులభంగా ఇముడ్చుకోగలిగిందన్నాడు. 7. సర్వసమగ్రమైన ఛందస్సు తెలుగులోనే కనిపిస్తున్నది. 8. సంస్కృతం, ఆంగ్లం, ఉర్దూ ఇత్యాది బాగా అభివృద్ధిని సాధించిన భాషల్లోని సాహిత్య ప్రక్రియల్లో దాదాపు అన్నింటినీ ఇది స్వంతం చేసికొని సాహిత్య ప్రక్రియా పరంగా ఉన్నతస్థానాన్ని పొందినది. 9. విశేషగుణకమైన అజంతత్వాన్ని సహజలక్షణంగా పొంది సంగీతానుకూలంగా ఉంటూ ప్రపంచ సాహితీ పరులని ఆకర్షిస్తున్నది.

తెలుగు భాష ఔన్నత్యాన్ని గూర్చి వివరిస్తూ ముఖ్యంగా స్వరానుకూలతను ఉద్దేశించి కాల్డ్వెల్ "స్వర మాధుర్యం చేత ద్రావిడ భాషలందు తెలుగు మొదటి స్థానాన్ని ఆక్రమించుకున్నద"ని వక్కాణించాడు. గ్రియర్సన్ పండితుడుకూడా స్వర మాధుర్యాన్ని వ్యంజిస్తూనే "తేనె వంటి భాష తెనుగు" అని ప్రవచించాడు. అజంతత్వాన్ని ఆధారం చేసికొనే ఇంకా పాశ్చాత్య పండితులు కొందరు తెలుగు భాషను "Italian of the East "గా ప్రవచించారు. కవి సార్వభౌముడైన శ్రీనాథుడు , బహు భాషా కోవిదులైన శ్రీ కృష్ణ దేవరాయలు "దేశ భాషలందు తెలుగు లెస్స" అని సగౌరవంగా కొనియాడారు. ఒకప్పుడుఅనాగరికి భాషలైన ద్రావిడ భాషల్లో పుట్టిన తెలుగు నాగరిక భాషయైన సంస్కృత భాషలో స్థిరపడటాన్ని చూస్తే దీని ఉన్నత స్థానాన్ని మనం సులభంగానే గణించవచ్చు.

# II. తెలుగు భాష

## ఆంధ్రం - తెలుగు - తెనుగు

యూరోపియనులు " జెంటూ భాష" (Zentoo Language) అనీ, తమిళులు, 'వడుగ భాష' అని తెలుగును ఒకప్పుడు పిలిచారు. కాని నేడు ఈ రెండు పదాలతో కాక "ఆంధ్రం -తెలుగు - తెనుగు" అనే మూడు పదాలతో తెలుగు భాష కనిపిస్తున్నది. అయితే మూడు పదాలు భాషాపరంగానే కాకజాతి , దేశ పరంగా కూడా క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

**ఆంధ్రం:-**

తెలుగు, తెనుగు పదాల కన్నా ముందు కనిపిస్తున్న పదం ఆంధ్రం. ప్రాకృత పదమైన "అంధక" శబ్దాన్ని సంస్కృతికరిస్తే ఏర్పడిందే ఆంధ్ర శబ్ధం, దీని తరువాతి పరిణామ రూపమే 'ఆంధ్ర' శబ్దం. ఇవి ముందు టజాతిపరంగా కనిపించి ఆ తరువాత క్రమంగా దేశ, భాషల పరంగా వ్యాప్తిని పొందింది.

**జాతిపరంగా ఆంధ్రం:-**

ఋగ్వేదంలోని ఐతరేయ బ్రహ్మణంలో ఆంధ్రపదం ప్రథమంగా జాతిపరంగా కనిపిస్తున్నది. ఆ తరువాత సంస్కృతరామాయణమహాభారతాల్లోను, భరతుని నాట్యశాస్త్రంలోను, పురాణాల్లోను, వాత్సాయనుని కామ సూత్రాల్లోను, మెగస్తనీస్ గ్రంథమైన ఇండికలోను, ప్లినీ రచనల్లోను, బౌద్ద జాతక కథల్లోను; అశోకుని 13 వ స్తంభ శాసనంలోను ఇది జాతి పరంగా వాడబడినది.

**దేశ పరంగా ఆంధ్రం:-**

సంస్కృతరామాయణ - మహాభారత - భాగవతాల్లోను, బౌద్ధవాఙ్మయంలోను పల్లవుల్లోని శివస్కంద వర్మ మైదవోలు శాసనం లోనూ, క్రీ.శ. 4వ శతాబ్దంలోని బాణరాజుల శాసనాల్లోను, వెలనాటి చోడుల శాసనాల్లోనూ ఇదిదేశ పరంగా వాడబడినది.

**భాష పరంగా ఆంధ్రం:**

భరతుని నాట్య శాస్త్రంలోనూ, నన్నయ్య నందంపూడి శాసనంలోనూ, అతని మహాభారతంలోనూ ఈ పదం ప్రయోగింపబడినది. అలాగే అతని మరో గ్రంధమైన 'ఆంధ్ర శబ్ద చంతామణి' నామ నిర్దేశంలోను అతడాశబ్దాన్ని వాడాడు. తరువాత కేతన కూడా గ్రంధనామ నిర్దేశానికై ఈ పదాన్ని ప్రయోగించాడు. (ఆంధ్ర భాషా భూషణం)

### తెలుగు:

త్రిలింగ శబ్ద భవమే తెలుగని కొందరు, 'త్రికళింగ' శబ్ద భావమే తెలుగని మరికొందరు వాదిస్తున్నారు.

### జాతిపరంగా తెలుగు

క్రీ.శ. 150ప్రాంతంలోని 'టాలమి' తన గ్రంథంలో 'త్రిలింగాన్' అనే పదాన్ని జాతిపరంగా ఉపయోగించాడు. బర్మాలో 'తలైంగు' అనే జాతి-ప్రజలున్నట్లు తెలుస్తున్నది. తెలింగ, తైలింగ, తిలింగ అనే శబ్దాలు జాతిపరంగా అనేక శాసనాల్లో కనిపిస్తున్నాయి. దీనిని బట్టి తెలింగ, తిలింగ శబ్దాల సంస్కృతీకరణమే 'త్రిలింగ' శబ్దమని భావింపవచ్చు. దక్షిణ భారతదేశంలో నివశించే అనేక జాతుల్లో తెల్ అనేది కూడ ఒక జాతి అని, ఈ జాతి ప్రజలనే తమిళులు 'వడుగరు' లు(ఉత్తర భాగంలో నివసించే వారు) గ పిలిచారని తెలియ వస్తున్నది. విష్ణు పురాణంలోని "తెలంగాణా భూమ్యములు" అనే ప్రయోగం 'తెలుగు వారి భూములు' అనే అర్థంలోనే వాడబడింది. కృష్ణదేవరాయులు తనను "తెలుగు వల్లభుండు" గా పేర్కొన్నాడు.

### దేశపరంగా తెలుగు

శ్రీశైలం, కాళేశ్వరం, ద్రాక్షారామం అనే మూడు ప్రసిద్ధ శివలింగాల మధ్య దేశమే త్రిలింగ దేశమనీ అదే తెలుగు దేశమనీ విద్యానాథుడు పేర్కొన్నడు. దీనిని అప్పకవి, విన్నకోట పెద్దనలు కూడ బలపఱిచారు. పెక్కు శాసనాల్లో కూడ త్రికళింగ శబ్దం కనిపిస్తున్నది. తెలుగు+ ఆణెము = తెలంగాణము. ఇక్కడ ఆణెము అనగా దేశమని కాబట్టి తెలంగాణమనగా తెలుగుదేశమనీ కొందరి భావన. స్కంద - బ్రహ్మాండ పురాణాల్లోనూ విద్ధసా భంజిక లోనూ త్రిలింగ శబ్దం దేశ పరంగానే వాడబడినది.

### భాషా పరంగా తెలుగు

తొలుత తెలుగును భాషా పరంగా ప్రయోగించిన ఘనత పాల్కురికి సోమనలే దక్కింది. తరువాత శ్రీనాథుడు (క్రీడాభిరామంలో), కృష్ణదేవరాయలు (ఆముక్తమాల్యదలో)" దేశభాషలందు తెలుగు లెస్స" అని తెలుగును భాషా పరంగా ప్రయోగించారు.

### తెనుగు

త్రినగ శబ్ద భవమే తెనుగని పెక్కురి వాదన.

### జాతి పరంగా తెనుగు

తెన్+అగు = తెనుగు, ఇందు 'తెన్' అనే ధాతువుకు 'దక్షిణ దిక్కు' అనేది అర్థమని, కాబట్టి, దక్షిణాపథంలో నున్న ఆంధ్రులే తెనుగువారని ప్రసిద్ధిలో ఉన్నది.

### దేశ పరంగా తెనుగు

శ్రీశైలం, కాళహస్తి, మహేంద్రాచలం అనేవి మూడు ప్రసిద్ధ త్రినగాలని, ఈ త్రినగాల

మధ్యస్థ భూమియే త్రినగమనీ, త్రినగ శబ్దం నుండి పుట్టిందే తెనుగని అదే తెనుగు దేశమనీ వ్యవహారం.

## భాషాపరంగా తెనుగు

మహా భారత రచనలో నన్నయ., నన్నెచోడుడు, తిక్కన లాంటి కవివరేణ్యులు తెనుగును భాషా పరంగా ప్రయోగించారు. 'తేనె యగు భాషయే తెనుగని ' (తేనె +అగు = తెనుగు) గ్రియర్ సన్ పండితుడు తెలిపాడు.

ఇటీవలి కాలంలో 'తెనుగు' అనే శబ్దం జాతి, దేశ, భాషల పరంగా అంతగా ప్రాచుర్యంలో లేదుకాని ఆంధ్రశబ్దం మాత్రం ముఖ్యంగా దేశ పరంగా తెలుగు శబ్దం మాత్రం ముఖ్యంగా భాషపరంగా స్థిరపడ్డాయి. అందుకు కారణాన్ని క్రంది విధంగా ఊహించవచ్చు.

స్వదేశీయమా? విదేశీయమా?అనే ప్రశ్నలను అవతల పెడితే భారత దేశంలోని జాతులన్నింటిలోకెల్లా ఆర్యజాతికి పూజ్యతా భావం అధికంగా ఉండేది. ఉత్తర భారతదేశంలోనే ఉంటున్న ఈ ఆర్య జాతుల్లో ఒకటైన 'అంధక' జాతి కారణ వశాత్తు దక్షిణాపథానికి చేరి అక్కడ స్వతస్సిద్ధంగా ఉన్నట్టి అనాగరిక ప్రజలను అణగద్రొక్కి అభివృద్ధిని సాధించి క్రమంగా హద్దులను నియమించుకొని దేశాన్ని పాలించారనీ, వారే శాతవాహనులనీ, వీరే ఆంధ్రదేశాన్ని పాలించిన తొలి రాజులనీ, వీరు అంధక జాతీయులు కావటం వలన వారి పేరు మీదుగానే వారు పాలించిన దేశానికి ఆంధ్రదేశమనే వ్యవహారం ఏర్పడిక్రమంగా అదే స్థిరపడి ఈనాటికి కూడ నిలిచి ఉన్నదనీ భావించవచ్చు. ఆర్యులకు మాదిరే వారి భాషైన సంస్కృతానికి కూడ పూజ్యతా భావం ఎక్కువ కావడం వలన ప్రాకృతమైన అంధక శబ్దాన్ని సంస్కృత భాషలోకి అందంగా 'ఆంధ్రం' గా సంస్కరించి క్రమంగా భాషా పరంగా వ్యాప్తిలోనికి తెచ్చారని చెప్పవచ్చు. ఇదే భావన మనకు నన్నయలో కనిపిస్తున్నది. ఆయన తెలుగుభాషకు వ్యాకరణ నియమావళిని రచించటానికి పూజ్యతా భావంతోనే సంస్కృత భాషను గ్రహించాడు. అలాగే ఆ గ్రంధానికి ఆయన పెట్టిన పేరులోని శబ్దాన్నీ కూడ సంస్కృతాలే. అంతేగాక ఆయనరచించినమహాభారతంలో మూడొంతుల రెండు భాగాలు సంస్కృత పదాలే.

అయితే నిశితంగా ఆలోచిస్తే దక్షిణాపథంలో నున్న అనేక జాతుల్లో 'తెల్' అనేది ఒకటనీ, వీరు అతి ప్రాచీన కాలంలో అత్యంత అనాగరికంగా ఉండేవారనీ, వీరు మాట్లాడే భాషయే తెలుగనీ, కాని వీరిని అంధక జాతి ప్రజలు అన్ని రంగాల్లో అణగ ద్రొక్కారనీ, దానితో వీరు అనామకులయ్యారనీ, అయితే కాలక్రమంలో దేశీయులకు, దేశీయతకు ప్రాచుర్యం వచ్చిందనీ అందుకే 12వ శతాబ్దంలోని నన్నెచోడుడు దేశీయతకు ప్రాధాన్యమిస్తే, అతని సమకాలికుడైన పాల్కురికి సోమన కేవలం దేశీయత కోసమే సాహిత్యాన్ని సృజించడమే కాక, తెలుగు పదాన్ని భాషాపరంగా ప్రప్రథమంగా ప్రయోగించాడనీ, తరువాతి కాలంలో కూడ సంస్కృత ప్రభావం దీనిపై బలంగానే ఉన్నప్పటికీ,స్వతసిద్ధంగా ఇది ద్రావిడ భాషా సంబంధి కావడం వలన దాని స్వయం ప్రతిపత్తిని కాపాడుకొంటు భాషాపరంగా తెలుగుగానే స్థిరపడినట్లు చెప్పవచ్చు.

# తెలుగు భాష పుట్టుక - క్రమవికాసం

అతి ప్రాచీన కాలంలో దక్షిణాపథంలోని అనేక అనాగరిక జాతుల్లో 'తెల్' జాతి ఒకటని, ఈ జాతి ప్రజలు తమిళ దేశానికి ఉత్తరభాగంలో నివసించారనీ, వీరి భాషయే తెలుగనీ పైన తెలనసికొన్నాం. అయితే ఈ దక్షిణా పథవాసులంతా ఆచార వ్యవహారాల్లో, సంస్కృతి సంప్రదాయాల్లో దాదాపుగా ఒకటిగానే ఉంటూ జీవనవ్యాపారానికై ఒకే భాషను ఉపయోగించారనీ, 'అదే మూల ద్రావిడ' భాషని స్పష్టమౌతున్నది. ఈ మూల ద్రావిడ భాష కాలక్రమంలో అతి సహజంగానే అనేక మాండలికాలుగా, భాషలుగా విభక్తమైందనీ, ఇట్టి ఈ భాషలన్నీ 1. దక్షిణ ద్రావిడ, 2. మధ్య ద్రావిడ, 3. ఉత్తర ద్రావిడ భాషలు అనే మూడు ప్రధాన శాఖలుగా ఏర్పడ్డాయవి, వీటిల్లో తెలుగు తొలి రోజుల్లో మధ్య ద్రావిడ భాషల్లోనే ఉంటూ క్రమంగా దక్షిణ ద్రావిడ భాషలతో సాన్నిహిత్యాన్ని పొంది దక్షిణ...మధ్య ద్రావిడమనే ప్రత్యేక నాలుగో శాఖలో చేరిందనీ తెలుస్తున్నది. అయితే ఈ ద్రావిడ భాషల నుంచి తెలుగు స్వతంత్రంగా ఎపుడు విడివడిందో ఇదమిద్ధంగా తెలియడం లేదు కాని క్రీ. పూ. 5వ శతాబ్దంనాటికల్లా ప్రత్యేక భాషగా బయటికొచ్చిందని మాత్రం సూచనగా తెలుస్తున్నది. క్రమంగా ఇది ప్రజల వాడుక భాషయై లిపిని కూడ సంతరించుకొన్నది. క్రీ. పూ. 271 ప్రాంతం నుంచి ప్రాకృతాన్ని రాజభాషగా గ్రహించి ఆంధ్రదేశాన్ని ఆంధ్రశాతవాహనులు పాలిస్తున్న కాలంలో సంస్కృతం విద్వద్భాషగా గౌరవం పొందింది. తెలుగు మాత్రం అనాగరిక అతి సాధారణ ప్రజావాడుక భాషగానే మిగిలిపోయింది. అయితే అలాగే ఉండిపోక క్రమంగా అభివృద్ధిని సాధిస్తూ ప్రాకృత వాఙ్మయంలో చోటు చేసికొన్నది. క్రీ.శ. 67 ప్రాంతంలోని శాతవాహన రాజైనట్టి హాలుడు, తాను సంకలనం చేసిన 'గాధా సప్తశతి' గ్రంథంలో పోట్టం (పొట్ట) పడ్డ(పాడి)పిలుతి(పిల్లి) ఫలహి (ప్రత్తి), అత్తా, అమ్మి, మొ.. గు తెలుగు పదాలనుప్రయోగించాడు. అలాగే క్రీ. శ. 1వ శతాబ్దికి చెందిన అమరావతి స్తూప శిలపై 'నాగబు' అనే పదం కనిపిస్తున్నది. ఇందు 'నాగ' శబ్దం సంస్కృతం కాగా దాని తత్సమ రూపమే 'నాగబు' పదం. అలాగే ఇదే శాసనంలో కనిపిస్తున్న "ఊరు, పాడు" శబ్దాలు కూడ తెలుగు భాషా సంబంధాలే. ఇలా తెలుగు పదాలు క్రమంగా ప్రాకృత సాహిత్యంలోనే కాక శాసనాల్లో కూడా అతి సాధారణంగా ప్రయోగింపబడ్డాయి. లేపురక, హిరలూర, కుడూర, చెన్దలూర, కణ్డకూర, కరుపూర, పెఱుకపఱ్ఱు , తానికొన, కుదురు., వఱ్ఱు, కొండ దాలూర. పాణూరు, ఒజ్జోడు, విరివఱ, కొండకి, కుణ్డూరు వేంగీ, పురె, ఏళూరె, చెఱ్ఱుఱువ మొ.. తెలుగు పదాలు వివిధ శాసనాల్లో విరివిగా కవిపిస్తున్నాయి. ప్రాకృత శాసనాల్లోనే కాక సంస్కృత శాసనాల్లో కూడ తెలుగు పదాలు కన్పించడం మొదలైనది. అచ్చంగా తెలుగు భాషలోనే శాసనాలు రావడం జరిగింది. అలా లభించిన మొట్టమొదటి తెలుగు శాసనం కడపజిల్లా కమలాపురంలోని క్రీ. శ . 575 నాటి 'ఎర్రగుడి పాడు' శాసనం, క్రీ. పూ.641 నాటి జయసింహ వల్లభుని 'విప్పర్తి' శాసనంలో తెలుగు సంస్కృత పదాల మిళితమైన వాక్య నిర్మాణం కన్పడుతున్నది. ఇలా తెలుగు భాష పద్య రూపంలో కూడా శాసనాల్లో కనిపించడం మొదలైంది. క్రీ. శ. 610 నాటి పోట్లదుర్తి 'మాలెపాడు శాసనం' పైకి వచనంలాగ కనిపించినా 'ద్విరగతి రగడ' లక్షణాలను అది పుణికి పుచ్చుకొన్నది. సంపూర్ణసల్లక్షణమైన మొదటి ఛందోబద్ధ శాసనం క్రీ.శ.848 నాటి పండరంగుని 'అద్దంకి శాసనం'. ఇందు 'తరువాజ' పద్యం ప్రయోగింపబడింది. అదే కాలంలోని కందుకూరి

శాసనంలో సీస పద్యం వాడబడింది. అలాగే క్రీ. శ. 885నాటి యుద్ధమల్లుని 'బెజవాడ శాసనం'లో 'మధ్యాక్కరలు' కనిపిస్తున్నాయి. క్రీ. శ. 980 ప్రాంతంనాటి 'ఆరుంబాక సంస్కృత శాసనం'లో తెలుగు లక్షణాలతోటి 'కందపద్యం' కనిపించినది. అలాగే 'సాతులూరి శాసనం' లో తెలుగు లక్షణాలతోటి 'చంపకమాల వృత్తం ' కనిపించినది. ఇలా దిక్కు మొక్కు లేని అనాగరిక తెలుగు భాష రాజ భాషయైన ప్రాకృతంలో కలిసిపోవటమే కాక, నాగరికమైన సంస్కృత సాహిత్యంతో క్రమంగా సాన్నిహిత్యాన్ని పెంచుకొన్నది. సంస్కృతానికి అందించే విధంగా ఛందస్సులో అభివృద్ధిని సాధించి గీత రచనకు తోడ్పడింది. ఇలా వాడుక భాష, వాడుకేతరమైన శాసన - కవితా భాషలనే రెండు శాఖలు తెలుగులో సూచనగా పొడసూపాయి. అలా క్రీ. శ. 11వశతాబ్దం నాటికి తెలుగు భాషా పరంగా, సాహిత్యపరంగా ఒకరకమైన రూపాన్ని సంతరించుకొన్నది. అయితే అది సంపూర్ణమైన, సమగ్రమైన రూపం మాత్రం కాదు. ఎందుకంటే భాషాపరంగా అప్పటి తెలుగులో ధాతునిర్మాణం, విభక్తుల ప్రయోగం, స్పష్టమైన లింగ - వచన భేధాలు. అర్థ నిర్ణయం, సంధివిధానం, వాక్య నిర్మాణం ఇత్యాదుల్లోనూ, సాహిత్యపరంగా వస్తు స్వీకరణ, తద్వ్యక్తీకరణ, పదకూర్పు, శైలి, విన్యాసం, ఛందోలంకార ప్రయోగంఇత్యాదుల్లోనూ స్థిరమైన నియమమంటూ కనిపించడం లేదు. అందుకే అప్పటి తెలుగును భాషావేత్తలు ద్రవరూప తెలుగుగా అభివర్ణించారు.

క్రీ. శ. 11వ శతాబ్దంలో తెలుగులో భాషాపరంగా సాహిత్యపరంగా విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. ఆ మార్పులన్నింటికి ప్రధాన కారకుడు నన్నయ భట్టారకుడు. అతడు తెలుగు భాషను సంస్కరిస్తూ, నియమ నిబంధనలను ఏర్పాటు చేస్తూ ఒక మహా కావ్యాన్ని నిర్మించటానికి అవసరమైన భావ జాలాన్నంతటినీ వ్యక్తీకరించే శక్తి వంతమైన గంభీరమైన సౌందర్యోపేతమైన భాషగా మలుస్తూ 'ఆంధ్ర శబ్దచింతామణి' అనే వ్యాకరణ గ్రంధాన్ని నిర్మించాడని ప్రతీతి, తెలుగు వాక్కంటే ఇలా ఉండాలని అనుశాసించి వాగనుశాసనుడతడయ్యాడు. సాహిత్యమంటే ఇది, దీని వ్యక్తీకరణ ఇలా ఉండాలి, దీని ప్రయోజనం ఇలా ఉంటుంది అని నిరూపించటానికి మహోన్నతమైన సంస్కృత భాషలో అత్యంత విస్తృత పరిధిలో నిర్మింప బడిన మహా భారతాన్ని ఆంధ్రీకరించి అతి పేదదైన, పేలవమైన తెలుగు సాహిత్యానికి తుష్టిని.పుష్టిని చేకూర్చి ఆదికవి అయ్యాడు.కవిత్వపరంగానంస్కృతంతో తెలుగును ధాదాపు సమానం చేయాలనే తలంపుతోనే ఆయన సంస్కృత పదజాలాన్ని, వ్యాకరణాన్ని, సాహిత్యమర్యాదలను తెలుగులో గుప్పించాడు. అందుకే నన్నయతో తెలుగు సంస్కృతమైపోయిందని వాడుక. దీని నుద్దేశిస్తూ "తెలుగునకీనాడు ఎట్టి భావము నైనను ఎట్టి రసమునైననూ మెప్పించు శక్తివంతమైన భాషయున్నదనగా అది నన్నయ పెట్టిన భిక్షయే". అని ఆచార్య సి.నారాయణరెడ్డి ఉద్ఘాటించాడు. నన్నయకు ముందు తెలుగులో సూచనగాపొడసూపిన వాడుక భాష - కవితా (కావ్య) భాషలు నన్నయతో సంపూర్ణంగా వేరుపడి రెండూ రెండూ దిశల్లో పయనించడం మొదలు పెట్టాయి. ఇలా నన్నయతో స్పష్టంగావేరు చేయబడిన కవితా (కావ్య) భాష చిన్నయ దాకా ఒకే మూసలో సాగినది.

11వ శతాబ్దం నాటికి సంస్కృతమయమైన కావ్యభాష 12వ శతాబ్దంలో స్వతస్సిద్ధంగా తన సహజశక్తిని పెంపొందించుకోవటానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నం నన్నెచోడుడిలో

సూచనగా కనిపిస్తే పాల్కురికి సోమనలో కొట్టొచ్చినట్లు కనిపించింది. ఇతనిలో తెలుగు తెలుగుగా రాణించింది. వేరైపోయిన వాడుక - కావ్యభాషల రెండింటినీ కలిపివేయాలనే తలంపుతో శిష్ట వ్యావహారిక భాష నితడుగ్రహించాడు. దీనిని వ్యక్తీకరిస్తూనే "అచ్చ తెనుగు మాటలలో సోమనాధుడు ఉపయోగించినన్నింటిని మరియే తెలుగు కవిన్నీ ఉపయోగించలేదు" అని డా.. చిలుకూరి నారాయణరావు వ్రాక్రుచ్చాడు .13వ శతాబ్దంలో తిక్కనలో కావ్య భాష మళ్ళీ సంస్కృతం వైపు మళ్ళినా తన సహజ స్వభావాన్ని మాత్రం పెంపొందించుకొన్నది. వాడుక భాషలోని పలుకుబడిని, నుడికారాన్నీ , జాతీయాలనూ, సామెతలనూ గ్రహించి నిండుతనాన్ని పొంది వీర్యవంతమైనది. అంతేకాక కావ్య భాష ఇతనిలో నటనను నేర్చుకొని నాట్యం చేసింది. ఇదేకాలంలో వాడుక భాష తరాను (త్రాను)లాంటి కొన్ని ఉర్దూపదాలకు స్వాగతం పలికింది. 14 వ శతాబ్దంలో ఎఱ్ఱన, సోమనలతో కావ్య భాష మళ్ళీ సంస్కృతమయమైందనే చెప్పాలి. ఇక 15వ శతాబ్దంలో కవిసార్వభౌమ శ్రీనాధునిలో కావ్య భాష సంపూర్ణంగా సంస్కృతమయమై పోయింది. అతని 'కాశీ ఖండ' భాష అయఃపిండమైతే, శృంగార నైషద భాష 'విద్వ దౌషదం'. ఈ శృంగార నైషధంలో ఈతని సంస్కృత పద ప్రయోగాన్ని ఉద్దేశంచి మీ "డుము్వు" లను మీరు తీసికొని మా నైషధాన్ని మాకిచ్చెయ్యండని ఒక సంస్కృతాభిమాని అతణ్ణి చమత్కరించినట్లు లోక ప్రతీతి. ఇదేకాలంలో వ్యవహారాన్ని సరళీకృతం చేయటానికి, వాణిజ్యాన్ని సానుకూలం చేయటానికి "ఇస్త్రీ, ఫలం, కాజా, కాగితం, కోస్తా, టొమాటో, తువాలు, బిస్కత్తు, గూదాం, పిస్తోలు, మేస్త్రీ, " మొ.. పోర్చుగీసు పదజాలాన్ని వాడుక భాష అత్యంత సహజంగా తనలో గర్భీకృతం చేసికొన్నవి. 16 వ శతాబ్దంలో కావ్య భాష ఉత్కృష్ట స్థితికి చేరుకొని సంస్కృతానుయాయిగనే నడిచింది. వాడుక భాష మాత్రం వ్యాపారానుకూలంగా ఉర్దూ, పోర్చుగీసు, డచ్చీ, పదాలతో పాటు అలమార, బీరువా, ఫిరంగి, కమాను మొ,, ఫ్రెంచి పదాలను కూడ గ్రహించింది. 17వ శాతాబ్దం నుంచి వాడుక భాషలో దేశాయ ఉర్దూ ప్రభావం అధికమైంది. "షరాబు, హుజూరు, కచ్చేరి, డోలు, సన్నాయి, పాదుషా, షర్మానా, సిపాయి. బందోబస్తు, ఖైదు, ఫసలీ, కుర్చీ, జంబుఖానా, చాకు, జలతారు, ఖరీదు, ఖర్చు, కండువా, లంగా, పాగా, కూజ, రోజు, ఖబురు, తారీఖు, ఆఖరు, బాకీ, అసలు, మరమ్మత్తు, ఫకీరు, చిరునామా, గచ్చు, లూటి, లాఠి, తర్జుమా" మొ.. ఉర్దూపదాలు వాడుక భాషలో అతి సాధారణమైపోవటమే కాక పారశీక ఉర్దూ కవిత్వాల్లో తెలుగు పదాలు, తెలుగు కవిత్వంలో పారశీక ఉర్దూపదాలు మామూలయ్యాయి. ఈ కాలం నుంచే వాడుక భాషలో ఆంగ్ల పదాలు కూడ చోటు చేసికోవడం మొదలెట్టాయి.

18, 19 శతాబ్దాల్లో రోడ్డు, స్కూలు, బిల్డింగు, స్టేషన్, పోలీస్, కార్డు, కవరు, స్పీడు, లేటు, హెడ్డు, రిజిష్టరు, లూజు, నంబరు, ఆయిలు, కోటు, బూటు, టిక్కెట్టు, ట్రెయిను, బస్సు, రేడియో, గిలాసు, మొ.. ఆంగ్ల పదజాలం వాడుక భాషలో అధికమైనది. అదే సమయంలో బడ,చోట, పాని, ఖానా, చలో రోటి, మొ.. హింది పద ప్రయోగం కూడ తెలుగు వాడుక భాషలో సాధారణమైనది.

ఇంక 20వ శతాబ్దంలో వాడుక భాషలోను, కావ్య భాషలోను విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. తెలుగులో సారూప్య సంబంధమున్న దేశీయ భాషలైన తమిళ, కన్నడ, పదాలు ప్రాచ్యభాషలైన సంస్కృత హింది ఉర్దూ పదాలు, పాశ్చాత్య భాషలైన ఆంగ్లం, పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్చి పదాలు, తదితర భాషాపదాలు గర్తించటానికి వీలు లేనంతగా వాడుక భాషలో

సంపూర్ణంగా కలిసిపోయి తెలుగు పదాలుగామారిపోయాయి. అంతేకాక కావ్య భాషలో కూడా ఈ వాడుక భాష పదజాలం సాధారణమైంది. ఇలా నన్నయతో విభక్తమైన కావ్య వాడుక భాషలు రెండూ పరవస్తు చిన్నయసూరి దాకా రైలుపట్టాల్లాగా విడివిడిగానే ఉంటూ ఆ తరువాత కలిసిపోవడానికి సిద్ధమయ్యాయి. ఇంతవరకూ మనమనుకొన్న వాడుక భాషే స్థూలంగా వ్యావహారిక భాష, కావ్య భాషే గ్రాంధిక భాష. గ్రాంధిక భాషను కావ్య నిర్మాణానికే కాకుండా సప్రమాణమైన సర్వరచనలకూ ఉపయోగించేవారు.11 వశతాబ్దంలో సప్రమాణంగా, సల్లక్షణ భరితంగా ఆవిర్భవించిన వ్యావహారిక భాషను కబళిస్తూ విశృంఖలంగా సాగిన గ్రాంధిక భాష 20వ శతాబ్దంలో బీటలు వారింది. అందుకు కారణం జన వ్యవహారాన్ని అది ప్రతిఫలింపచేయలేకపోవటం, అంతేకాక అందరికీ అర్థం కాకపోవడం. గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు లాంటి ప్రముఖ వ్యక్తుల సహకారంతో వ్యావహారిక భాష ఊపందుకొన్నది. క్రమంగా ఈ వ్యావహారిక భాష గ్రాంధిక భాషను కబళించడంతో రెండు కలసిపోయి శిష్ట వ్యావహారిక భాషగా ఆవిర్భవించి ప్రభుత్వ పాలనకు, సామాజిక వ్యవహారానికి, కవితా వ్యక్తీకరణకు శక్తివంచన లేకుండా దోహదపడుతూ జీవద్భాషగా అలరారు తున్నది.

## తెలుగు సంస్కృత జన్యమా? లేక ద్రావిడ జన్యమా?

తెలుగు భాష సంస్కృత భాష నుంచి జన్మించినదని కొందరు టవాదిస్తే, ద్రావిడ భాష నుంచి జన్మించినదని మరికొందరు వాదించారు. సంస్కృత భాషనుంచే తెలుగు భాష పుట్టిందనే వారు క్రింది ఆధారాలను పేర్కొంటున్నారు.

1.తెలుగులో ఉండే 56వర్ణాలలో 19వర్ణాలు సంస్కృతానివే. 2.తెలుగు పదజాలంలో దాదాపు 80% సంస్కృత పద జాలమే. 3.తెలుగు వ్యాకరణానికి ప్రధాన ఆధార భూమిక సంస్కృత వ్యాకరణమే. 4.తెలుగు అలంకార శాస్త్రం ముసుగు వేసికొన్న సంస్కృత అలంకారమే. 5.తెలుగు ఛందస్సులో అత్యధిక భాగం సంస్కృత ఛందస్సే. 6.తెలుగు అలంకారాలు దాదాపుగా సంస్కృత అలంకారాలే . 7.తెలుగు సాహిత్య వ్యక్తీకరణ విధాన మంతా దాదాపుగా సంస్కృత సాహిత్య వ్యక్తీకరణ విధానమే. 8.తెలుగు సాహిత్యంలో కనిపించే ప్రాచీన సాహిత్య ప్రక్రియలన్నీ దాదాపుగా సంస్కృత సాహిత్య ప్రక్రియలే. 9.ప్రారంభ తెలుగు సాహిత్యమంతా దాదాపుగా సంస్కృత సాహిత్య అనువాదమే.

పై విధంగా తెలుగుకు సంస్కృతం అస్థిపంజరమనీ, అంచేత సంస్కృత భాష నుండే తెలుగు భాష పుట్టిందనీ, ఒక్క తెలుగే కాక మొత్తం భారతీయ భాషలన్నీ కూడ సంస్కృతం నుంచే ఉద్భవించాయని అందుకే "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అని కేతన, "జనని సంస్కృతంబు సర్వ భాషలకును" అని శ్రీనాధుడు ప్రవచించారని వీరి వాదన.

ద్రావిడ భాష నుంచి తెలుగు భాష పుట్టిందనే వారు క్రింది ఆధారాలను చూపిస్తున్నారు.

సర్వనామాలు, సంబంధ వాచకాలు, సంఖ్యా వాచకాలు, క్రియా వాచకాలు సాధారణ పదాలు మొ.. వాని విషయంలో తెలుగుతో కలిపి ద్రావిడ భాషలన్నీ ఒకే రకంగా కనిపిస్తుండగ

సంస్కృత భాష అందుకు భిన్నంగా కనిపిస్తున్నది.

| | | తమిళం | మలయాళం | కన్నడం | తెలుగు | సంస్కృతం |
|---|---|---|---|---|---|---|
| 1. సర్వనామాలు | 1. | నాన్ | నాన్ | నాను | నేను | అహమ్ |
| | 2. | నీ | నీ | నీను | నీవు | త్వమ్ |
| 2.సంబంధ వాచకాలు | 1 | అణ్ణన్ | అణ్ణన్ | అణ్ణ | అన్న | జేష్ఠ (భ్రాత, అగ్రజ) |
| | 2 | తంబి | తంబి | తమ్మ | తమ్ముడు | కనిష్ఠ (భ్రాత, అనుజ) |
| 3. సంఖ్యా వాచకాలు | 1 | ఒన్ఱు | ఒరు, ఒన్ను | ఒన్టు | ఒకటి | ఏక |
| | 2 | ఇరంటు | రంటు | ఎరడు | రెండు | ద్వి |
| 4.క్రియాపదాలు | 1 | పోకిరాన్ | పోగిరాన్ | పోగిడిదే | పోతున్నాడు | గచ్ఛతి |
| | 2 | వరికిరాన్ | వరిగిరాన్ | వరిగిడిదె | వస్తున్నాడు | ఆగచ్ఛతి |
| 5. సాధారణ పదాలు | 1 | కణ్ణు | కణ్ణు | కణ్ణు | కన్ను | నేత్రమ్ |
| | 2 | పల్ | పల్ | పల్లు | పండు పన్ను | దంతమ్ |

1.పై పరిశీలనను బట్టి తమిళ,మళయాళ,కన్నడ, తెలుగులు ఒకే కుటుంబానికి సంబంధించినవనీ, ఆ కుటుంబం పేరు ద్రావిడ భాషా కుటుంబమనీ, ఈ కుటుంబ భాషలకు మూల భాష మూల ద్రావిడమనీ, ఈ మూలద్రావిడానికి, సంస్కృతానికీ ఏ మాత్రం సంబంధం లేదనీ స్పష్టమౌతున్నది. 2.సంస్కృతంలో లేని 'ఁ, జ, ఱ, ళ' అనే విశిష్ట వర్ణాలు తెలుగులో మాత్రమే ఉన్నాయి. 3.సంస్కృతంలో పద స్వరూపాన్ని బట్టి లింగవిభజన జరిగితే తెలుగులో అందుకు వ్యతిరేకంగా అర్థ స్వరూపాన్ని బట్టి లింగ విభజన జరుగుతున్నది.4.సంస్కృతంలో 'ఏక - ద్వి - బహు' అని మూడు వచనాలుంటే తెలుగులో కేవలం 'ఏక - బహు' అనే రెండు వచనాలు మాత్రమే ఉన్నాయి. 5.తెలుగులో 'ఇటితి' అనే మూడు ఔప విభక్తి కాలుంటో సంస్కృతంలో అవి లేవు. 6. 'కర్త - కర్మ - క్రియ' అనే వరుస తెలుగు వాక్యానికి సహజ లక్షణమైతే సంస్కృతంలో అది లేదు. 7. కర్మణి ప్రయోగం తెలుగుకు సహజంకాదు. కాని సంస్కృతానికది అత్యంత సహజం. 8. తెలుగుకు పరరూప సంధి సహజ లక్షణమైతే సంస్కృతానికి పూర్వ రూప సంధి సహజ లక్షణం. 9.ఎడమ నుండి కుడికి లెక్కించే విధంగా సంఖ్యా వాచకాలను ఉపయోగించడం తెలుగు సహజ లక్షణమైతే కుడి నుండి, ఎడమకు లెక్కించే విధంగా సంఖ్యావాచకాలను ప్రయోగించడం సంస్కృత సహజ లక్షణం. ఉదా:- తెలుగులోని పద్దెనిమిది (మొదట పదులు,తరువాత ఒకట్లు) ని సంస్కృతంలో అష్టాదశ (మొదట ఒకట్లు, తరువాత పదులు) గా పిలుస్తారు.

పై తెలుగు లక్షణాలన్నీ ద్రావిడ భాషలన్నింటికీ సర్వసమానంగా ఉంటూ సంస్కృతానికి మాత్రం పూర్తిగా వ్యతిరేకంగా ఉంటున్నాయి కాబట్టే ప్రపంచ భాషలను జాత్యాశ్రితంగా వర్గీకరించేటప్పుడు భాషావేత్తలు తెలుగును ద్రావిడ భాషా కుటుంబంలో కలిపి సంస్కృతాన్ని ఇండో ఆర్యన్ కుటుంబంలో కలిపారు. అలాగే రూపాశ్రిత వర్గీకరణలో తెలుగును ప్రతి పదాత్మక శాఖలో కలిపి సంస్కృతాన్ని సంయోగాత్మక శాఖలో కలిపారు. భారతీయ భాషల వర్గీకరణలో కూడ భాషాభిజ్ఞులు తెలుగును ద్రావిడ కుటుంబంలో చేర్చిసంస్కృతాన్ని ఆర్య కుటుంబంలో చేర్చారు.

పై ఆధారాల వలన తెలుగు ద్రావిడ జన్యమే తప్ప సంస్కృత జన్యం కాదని వీరి వాదన.

పై రెండు వాదాల్లో తెలుగు ద్రావిడ జన్యమనే రెండో వాదనే న్యాయంగా నిజమైనది. వాస్తవానికి తెలుగుకు తల్లిభాష మూల ద్రావిడమే తప్ప సంస్కృతం కాదు అనేది ఆధునికుల అంతిమ తీర్పు. అయితే తెలుగు భాష ద్రావిడ భాషకే జన్మించినప్పటికీ పెరిగి పెద్దదై స్థిరపడింది మాత్రం సంస్కృత భాషలోనే, కాబట్టి తెలుగు భాషకు "పుట్టిల్లు ద్రావిడమైతే మెట్టినిల్లు సంస్కృతం" అనడం ఎంతో సమంజసం.

# తెలుగు - ధ్వని - విజ్ఞానం

## (Phonetics)

వివిధ భాషా ధ్వనులు పుట్టే తీరును, వాని వర్గీకరణను, ఉచ్చారణను లిపి-వ్యాప్తి మొ.. వానిని వివరించే భాషా శాస్త్ర భాగానికి 'ధ్వని విజ్ఞానమని' పేరు. వివిధ ధ్వనులను ఎలా ఉత్పత్తి చేయాలో, విద్యార్థుల చేత చేయించాలో భాషా బోధకునికి తప్పనిసరి కనుక అతనికి ఈ ధ్వని విజ్ఞానం అత్యంత అవసరమౌతున్నది. ప్రపంచంలోని భాషలకన్నింటికీ మూలం ధ్వనియే. అందుకే ధ్వని లేకపోతే భాషయే లేదని చెబుతారు. కాబట్టి భాషకు ప్రాగ్రూపం ధ్వని. అయితే సృష్టిలోని ధ్వనులన్నీ భాషాధ్వనులు కాజాలవు. మానవుని వాగ్యంత్రంలో పుడుతూ భాషా నిర్మాణంలో ఒక నిర్దిష్టమైన స్థానాన్ని పొందిన ధ్వనికే 'భాషాధ్వని' అని పేరు. ప్రపంచంలో ఈ భాషా ధ్వనులన్నీ మానవుని నిశ్వాసిత వాయు సహాయంతోనే పుడుతుంటే, సింధి, హేబ్రెడ్ మొ.. భాషా ధ్వనులు మాత్రం ఉచ్ఛ్వాసిత వాయు సహాయంతో పుట్టడం విశేషం. ఇట్టి ఈ భాషా ధ్వనుల లిఖిత రూప సంకేతాలే అక్షరాలు, తెలుగు భాషకు ఇట్టి అక్షరాలు 56 ఉన్నాయి. వీటిల్లో 'అ'నుంచి 'ఔ' వరకుఉండే 16 అక్షరాలు 'అచ్చులు' కాగా 'క' నుంచి 'హ' వరకు ఉండే 37అక్షరాలు 'హల్లులు' మిగిలిన '0 c ః' అనే మూడు ఉభయాక్షరాలు. తెలుగు భాషకు స్వతస్సిద్ధంగా ఉన్న అక్షరాలు 37కాగా, సంస్కృత భాష నుంచి గ్రహింపబడిన " , , ఋ, ౠ, ః, ఖ, ఘ, జ, భ, ఝ , ఞ , ఠ , థ, ధ, ఫ , భ , శ , ష," అనే 19 అక్షరాలు కలిసి మొత్తం 56 అవుతున్నాయి.

### ధ్వన్యుత్పత్తి విధానం

మానవుని శ్వాసకోశాలకు క్రింది భాగంలో ఉండే ఉదర విదానం ఉచ్ఛ్వాస సమయంలో సంకోచింపబడి క్రిందికి జరగడంతో ఊపిరితిత్తులు వాయువుతో నిండుతాయి. తరువాత నిశ్వాస

సమయంలో ఉదర వితానం వ్యాకోచింపబడి పైకి జరిగినపుడు శ్వాసకోశాలపై ఒత్తిడి ఏర్పడటంతో వానిలోని గాలి శ్వాసనాళం ద్వారా పయణించి నాదతంత్రువులను, స్వర పేటికను చేరి ముఖవివరంలో ప్రవేశించి అక్కడనుండి నోటిముఖంగాను, నాసికా కుహరం నుండి నాసికా రంధ్రాల ద్వారాను బయటికి నిర్గమిస్తుంది.

పిల్లన గ్రోవి నుండి నిర్గమిస్తున్న గాలిని వివిధ చోట్ల వివిధరీతుల్లో చేతి వ్రేళ్ళు స్పర్శించటం వలన వివిధ రకాలైన వాంఛిత ధ్వనులు పుట్టినట్లుగానే శ్వాసకోశాల నుండి బయలుదేరి బయటకు నిర్గమిస్తున్న గాలిని వివిధ చోట్ల వివిధ ముఖావయవాలు వివిధ రీతుల్లో స్పర్శించుటం వలన వివిధ రకాలైన అభిలషణీయమైన ధ్వనులు పుడుతున్నాయి. ఇలా వాగుత్పత్తికి సహకరించిన వివిధ అవయవాల సముదాయాన్నే వాగ్యంత్రమంటున్నాం. వాగ్యంత్రం ద్వారా వాయువు వాక్కుగా బహిర్గతమవుతున్నదని అర్థం. ఇలా వాయువును వాక్కుగా తయారు చేసే వాగ్యంత్రపు కదిలే భాగానికి (క్రింది పెదవి, నాలుక, స్వర తంత్రులు మొ..) 'కరణమని' స్థిరంగా ఉండే భాగానికి (పై పెదవి. దంతాలు. దంతమూలం, మూర్ధం, తాలువు, కంఠమూలం, కంఠ నాళం మొ..) 'స్థానమ'ని, కరణం స్థానాన్ని సమీపించే విధానాన్ని 'ప్రయత్న'మని అంటారు. ఇలా స్థానకరణ ప్రయత్నాల వలన వివిధ ధ్వనులు ఉద్భవిస్తున్నాయి.

### ధ్వనుల వర్గీకరణ

స్థానాన్ని కరణం వివిధ రీతుల్లో సమీకరించటానికి ప్రయత్నించడం వలన వివిధ రకాలైన ధ్వనులు పుడుతున్నాయి. వీనిని ప్రధానంగా అచ్చులని, హల్లులని రెండు రకాలుగా విభజించవచ్చు.

**హల్లులు** (Consonants)

ప్రాణాలైన అచ్చుల వలన ఇవి బ్రతుకుతున్న కారణాన వీటికి 'ప్రాణుల'(జీవుల)ని, అర్థ విశేషాన్ని ఇవి వ్యంజిస్తున్న (ప్రకటిస్తున్న) కారణాన వీనికి 'వ్యంజనాలని' పేర్లున్నాయి. ఊపిరితిత్తుల నుండి గాలి బహిర్గతమౌతున్న సమయంలో కంఠనాళం మొదలు పెదవుల దాకా భిన్న కారణాలు భిన్న స్థానాలను భిన్న ప్రయత్న భేదాలతో సమీపించినపుడు ఏర్పడిన ధ్వనులే హల్లులు. వీనిని క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1.స్పర్శాలు (Stops) : స్థాన కరణాలు రెండూ పరస్పరం స్పర్శించుకొని లోపలి నుంచి వస్తున్న గాలిని లిప్తపాటు (క్షణకాలం) ఆపడం వలన పుట్టే ధ్వనులే స్పర్శాలు. వాయు ప్రసారాన్ని స్తంభింపచేసి ఒక్కసారిగా వదిలి వేయడం వలన పుట్టిన ధ్వనులు కాబట్టి వీనికి 'స్ఫోటముల' (Plosives)ని కూడ పేరు. 'క' నుండి 'మ' వరకు ఉండే వర్గాక్షరాల్లో అనునాసికాలు తప్ప తక్కిన వన్నీ స్పర్శాలే. వీటిలో 'క , చ , ట , త ,ప' లు పరుషాలు, శ్వాసాలు కాగా 'గ , జ, డ , ద , బ' లు సరళాలు, నాదాలు. ఈ పరుషాలు సరళాలు అల్పప్రాణులు కాగా ఖ , ఛ , ఠ , థ , ఫ , ఘ , ఝ, ఢ, ధ , భ , లు మహా ప్రాణాలు.

2.అనునాసికాలు (Nasals): స్థానకరణాలు స్పర్శ ప్రయత్నంతో ముఖ కుహరాన్ని మూసి వేయగా వాయు ప్రసారం నాసికా రంధ్రాల గుండా నిర్గమిస్తున్న సమయంలో ఏర్పడే ధ్వనులకు అనునాసికాలని పేరు. వర్గాక్షరాల్లో చివరివైన 'ఙ , ఞ , ణ , న , మ' లు అనునాసికాలు. ఇవన్నీ

అల్ప ప్రాణాలు, నాదాలు.

3.ఊష్మాలు (spirants): స్థాన కరణాల మధ్య స్పర్శ కాకుండా కేవలం సాన్నిహిత్యం మాత్రమే ఉండడం వలన లోపల నుంచి వస్తున్న గాలి ఆ రెండింటి మధ్యలో నుంచి ఘర్షణతో దూసుకు పోవడం వలన పుట్టిన ధ్వనులే ఊష్మాలు. ఘర్షణ ఆధారంగా పుట్టిన ధ్వనులు కాబట్టి వీనికి ఘర్షములు (Fricatives)అని కూడా పేరు. 'శ , ష , స, హ' లు ఊష్మాలు.

4.స్పర్శోష్మాలు: (Affricates) : స్పర్శ ప్రయత్నంతో మొదలై ఊష్మ ప్రయత్నంతో వెలువడే గాలి వలన పుట్టే ధ్వనులకు స్పర్శోష్మాలను పేరు. 'చ , ఛ , జ , ఝ 'లు అందుకు ఉదాహరణలు.

5.పార్శ్వికాలు:(Laterals): కరణమైన నాలుక యొక్క చివరి భాగం స్థానాన్ని స్పర్శించినప్పుడు ఇరువైపుల నుండి వెలువడే గాలి వలన పుట్టే ధ్వనులే పార్శ్వికాలు. ఉదా:- 'ల ళ' లు.

6. అంతస్థాలు(Semi - Ovels): హల్లులలో మాదిరిగా కండరాల చలనం వలన, అచ్చుల్లో లాగ నిరాటంక వాయు ప్రసారం వలన పుట్టే ధ్వనులు అంతస్థాలు. ఉదా.. 'య , ర , ల , వ' లు.

7.కంపితాలు(Trills): స్థానమైన నాలుక యొక్క చివరిభాగం ప్రకంపనాలతో స్థానాన్ని స్పృశించడం వలన పుట్టే ధ్వనులే కంపితాలు. ఉదా.. 'ర , ల' లు.

8.తాడితాలు (Flapps): నాలుక చివిరి భాగం పైనున్న స్థానాన్ని ఒక్కసారిగా తాడించటం (కొట్టడం) వలన ఏర్పడే ధ్వనులే తాడితాలు, ఉదా.. 'ద'

## ప్రధానంగా స్థాన - కరణ భేదంతోటి ధ్వనుల వర్గీకరణ.

9.ఓష్ఠ్యాలు(Bilabials):- స్థానమైన పై పెదవిని కరణమైవ క్రింది పెదవి స్పృశించడం వలన పుట్టే ధ్వనులే ఓష్ఠ్యాలు. ఉదా.. 'పఫ బభమ'లు.

10దంత్యాలు (Dentals): స్థానమైన పై దంతాల వెనుక భాగాన్ని కరణమైన నాలుక చివరి భాగం తాకడం వలన పుట్టే ధ్వనులు దంత్యాలు. ఉదా.. 'తథ దధ' లు

11.దంత మూలీయాలు : స్థానమైన దంతమూలీయాన్ని కరణమైన నాలుక చివరి భాగం తాకుట వలన పుట్టే ధ్వనులే దంతమూలీయాలు. ఉదా .. చ , జ లు.

12. మూర్ధన్యాలు: నాలుక యొక్క పై భాగంలో కప్పువంటి ఆకారంలోనున్న నోటి కుహరాన్ని మూర్ధన్యమంటారు. ఇది స్థానంగా జిహ్వాగ్రంకరణంగా పుట్టిన ధ్వనులే మూర్ధన్యాలు. ఉదా. 'ట , ఠ , డ , ఢ' లు.

13. తాలవ్యాలు: దంతాలకు వెనుకగా ఉన్నట్టి కఠిన తాలువును స్థానంగా జిహ్వాగ్రం కరణంగా పుట్టే ధ్వనులే తాలవ్యాలు. ఉదా.. 'చ , ఛ , జ , ఝ' లు.

14.కంఠ్యాలు: కంఠ నాళం గుండా ప్రవహిస్తున్న గాలి స్వరపేటిక దగ్గర రుద్ధం కావడం వలనవ పుట్టే ధ్వనదలే కంఠ్యాలు. ఉదా.. ౹క , ఖ , గ , ఘ , ఙ౹లు.

15. శ్వాసాలు(Un-voiced Sounds):- వాయువు నాద తంత్రువుల ద్వారా ప్రసరిస్తున్నపుడు అది కొద్దిగా అవరోధానికి గురికావడం వలన పుట్టే ధ్వనులే శ్వాసాలు. ఉదా.. 'క , చ , చ , ట , త, ప శ్రీఖ , ఛ , ధ , ఫ' లు

16. నాదాలు (Voiced Sounds): వాయువు నాద తంత్రువుల ద్వారా ప్రసరిస్తున్నపుడు అవి పూర్తిగా అవరోధానికి గురై కపించడం వలన పుట్టే ధ్వనులను నాదాలంటారు. ఉదా..' గ,జ, జ, డ, ద, బ, ఘ, ఝ, ఢ, ధ, భ,' లు.

17. మహాప్రాణాలు(Aspirates):- ఉచ్చారణలో ఒత్తి (Stress) పలుకబడేవి మహాప్రాణాలు. ఇవి సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చాయి. ఉదా.. 'ఖ, ఛ, ఠ, ధ, ఫ ఘ, ఝ, ఢ, ధ, భ 'లు.

18. అల్ప ప్రాణాలు: ఉచ్చారణలో తేల్చి (Lightness) పలుకబడేవి అల్ప ప్రాణాలు. ఉదా.. 'క, చ, ట, త, పగ, జ, డ, ద, బ, జ, ఞ, ణ, న, మ' లు. వీటిల్లో జ, ఞ లు తప్ప తక్కినవన్నీ తెలుగు వర్ణాలు.

19. వర్గాక్షరాలు:- 'క' నుండి వరుసగా 'మ' వరకు ఉండే అక్షరాలను వర్గాక్షరాలంటారు.

20 పరుషాలు: ఉచ్చారణలో కొంచెం కఠినంగా ఉండేవి. ఉదా.. 'క , చ, చ , ట , త , ప' లు.

21. సరళాలు:ఉచ్చారణలో తేలికగా ఉండేవి. ఉదా. 'గ , జ , జ , డ , ద , బ'లు.

22. స్థిరాలు:- 37 హల్లుల్లో పరుష సరళాలు తప్ప తక్కినవన్నీ స్థిరాలు.

23. వర్గయుక్కులు: వర్గాల్లోని ద్వితీయ చతుర్థాక్షరాలను అనగా 'ఖ, ఛ, ఠ, ధ,ఫ ఘ, ఝ, ఢ, ధ, భ' లను వర్గాక్షరాలంటారు.

**అచ్చులు (Vowels) :-**

ఊపిరితిత్తుల నుండి బహిర్గతమౌతున్న వాయువు వాగ్యంత్రంలో ఎక్కడ కూడా నిరోధాన్ని కానీ, ఒరపిడిని గాని పొందకుండానే కేవలం నాలుక చిన్న ఎత్తుల్లో లేయడం వలన, పెదవులు, వివిధ ఆకారాలను పొందడం వలన పుట్టే ధ్వనులను అచ్చులంటారు. ఇట్టి అచ్చుల ఉత్పత్తిలో కీలక పాత్ర వహించే అవయవాలు కేవలం నాలుక మరియు పెదవులు కాబట్టి వాని ఆధారంగా అచ్చులను క్రింది విధంగా వర్గీకరించారు.

### I. జిహ్వా భాగానికి సంబంధించిన వర్గీకరణ

1. అగ్రిమాచ్చులు:- ఉచ్చారణ సమయంలో నాలుక చివరి భాగం మాత్రమే తాలువు వైపు గాని, దంతాల వైపు గాని, పైకి లేయడం వలన పుట్టేవి అగ్రిమాచ్చులు. ఉదా : ఇ -ఈలు.

2. పశ్చిమాచ్చులు :-ఉచ్చారణ సమయంలో నాలుక మూల భాగం మాత్రమే మృదు తాలువు వైపు పైకి లేయడం వలన పుట్టేవి పశ్చిమాచ్చులు. ఉదా :- "అ - ఆ" లు.

3. మధ్యాచ్చులు :- ఉచ్చారణలో నాలుక మధ్య భాగం మాత్రమే మూర్ధం వైపు పైకి లేయడం వలన పుట్టేవి. ఉదా:- 'ఉ-ఊ'లు.

### II. జిహ్వ ఔన్నత్యానికి సంబంధించిన వర్గీకరణ

1. నిమ్నాచ్చులు:- ఉచ్చారణ సమయంలో నాలుకంతా ఏ మార్పు చెందకుండా బల్ల పరుపుగా ఉండడం వలన పుట్టేవి. ఉదా :- 'అ'

2. మధ్యాచ్చులు:- ఉచ్చారణలో నాలుక కొంచెం పైకి లేవడం వలన పుట్టేవి. ఉదా.. 'ఆ' (తాటాకు)

3. ఉచ్చాచ్చులు:- ఉచ్చారణలో నాలుక పూర్తిగా పైకి లేవడం వలన పుట్టేవి. ఉదా :- 'ఇ - ఈ'లు.

### III. పెదవుల ఆకారానికి సంబంధించిన వర్గీకరణ

1. వివృతాచ్చులు:- ఉచ్చారణ సమయంలో పెదవులు పరస్పరం దూరంగా ఉన్నపుడు వెలువడేవి. ఉదా.. "అ - ఆ' లు.

2. అర్థ వివృతాచ్చులు :- ఉచ్చారణలో పెదవుల మధ్య దూరం ఎక్కువ కానీ, తక్కువ కాని కాకుండా మధ్య రకంగా ఉన్నపుడు వెలువడేవి.

3. అర్థ సంవృతాచ్చులు :- పెదవుల మధ్య దూరం కొంచెం తగ్గి రెండు సన్నిహితమైనపుడు వెలువడేవి.

4. సంవృత్తాచ్చులు :- పెదవుల మధ్య దూరం పూర్తిగా తగ్గినపుడు వెలువడేవి. ఉదా. 'ఇ -ఈ'లు.

5. వర్తులితాచ్చులు :- పెదవులు రెండు సన్నిహితమై, ముందుకు వచ్చిగుండ్రంగా మారడం వలన వెలువడేవి. ఉదా:- 'ఉ -ఊ, ఒ - ఓ'లు.

6. విస్తారితాచ్చులు:- వర్తులితాల మాదిరిగా రెండు పెదవులు గుండ్రంగా కాక, కొంచెం విస్తరించినపుడు వెలువడేవి. ఉదా:- 'ఎ - ఏ'లు.

**ఉభయాక్షరాలు (Dipthongs):**

అచ్చుల వాల్లుల రెండు గుణాలను కలిగిన వానికి ఉభయాక్షరాలని పేరు. 'ం, ః, ఁ 'లు ఉభయాక్షరాలు వీటిల్లో 'ః' సంస్కృతం నుండి గ్రహింపబడినది.

## తెలుగు లిపి పరిణామం

వాగ్రూపమైన ధ్వనుల సముదాయానికి లిఖిత రూపమైన సంకేతాల సముదాయమే లిపి. లిఖి, వర్ణం అక్షరం అనేవి దీని పర్యాయ పదాలు. ఇది లిఖిత రూపంలో ఉంటుంది కాబట్టి 'లిఖి' అనే, రంగుతో రాయటం వలన వర్ణమనీ, వాగ్రూప ధ్వని మాదిరిగానశించి పోయే గుణం లేదు కాబట్టి అక్షరమనీ దీనికి వ్యవహారమున్నది. అశోకుని శాసనాల్లోని బ్రాహ్మి లిపిని పోలిన లిపి అంతకన్నా ముందే అమరావతిలో లభించిన శాసనాల్లో కనిపించింది. దానిని దక్షిణ బ్రాహ్మి లిపిగా వ్యవహరించారు. దీని నుంచే తెలుగు లిపి పరిణమించి ఉండవచ్చునని ఊహించడానికి వీలున్నది. క్రమంగా తెలుగు భాష ఇతర భాషల నుంచి వేరౌతూ వచ్చినట్లుగానే, దాని లిపి కూడ వేరౌతూ వచ్చింది. తెలుగు దేశాన్ని పాలించిన శాత వాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, చోళులు,

కాకతీయులు మొదలైన వారంతా కాలక్రమానుసారంగా తెలుగు భాషను, దాని లిపిని అభివృద్ధిపరస్తూ వచ్చారు. క్రీ. శ. 14వ శతాబ్దం నాటికి తెలుగు లిపి ఆకారంలో గుండ్రంగా మారి ముత్యాల్లాగా సౌందర్యాన్ని సంతరించుకొన్నది. ఈ లిపియే అతి కొద్ది మార్పులతో ఇప్పటికి కనిపిస్తున్న తెలుగు లిపి.

మారుతున్న కాలాన్ని, అవసరాన్ని, యధాతథ ధ్వని వ్యక్తీకరణను దృష్టిలో పెట్టుకుంటే తెలుగు లిపిని సంస్కరించవలసిన అవసరం కూడా ఈ నాడు ఎంతగానో కనిపిస్తున్నది. ఎందుకంటే తెలుగు భాషలో ఈనాడు అవసరాన్ని బట్టి అనేక అన్య భాషా ధ్వనులు ప్రవేశిస్తున్నాయి. వ్యక్తీకరణ పద్ధతులు కూడా మారుతున్నాయి. అలాగే తెలుగు భాషలో సనాతనంగా కనిపించే కొన్ని ధ్వనులు నిరుపయోగాలై నశించిపోతున్నాయి. ముఖ్యంగా ఆధునిక టైపుకు , ముద్రణకు అనుకూలంగా కూడా తెలుగు లిపిని సంస్కరించవలసిన అవసరం ప్రధానంగానే కనిపిస్తున్నది.

తెలుగు భాషలో లిపి రూపంగా కనిపిస్తూ ఉచ్చారణలో కనుమరుగౌతున్న వర్ణాలు అర్థానుస్వారం (c) ఋ, ౠ, ( పొడకంలో రు, రూ, లు, లూ') ఌ, ఐ (అయ్), క్ష, ఛ, జ, మొదలైనవి. తెలుగు భాషలో కనిపించే నూతన ధ్వనుల్లు 'ఫ' ధ్వని. ఇది ఆంగ్ల ప్రభావంతో తెలుగులోకి వచ్చిన క్రొత్త ధ్వని. ఉదా:- Coffee (కాఫీ). ఇది తెలుగులో సహజంగా కనిపించే పరుషాక్షర ధ్వనియైన 'ప'కు, మహా ప్రాణాక్షర ధ్వని యైన 'ఫ'కు భిన్నంగా కనిపించే ధ్వని రూపం. దీనికి ప్రత్యేక వర్ణస్థాయికలుగ లేదు. అలాగే బాంకు లేద బేంకు (బ్యాంకు) తాటాకు లేద తాటేకు (తాట్యాకు) పదాల్లో కనిపించే అకార, ఎకారాల సంయుక్త ధ్వని కూడ క్రొత్తదే. దీనికి కూడ ప్రత్యేక వర్ణ స్థాయి లేదు. ఇంకొక ఉదాహరణ ఏమంటే రాయల సీమ ప్రాంతం లోని 'మామ' అనే పదం అదే అర్థంలో కోస్తా ప్రాంతంలో ఉచ్చారణలో భిన్నంగా 'మావ' గా ఉపయోగింపబడుతున్నది. ఇక్కడి ఈ 'వ' ధ్వని 'మ' కు ప్రత్యామ్నాయమే తప్ప వర్ణమాలలో కనిపించే 'వ' కు సమానమైనది కాదు.

అచ్చులు, హల్లులు, వీని దీర్ఘాలు, గుణింతాలు, ద్విత్వాలు, సంయుక్తాలు తెలుగు లిపిలో అతి సాధారణ విషయాలు. అయితే ఆంగ్ల లిపిలో కేవలం అచ్చులు, హల్లులు తప్ప తక్కిన వేవి కనిపించవు. హల్లుల ప్రక్కలో హల్లులను చేర్చి ద్విత్వాలను, సంయుక్తాలను, హల్లుల పక్కలో అచ్చులను చేర్చి గుణింతాలను ఆంగ్ల లిపి తయారు చేస్తుంది. అలాగే మహా ప్రాణతను సూచించటానికి ఇది ' హెచ్' అనే ధ్వనిని ఉపయోగిస్తున్నది. ఉదా:- " రాముడు రావణాసురుణ్ణి వధించెను" అనే తెలుగు వాక్యాన్ని ఆంగ్ల లిపి ప్రకారం రాస్తే "RAMUDU RAVANASURUNNI VADHINCHENU" అవుతుంది. దీనిని యధాతథంగా తెలుగులో రాస్తే 'రఅఅమఉడఉ రఅఅవణఅఅసఉరఉణణఇ వదహఇఇచఎనఉ' గా మారుతుంది. ఈ లిపి తెలుగులో ఇప్పుడుండే 56 వర్ణాలకు బదులుగా దాదాపు వానిలో సగం వర్ణాలే సరిపోటానికి వీలున్నది. అపుడు తెలుగుని టైపు చేయడం, ముద్రించడం అత్యంత సులభమౌతుంది. అయితే ఇది వీలౌతుందా. లేదా. అనేది తరువాతి విషయం.

## తెలుగు భాషా భాగాలు :-

అర్థవంతమై, అక్షర సముదాయమైనదే పదం. ఇట్టి పద సముదాయమే భాష. ఇలా, భాషలో ప్రధానంగా కనిపించే పదజాలాన్ని ఐదు భాగాలుగా విభజించారు. అవి. 1. నామ వాచకాలు. 2. సర్వనామాలు. 3. విశేషణాలు. 4. క్రియలు.5. అవ్యయాలు. ఇట్టి ఈ ఐదు భాగాల పదాలు లేకపోతే భాష. భాషగా రాణించలేదు. అందుకే అవి భాషలో ప్రధాన భాగాలై 'భాషా భాగాలుగా' పిలుబడుతున్నాయి. వీనిని గురించి క్రింది విధంగా తెలిసికోవచ్చు.

### I. నామ వాచకాలు :-

ఇవి నామాల (పేర్ల)గూర్చి తెలుపును. వీనిలో మనుష్యుల, ప్రదేశాల, వస్తువుల నామాలను తెలిపే వానిని 'సంజ్ఞానామ వాచకాల'నీ (ఉదా:- ఎల్లమ్మ, ఎవరెస్టు, యమున మొ.), స్వభావాల, గుణాల నామాలను తెలిపే వానిని 'గుణనామవాచకాల' నీ (ఉదా:- తెలుపు, నలుపు, మొ..), క్రియల (పనుల ) నామాలను తెలిపే వానిని 'క్రియా నామవాచకాల' నీ (ఉదా:- రండి, వ్రాత మొ..) సంఖ్యా నామాలను తెలిపే వానిని 'సంఖ్యా నామవాచకాల' ని, జాతి నామాలనుతెలిపే వానిని 'జాతి నామవాచకాల' నీ (ఉదా:- మానవుడు, జంతువు మొ.) ఐదు రకాలుగా విభజించారు. ఇవి విశేషణాల చేత విశేషింపబడుతున్న కారణాన వీనికి ' విశేష్యాలన్నది మరొక పేరు. ఈ నామ వాచకాల వచన విధానం, లింగవిధానం, విభక్తి తోడి సంబంధం క్రింది విధంగా ఉన్నాయి.

వచనం:- తెలుగు నామ వాచకాలు అవి ప్రతిపాదించే వస్తు సంఖ్యను బట్టి ఏక వచనం, బహు వచనం అని రెండు రకాలుగు ఉన్నాయి. సంస్కృత నామ వాచకాలు మాత్రం ఇతీనికి తోడు ద్వి వచనాన్ని కూడ కలిగి ఉన్నాయి. తెలుగులో కొన్ని నామ వాచకాలు ఎల్లపుడు కేవలం ఏక వచనంలో మాత్రమే ఉంటాయి. వీనిని నిత్య ఏక వచనాలంటారు. ఉదా:- కందులు, పెసలు, వడ్లు, నీరు, మొ..

లింగం:- తెలుగులో నామ వాచకాలు ప్రతిపాదించే అర్థాన్ని బట్టి లింగ భేదం ఏర్పడు తున్నది. పురుషులకు సంబంధించినవి పుంలింగాలు కాగా, స్త్రీలకు సంబంధించినవి స్త్రీలింగాలు. రెండూ కాని వృక్షాదులకు సంబంధించినవి నపుంసక లింగాలు. సంస్కృతంలో మాత్రం లింగ బేధం అర్థాన్ని బట్టి కాక శబ్దాన్ని బట్టి ఏర్పడుతుంది. ఉదా:- స్త్రీ అనే అర్థానిచ్చే 'కళత్రమ్' అనేది నపుంసక లింగం కాగా, అదే అర్థాన్నిచ్చే 'ధారా' అనేది పులింగం. వీటికి శబ్ద బేధముందే తప్ప అర్థ బేధం లేదు.

విభక్తి:- వాక్యంలో నామ వాచకాలను ఇతర పదాలతో జోడించేవి, లేద కలిపేవి విభక్తులు. ఇట్టి విభక్తులు తెలుగులో 8 ఉన్నాయి. అవే ప్రథమా విభక్తి మొదలు విభక్తి సంభోధనా ప్రథమా విభక్తి వరకు ఉండే ఎనిమిది.

### II.సర్వనామాలు :-

నామ వాచకాలకు బదులుగా వాడబడే పదాలే సర్వనామాలు. నామ వాచకాల మాదిరి వీనికి కూడ లింగ, వచన , విభక్తులుంటాయి. వీటిల్లో తనను గూర్చి బోధించే వానిని ఉత్తమ

పురుషలనీ (ఉదా:- నేను, మేము) ఎదుటి వానిని గూర్చి బోధించే వానిని మధ్యమ పురుషలనీ (ఉదా:- నీవు, మీరు) , ఎక్కడో ఉన్న వానిని గురించి బోధించే వానిని ప్రథమ పురుషలని (ఉదా:- అతడు., ఆమె, అది, అవి, ఎవరు, ఏమి, కొన్ని, కొంత, పెక్కు మొ.) పేర్కొన్నారు.

**III. విశేషణాలు:-**

నామ వాచకాల గుణాన్ని విశేషించి చెబుతున్న కారణాన ఇవి విశేషణాలౌతున్నాయి. ఉదా:- తెల్ల గుఱ్ఱం. ఇందు తెల్ల విశేషణం కాగా గుఱ్ఱం విశేష్యం (నామ వాచకం). సంస్కృతంలో విశేష్యం ఏ లింగ, వచన, విభక్తుల్లో ఉంటుందో విశేషణం కూడా అదే లింగ, వచన, విభక్తుల్లోనే ఉంటుంది. తెలుగులో దీనికి బదులుగా విశేషణ స్థానాన్ని బట్టి విశేష్యంతో సంబంధమేర్పడుతున్నది. సాధారణంగా ఈ విశేషణాలన్నీ విశేష్యాలకు ముందే ఉంటాయి. ఉదా:- వేడి నీరు, ఎఱ్ఱ గుఱ్ఱం. వీటిల్లో వ్యక్తికి, ప్రదేశానికి సంబంధించిన వానిని 'సంజ్ఞావిశేషణాల' నీ (ఉదా:- దశరథ రాముడు, నర లోకం), సంఖ్యకు సంబంధించిన వానిని 'సంఖ్యావిశేషణాల' నీ (ఉదా:- పంచ పాండవులు), క్రియలకు సంబంధించిన వానిని 'క్రియా విశేషణాల' నీ (ఉదా:- నెమ్మదిగా పరుగెత్తును) క్రియల నుండి పుట్టే వానిని "క్రియా జన్య విశేషణాల" నీ (ఉదా:- చేయుచున్నవాడు , ఆరని ముడుగు) నాలుగు రకాలున్నాయి. వీనితో పాటు ఎక్కడ-ముందు-వెనుక-పైన-క్రింద-ప్రక్కన-లోపల- బయట మొ|| స్థల వాచకాలు-అంత - ఇంత - ఎంత - అన్ని - కొన్ని - ఎన్ని- ఎక్కువ - తక్కువ - చాలా - కొంచెం - పెక్కుమొ|| పరిణామ వాచకాలు, అట్లు -ఇట్లు -ఎట్లు - మొ.. ప్రకార వాచకాలు ఉన్నాయి.

**IV. క్రియలు:-**

నామ వాచకాల సర్వనామాల 'పనులను' తెలిపేవి క్రియలు. ఆంధ్ర శబ్ద చింతామణి ధాతువునే క్రియగా చెబితే, బాల వ్యాకరణంలో చిన్నయ లింగ, వచన, కాలాలను అనుసరించి ధాతువుకు చేరే ప్రత్యయాల వలన క్రియ లేర్పడతాయని చెప్పాడు. ఇట్టి ఈ క్రియలు కర్మను బట్టి అకర్మక- సకర్మకాలనీ, వాక్య సంపూర్ణాన్ని బట్టి సమాపక - అసమాపకాలనీ, కాలాన్ని బట్టి భూత కాలిక - వర్తమాన కాలిక - భవిష్యత్కాలిక తద్ధర్మార్థకాలనీ, ఫలాన్ని బట్టి ఆత్మనే పద - పరస్మై పదాలనీ విభజింప బడ్డాయి.

1. సకర్మక - అకర్మక క్రియలు:- (Transitive - Intransitive Verbs):

వాక్యంలో క్రియ యొక్క ఫలాన్ని అనుభవించే కర్మను ఆకాంక్షించేవి సకర్మక క్రియలు కాగా, కర్మను ఆకాంక్షించనవి అకర్మక క్రియలు. ఉదా:- 'రాముడు తెచ్చెను'. అనే వాక్యంలో 'దేనిని' అనే ప్రశ్నకు సమాధానమైన కర్మ లేదు. కనుక ఇక్కడి ఈ 'తెచ్చెను' అనేది అకర్మక క్రియ. 'రామాయణాన్ని 'వ్రాసెను' అనే ఈ వాక్యంలో 'దేనిని'అనే ప్రశ్నకు సమాధానమైన రామాయణాన్ని అనే కర్మ ఉన్నది. కావున ఇక్కడ 'వ్రాసెను' అనేది సకర్మక క్రియ.

2. సమాపక - అసమాపక క్రియలు: (Finitive - Infinitive Verbs):

వాక్యంలోని పనిని సంపూర్ణం చేసేది సమాపక క్రియ కాగా, సంపూర్ణం చేయలేనిది అసమాపక క్రియ. ఉదా.. రాముడు బడికి పోయెను అనే వాక్యంలో పనిని సంపూర్ణం చేసే 'పోయెను' అనేది సమాపర క్రియ. 'రాముడు బడికి పోయి ' అనే వాక్యంలో రాముని కార్యాన్ని సంపూర్ణం చేయని 'పోయి ' అనేది అసమాపక క్రియ.

3. కాల బోధక క్రియలు:-

వాక్యం యొక్క కాలాన్ని బోధించే క్రియలే కాలబోధక క్రియలు. వీనిని జరిగి పోయిన కాలాన్ని సూచించే భూతకాలిక క్రియలు (ఉదా:- రంగడు వచ్చెను) గా, జరుగుతున్న కాలాన్ని సూచించే వర్తమాన క్రియలు:- (ఉదా :- వాడు వస్తున్నాడు) గా, జరుగబోయే కాలాన్ని సూచించే భవిష్యత్కాలిక క్రియలు (ఉదా:- ఆమె రేపు పోవును)గా, భూతభవిష్యత్ వర్తమానాలనే భేదం లేక నిత్యమూ జరుగుతున్న వానిని సూచించే తద్ధర్మకాలిక క్రియలు (ఉదా:- సూర్యుడు తూర్పుననే ఉదయించును) గా విభజించారు.

4. ఆత్మ నే పద - పరస్మైపద క్రియలు :

పనిని (కార్యాన్ని) చేస్తున్న వ్యక్తికే ఫలితం దక్కినట్లు సూచించేవి ఆత్మనేపద క్రియలు. ఉదా:- నేను కాఫీ త్రాగితిని. చేస్తున్న వ్యక్తికి కాక పరులకు ఫలితం దక్కినట్లు సూచించేవి పరస్మై పదాలు. ఉదా:- గేదె పాలిచ్చెను. ఇక్కడ గేదె పాలు గేదెకు కాక పరులకు ఉపయోగపడతాయి. పనులను ఇతరుల చేత చేయించిట్లుగ సూచించేవి ప్రేరణ క్రియలు. ఉదా:- రాజరాజ నరేంద్రుడు నన్నయ చేత భారతాన్ని వ్రాయించెను.

**V.అవ్యయాలు:-**

సహజంగా వాక్యంలోని పదాలన్నీ ఇతర పదాలతో ఏదో ఒక రకమైన సంబంధాన్ని కలిగి ఉంటాయి. ఇట్టి సంబంధం కోసం పదాలన్నీ ముఖ్యంగా లింగ, వచన, విభక్తి కాలాదుల్లో ఎంతో కొంత మార్పును పొందుతాయి. అయితే కొన్ని పదాలు మాత్రం ఇతర పదాలతో సంబంధాన్ని కలిగి ఉన్నప్పటికీ ఎలాంటి మార్పుకు లోను కాకుండా ఎల్లప్పుడూ ఒకే రకంగా ఉంటాయి. అతి ముఖ్యాలైన లింగ, వచన, విభక్తి, కాలాదుల్లో కూడ ఇవి మార్పు చెందవు. ఇట్టి పదాలనే 'అవ్యయాలు' అంటున్నారు. సంస్కృతంలో యథా, తథా, అన్యథా, సర్వథా, బహుశః, అతః, ఇతః మొ.. అవ్యయాలు. తెలుగులోని అవ్యయాలను ప్రతిపదోక్తకాలు. లాక్షణికాలని రెండుగా విభజించారు.

(1) ప్రతిపదోక్తకాలు:- ప్రకృతి సిద్ధమైన అవ్యయాలే ప్రతిపదోక్తకాలు ఉదా.. అక్కడ, ఇక్కడ, ఎక్కడ అనే స్థలార్థకాలు, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, నేడు, రేపు అనే కాలార్థకాలు, ఓహో, ఒహో, భళీ, వహ్వా అనే ప్రశంసార్థకాలు అయ్యారే, అహో, అవురా అనే ఆశ్చర్యార్థకాలు అకటా, అయ్యో, కటకటా అనే సంతాపకార్థాలు ఊరక, మిన్నక అనే తూష్ణీమర్థకాలు, కదా, సుమ్ము అనే నిశ్చయార్థకాలు అట్లు, ఇట్లు అనే ప్రకారార్థకాలు అయ్యును, మరియును అనే సముచ్చయార్థకాలు వలెన్, పోలెన్ అనే ఔపమ్యార్థకాలు మొదలైనవి.

(2) లాక్షణికాలు:- సహజ సిద్ధాలుగా గాక వ్యాకరణ సూత్రాధారంగా ఏర్పడిన అవ్యయాలే లాక్షణికాలు. ఉదా.. వచ్చుచున్, చూచుచున్ అనే శత్రర్థకాలు రాగన్, చూడగన్, అనే గు ము న్నార్థకాలు వచ్చుడున్, చూచుడున్, అనే అనంతర్యార్థకాలు వచ్చినన్, చూచినన్ అనే చేదర్థకాలు వచ్చిచూచి అనే క్త్వార్థకాలు రాక, చూడక అనే వ్యతిరేకార్థకాలు ఎడున్, తన్, అనే ఆశీరర్థకాలు మొదలైనవి.

# భాషోద్యమం.

భాష ప్రధానంగా భావ వాహిక (Language is a vehicle of thought). భావాన్ని వ్యక్తం చేయడానికి గ్రహించడానికి ఇదొక సాధనం. భాషమూలంగానే వ్యక్తి మరొక వ్యక్తితో సంబంధాన్ని కుదుర్చుకోటంతో సమాజం ఏర్పడుతున్నది. ఇలా సమాజాన్నంతటినీ నడిపించే ఏకైక సాధనం భాష. మరి అలాంటి భాష అందరి వ్యక్తులు అలవోకగా ఉపయోగించుకోటానికి వీలుగా ఉండటం న్యాయం. అంతేగాని అది కొందరికే చేరువగా ఉంటే మొత్తం భాషా ప్రయోజనమే దెబ్బతింటుంది. 11 వ శతాబ్దంలో స్థిరపడిన కావ్య భాష గ్రాంధిక భాష అనే పేరుతో 19 వ శతాబ్దం వరకు తెలుగులో తిష్ఠ వేసికొన్నది.18, 19 శతాబ్దాల్లో ప్రపంచంలో అనేక రంగాల్లో మార్పులు వచ్చినట్లుగానే భాషా రంగంలో కూడ అనూహ్య మార్పులు సంభవించాయి. వాటిల్లో 1. భాష సమిష్టిరాశి కావటం వలన అది అందరికి ఆమోద యోగ్యంగా ఉండాలనటం, 2. భావాన్ని సులభంగా వ్యక్తీకరించటానికి అనుకూలంగా ఉండాలనటం. 3. వ్యవహార భావ ప్రకటనకు సౌందర్య భావ ప్రకటనకు ఒకే భాష సరిపోతుందనడం.4. పెరుగుతున్న అవసరాలకు అనుకూలంగా భాషలో కూడ మార్పు రావాలనడం.5. భాష వ్యాకరణాన్ని నియంత్రించాలే తప్ప వ్యాకరణం భాషను నియంత్రించనవసరం లేదనడం. 6. భాష మృత ప్రాయంగా కాక సజీవకళతో అలరారుతుండాలనడం. 7. అతి శీఘ్ర కాలంలో అందరికీ అర్థమయ్యేదిగా ఉండాలనడం మొ.. కొన్ని ముఖ్యమైన మార్పులు. ఇట్టి ఈ మార్పులతో భాషను సంస్కరించి దానిని అభివృద్ధి పరచటానికై పెద్ద ఉద్యమం బయలు దేరింది. అట్టి ఉద్యమానికే "భాషోద్యమం" అని పేరు. అంధ్రదేశంలో ఆంధ్ర రాష్ట్రోద్యమం మాదిరిగానే ఈ భాషోద్యమం కూడ ఒకటి. పైన పేర్కొన్న లక్షణాలలో ఏ ఒక్కటి కూడ గ్రాంధిక భాషలో లేదని, నానినన్నింటిని పుణికి పుచ్చుకొన్న భాష కేవలం వ్యావహారికి భాషేనని భావించి దానిని పెంపు చేయటానికై గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి లాంటి కొంత మంది భాషా మేధావులు ఉద్యమానికై నడుం బిగించారు. ఆ ఉద్యమానికే తెలుగు భాష పరిణామ చరిత్రలో 'వ్యావహారికోద్యమమని' పేరు. ఇలా ఈ ఉద్యమం గ్రాంధిక భాషను సంస్కరించే తలంపుతోనే ఆవిర్భవించి నప్పటికి క్రమంగా అది గ్రాంధిక భాషకు వ్యతిరేకోద్యమంగానే స్థిరపడింది.

## గ్రాంధిక భాష

గ్రంథస్థమైన భాషయే గ్రాంధిక భాష అని సాధారణ వ్యవహారం. దీనిని బట్టి గ్రంథముఖంగా లిఖింపబడిన భాషంతా గ్రాంధిక భాషని చెప్పాలి. అనగా భాషలో సమగ్రతను సాధించిన కవి పండితాది శిష్టజన వ్యవహార ముఖంగా సాగిన సలక్షణ భరితమైన, వ్యాకరణ శుద్ధమైన భాష అని అర్థం. ఇట్టి ఈ గ్రాంధిక భాష యొక్క ప్రాగ్రూపం 11 వ శతాబ్దానికి పూర్వం తెలుగులో అరకొరగా, సూచనాప్రాయంగా ఉండేది. 11 వ శతాబ్దంలో మాత్రం "కావ్య(కవితా) భాష" అనే పేరుతో సమగ్ర రూపాన్ని సాధించుకొన్నది. దానికా స్థితిని ప్రసాదించిన మహాప్రదాత నన్నయ. ఈయన ఏ శుభ ఘడియలో దానికి శ్రీకారం చుట్టాడో తెలియదు కాని అది తెలుగు సాహిత్య ప్రపంచంలో ఎదురు లేక ఏక ముఖంగా, విచ్చలవిడిగా, విశృంఖలంగా 19 వ శతాబ్దం వరకు వీరవిహారం

చేసింది.

గమ్యమంటూ లేక చంచలత్వంతో, అస్థిరంగా, మోటుగా, ద్రవరూపంగా ఉన్నట్టి తెలుగు భాషకు స్థిరత్వాన్ని సౌందర్యాన్ని ఆపాదించే నిమిత్తం నన్నయ వ్యాకరణాన్ని నిర్మించి అట్టి వ్యాకరణానుకూలమైన భాషకు ఉదాహరణగా మహాభారతాన్ని తెనిగించాడని ప్రతీతి. మహాభారత రచనలో నన్నయ ప్రయోగించిన భాష మూసలోనే తరువాతి కవి పండితులంతా నడిచారు. సాహిత్యమంతా నడిచింది. ఇలా ఈ భాష సాహిత్యాన్ని, కవి పండితులనే కాక భాషా జ్ఞానమున్న ప్రతి వ్యక్తిని ఆకర్షించినది. సాధారణ వ్యావహారిక భాషపై పెత్తనాన్ని చెలాయించినది.

ఈనాటి సమాజంలో ఆంగ్ల భాషను ప్రయోగించే వ్యక్తికి ఎంతటి గౌరవం లభిస్తున్నదో ఆనాటి సమాజంలో ఆ గ్రాంథిక భాషను ఉపయోగించే వ్యక్తికి అంతకన్నా ఎక్కువ గౌరవం లభించేది. అందుకనే అతిసాధారణంగా ఆనాటి కవి పండితులందరూ తమ సర్వ వ్యవహారాన్నంతటినీ (మౌఖిక - లిఖిత) ఈ భాషలోనే జరుపుకొనేవారు. కొద్దిపాటి భాషా జ్ఞానమున్న వ్యక్తి కూడా మౌఖికంగా వ్యవహారిక భాషనే ఉపయోగించినప్పటికి లేఖనం దగ్గరకు వచ్చేసరికి ఖచ్చితంగా ఈ భాషనే ప్రయోగించే వాడు. ఈ స్థితి అప్పుడే కాదు ఇప్పటికీ పాతకాలపు వారిలో కనిపిస్తూనే ఉన్నది. ఇలా ఆనాడు భాషా జ్ఞానమున్న ప్రతివ్యక్తీ దేనినైనా లిఖించటానికి సర్వసాధారణంగా ఈ భాషనే ఉపయోగించేవాడు. అలా సాధారణ వ్యవహారలేఖనానికై ఈ భాషను ఇంతనిక్కచ్చిగా ఉపయోగిస్తే ఇంక శాస్వతంగా పదికాలాల పాటు నిలిచే శుద్ధమైన, మహోన్నతమైన గ్రంథ నిర్మాణానికి ఇంకే భాషను ప్రయోగించి ఉంటారో మనం అతి సులభంగానే ఊహించవచ్చు. అందుకే 'గ్రంథస్థమైనదంతా గ్రాంథిక భాష' అనే వ్యవహారం స్థిరపడిపోయింది. ఇట్టి ఈ గ్రాంథిక భాషా లక్షణాలను కొన్నింటిని క్రింది విధంగా చూడవచ్చు.

(1) వ్యాకరణ బద్ధమై ఉండటం. (2) ప్రకృష్టమైన శైలిలో నడవటం. (3) సమగ్రతను, గంభీరతను సాధించటం. (4) స్థిరత్వాన్ని, శాశ్వతత్వాన్ని పొందటం. (5) కవిపండిత ప్రమాణంగా ఉండటం. (6) వ్యావహారిక శైలికి భిన్నంగా ఉండటం. (7) గ్రామ్య పదాలను విసర్జించటం. (8) సంధి, సమాసాలను నిక్కచ్చిగా పాటించటం. (9) భాషాపటుత్వాన్ని పెంపొందించటం. (10) అలంకారాదులతో సౌందర్యంగా ప్రకాశించటం. (11) శబ్దశుద్ధిని. వాక్యశుద్ధిని పొందటం. (12) అన్యదేశ్యమయ పదజాలాన్ని పరిహరించటం. (13) సంస్కృత పద ప్రయోగం ఉండటం మొ..

పై లక్షణాలను పుణికి పుచ్చుకొన్నదే నన్నయ భాష. ఈ భాషనే తరువాతి కవులంతా ఆదర్శంగా గ్రహించి దాని అభివృద్ధికై సర్వతోముఖంగా కృషి చేస్తూ, తమ సాహిత్యవ్యక్తీకరణకు, గ్రంథ నిర్మాణానికి ఏకైక ఆయుధంగా ఉపయోగించుకొన్నారు. సాధారణంగా ఆరోజుల్లో గ్రంథ నిర్మాణమనగా మహాకావ్య నిర్మాణమన్నదే వ్యవహారం. ఇట్టి కావ్యంలో ప్రయోగింపబడిన భాషయే కావ్య భాష. కాబట్టి కావ్య భాషంతా గ్రాంథిక భాషయే. కాని గ్రాంథిక భాషంతా కేవలం కావ్యభాషే కానక్కఱ లేదు. పైన పేర్కొన్న రీతిలో ఉన్నదంతా గ్రాంథిక భాషే అవుతున్నది.

## వ్యావహారిక భాష

వ్యవహారాన్ని నడిపించే భాషయే వ్యావహారిక భాష. సంఘజీవియైన మానవుడు సమిష్టిగా బ్రతుకు తాడే తప్ప వ్యష్టిగా రాణించలేడు. అందుకోసం ఒక వ్యక్తి మరొక వ్యక్తితో సంబంధం ఏర్పరుచుకోక తప్పదు. ఇట్టి పరస్పర సంబంధాలను సానుకూలం చేస్తూ వ్యవహారాన్ని సరళీకృతం చేసేదే 'వ్యావహారిక' భాష. మారుతున్న కాలాన్ని, సంఘాన్ని, అవసరాన్ని, వ్యక్తీకరణను బట్టి ఇది కూడ మార్పులకు లోనౌతూ, నిరంతరం మానవులను ఏకం చేస్తూ, వారి వ్యవహారాన్ని అవిచ్ఛిన్నంగా చక్కబెడుతున్న కారణాన దీనికి 'జీవ భాష' అనే వ్యవహారం కూడ ఉన్నది. ఈ జీవ భాష లేదా వ్యావహారిక భాష నుండి పుట్టి పెరిగేదే శిష్టమైన కావ్య భాష. క్రింది వానిని వ్యావహారిక భాషా లక్షణాలుగా మనం గుర్తింపవచ్చు.

(1) వ్యవహారాన్ని నడిపించటాన్ని పరమావధిగా భావించటం. (2) గ్రాంధిక భాషకంటే భిన్నంగా ఉండటం. (3) వ్యాకరణం చేత నియంత్రించపబడక తానే వ్యాకరణాన్ని నియంత్రించటం. (4) ధ్వన్యనుగుణంగా లిపిని మార్చుకోవటం. (5) సజీవాలైన జాతీయాలను, సామెతలను కలిగిఉండటం. (6) అవసరాన్ని బట్టి అన్యదేశీయ పద జాలాన్ని పొందటం. (7) భాషా పరంగా సమకాలీన ప్రజావసరాలకన్నింటికీ ఉపయోగపడటం. (8) అవసరాన్ని బట్టి మారే గుణాన్ని కలిగి ఉండటం. (9) అత్యంత సరళంగా నడవటం. (10) అందరికీ అర్థం కావటం. (11) మృతప్రాయంగా కాకుండా సజీవ కళతో ప్రకాశించటం. మొ..నవి. తెలుగులో నన్నయకు పూర్వం వాడుక భాష - కావ్య భాష అనేవి సూచనగా పొడసూపాయనీ, వాటిల్లో నన్నయ కావ్య భాషను సమగ్రపరచి విశ్వవ్యాప్తం చేశాడనీ, అదే గ్రాంధిక భాషగా తెలుగులో 19 వ శతాత్బ్దం వరకు అవిచ్ఛిన్నంగా కొనసాగిందనీ తెలుస్తూనే ఉన్నది. ఇంక రెండోదైన వాడుక భాష కావ్య భాషతో పోటీ పడలేక సామాన్య ప్రజా వ్యవహారంలోనే ఉంటూ ఎంతో కొంత అభివృద్ధిని సాధించుకొంటూ, అవసరాన్ని బట్టి, అన్యదేశీయ పదజాలాన్ని కూడా కలుపుకొంటూ, టీకలు - టిప్పణులు - వ్యాఖ్యలు- భావార్థ తాత్పర్యాలు - దిన చర్యలు - జమాఖర్చులు - ఇచ్చిపుచ్చుకొనే పత్రాలు మొ.. వాటిల్లో క్రమంగా స్థానాన్ని పెంచుకొంటూ 19 వ శతాబ్దం వరకు కాలం గడుపుకొన్నది. ఆ తరువాత గిడుగు రామమూర్తి లాంటి భాషా వేత్తల సాహసోపేతకృత్యంతో వ్యావహారికోద్యమంగా ఉప్పెనగా ఊపందుకొన్నది. క్రమంగా సఫలీకృతమైనేటి కాలంలో గ్రాంధిక భాష దర్పణాన్ని అణిచివేస్తూ సజీవ భాషగా నిండు జవ్వనాన్ని పొందుతున్నది.

## మాండలిక భాష

మండలానికి సంబంధించిన భాషయే మాండలిక భాష. సాధారణంగా మండలమనగా పరిపాలనా సౌలభ్యం కోసం విభజింపబడిన పరిమిత ప్రాంతమని వ్యవహారం. అయితే మాండలిక భాషకూ ఇటువంటి మండలానికి సంబంధం లేదు. దాదాపు ఒకేరకమైన భాష - సంస్కృతి - సంప్రదాయాలు, ఆచార - వ్యవహారాలు కలిగినట్టి ప్రజలు సహజీవనం చేస్తున్నట్టి ప్రాంతమే భాషా పరమైన మండలం. ఇటువంటి మండలంలో జీవించే ప్రజలు తమ నిత్యాదైనందిన కార్యకలాపాల నిర్వర్తనకు. జీవన వ్యాపారానికి ఎటువంటి భాషనైతే ఉపయోగిస్తారో ఆ భాషయే

ఆ మండలానికి సంబంధించిన మాండలిక భాష. ఇది అక్షర జ్ఞానం లేని సాధారణ గ్రామీణుల భాష కావడం వలన దీనికి 'గ్రామ్య' భాష అనే వ్యవహారం కూడ ఉన్నది. మొదట్లో ఒకేరకమైన భాషతో ఒకే ప్రాంతంలో జీవిస్తున్న వ్యక్తులు కాలక్రమంలో కారణ దృష్ట్యా మరొక ప్రాంతానికి వెళ్ళటం, భౌగోళిక పరిస్థితుల వలననో లేక వారభీష్టం మేరకో వారక్కడే స్థిరపడటం, దానితో ప్రాంతీయ భేదం రావడం, ఆ తరువాత భాషలో కూడ వ్యత్యాసం కలగడం, ఈ వ్యత్యాసమే క్రమంగా పెరిగి రెండు భాషలుగా విభక్తం కావటం ఈ రెండు మరి కొన్నాళ్ళకు మరికొన్ని భాషలుగా విడిపోవటం అనేది అతి సాధారణంగా జరిగింది. ఇలా ఒక భాషయే కాలక్రమంలో అనేక మార్పులకు లోనై అనేక భాషలుగా విభక్తమైపోయింది. ఈ విధంగా విడివడిన ఈ భాషలకే 'ఉపభాష'లని పేరు. ఇట్టి ఈ ఉపభాషలే మాండలిక భాషలు. ఉదాహరణకు మూల ద్రావిడ పదాలు వివిధ మాండలికాల్లో ఏవిధంగా విభక్తమయ్యాయో క్రింద చూడవచ్చు.

| అర్థాన్ని సూచించే పదం | తమిళ మాండలికం | మలయాళ మాండలికం | కన్నడ మాండలికం | తెలుగు మాండలికం |
|---|---|---|---|---|
| మూడు | మూన్టు | మ్యూన్ను | మూరు | మూడు |
| తమ్ముడు | తంబి | తంబి | తమ్మ | తమ్ముడు |

పై ఉదాహరణను మనం జాగ్రత్తగా పరిశీలిస్తే పై వివిధ మాండలికాలకు సంబందించిన మూల భాష ఒకటుండేదనీ, అదే మూల ద్రావిడమనీ, అది కాలక్రమంలో వివిధ మండలాలలో స్వల్ప తేడాతో వివిధ ఉపభాషలుగా విభక్తమైందనీ ఈ ఉపభాషలే తరువాతి కాలంలో ప్రత్యేక భాషలుగా స్థిరపడ్డాయినీ, అవే తమిళ - మళయాళ - కన్నడ- తెలుగు భాషలనీ స్పష్టమౌతున్నది. తెలుగు మాండలికాలను కూడ మనం క్రింది విధంగా చూడవచ్చు.

| | కోస్తా (ఆంధ్ర ) మండలం | రాయలసీమ మండలం | తెలంగాణ మండలం |
|---|---|---|---|
| బరువైన వానిని ఎత్తడానికి ఉపయోగించే సాధనం | గుణపం | గడారు, గడ్డపార | గడ్డపార |
| ఆకుకూర పేరు | గోంగూర | గోగాకు | పుంటికూర |
| కూరగాయ పేరు | ఆనబకాయ | సొరకాయ | ఆనిగెంకాయ |
| భుజించటానికి ఉపయోగించే సాధనం | పళ్ళెం | తట్ట( కంచం) | కంచం |
| "ఆ విధంగా "అనే అర్థంలో | అలా | అట్లా | గట్లా |
| "వచ్చాడ"నే అర్థంలో | వచ్చాడు | వచ్చిండు | ఒచ్చిండు |

తెలుగు పదాలు పైన సూచించిన విధంగా వివిధ మండలాలలో స్వల్పతేడాతో వివిధాలుగా స్థిరపడిపోయాయి. వానినే మనం మాండలిక భాషలు అంటున్నాం.

ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతాల్లో వృత్తిపరంగా కనిపిస్తున్న తెలుగు పదాలను సూక్ష్మ దృష్టితో పరిశీలించిన ఆధునిక భాషవేత్తయైన భద్రిరాజు కృష్ణమూర్తి గారు తెలుగు భాషలో ప్రధానంగా నాలుగు మాండలికాలున్నాయని గుర్తించారు. అవి పూర్వమండలం. [శ్రీకాకుళం విశాఖపట్టణం] 2. మధ్యమండలం [ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు] 3. ఉత్తర మండలం [తెలంగాణా జిల్లాలు] 4. దక్షిణ మండలం [రాయలసీమ,ప్రకాశం, నెల్లూరు] అయితే ఆంధ్రదేశంలో అన్ని విషయాల్లో స్పష్టమైన భేదాలతో కొట్టొచ్చినట్లుగా కనిపిస్తున్న ప్రధాన మాండలికాలు మూడే. అవి:- 1.ఆంధ్ర[కోస్తా] మాండలికం. 2. రాయలసీమ మాండలికం. 3 . తెలంగాణ మాండలికం. మాండలిక భాషా లక్షణాలుగా మనం క్రింది వానిని గుర్తించవచ్చు.

1. మండలం వరకే పరిమితం కావడం. 2. అనాగరికంగా ఉండడం. 3. వ్యాకరణ దృష్ట్యా అభివృద్ధి చెందకపోవడం. 4. స్థిరమైన శైలి అంటూ లేక పోవడం. 5. స్పష్టమైన ఉచ్చారణను కలిగి ఉండకపోవడం. 6. భాషలో ఆకర్షణ కొఱవడడం. 7. ధ్వనికి - వర్ణానికి కొన్ని తావుల్లో పొత్తు లేకపోవడం. 8. స్థిరత్వం కంటే ద్రవత్వానికే ప్రాధాన్యముండడం మొ..

**ప్రామాణిక భాష**

ప్రామాణీకరింపబడిన భాషయే 'ప్రామాణిక భాష'. సృష్టిలో ప్రతి విషయంలోనూ ప్రామాణికత (Standardness)ను అభిలషించడం మానవుని సహజ లక్షణం. అందరికీ ఆమోదయోగ్యంగా అభివృద్ధి మార్గంలో పదికాలాల పాటు స్థిరంగా నిలువగలిగేదే ప్రామాణికత, ఇట్టి ప్రామాణికతను భాషకూడా పొందితే అట్టి భాషను ప్రామాణిక భాష అంటారు. భాష ఒకటే అయినప్పటికీ, అది అనేక మాండలిక భాషలుగా చీలిపోయినపుడు వివిధ మాండలికాల మధ్య భాషా పరంగా సఖ్యత చెడిపోతుంది. క్రమంగా కొన్నాళ్ళకవి విడివిడి భాషలుగా రూపాంతరంచెందే ప్రమాదం ఉన్నది. అంతే కాక వివిధ మండలాల మధ్య వ్యవహారం దెబ్బతింటుంది. దానితో సహసంబంధాలు క్షీణించిపోవడం కూడ జరుగుతుంది. ఈ పరిణామం ఇంకా శ్రుతిమించితే భాష ముక్కలై పోవడమే కాక మొత్తం దేశమే ముక్కలైపోయే ప్రమాదం కూడ లేకపోలేదు.

ఇలా ఒక నియమావళి లేదా ప్రామాణిక స్థితి అంటూ లేకపోతే భాష స్థిరత్వాన్ని కోల్పోయి కొన్నాళ్ళకు క్షీణించిపోతుంది. కాబట్టి వివిధ మాండలికాల మధ్య సంబంధాలను ఏర్పఱచటానికీ, స్థిరత్వాన్ని చేకూర్చి అభివృద్ధి మార్గంలో నడిపించటానికీ, శాశ్వత ప్రతిపత్తిని కలిగించటానికి భాషను సంస్కరించి దానికొక ప్రామాణిక స్థితిని చేకూర్చవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అదుకే ప్రామాణిక భాషను "వివిధ మాండలికాల మధ్య అనుసంధానతను ఏర్పరుస్తూ, స్థిరత్వ - సమగ్రత్వ - శాశ్వత్వాలను సాధించుకొంటూ, ప్రసారాది సర్వ వ్యవహారాలకు, సాహితీ వ్యక్తీకరణకు దోహదపడుతూ, నిరంతరాభివృద్ధి మార్గంలో పయణించే భాష" గా చెప్పుకోవచ్చు. సమాజంలోని వ్యక్తులను శిష్టులనీ [ఎంతోకొంత భాషా జ్ఞానమున్న వారు], శిష్టేతురులనీ [కొద్దిపాటి భాషా జ్ఞానం కూడా లేనివారు] రెండుగా విభజిస్తే శిష్టేతరులకు సంబంధించినది మాండలిక భాషక్గాగా శిష్టులకు సంబంధించినది ప్రామాణిక భాషగా చెప్పుకోవచ్చు. ఇలా ఇది శిష్టజన వ్యవహారంలో ఉంటున్న కారణాన దీనికి 'శిష్టవ్యావహారిక భాష' అనే వ్యవహారం కూడ ఉన్నది. ప్రమాణిక భాష లక్షణాలుగా మనం క్రింది వానిని గుర్తించవచ్చు.

1. ప్రమాణ బద్ధం కావడం. 2.సరళ వ్యాకరణ బద్ధం కావడం. 3. వివిధ మండలాల మధ్య సఖ్యతను చేకూర్చడం. 4. మాండలిక భాషలన్నింటినీ ఏకత్రాటితో కూర్చటం. 5. వ్యవహారానికి చక్కగా దోహదపడడం. 6. సాహితీ వ్యక్తీకరణకు చక్కగా ఉపయోగపడడం. 7. రేడియో, టెలివిజన్ వార్తాపత్రికలు మొ.. ప్రసార సాధనాల్లో ఉపయోగింపబడడం. 8. అభివృద్ధి మార్గంలో పయనించడం. 9. స్థిరత్వ-సమగ్రత్వాది గుణాలను పొందడం.

తెలుగులో నన్నయకు పూర్వమే కావ్యభాష నుంచి సూచనగా వేరైన వాడుక భాష క్రమంగా వృద్ధి పొందుతూ 19, 20 శతాబ్దాల్లో వ్యావహారిక భాషగా విశ్వవ్యాప్తం చెందిన విషయం తెలిసినదే. ఈ వ్యావహారిక భాషనే ఇంకొంచెం ప్రమాణీకరిస్తే ఏర్పడిందే ప్రామాణిక భాష. ఈ ప్రామాణిక భాషయే ప్రస్తుతం తెలుగులో సర్వ సాహితీ ప్రక్రియలకు, వివిధ వ్యవహారాలకు నిరవధికంగా దోహద పడుతూ నిరంతరంగా అభివృద్ధి మార్గంలో పయణిస్తున్నది.

**అధికార భాష**

ప్రభుత్వ అధికార నిర్వర్తనకు ఉపకరించే భాషను 'అధికార భాష' అంటారు. విజ్ఞాపక పత్రాలను (Requisitions) గ్రహించడం, ఉత్తర్వులను (Orders) ను జారీ చేయడం, యోగ్యతా పత్రాలను (Certificates) అందించడం. అధికార వార్తలను (Gazettes) ప్రకటించడం, సమస్యలను(Problems) పరిష్కరించడం, ఆజ్ఞలను(Commands) ఆదేశించడం, శాసనములను (Acts)లిఖించడం మొ.. ప్రభుత్వ అధికార కార్యకలాపాల్లో ఉపయోగపడే భాషయే అధికార భాష. ప్రతి ప్రభుత్వం తన అధికార నిర్వర్తనకు ఏదో ఒక భాషను గ్రహించి తీరుతుంది. అయితే ఆ భాష ఖచ్చితంగా పాలిత భాషై ఉండాలనే నియమం మాత్రం ఇంతకు ముందు పాటింపబడలేదు. ఉదాహరణకు ఆంధ్ర ప్రభుత్వాలను పరిశీలిస్తే మొట్టమొదటి ఆంధ్ర ప్రభువులైన శాతవాహనులు ప్రాకృతాన్ని, ఇక్ష్వాకులువిష్ణుకుండినులు సంస్కృతాన్ని, తరువాతి చాళుక్యులు, కాకతీయులు మొదలైనవారు తెలుగును. ఆ తరువాతి 17 వ శతాబ్దాల్లోని ఆంధ్రసుల్తానులు ఉర్దూ, పారశీకాలను, తరువాతి ఆంగ్లేయులు ఇంగ్లీషును అధికార భాషలుగా గ్రహించారు. అయితే క్రీ. శ. 1947 లో భారత దేశానికి స్వాతంత్ర్యం రావడం. తరువాత క్రమంగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడం. ఆ తరువాత ఒకటి రెండు చోట్ల తప్ప ఆయా రాష్ట్ర భాషలే ఆయా రాష్ట్ర అధికార భాషలుగా కూడ చెలామణి కావడం అతి సాధారణంగానే జరిగింది. ఇట్టి అధికార భాష లక్షణాలుగా మనం క్రిందివానిని పేర్కొనవచ్చు.

1. ప్రాంతీయ భేధానికి మాండలిక భేదానికి ఆస్కారం ఉండకపోవటం. 2. సాధారణ వ్యాకరణబద్ధమై ఉండటం. 3.జన వ్యవహారంలో లేని పదాలతో మృతప్రాయంగా ఉండకపోవటం.4.ప్రమాణబద్ధంగా నడవడటం. 5.అందరికీ అర్థమయ్యేరీతిలో ఉండటం. 6. ఆలంకారికశైలికి తావుండకపోవట.7. అవసరాన్ని బట్టి అన్యదేశీయ పదజాలాన్ని గ్రహించటానికి వీలుగా ఉండటం. 8. నుడికారానికి జాతీయానికి తావుండటం. 9.సంక్షిప్తతను, సమగ్రతను పాటించటం.

బ్రిటిష్ పాలనలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉన్న ఆంధ్రదేశం 1-10-1953

న ఆంధ్ర రాష్ట్రంగాను, తరువాత విశాలాంధ్ర నినాదంతో 1-11-1956 న ఆంధ్రప్రదేశ్ గాను అవతరించినది. అయితే అధికార భాషగా ఆంగ్లమే ఉండేది. క్రమంగా ఆంగ్ల భాషపై నిరసన వెల్లుబుకటం, ఆంధ్ర భాషపై గౌరవం పెంపొందటం మొ.. కారణాల వల్ల ఆంధ్ర భాషనే ఆధికార భాషగా చేయటానికై 1956 లో 'అధికార భాషా చట్టం' ఏర్పడటం జరిగింది. ఇట్టి ఈ అధికార భాషా సంఘానికి వావిలాల గోపాల కృష్ణయ్య, డా. సి. నారాయణ రెడ్డి, నండూరి రామకృష్ణమాచార్యులు, డా..యశోదారెడ్డి మొదలైనవారు అధ్యక్షులై అధికార భాషగా తెలుగు అమలుకు. తదభివృద్ధికి దోహదపడ్డారు. ప్రస్తుతం గజ్జల మల్లారెడ్డి ఈ సంఘానికి అధ్యక్షుడు. అన్ని ప్రభుత్వశాఖల్లో అధికార భాషగా తెలుగు అమలును పెంపుచేయటానికై కృషిచేస్తున్నాడు.

## తెలుగు భాషపై అన్య భాషల ప్రభావం

తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది గనుక సహజ సిద్ధంగానే తమిళ, కన్నడాది ద్రావిడ భాషల స్వభావం దీనిలోనూ కనిపిస్తూనే ఉన్నది. ద్రావిడ భాషనుంచే తెలుగు జన్మించినప్పటికీ పెరిగింది, స్థిరపడిందీ సంస్కృత భాషలో కనుక సంస్కృత భాషాగుణగణాలన్ని దీనికి సహజమై పోయాయి. తరువాత 16, 17 శతాబ్దాల నాటికి అనేక ఉర్దూ పారశీక పదాలు, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఆంగ్ల పదాలు తెలుగులో కలిసిపోయాయి. ఇంక 18,19 శతాబ్దాల్లో ఆంగ్ల పధాలు తెలుగులో కలిసిపోయయి.ప్రస్తుత కాలంలో భాషాపదాలతో పాటు దాని సహజ లక్షణాల్లో కూడా కొన్ని తెలుగు భాషకు సహజాలై పోతున్నాయి. అలాగే హిందీపదాలు కూడ తెలుగులో చేరుతున్నాయి. ఇలా దశలవారీగా విస్తృతంగాఅన్యదేశీయ పదజాలం తెలుగు భాషలో కలిసిపోయినప్పటికీ వర్ణాలు, పదాలు పదనిర్మాణం, అర్ధనిర్ణయం, వాక్య నిర్మాణం, వ్యక్తీకరణ, వ్యాకరణంసాహితీ ప్రక్రియలు, కవితాధోరణులు మొ.. వాని విషయంలో తెలుగు భాషపై విప్లవాత్మకమైన ప్రభావాన్ని చూపించిన అతి ముఖ్యమైన భాషలు రెండు. అవి 1. సంస్కృతం. 2.ఆంగ్లం.

### 1. తెలుగు భాషపై సంస్కృత భాషా ప్రభావం :-

రాజభాషగా, శాసన భాషగా కొన్నాళ్ళుండడం చేతా, ఇంచుమించు పాలకులందరూ దీనిని అభిమానించి ఆదరించడం చేతా,కవి పండితులంతా దీనిని గౌరవించడం చేతా, శిష్టులంతా దీనిని పూజించడంచేతా, అప్పటికే అది బాగా అభివృద్ధిచెంది ఉండడం చేతా అన్ని విధాలుగా సంస్కృత భాష తెలుగు భాషపై క్రిందివిధంగా ప్రభావాన్ని చూపించినది.

I. వర్ణాలు :- తెలుగు భాష సంస్కృత ప్రభావంతోనే తన 56 వర్ణాల్లో ఋ - ౠ, ఖ, ఛ, ఠ , థ, ఫ - ఘ, ఝ, ఢ, ధ, భ - ఌ, ౡ, శ, ష, అనే 19 వర్ణాలను సంస్కృతం నుండి గ్రహించినది.

II. పదజాలం:- తెలుగులో కనిపించే అత్యధిక పదజాలం(దాదాపు80%) సంస్కృతానిదే. ఇట్టి సంస్కృత పదజాలాన్ని తెలుగు ముఖ్యంగా రెండు విధాలుగా గ్రహించింది. 1. తన విభక్తి ప్రత్యయాలను మాత్రమే చివరచేర్చి సంస్కృత పదాలను యథాతథంగా గ్రహించడం. ఇట్టి పదాలే తత్సమాలు. ఉదా:- సంస్కృత పదాలైన రామః, వృక్షః, వధూః, మొదలైన వానిని తన

విభక్తి ప్రత్యాయాలైన డు, ము, వు, లను చేర్చి రాముడు, వృక్షయు, వధువు పదాలుగా గ్రహించడం. ఉచ్చరణాలో ప్రకృష్టమైన తేడావచ్చే విధంగా సంస్కృత పదాలను గ్రహించడం.ఇట్టివానికే తద్భవాలని పేరు. ఉదా.. సంస్కృతాలైన,అగ్నిః, విష్ణుః, చంద్రః, రక్తః మొ.. వానిని అగ్గి, వెన్నుడు, చందురుడు, రగతము, మొ॥ వానిగా గ్రహించినది.

III. వాక్య నిర్మాణం:- 1. వాక్యంలో కర్మణి ప్రయోగం సంస్కృత భాషకు ప్రధాన లక్షణం. తెలుగులో మొదట్లో ఇట్టిది లేదు. కాని సంస్కృత ప్రభావం వలన తెలుగులో ప్రస్తుతమిది సహజమై పోయింది. ఉదా:- 'రాముడు చేసిన పని మంచిది' అనే తెలుగు సహజ వాక్యం సంస్కృత ప్రభావం చేత "రామునిచే చేయబడిన పని మంచిది" (రామేణకృతం కార్యం సమ్యక్) అనే కర్మణి వాక్యంగా స్థిరపడిపోయింది. అలాగే "అద్దం పగిలింది" అనే వాక్యం "అద్దం పగులగొట్టబడింది" అనేవాక్యంగా సాధారణమైనది.

2. వాక్యంలో 'కర్త - కర్మ - క్రియ' అనే వరుస తెలుగుకు సహజ లక్షణం. సంస్కృతంలో కర్త వాక్యచివర్లో రావడం అన్నది ఒక నియమం. తెలుగులో కూడ ఇపుడు సాధారణంగానే కనిపిస్తున్నది. ఉదా:- 'నేను నమస్కారం చేస్తున్నాను', అనే తెలుగు వాక్యం సంస్కృత ప్రభావంతో 'నమస్కారం చేస్తున్నాను నేను' [నమస్కారం కరోమి అహమ్] గా మారిపోయింది. అలాగే 'ఫల్గుణుడు వచ్చి నాడు' అనే సహజ వాక్యం 'వచ్చినవాడు ఫల్గుణుడు' గా మారి పోయినది.

3. తెలుగు వాక్యానికి సహజం కానట్టి సంబంధ బోధక సర్వనామాల ప్రయోగం సంస్కృత ప్రభావంతో తెలుగులో సహజమై పోతున్నది. ఉదా:- "దుర్మార్గులను సంహరించేవాడు మహానుభావుడు" అనే వాక్యం "ఎవడు దుర్మార్గులను సంహ రించేవాడో వాడే మహానుభావుడు" గా మారిపోయినది.

IV. వ్యాకరణం:- ఆంధ్రశబ్ద చింతామణి నుంచి బాలవ్యాకరణం దాకా వచ్చిన తెలుగు వ్యాకరణమంతా సంస్కృత వ్యాకరణానికి మారు రూపమే. అక్కడ కనిపించే పారిభాషిక పదాలన్నీ దాదాపుగా ఇక్కడ కూడ కనిపిస్తూన్నాయి. ఉదా:- అత్తు, ఇత్తు, ఉత్తు, ముత్తు, ఆగమం, ఆదేశం, విభాష, బహుళం, సంధి, సమాసం, తద్ధితం, కృదంతం మొ॥ అలాగే సూత్రీకరణ విధానం కూడా దాదాపు సంస్కృతానిదే.

V. సాహిత్యం:- ప్రాచీన తెలుగు సాహిత్యమంతా దాదాపుగా సంస్కృత సాహిత్యానికి అనువాదమో, అనుకరణమో, ఆధారంగా జన్మింటమో, కావటం చేత దానిపై సంస్కృత సాహిత్య ప్రభావం అనూహ్యంగా పడినది. తెలుగులోని కావ్యం, నాటకం, ప్రబంధం, శతకం, మొ॥ సంప్రదాయ సాహిత్య ప్రక్రియలన్నిటికీ సంస్కృత సాహిత్యమే మూలం. అలాగే తెలుగులోని కావ్య - ప్రబంధ - శతక - ఉదాహరణ - అశుబంధ - గర్భ - మధురాది ప్రాచీన కవితాధోరణులన్నిటికి కూడ సంస్కృత సాహిత్యమే ఆధారం.

VI. అలంకార శాస్త్రం:- తెలుగు అలంకార శాస్త్రం సంస్కృతాలంకార శాస్త్రంతోనే పుట్టి ప్రత్యేక తెలుగలంకార శాస్త్రంగా మారబోయి తిరిగి సంస్కృతాలంకార శాస్త్రంలోనే కలిసిపోయినది. అలంకారశాస్త్రంలో ప్రధానాంశాలైన రసం - ధ్వని - వక్రోక్తి - అలంకారం - గుణం - రీతి

చమత్కారంమొ॥ అన్నీ సంస్కృతానివే.

VII. ఛందస్సు :- తెలుగులోని అత్యధిక ఛందస్సు ఉత్పలమాల - చంపక మాల - శార్దూలం - మత్తేభం మొ॥ రూపాల్లో కనిపించేవన్నీ సంస్కృతానివే.

పై విధంగా భాషాపరంగా, సాహిత్యపరంగా తెలుగు పై సంస్కృతం విశేషంగా ప్రభావాన్ని చూపించి ఆత్మస్థానాన్ని పొందినది. శరీర స్థానాన్ని మాత్రం తెలుగుకు మిగిలించినది.

## II. తెలుగు భాషపై ఆంగ్ల భాషా ప్రభావం :-

బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో రాజ భాషగాను, తరువాత అనుసంధాన భాషగాను, అంతర్జాతీయ జ్ఞానారన భాషగాను, ఉపాధ్య వకాశభాషగాను, గౌరవ భాషగాను, బోధనామాధ్యమ భాషగాను ఆంగ్లం ప్రముఖ స్థానాన్ని పొందటం చేత తెలుగు భాషపై అది విశేషంగా క్రింది విధంగా ప్రభావాన్ని చూపించినది.

I. పదజాలం:- కోటు - బూటు - రేటు - ఘాటు - రోడ్డు , క్లాసు - గ్లాసు, లూజు - స్కేలు మొదలైన ఆంగ్ల పదాలు అతి సాధారణంగాతెలుగులో కలిసిపోతున్నాయి.

II. వాక్య నిర్మాణం:- (1) ఆంగ్లభాషకు సహజమైన కర్మణి వాక్యప్రయోగం తెలుగులో కూడ సహజమై పోయినది. ఉదా:- "రాముడు రావణుణ్ణి చంపాడు" అనేతెలుగు సహజ వాక్యం ఆంగ్ల ప్రభావంతో "రావణుడు రాముడి చేత చంపబడ్డాడు" (Ravana was killed by Rama) అనే వాక్యంగా మారినది

(2) తెలుగు వాక్యాల్లో 'మరియు' అనే పదాన్ని ఉపయోగించడం సాధారణమైన విషయం కాదు. కానీ ఆంగ్ల ప్రభావంతో అది సాధారణ మౌతున్నది. ఉదా: సీతారామ లక్ష్మణులు అడవికి వెళ్ళారు అనే వాక్యం ఆంగ్ల ప్రభావంతో "సీత, రాముడు మరియు లక్ష్మణుడు అడవికి వెళ్ళారు" (Sita, Rama and Lakshmana went to the Forest). గా మారిపోయినది.

(3) సాధారణ (Simple) వాక్యం తప్ప సంయుక్త (Compound) సంశ్లిష్ట (Complex) వాక్యాలు తెలుగుకు సహజమైనవి కావు. కాని ఆంగ్ల ప్రభావంతో అవి మామూలైపోయాయి. ఉదా: "పోస్టాఫీసుకు వెళ్ళుతూ మిత్రుణ్ణి కలిశాను" అనే సాధారణ వాక్యం "ఎప్పుడు నేను పోస్టాఫీసుకు వెళ్ళుచుంటినో అప్పుడు మిత్రుణ్ణి కలిశాను" (When I was going to the post-office , I met my Friend)అనే సంక్లిష్ట వాక్యంగా మారుతున్నది.

III. వ్యాకరణం:- 1. స్త్రీ(Feminine), పుం(Masculine) నపుంసక(Neuter)లింగాల(Genders)తో పాటు ఆంగ్లంలోని సాధారణలింగం (Common Gender)కూడా తెలుగు భాషలో సాధారణమైపోయినది. ఉదా: స్త్రీ పుంసత్వాల రెంటికీ సంబంధించిన మానవులు - రాక్షసులు - దేవతలు మొ॥వారు.

2. నామవాచకం, సర్వనామం, విశేషణం, క్రియ, అవ్యయం అనే ఐదు తెలుగుకు భాషా భాగాలు కాగా, ఆంగ్లభాషలోని సముచ్ఛయ (conjunction), విభక్తి ప్రత్యయం(pre-position),

ఆశ్చర్యార్థకం (Interjection) అనేవి కూడా తెలుగు భాషా భాగాలౌతున్నాయి.

3. వాక్యాంతంలో నిలువుగీత గీయడం భారతీయ భాషలకు మాదిరిగానే తెలుగుకు కూడా సహజ లక్షణం అయితే ఆంగ్ల ప్రభావంతో Full stop, Cama, Semi colon, Dash, Question mark , Exclamatory Mark, Inverted Camasమొ॥ తెలుగులో సాధారణమయ్యాయి.

4. తెలుగులో సహజమైన వర్ణనాత్మక వ్యాకరణంతో పాటు చారిత్రాత్మక. తులనాత్మక వ్యాకరణాలు వికసించటానికి ఆంగ్ల వ్యాకరణ విధానమే ఆధారం.

IV. సాహిత్యం:- తెలుగులోని ప్రాచీన సాహిత్య మంతా సంస్కృతమయమైతే, ఆధునిక సాహిత్యమంతా ఆంగ్లమయమై పోయినది. నవల, కథ, కథానిక, వ్యాసం, విమర్శ, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర, మొ॥ ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలకన్నింటికీ ఆంగ్ల సాహిత్యమే ఆధారం. అలాగే భావ - అభ్యుదయ - దిగంబర - విప్లవ - మినీ కవిత మొదలైన ఆంధ్ర నూతన కవితా ధోరణులకన్నింటికి కూడ ఆంగ్ల సాహిత్యమే మూలం.

V. అలంకారం:- దీనికి సౌందర్య శాస్త్రం అనే పేరు స్థిరపడటానికి ఆంగ్లమే ప్రధాన కారణం. కావ్యంలో భావనకు - కల్పనకు - అనుభూతికి - వ్యక్తీకరణకు ప్రాధాన్యమివ్వడమనేది ఆంగ్ల ప్రభావమే. కావ్య నిర్మాణ కాలంనాటి పరిస్థితులను, చారిత్రక నేపథ్యాన్ని పరిశీలించాలనడం, తులనాత్మక పరిశీలనతో సాహిత్యాన్ని విలువకట్టాలనడం, చారిత్రక - మార్క్సిస్టు దృక్పథాలతో సాహిత్యాన్ని విమర్శించాలనడం మొ॥ ఆంగ్ల ప్రభావ ఫలితాలే.

పై విధంగా ఆధునికి కాలంలో తెలుగు అన్ని విషయాల్లో ముఖ్యంగా సాహిత్యపరంగా ఆంగ్లంలోనే జీవిస్తున్నది.

## తెలుగు భాషా బోధనపై అన్య భాషల బోధనా ప్రభావం

వివిధ కాలాల్లో తెలుగు భాషపై అనేక భాషల ప్రభావాలు పడినప్పటికీ, భాషా పరంగా సాహిత్య పరంగా వ్యక్తీకరణ పరంగా తెలుగు భాషపై ప్రముఖంగా ప్రభావాన్ని చూపిన భాషలు ముందటి కాలంలో సంస్కృతం, ఆధునిక కాలంలో ఆంగ్లమని తెలుస్తూనే ఉన్నది. ఈ రెండు భాషల ప్రభావం తెలుగుపై ఇంతటితో ఆగక తెలుగు భాష బోధనా ప్రక్రియలో కూడ విశేషమైన స్థానాన్ని పొందినది. సంస్కృత భాషా బోధనా విధానాన్నే యథాతథంగా తెలుగు భాషా బోధనకు ఉపయోగిస్తే ప్రస్తుత కాలంలో ఆంగ్ల భాషా బోధనా విధానాన్ని కూడ తెలుగు భాషా బోధనకు ఎక్కువగానే ఉపయోగిస్తున్నారు. ఈ రెండుభాషల బోధనా విధానాలు తెలుగు భాషా బోధనలో క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

### 1. తెలుగు భాషా బోధనపై సంస్కృత భాషా బోధనా ప్రభావం

1. సంస్కృత భాషా బోధనా విధానాన్ని అనుసరించే తెలుగు భాషను బోధించడంలో కూడ మొదట వర్ణాలను చదవటానికి, రాయటానికి, నేర్పించి ఆ తరువాత గుణింతాన్ని నేర్పించడం, జరుగుచున్నది. 2. వాచకాన్ని ప్రవేశ పెట్టే వరకు లేఖనాన్ని అనుసరించి పఠనాన్ని నేర్పించడం

కూడా సంస్కృత ప్రభావమే. 3. విద్యార్థులకు సాధారణ వ్యవహార జ్ఞానాన్ని అందించటానికై పెద్ద బాలశిక్ష ను చదివించడం కూడ సంస్కృత బోధనావిధాన ప్రభావమే. 4. భాషాజ్ఞానాన్ని మరింతగా పెంపుచేయటానికై పలు కావ్యాలను బోధించడమనే పద్ధతి కూడా సంస్కృత పంచకావ్య బోధనా విధాన ప్రభావమే. 5. కావ్యాన్ని బోధించేటప్పుడు ముందుగా కవిని - అతని కాలాన్ని - ఇతర గ్రంధాలను, కృతిపతిని, కావ్యానికి సంబంధించిన మూలగ్రంధాన్ని ప్రస్తావించడమనేది కూడ సంస్కృత బోధనా ప్రభావమే. 6. పద్యాన్ని బోధించేటప్పుడు ముందుగా చదవడం, పదవిభాగం చేయడం, తరువాత ప్రతిపదార్థం - తాత్పర్యం - వ్యాకరణాంశాలు.- విశేషాంశాలు మొ॥వానిని బోధించడం అనేవి సంపూర్ణంగా సంస్కృతబోధనా ప్రభావమే. 7. మరుసటిరోజు పద్యాన్ని బోధించే ముందు ముందురోజు బోధించిన పద్యాన్ని చదివించడం అనేది కూడ సంస్కృత ప్రభావమే.

## 2. తెలుగు భాషాబోధన పై ఆంగ్ల భాషా బోధనా ప్రభావం

1. లేఖనాన్ని నేర్పించే ముందు భాషాలిపికి సంబంధించిన గీతలు గీయటాన్ని నేర్పించడమనేది ఆంగ్ల ప్రభావమే. 2. ముందుగా పఠనాన్ని నేర్పించి ఆ తరువాత లేఖనాన్ని నేర్పించడం, ఈ పఠనాన్ని కూడ అక్షర పద్ధతి ప్రకారం కాక, చూసి చెప్పే పద్ధతి ప్రకారం నేర్పించడం అనేవి కూడ ఆంగ్లప్రభావాలే. 3.పాఠాన్ని బోధించే ముందు ఉన్ముఖీకరణం(Motivation)చేయడం, తరువాత పాఠ్యబోధన (Interpretation), సమన్వయం(Application), సామాన్య ధర్మనిర్దేశం (Generalisation) సింహావలోకనం (Re-capitulation) మొ॥ సోపానాలను (steps) పాటించడం అనేది సంపూర్ణంగా ఆంగ్ల ప్రభావమే.5. క్రొత్త పదాలకు అర్థాలను ఉపాధ్యాయుడుతానుగా చెప్పకుండా విద్యార్థులే గ్రహించేటట్లు చేయడం 6. వ్యాకరణాంశాలను అనుమానోపపత్తి పద్ధతి ద్వారానే బోధించడం మొ॥కూడా దీనిప్రభావమే. 7. వార్షిక (Annual),అంశ (Unit); పాఠ(Lesson) పథకాలను ముందుగానే సిద్ధపరచుకోవడం ఆంగ్ల సంప్రదాయమే. 8. పరీక్షలలో విషయనిష్ఠ(Objective) ప్రశ్నలకే ప్రాధాన్యమివ్వడమనేది ఆంగ్ల ప్రభావఫలితమే. 9. విద్యార్థుల ధారణాశక్తిని మాత్రమే కాకుండా, వారి మానసిక శక్తులన్నింటినీ పరీక్షించాలనేవి కూడ ఆంగ్ల బోధనాపద్ధతి ప్రభావమే.

# III. తెలుగు సాహిత్యం

## సాహిత్యం - సమాజంలో స్థానం

'స - హి - తస్య - భావః సాహిత్యమ్' శ్రీ మంచిహితంతో కూడినదాని భావమే సాహిత్యం . అనగా హితబోధయే సాహిత్య పరమధ్యేయమని స్పష్టమౌతున్నది. మదక్రోధమాత్సర్యాది అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న మానవ సమాజానికి హితబోధ చేసి దానిని సాధు జీవనంలో జ్ఞానమార్గం వైపు పయణింప చేయటానికి ఆవిర్భవించినదే సాహిత్యమన్నమాట.

'సహిత భావః సాహిత్యమ్' శబ్దార్థాలు కలయికతో ఏర్పడిన దాని భావమే సాహిత్యం, " ఆది దంపతులైన పార్వతి పరమేశ్వరులు ఒకరితో మరొకరు కలిసిపోయి అర్ధనారీశ్వరులై ఈ సృష్టికి మూలమైనట్లుగానే శబ్దం (రమణీయ) అర్థంతో కలిసి జగదేక సౌందర్య సృష్టికి ఆధారమౌతున్నది. స్వాతి - ముత్యంతో కలిసి పరమ పవిత్రతను అతిలోక సౌందర్యాన్ని ఈ ప్రపంచానికి అందించినట్లే శబ్దం చక్కటి అర్థంతో కలిసి సాహిత్యమై మానవసమాజానికి ఒక వంక హితబోధ చేస్తూ మరోవంక హృదయానందాన్ని చేకూరుస్తున్నదన్నమాట.

మానవ హృదయాన్ని స్పృశించి మథించి పరవశింప చేసే లలిత కళల్లో సాహిత్యం ప్రధానమైన కళ. ఇందులో కూడ "నాటకాంతం హిసాహిత్యం, నాటకాంతం హి కవిత్వమ్" అనుటను బట్టి నాటకానికి అగ్రతాంబూలమున్నది. ఇది సంగీతశిల్పచిత్రలేఖనాలసమాహారకళ కావడమే అందుకు కారణం. దీనిని బట్టి అతి మనోహరమైన లలిత కళలన్ని సాహిత్యంలో సంగమిస్తున్నాయని తెలుస్తూనే ఉన్నది. అందుకే సాహిత్యం సమాజంలోని మానవ హృదయానందానికి హేతు భూతమౌతున్నది.

ప్రసిద్ధ పాశ్చాత్య పండితుడైన మ్యాథ్యూ అర్నాల్డ్ గారు"Leterature is nothing but the criticism of life"- (జీవిత వ్యాఖ్యానమే సాహిత్యమ) ని వాక్రుచ్చారు. అనగా సమాజమే సాహిత్యానికి ఆయువు పట్టని అర్థమౌతున్నది. భారతీయ సాహిత్య సిద్ధాంతాల్లో అతి ముఖ్యమైనదీ, కావ్యానికి ఆత్మస్థానాన్ని పొందినట్టినదీ 'రస సిద్ధాంతం'. ఇది మానవుని మానసిక జగత్తును పరి పరి విధాల పరిశోధించి, విశ్లేషించి , మానవ జీవితమంతా ప్రధానమైన నవరసాల్లో పల్లవిస్తుందని సిద్ధాంతం చేసినది. ఇట్టి ఈ " వీరం - శృంగారం - రౌద్రం, భయానకం - బీభత్సం - అద్భుతం - హాస్యం - కరుణం - శాంతం" అనే తత్వాల వ్యాఖ్యానమే భారతీయ సాహిత్యానికి మూలకందం.

ధర్మార్థ కామమోక్షాలనే నాలుగు పురుషార్థాలు భారతీయ సమాజానికి మూల స్తంభాలు. ఇందు మానవ జీవితానికి అతి ముఖ్యమైనవి 'అర్థకామాలు' వీటిల్లో మొదటిది బాహ్య జగత్తుకు సంబంధించినది కాగా రెండోది అంతర జగత్తుకు సంబంధించినది. ఈ రెండు కేంద్ర బిందువుల చుట్టే మానవ జీవితమంతా తిరుగుతూ ఉంటున్నది. అందుకే వీనిని పొందడానికి మానవుడు ఎల్లప్పుడూ ఎదుటి వానితో పోటీ పడుతుంటాడు. ఇట్టి పోటీలో బలమున్నవాడు బలహీనుణ్ణి దోపిడీ చేస్తాడు. ఈ దోపిడీని అరికట్టడానికి మన తాత్వికులు ఏర్పాటు చేసిన నియమమే 'ధర్మం'.

అంటే మానవుడు తన మనుగడకు అత్యంత ముఖ్యమైన అర్థాన్ని - కామాన్ని తన ఇష్టమొచ్చిన రీతిలో కాకుండా ధర్మ మార్గంలో మాత్రమే పొందాలి. ఇలా మానవుడు అర్థాన్ని కామాన్ని ధర్మ మార్గంలో పొందటమే పరమార్థం. అట్టి పరమార్థమే మోక్షం. ఇట్టి నాలుగు పురుషార్థాల వ్యాఖ్యానం కోసం పుట్టిందే సాహిత్యం. ఇదే విషయం ఆది కావ్యమైన రామాయణం ద్వారా స్పష్టమౌతున్నది. "క్రౌంచ ద్వంద్వ వియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః" ఇదే రామాయణ కావ్య ఆవిర్భావం. వయసులోని రెండు క్రౌంచ పక్షులు వయస్సును అనుభవిస్తున్నపుడు అక్రమ మార్గంలో కిరాతకుడొకడు ఒకదానిని సంహరించాడు. విరహ వ్యథతో దిక్కు తోచక తల్లడిల్లుతున్న రెండో పక్షిని వాల్మీకి చూశాడు. అతని హృదయం ద్రవించినది. వెంటనే శోకమే శ్లోకమైనది. ఇదే రామాయణం. సీతారాములు అగ్ని సాక్షిగా వివాహం చేసుకొన్న క్రొత్త జంట. రావణాసురుడు అక్రమ మార్గంలో సీతను పొందాలనుకొన్నాడు. అనగా ధర్మానికి విఘాతం తలపెట్టాడు. ఫలితంగా అతనే నాశనమయ్యాడు. చివరకు ధర్మమే నిగ్గు తేలింది. అలాగే మహా భారతం కూడ ధర్మం కోసమే ఆవిర్భవించిందనే విషయం ఋజువౌతూనే ఉన్నది.

పై విధంగా సమాజం వెన్నెముక అయితే దాని రక్తమాంసాదులే సాహిత్యం. సమాజం శరీరమైతే సాహిత్యం దాని ఊపిరి. సమాజం ముందైతే, దాని వెనుకే దాన్ని అంటి పెట్టుకొని ఉండేదే సాహిత్యం. ఇట్టి సాహిత్యం లేకపోతే సమాజానికి స్థితి లేదు, గతి లేదు. ఉత్తమ సమాజానికి సాహిత్యం అత్యుత్తమమైన మణిభూషణం. ఇట్టి ఈ సాహిత్యం ఉన్నత ప్రమాణాల్ని పొందినపుడు సమాజాన్ని స్వర్గ సీమలవైపు పయణింప చేస్తుందనడంలో సందేహం లేదు. అదే సమయంలో ప్రమాణాలు పడిపోయిన సాహిత్యం సమాజాన్ని అజ్ఞానాంధకారంలో అతః పాతాళానికి త్రొక్కుతుందనడంలో కూడ ఎటువంటి సందేహం లేదు.

## తెలుగు సాహిత్య ఆవిర్భావ వికాసాలు

క్రీ. శ. 1 వశతాబ్దం నాటికి తెలుగు భాష స్వతస్సిద్ధంగా అభివృద్ధి చెందుతున్న సమయంలో జన వ్యవహారంలో ప్రజల హావభావ విన్యాసాలకు అద్దం పట్టే గేయాలు కూడ కొన్ని పుట్టాయి. ఇవి క్రమంగా వృద్ధి పొందుతూ క్రీ. శ. 6వ శతాబ్దం నాటికి శాసనాలలో కూడ సూచనగా చోటు చేసుకొన్నాయి. క్రీ. శ. 9వ శతాబ్దం నాటికి సల్లక్షణ ఛందో బద్దమైన శాసనాలతో పాటు అచ్చంగా పద్యమయశాసనాలు కూడా వెలువడ్డాయి. ఇలా తెలుగు శాసనాలు పద్యరూపంలో నడుస్తూ నిత్య వాడుక భాషకంటే వేరొక భాషను అభివృద్ధి పఱచాయి. అయితే ఈ భాష విషయ ప్రధానమైనదే తప్ప కవితా వాసన సోకిన భావ ప్రధానమైనది మాత్రం కాదు. అయితే ఆ తరువాత కనిపించే శాసన భాషకు సూచనగా కవితా గుణాలు కొన్ని సోకినట్లు తెలుస్తూనే ఉన్నది. అట్టి స్థితిలో క్రీ. శ. 11 వ శతాబ్దంలో నన్నయ వాడుక భాష నుంచి కవితా భాషను పూర్తిగా వేరు చేసి ,దానిని సుసంపన్నం చేసి, దానితోనే భారతాన్ని రచించి తెలుగులో సత్సాహిత్యానికి చక్కటి రాజబాటను వేసి ఆదికవియై ఆంధ్ర కవితా గురువయ్యాడు. ఈతని సాహిత్యం సంస్కృత పద బాహుళ్యంతో, వైష్ణవ మత ప్రాధాన్యంతో నడిచినది. రచనలో ఇతడు ప్రసన్నతకు, అక్షర రమ్యతకు. సూక్తులకు ప్రాధాన్యమిచ్చాడు.

12 వ శతాబ్దంలో తెలుగు సాహిత్యం దేశీయమైనది. ముఖ్యంగా పాల్కురికి సోమనాధుని దేశీయ పద బాహుళ్యంతో, శైవ మత ప్రాధాన్యంతో ఇది వృద్ధిని పొందినది. ద్విపద, ర( శతకం, ఉదాహరణం, గద్యం, మొదలైన దేశీయ రచనా ప్రక్రియల్ని సోమనాధుడే తెల సాహిత్యంలో స్థిర పఱచాడు. ఇదే కాలంలోని నన్నె చోడుడు ప్రౌఢరచనను చేపట్టి ప్రబ రచనకు పాదులు తీశాడు. తరువాతి కాలంలో తెలుగు సాహిత్యంలో మొదటిదైన రంగన రామాయణంఉద్భవించినది. ఇది దేశి-మార్గ సాహిత్యాల సంగమ స్థానం.

13 వ శతాబ్దంలో తిక్కన భారతంలో అత్యధిక భాగాన్ని తెలుగు చేసి తెలుగు సాహిత్యా పండించి 'కవి బ్రహ్మ' అయ్యాడు. అలాగే శివ- వైష్ణవుల వైషమ్యాలను తొలగిస్తూ ధర్మాద్వైతషై హరిహరనాధతత్వాన్ని తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. రచనలో సంస్కృతానికి, దేశీయత దాదాపు సమ ప్రాధాన్యమిచ్చి ఉభయ కవి మిత్రుడయ్యాడు. ఇతడు నిర్వచనోత్తర రామాయణా రచించి సాహిత్యంలో నూతనంగా కేవల పద్య రచనా ప్రక్రియకు మార్గం వేశాడు. రచన శిల్పానికి అతడు ప్రాధాన్యమిచ్చాడు. ఇదే కాలంలోని కేతన తెలుగుసాహిత్యంలో మొదటి సారి 'దశకుమార చరిత్ర' అనే కథాకావ్యాన్ని రచించాడు. అలాగే మారన 'మార్కండేయ పురాణా ' రచించి పురాణ రచనను తెలుగు సాహిత్యానికి పరిచయం చేశాడు. ఇదే కాలానికి చెంది కృష్ణమాచార్యుడు 'సింహగిరి నరహరి వచనాలనే' పేరుతో తెలుగు సాహిత్యంలో మొదటి సారి వచన రచన చేసాడు. 'కాచవిభుడు - విఠల నాధుడు' అనే జంట కవులు ఈ కాలంలోనే మొద సారిగా తెలుగు సాహిత్యంలో కనిపిస్తున్నారు.

14 వ శతాబ్దంలో ఎర్రన మిగిలిపోయిన భారతాన్ని పూర్తి చేసి తెలుగు సాహిత్యంలో భారత రచనను సంపూర్ణం చేశాడు. పైకి పురాణం లాగా కనిపించే నృసింహ పురాణాన్ని ప్రౌఢ మార్గంలో రచించి ఇతడు 'ప్రబంధ పరమేశ్వరుడయ్యాడు' . నృసింహ పురాణ రచనతో ఇతడు క్షేత్ర మహాత్మ్య ప్రక్రియను తొలిసారిగా తెలుగు సాహిత్యానికి పరిచయం చేశాడు. రచనలో ఇతడు సూక్తి వైచిత్రికి ప్రాధాన్యమిచ్చాడు. ఎర్రన హరివంశానికి దాదాపు పోటీ అన్నట్లుగా ఉత్తర హరి వంశాన్ని రచించి "సాహిత్య రసపోషణ, నవీన గుణ సనాధ, సంవిధాన చక్రవర్తి" అనే బిరుదులను పొందిన నాచన సోమనాధుడు ఈ కాలంలోని వాడే. అలాగే జన వ్యవహారంలో మిగుల ప్రచారాన్ని పొందిన భాస్కర రామాయణం కూడ ఈ కాలం నాటిదే.

15 వ శతాబ్దం నాటి శ్రీనాధుడు కవి సార్వభౌముడై తెలుగు సాహిత్యాన్ని పరి పరి విధాలుగు పండించాడు. "విద్వదౌషధమ్" అయినట్టి శృంగార నైషధం, అయః పిండమ్ అయినట్టి కాశీ ఖండం ఈతని మిగుల ప్రసిద్ధ గ్రంధాలు. తెలుగు సాహిత్యంలో మొదటి సారిగా శ్రీనాధునితోనే చాటువు ప్రక్రియ ప్రకాశించినట్లు తెలుస్తున్నది. ఈతని కవిత మిగుల ప్రౌఢంగా, వినసొంపుగా ఉండును. 'క్రీడాభిరామమనే వీధి నాటకం తెలుగు నాటకానికి పూర్వ రూపంగా ఈ కాలంలోనే ఉద్భవించినది. సహజ పండితుడైన పోతన ఈ కాలంలోనే భాగవతాన్ని అత్యంత మృదమధురంగా రచించాడు. అలాగే భోగినీ దండకాన్నికూడ ఇతడు రచించి తెలుగు సాహిత్యానికి దండక రచనను మొదటి సారిగా పరిచయం చేశాడు. 'వాణినా రాణి' అన్నట్టి పిల్లల మఱ్ఱిపిన వీరన ఈ కాలంలోని వాడే. భోజరాజీయం, సింహాసనద్వాత్రింసిక లాంటి కథా కావ్యాలు ఈ కాలంలో విరివిగా పుట్టుకొచ్చాయి.

ఈ కాలంలో వెలువడిన కావ్యాలన్నింటిలో దాదాపుగా శృంగారమే తీవ్రంగా కనిపిస్తున్నది. మడికి సింగన ఇదే కాలంలో సకల నీతి సమ్మతమనే సంకలన కావ్యాన్ని రచించి తెలుగు సాహిత్యంలో, సంకలన కావ్య జాతికి శ్రీకారం చుట్టాడు. మొట్టమొదటి సారిగా తెలుగు సాహిత్యంలో సంకీర్తన రచనకు శ్రీకారం చుట్టి పదకవితా పితామహుడిగా, సంకీర్తనా చార్యుడిగాకీర్తినార్జించిన తాళ్ళపాక అన్నమాచార్యుడు ఈ కాలంలోని వాడే. క్షేత్రమహాత్మ్య ప్రక్రియ ఈ కాలంలో బాగా అభివృద్ధిని సాధించినది. అనంతామాత్యుని రసాభరణం, విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడా మణి, ఈ కాలంలో వెలువడిన ప్రసిద్ధ అలంకార గ్రంథాలు. నంది మల్లయ, ఘంట సింగనలు ఈ కాలంలో ప్రసిద్ధ జంట కవులు.

16 వ శతాబ్దం తెలుగుసాహిత్యానికి స్వర్ణ యుగం. తెలుగు సాహిత్యం ఈకాలంలో ఉన్నత ప్రమాణాలతో అత్యున్నత స్థానానికి చేరుకొన్నది. సాహిత్యంలో రాజశ్రేష్ఠత్వాన్ని పొందిన ప్రబంధ ప్రక్రియ ఈ యుగంలో మూడు పూవులు ఆరు కాయలతో శిఖర స్థానానికి చేరుకొన్నది. అష్ట దిగ్గజ మహా కవులు ఆంధ్ర సాహిత్యాన్ని విశ్వవ్యాప్తం చేశారు. ప్రకృష్ట రచనతో, రస నిర్భరతతో, అపురూప భావనావాహికగా, శృంగార రస గుళికగా మను చరిత్రను రచించి పెద్దన ఆంధ్రకవితా పితామహుడయ్యాడు. ఈతని కవిత కుసుమ పేశల సుధామయోక్తులతో, అల్లిక జిగిబిగితో రసరాజనాలను పండిస్తున్నది. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణ దేవరాయలు కన్నడీయుడే అయినప్పటికీ తమిళ సంస్కృతికి అద్దం పట్టే ఆముక్త మాల్యదను ఆంధ్ర భాషలో అత్యున్నత ప్రమాణాలతో విరచించాడు . తెలుగు సాహిత్యంలో నాయిక ప్రాధాన్యంతో మహాకావ్యాన్ని సృజించడం ఇదే ప్రథమం. ముక్కు తిమ్మనార్యుని ముద్దు పలుకుల్లో వెలువడిన పారిజాతాపహరణం ప్రబంధాకారం తాల్చిన నాటకం. మాధురీ మహిమను పండించే ఉత్తమ స్తుత మతియైన ధూర్జటి కాళహస్తి మహాత్యాన్ని వెలయించాడు. కుమార భారతి బిరుదాంకితుడైత తెనాలి రామలింగడు పదగుంఫనంతో అనేక కావ్యాలను రచించాడు. కావ్యప్రబంధపురాణ రీతులు మూడింటినీ పుణికి పుచ్చుకొన్న ఈతని పాండురంగ మహాత్మ్యం 'పాండురంగ సుకవి పద్యంబు హరువు.' అనే కీర్తిని ఇతనికి ఆర్జించి పెట్టినది. రామాయణభారత గాథలను వ్యక్తీకరించే 'రాఘవ - పాండవీయ' మనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించి పింగళి సూరన ద్వ్యర్థి కావ్య ప్రక్రియను తెలుగు సాహిత్యానికి తొలి సారిగా పరిచయం చేశాడు. ఈతని 'కళా పూర్ణోదయం' లలిత కళల సంగమ స్థానమైన తొలి కల్పిత మహా ప్రబంధం. తెలుగు నవలా చరిత్రలో ఇదే ప్రథమమనే భావాన్ని కూడా ఇది కలిపిస్తున్నది. ఈతని ప్రభావతి ప్రద్యుమ్నం అత్యంత సరసమైన మహా ప్రబంధం. రామరాజ భూషణుడనే బిరుదు నామాన్ని పొందిన భట్టుమూర్తి సంగీతం చిందులాడే విధంగా వసు చరిత్ర' మనే మహా ప్రబంధాన్ని రచించి 'సంగీత రహస్య కళానిధి' గా ఖ్యాతిని పొందాడు. వసు చరిత్రను అనుసరించి పిల్ల వసు చరిత్రలు అనేకంగా తెలుగు సాహిత్యంలో ఆవిర్భవించాయి. హరిశ్చంద్రనలోపాఖ్యానమనే ద్వ్యర్థి కావ్యాన్ని, కావ్యాలంకార సంగ్రహమనే సమగ్ర అలంకార శాస్త్ర గ్రంథాన్ని ఇతడు రచించాడు. 'రాధా మాధవ' బిరుదాంకితుడైన చింతల పూడి ఎల్లనార్యుడు "రాధా మాధవమనే" మహా ప్రబంధాన్ని రచించాడు. శృంగార వైరాగ్య సంగమ స్థానంగా ఆవిర్భవించిన ఆ కవి కర్ణరసాయనాన్ని సంకుసాల నృసింహ కవి రచించాడు. సల్లక్షణాలతో సుగ్రీవ విజయమనే' యక్షగానాన్ని తొలిసారిగ తెలుగు సాహిత్యానికి అందించిన వ్యక్తి కందుకూరి

రుద్రకవి. ఇతడే రచించిన నిరంకుశోపాఖ్యానం తెలుగు సాహిత్యంలో వెలసిన తొలి సాంఘిక మహా ప్రబంధం. అలాగే 'జనార్ధనాష్టకాన్ని' రచించి తెలుగులో అష్టక రచనలో ప్రథముడిగ ఇతడు ఖ్యాతిని పొందాడు.

ఈ యుగంలో నే పొన్నిగంటి తెలగన 'యయాతి చరిత్రను' రచించి తెలుగు సాహిత్యానికి అచ్చ తెనుగు కావ్య రచనను ప్రప్రథమంగా పరిచయం చేశాడు. మరింగంటి సింగరాచార్యుడు ఈ కాలంలోనే నాలుగర్థాల కావ్యాన్ని అనేకంగా టరచించాడు. ఆంధ్ర సాహిత్యంలో తొలిసారిగా కవయిత్రిగా విరళ ఖ్యాతిని పొందిన ఆతుకూరి మొల్ల "మొల్ల రామాయణ" మనే ప్రథమ సంగ్రహ రామాయణాన్ని రచించినది. ఈ కాలంలోనే వెలువడిన 'రాయవాచకం' వ్యావహారిక భాషలో రచింపబడిన ప్రథమ వచన గ్రంధం. చిత్ర కవి పెద్దన, వెల్లంకి తాతం భట్టు, లింగముగుంట తిమ్మన మొదలైన ఆలంకారికులు ఈ యుగంలోని వారే. తెలుగు సాహిత్యంలో అత్యున్నత ప్రమాణాలు కలిగిన గ్రంధ రాజాలైన ఆముక్త మాల్యద, మను చరిత్ర, వసు చరిత్ర, పారిజాతాపహరణం, పాండురంగ మహాత్మ్యం అనబడే పంచ కావ్యాలు ఆంధ్ర పంచ మహా ప్రబంధాలుగా ఖ్యాతిని పొందాయి.

17 వ శతాబ్దంలో అభినవ భోజరాజ బిరుదాంకితుడైన రఘునాధ నాయకుడు "నాయకాభ్యుదయ' ప్రక్రియను తెలుగు సాహిత్యాకికి పరిచతయం చేశాడు. ఈతని ఆస్థాన కవియైన చేమకూర వేంకట కవి 'ప్రతి పద్యచమత్కృతిగా' శ్లేష ప్రాధాన్యంతో 'విజయ విలాస' మనే ప్రబంధాన్ని రచించాడు. ఈ కాలంలో యక్షగాన ప్రక్రియ విరివిగా అభివృద్ధి చెందింది. అలాగే దేశీయతా ప్రాధాన్యం కూడ వృద్ధి చేందినది. రామభద్రాంబ, మధుర వాణి, రంగాజమ్మ మొ.. ప్రసిద్ధ కవయిత్రులు ఈ కాలంలోని వారే. ప్రసిద్ధ ప్రజా కవియైన వేమన ఈ కాలంలోని వాడే. 18 వ శతాబ్దంలో పేర్కొన దగిన కవయిత్రి ముద్దు పళని. మొత్తం మీద ఈ 17, 18 శతాబ్దాల్లో తెలుగు సాహిత్యంలో యక్షగాన, ద్విపద, శతక,. ఉదాహరణ, అభ్యదయ, వచన, ద్వ్యర్థి, ప్రబంధ, కావ్య , పురాణ, నిరోష్ఠ్య, చరుర్విధ (అశు - చిత్ర - మధుర - విస్తర) కవితాది ప్రక్రియలన్నీ విస్తృతంగా వ్యాపించాయి.

19 వ శతాబ్ది ప్రారంభంలో తెలుగు సాహిత్యంలో అభివృద్ధి లేదనే చెప్పవచ్చు. అయితే ఈ శతాబ్ది అంతం నాటికి తెలుగు సాహిత్యం విప్లవాత్మకమైన మార్పులకు లోనైనది. ఇంత వరకూ సంస్కృత సాహిత్యాన్ని పుణికి పుచ్చుకొన్న తెలుగు సాహిత్యం ఈ శతాబ్ది చివరి నాటికిపూర్తిగా ఆంగ్ల సాహిత్యమయమై పోయినది. 'గద్య తిక్కన' గా ప్రఖ్యాతమైన కందుకూరి విరేశలింగం ఆంగ్ల సాహిత్య స్ఫూర్తితో నవల, స్వీయ చరిత్ర, జీవిత చరిత్ర, అధిక్షేపం, ప్రహసనం, పద్యం, పరిశోధన, మొదలైన నూతన ప్రక్రియలను తెలుగుసాహిత్యానికి పరిచయం చేశాడు. ఇదే కాలంలో జంట కవులైన తిరుపతి వేంకట కవులు అవధాన ప్రక్రియను తెలుగు సాహిత్యంలో విశ్వ వ్యాప్తం చేయడమే కాక దానిని ఊరూరా ఊరేగించారు. క్రమంగా స్మృతి కావ్యం, ఖండ కావ్యం, కథ, కథానిక , నాటకం, నాటిక,. విమర్శ మొ.. నూతన ప్రక్రియలన్నీ కూడా ఆంగ్ల ప్రభావంతో తెలుగు సాహిత్యంలో స్థిర పడి పోయాయి.

అలాగే 20 వ శతాబ్దంలో తెలుగు సాహిత్యం కవితా పరంగా కూడా విప్లవాత్మకమైన

మార్పులకు లోనైనది. సనాతనంగా సంక్రమిస్తున్న సంప్రదాయ కవితా ధోరణితో పాటు భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ, గేయ కవిత, మినీ కవిత, వచన కవితాది ధోరణులన్నీ తెలుగు కవిత్వంలో ప్రభవిస్తున్నాయి.

**తెలుగు సాహిత్య యుగ విభజన**

క్రీ. శ. 6 వ శతాబ్దంతోనే సూచన ప్రాయంగా ఆరంభమైన తెలుగు సాహిత్యం వివిధ కాలాల్లో వివిధ కవుల చేత., వివిధ వ్యక్తీకరణలతో, విభిన్న సాహిత్య ప్రక్రియలతో, వివిధ కవితా ధోరణులతో అవిచ్ఛిన్నంగా, విశృంఖలంగా, విరళ వ్యాప్తితో ఈ నాటి వరకు వృద్ధి చెందినది-చెందుతున్నది. ఇట్టి ఈ విస్తృత విశాలమైన తెలుగు సాహిత్యాన్నంతటినీ మథించి, సూక్ష్మాతి సూక్ష్మ దృష్టితో పరిశీలించడం సులభసాధ్యమైన విషయం కానేకాదు. దానికోసం సువిశాల తెలుగు సాహిత్యాన్నంతటినీ సాహితీ చరిత్ర కారులు కొన్ని యుగాలుగా విభజించారు. ఇక్కడ యుగమంటే "కొన్ని విశిష్ట లక్షణాలు సమానంగా ఉండే కాల పరిమితి" అని అర్థం. అనగా కొన్ని ప్రత్యేక విశిష్ట లక్షణాలతో ఆరంభమైన సాహిత్యం మరల కొన్ని క్రొత్త విశిష్ట లక్షణాలు వచ్చేంత వరకూ కొనసాగిన కాలమని భావం. ఇట్టి యుగ విభజనను అనేకులు అనేక రీతుల్లో చేశారు.

కొందరు వివిధ కవులు రచించిన గ్రంథాలను ప్రమాణంగా తీసికొని భారత కవులు, రామాయణ కవులు, ప్రబంధ కవులు, గేయ కవులు మొ.. వానిగా యుగ విభజన చేశారు. అయితే దీని ఆధారంగా గ్రంథ ప్రామాణికతను నిర్దేశించాలో తెలియక పోవడం వలనా, ఒక కాలంలో ప్రమాణ వంతమైన గ్రంధం మరొక కాలంలో కాకపోవడం వలనా ఈ యుగ విభజన అంత హేతువంతమైనదిగా కనిపించడం లేదు.

మరికొందరు కవులను పోషించిన రాజులను, రాజవంశాలను బట్టి ఆదిమ చాళుక్య యుగం, కాకతీయ యుగం, పద్మనాయక యుగం, రెడ్డిరాజుల యుగం, రాయల యుగం, నవాబుల యుగం, కుంఫిణీ యుగం, జమిందారీ యుగం, ఆధునిక యుగం, మొ.. వానిగా విభజించారు. దీని ప్రకారం ఆలోచిస్తే ఎవరి చేతా పోషింప బడక స్వతస్సిద్ధంగా ఉన్నట్టి కవులు., వారికావ్యాలు మరుగున పడిపోయే ప్రమాదమున్నది. అందుచేత ఇది కూడా తర్క సమంజసం కాదు.

ఇంకొందరు కావ్య ప్రక్రియలను బట్టి ప్రాఙ్నన్నయ యుగం, పురాణ యుగం, కావ్య యుగం, ప్రబంధ యుగం, గద్య - గేయ - యక్షగాన యుగం,ఖండ కావ్య యుగం మొ॥ విగా విభజించారు. ఇక్కడ కూడ అసౌకర్యమున్నది. అదేమంటే ఒకే కాలంలో ఒకే రకమైన సాహిత్య గ్రంథాలను మన కవులెవరూ రాయలేదు. ఆయా కాలాల్లో ఆయా కవులంతా తమ అభిరుచి కనుగుణంగా కావ్యాల్ని, పురాణాల్ని, ప్రబంధాల్ని, గేయాల్ని కలగా పులగంగా రచించారే తప్ప ఒక నిర్దిష్టమైన కాలంలో ఒక నిర్దిష్టమైన సాహిత్య ప్రక్రియగా సృజించలేదు.

కొందరు మాత్రం కావ్య ప్రక్రియ, రాజవంశం రెండింటినీ దృష్టిలో ఉంచుకొని ప్రాచీన కవిత్వం (అజ్ఞాత యుగం, లబ్ధ సారస్వతం), పురాణ కవిత్వం, (చాళుక్యచోడ యుగం, కాకతీయ యుగం) కావ్య ప్రబంధ కవిత్వం (రెడ్డి, నాయక, కర్ణాటక యుగం, రాయల యుగం) అర్వాచీన కవిత్వం ( మధ్యమ యుగం, సంధి యుగం) మొ॥ వానిగావిభజించారు. పైన పేర్కొన బడిన

లోపాలే ఈ విభజనలో కూడా కనిపిస్తున్నాయి.

ఇంకా కొందరు వాఙ్మయ పరిణామంలోని ప్రధాన లక్షణాలను బట్టి అజ్ఞాత యుగం, భాషాంతరీకరణ యుగం, సంధి యుగం, ప్రబంధ యుగం, దక్షిణ దేశీయ వాఙ్మయ యుగం, ఆధునిక యుగం మొ॥ వానిగా విభజించారు.ఇది కూడ సరియైన విభజన కాదనిపిస్తున్నది. ఎందుకంటే భాషాంతరీకరణ కావ్యాలు ఉద్భవిస్తున్న కాలంలోనే స్వతంత్ర కావ్యాలు కూడ ఆవిర్భవించాయి. అలాగే స్వతంత్ర కావ్యాల కాలంలో భాషాంతరీకరణాలూ ఉన్నాయి.

మరికొందరు మాత్రం ప్రధాన కవులను, కావ్య భేదాలను, కాలాన్ని, ప్రదేశాన్ని దృష్టిలో ఉంచుకొని నన్నయ పూర్వయుగం, నన్నయ - తిక్కనల నడిమి కాలం, తిక్కన యుగం, ఎర్రన యుగం, శ్రీనాథ యుగం, కృష్ణరాయ యుగం,అనంతర ప్రబంధ యుగం, 17, 18వ శతాబ్దాపు కవులు, ఆంధ్ర కవయిత్రులు, చారిత్రిక కావ్యాలు, యక్ష గానాలు, శతకాలు మొ॥ వానిగా విభజించారు. పై విభజనల్లో కనిపిస్తున్న లోపాలే ఇందులో కూడా కనిపిస్తున్నాయి.

పై విధంగా ప్రతి విభజనలో ఎంతో కొంత సత్యమున్నప్పటికీ ప్రతిదీ అతి వ్యాప్తియో, అవ్యాప్తియో అవుతూ సమగ్రమయినది కాలేక పోతున్నది. ఈ లోపాలను దృష్టిలో పెట్టుకోనే కొందరు మార్గ దర్శకులైన మహాకవులను బట్టి యుగ విభజన చేశారు. "తమ రచనల ద్వారా వర్తమాన కాలానికే కాక భవిష్యత్కాలానికి కూడా అభినవ ఉత్తేజం ఎవరు కలిగిస్తారో, గతించి, ఘనీభవించి పోయిన భావ ప్రపంచంలో ఉద్దీపనాన్ని ఎవరు కలిగిస్తారో, తరువాత వారికి ఆదర్శ ప్రాయులు ఎవరౌతారో వారు సాహిత్య రంగంలో యుగ కర్తలుగా" రాణిస్తారు. అట్టి ఆ " యుగ కర్తల " ఆధారంగాసాహిత్యాన్ని విభజించే ఈ పద్ధతి అత్యంత ఆమోదయోగ్యమైనది అనుసరణీయమైనది. ఇట్టి ఈ విభజన పద్ధతిని దృష్టిలో పెట్టుకునే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు సువిశాల తెలుగు సాహిత్యాన్నంతటినీ 10 యుగాలుగ క్రింది రీతిలో విభజించారు.

(1) ప్రాఙ్నన్నయ యుగం ( క్రీ. పూ. 200 క్రీ. శ. 1000)

(2) నన్నయ యుగం (11వ శతాబ్దం)

(3) శివ కవి యుగం (12 వశతాబ్దం)

(4) తిక్కన యుగం (13వ శతాబ్దం)

(5) ఎఱ్ఱన యుగం (1300 - 1350)

(6) శ్రీనాధుని యుగం(1350 - 1500)

(7) కృష్ణ రాయల యుగం (1500 - 1600)

(8) దక్షిణాంధ్ర యుగం (1600 - 1775)

(9) క్షీణ యుగం (1775 - 1875)

(10) ఆధునిక యుగం (1875 —)

తెలుగు సాహితీ చరిత్రకారులందరూ దాదాపుగా పై యుగ విభజననే అనుసరిస్తున్నారు.

# తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియలు.

సమాజంకోసమే సాహిత్యం అనే విషయం అందరికీ తెలిసినదే. ఒక సమాజంలో నివసిస్తున్న సాహితీ స్రష్ట సమాజ అవసరాలకు అనుగుణంగా, అప్పటి ప్రజల అభిరుచులకు ఆమోద యోగ్యంగా, సమాజాన్ని అభివృద్ధి మార్గంలో ముందుకు నడిపే విధంగా ఏదో ఒక సాహిత్యాన్ని సృజిస్తాడు. అది ప్రజా మన్నన పొంది ఆశించిన ప్రయోజనాన్ని సాధించినపుడు అదే మూసలో మరొక సాహితీ గ్రంధాన్ని మరొక సాహితీ స్రష్ట వెలువరిస్తాడు. అది కూడ సత్ఫలితాన్ని ఇచ్చినపుడు మరి కొందరు సాహితీ స్రష్టలు అదే రకమైన మరి కొన్ని గ్రంధాలను రచించడంతో అవన్ని కూడ ఒకే రకమైన స్వరూపస్వభావాలను, లక్షణాలను పుణికి పుచ్చుకొని ఒకే రకమైన వ్యక్తీకరణ పద్ధతిలో నడుస్తాయి. అయితే కాలం ఎల్లప్పుడూ ఒకే రకంగాకాక మారుతుండటం, దానిని అనుసరించి సమాజం మారడం, తదనుకూలంగా సామాజికావసరాలు మారడం, ప్రజాభిరుచుల్లో మార్పులు రావడం, వీటి ప్రభావం సాహిత్యంపై పడడం, దానితో సాహిత్యంలో కూడ మార్పులు సంభవించడం, ఫలితంగా పాత సాహిత్య వ్యక్తీకరణ స్థానంలో క్రొత్త సాహిత్య వ్యక్తీకరణకు అంకురార్పణం జరగడం, క్రమంగా అది స్థిర పడడం, మరలా కాలానుగుణంగా దాని స్థానంలో సరిక్రొత్త సాహిత్య వ్యక్తీకరణ బయలు దేరడం టఅనేది మామూలుగా జరిగే విషయం. ఇలా ఒకే రకమైన స్వరూపస్వభావాలు, లక్షణాలు ప్రయోజనాలు కలిగిన సాహిత్య వ్యక్తీకరణ పద్ధతినే సాహిత్య ప్రక్రియగా భావించవచ్చు. ఇలాంటి సాహిత్య ప్రక్రియలు ఆంధ్ర సాహిత్యంలో వివిధ కాలాల్లో అనేకంగా ఉద్భవించాయి. వీనినన్నింటినీ (1) ప్రాచీన సాహిత్య ప్రక్రియలు. (2) ఆధునిక సాహిత్య ప్రక్రియలు అని ప్రధానంగా రెండు రకాలుగా విభజించవచ్చు.

## I. ప్రాచీన సాహిత్యా ప్రక్రియలు :-

ఇవి సనాతనంగా సంక్రమిస్తున్న ప్రక్రియలు . దాదాపుగా వీనికన్నింటికీ సంస్కృత సాహిత్యం ఆధార భూమికగా నిలుస్తున్నది. వీటిల్లో (1)పురాణం. (2) ఇతిహాసం. (3) కావ్యం . (4) ప్రబంధం. (5) శతకం. (6) నాటకం, ప్రధాన ప్రక్రియలు కాగా ఛందో వైవిధ్యాన్ని బట్టి ద్విపద. దండకం, అష్టకం, ఉదాహరణం, యక్ష గానం, గద్యం, వచనం మొదలైనవి, పద ప్రయోగాన్ని బట్టి అచ్చ తెనుగు కావ్యం , అర్థాన్ని బట్టి ద్వర్థి కావ్యం మొ.. ఉన్నాయి.

(1) పురాణం:- హైందవ సంస్కృతి అనే కల్ప తరువుకు వేదాలు మూలమైతే, స్మృతులు శాఖలు కాగా పురాణాలు పత్ర పుష్పాలు. ఇవి పరమేశ్వరునికి హృదయ స్థానాలు. వేద హృదయాన్ని విప్పి చెప్పే వివి. పురాణమనగా ప్రాచీన లేద పూర్వ కథ అని పురాభవమితి పురాణమ్ ఎప్రాచీన కాలంలో పుట్టినది.ఏ అనే విషయం స్పష్టం చేస్తున్నది. అయితే ఇది పురాతనమైనదే అయినప్పటికీ నవ్యంగా ఉంటుందని పురాపి నవమ్ పురాణమ్ ఎపురాతనమయ్యు నవ్యంగా ఉండేదిఏ అనేది తెలియజేస్తున్నది. ఇలా పురాణంలో ప్రాచీన , అర్వాచీన విషయంతో బాటు భవిష్యత్కాల విషయం కూడా ఉండవచ్చునని ఊహించడానికి వీలున్నది.

"పురాణం పఞ్చ లక్షణమ్" అని పురాణం ప్రధానంగా 5 లక్షణాలను కలిగి ఉన్నది. అవి, 1. సృష్టి ( సృష్టిని గూర్చి తెలుపుతుంది) 2. ప్రతి సృష్టి (కల్పాంతంలో జరిగే పునఃసృష్టిని గూర్చి

తెలుపుతుంది.) 3. వంశం.(దేవతలు, దేవర్షుల, బ్రహ్మర్షుల గోత్రాల గూర్చి తెలుపుతుంది) 4. వంశాను చరితం (సూర్య, చంద్ర, వంశాల గూర్చి తెలుపుతుంది) 5. మన్వంతరం (మనువుల గూర్చి తెలుపుతుంది) ఇటువంటి పంచలక్షణసమన్వితమైన పురాణాలు గరుడ, స్కంద, భవిష్య బ్రహ్మాండాది18. వీటికి తోడు మరొక 18 ఉప పురాణాలు సంస్కృత సాహిత్యంలో ఉన్నాయి. మొత్తం మీద ఈ పురాణాలన్నీ విజ్ఞానాంశాలు, తీర్థవ్రత మహాత్మ్యాదులు, బ్రహ్మ స్థితి, మత ప్రాధాన్యం, దైవ ఉనికి మొ.. విషయాలను సుస్పష్టం చేస్తాయి. అందుకే అలౌకికం, అద్భుతం అయినట్టి భగవల్లీలా కథనంతో నిండిందే పురాణమనీ స్పష్టమౌతున్నది. ఇది ప్రధానంగా ఉపదేశాత్మకతతో వేదార్థాన్ని మిత్రుని లాగా అందిస్తూ అర్థ ప్రధానంగా నడుస్తుంది.

తెలుగు సాహిత్యంలో ఇటువంటి పురాణ ప్రక్రియ పాల్కురికి సోమనాథునితో ఆరంభమైనది. అతని 'బసవ పురాణం' తెలుగులో వెలసిన లక్షణభరితమైన మొట్ట మొదటి స్వతంత్ర దేశిపురాణం. ఆ తరువాతి మారన 'మార్కండేయ పురాణం' ప్రథమాంధ్ర మహా పురాణం. తరువాతి పోతన భాగవతం ఆంధ్ర ప్రజల నాలుకలపై ఇప్పటికీ పరవళ్ళు త్రొక్కుతున్నది. ఈ ముగ్గురే ఆంధ్ర పురాణ సాహిత్యంలో కవిత్రయం వంటి వారు. తరువాతి కాలంలో విరివిగానే తెలుగులో పురాణ రచన సాగింది.

2. ఇతిహాసం:- ఏదో ఒక కాలానికి చెందిన రాజ వంశానికో, జాతికో సంబంధించిన చారిత్రకాంశాన్ని తెలిపేది ఇతిహాసం. ఇది హైందవ సంస్కృతి కల్ప తరువుకు రసవత్ఫలం. ఇది పూర్వ చరిత్రను తెలుపుతూనే ఉజ్జ్వలమైన ఉపదేశాన్ని అందిస్తున్నది. ఇది కూడ పురాణం వలె వేదార్థాన్ని మిత్రుని వలె అందిస్తూ అర్థ ప్రధానంగా సాగుతుంది. దానిలో మాదిరి దీనిలో కూడ ధర్మ,భోధ, హితోపదేశం, కర్మ - జ్ఞాన - భక్తి - వైరాగ్యాది విచారణాదులు ముఖ్యాంశాలు. వ్యుత్పత్తిని బట్టి పరిశీలిస్తే ఈ రెండు ఇంచు మించు సమానార్థకాలుగనే కనిపిస్తాయి. ఒకప్పటి పంచలక్షణ సమన్వితమైన పురాణం కాలక్రమంలో వంశ చరిత్రలను, ఇతి హాస సంబంధమైన కథలను వ్యంజిస్తూ ఇతిహాసం లాగా కనిపించడం మొదలైంది. అందుకే ఇతిహాసం నేడు పురాణ భేదంగానే కనిపిస్తున్నది. అంతేకాక రెంటికీ దాదాపుగా పురాణ నామమే రూఢిలో ఉంటున్నది. సంస్కృతంలో రామాయణభారతాలు ఇతిహాసాలు. వీని అనువాదాలైన తెలుగు రామాయణ భారతాల్లో ఇతిహాసత్వంతో పాటు కావ్యస్థితి కనిపిస్తున్నది. విక్రమార్క చరిత్ర, భోజరాజీయాదులను ఈ జాతి వానిగా చెప్పుకోవచ్చు.

3. కావ్యం:- 'కవి కర్మ కావ్యమ్' కవి యొక్క శిల్ప నైపుణ్యం తోడి క్రియయే కావ్యం. 'కవనీయం కావ్యమ్' వర్ణింపబడేది కావ్యం. అనగా లోక వృత్తాన్ని గ్రహించిన కవి ముందుగా తాను తన్మయుడై పొందిన అనుభవాన్నంతటినీ తీవ్రానుభూతితో వర్ణనా రూపంలో, విశేష శిల్ప చాతుర్యంతో ఎదుటి వారికి అందించడమే కావ్యం. పురాణేతి హాసాల మాదిరిగా కాక ఇది వేదార్థాలను కాంతలాగ ఆహ్లాదంగా. నాజుగ్గా అందిస్తుంది. ఉపదేశాత్మకత దీనికి కూడా లక్షణమే అయినప్పటికీ బ్రహ్మానంద సదృశ్యమైన ఆనంద పారవశ్యకత దీని పరమావధి. అందుకే విశ్వ నాథుడు 'వాక్యం రసాత్మకం కావ్యం' (రసవంతమైన వాక్యమే కావ్యం) అని కావ్యాన్ని నిర్వచించాడు. పురాణేతిహాసాల్లాగా కాక ఇది రమణీయార్థాన్ని అందించే శబ్ద ప్రధానమైనది. అందుకే 'రమణీయార్థ

ప్రతి పాదక శబ్దః కావ్యమ్' (రమణీయర్థాన్ని ప్రతిపాదించే శబ్దమే కావ్యం) అని జగన్నాథుడు నిర్వచించాడు. ఇట్టి ఈ కావ్యానికి సనాతనంగా చెప్పుకొంటు వస్తున్న లక్షణాలు క్రింది విధంగా ఉన్నాయి.

1. కథాంశం ఆది మధ్యాంతాలతో క్రమ వికాసం పొందడం.
2. కథను నడపటానికి నాయకుడొకడుండటం, కథంతా అతని చుట్టే అల్లబడటం.
3. చతుర్విధ నాయకుల్లో ( ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత , ధీర శాంత) ధీరోదాత్తునికి ప్రాధాన్యమివ్వడం
4. అత్యధిక వర్ణనలకు ప్రాధాన్యమివ్వడం.
5. నవ రసాల్లో ఏదో ఒకదానిని అంగి రసంగాను, తక్కిన వానిని అంగ రసాలు గాను పోషించడం.
6. సాధారణంగా వీరశృంగారాలకు ప్రధాన్యమివ్వడం
7. రచనలో అలంకారాలకు ప్రాధాన్యమివ్వడం.
8. అలంకార శాస్త్రానుకూలంగా రచన సాగడం.
9. హితోప దేశంతో పాటు ఆనందాన్ని కలిగించడం.

సల్లక్షణాలతోటి కావ్యాలు సంస్కృత , సాహిత్యంలో కోకొల్లలుగా ఆవిర్భవించాయి. వీటిల్లో "రఘువంశం, కుమార సంభవం, కిరాతార్జునీయం, శిశుపాల వధ, నైషదాలనే 5 కావ్యాలుగా రాణిస్తున్నాయి.

తెలుగు సాహిత్యంలో నన్నయతో కావ్య శకం ఆరంభమైనది. ఇతిహాసమైన మహా భారతం ఈయన చేతిలో కావ్యత్వాన్ని పొందినది. అయితే నన్నె చోడుని 'కుమార సంభవమే' తొలి మహా కావ్యంగా ప్రసిద్దిని పొందుతున్నది. ఆ తరువాత వివిధ కాలాల్లో విశృంఖలంగా కావ్యాలు తెలుగు సాహిత్యంలో పుట్టుకొచ్చాయి. వీటిల్లో ఆముక్త మాల్యద, మను చరిత్ర, వసు చరిత్ర, శృంగార నైషధం, పాండురంగ మహత్యాలు (కొందరి దృష్టిలో క్రీడాభిరామం) మహాకావ్యాలుగా తెలుగు కావ్యకన్నెను సింగారిస్తున్నాయి.

4. ప్రబంధం:- కావ్యం యొక్క విశిష్ట పరిణామమే ప్రబంధం. కావ్య మనేది సామాన్య వాచి కాగా ప్రబంధమనేది కొంత ప్రత్యేకతను సంతరించుకొన్నటిది. ప్రకృష్టమైన బంధం కలిగినదే ప్రబంధంగా గుర్తింపబడినది. ఈ ప్రకృష్ట బంధమనేది శబ్దార్థాల కూర్పుకు సంబంధించినది. కథా వస్తువులో, రచనా విధానంలో, పాత్రచిత్రణలో , రస పోషణలో, అలంకార -వర్ణనాదుల్లో ప్రత్యేక రీతిని సంతరించుకున్న కావ్యమే ప్రబంధం. సాధారణ కావ్య లక్షణాలు ఇందులో ఉండడమే కాక కొన్ని ప్రత్యేక లక్షణాలు ఇందులో క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

1. పూరాణాంతర్గతమైన కథను గ్రహించడం.

2. రచనంతా స్వతంత్రంగా సాగడం.
3. అనువాదానికి తావు లేక పోవడం.
4. కథైక్యాన్ని ఖచ్చితంగా పాటించడం.
5. అష్టాదశ వర్ణనలను నిక్కచ్చిగా పాటించడం.
6. ఆలంకారిక రచనతో సాగడం.
7. శృంగార రస ప్రధానం కావడం.
8. అనతి విస్తృతంగా ఉండడం.
9. స్వకపోల కల్పనలతో నడవడం.
10. ఆనందాన్నే పరమావధిగా భావించడం.

సంస్కృత సాహిత్యంలోని సర్గ బంధం లేద మహా కావ్యమే తెలుగులో ప్రబంధంగా గుర్తింపబడినది. తెలుగు సాహిత్యంలో కుమార సంభవంతో నన్నె చోడుడే ప్రబంధ పోకడకు శ్రీకారం చుట్టాడని తెలుస్తున్నది. ఆ తరువాత తిక్కన తన భారతాన్ని ప్రబంధ మండలిగ పేర్కొన్నాడు. ఎర్రన తన నృసింహ పురాణాన్ని ప్రబంధ రచనలోనే సాగించాడన్నది సత్యం. శ్రీనాథుని కావ్య రచనంతా దాదాపుగా ప్రబంధ శైలిలోనే సాగినది. తరువాతి కృష్ణరాయల యుగమంతా ప్రబంధ యుగమే. ఈ కాలంలోనే వెలువడిన ఆముక్తమాల్యద, మను చరిత్ర, వసు చరిత్ర, పారిజాతాపహరణం, పాండు రంగ మహాత్మ్యాలు, పంచ మహా ప్రబంధాలు. తరువాతి కాలంలో కూడ ప్రబంధ రచన కొనసాగినది.

5. శతకం:- సర్వ జనాదరణీయమైన, శక్తివంతమైన సాహిత్య ప్రక్రియల్లో శతకం కూడ ఒకటి. శతకమనగా నూరు పద్యాల నిడివి కల గ్రంధమని అర్థం. సంఖ్యా నియమం, మకుట నియమం, ఛందో నియమం, రస నియమం, ఆత్మాశ్రయ కవితా ధర్మం మొదలైనవి శతక ధర్మాలు. ఈ లక్షణాలన్నీ సంస్కృత ప్రాకృతాల నుంచే తెలుగు శతానికి లభించాయిని డా.. కె. గోపాల కృష్ణారావు గారు పేర్కొన్నారు. నూరు పద్యాలతో ఉండవలసిన శతకం నూటెనిమిది పద్యాలతో ఉండడం పరిపాటైపోయినది. ముఖ్యంగా భక్తి శతకాల్లో ఈ నియమం ఇంకా ఎక్కువ. దానికి ప్రధాన కారణం భగవన్నామ స్తోత్రాలన్నీ దాదాపుగా సహస్రంగానో, అష్టోత్తర శతకంగానో ఉండడం వలన భగవన్నుతి ప్రధానాలైన శతకాలు కూడా అష్టోత్తర శతకంగానే ఉండాలనే సాంప్రదాయం ఏర్పడినది. వేమన పద్యాల వంటి కొన్ని శతకాలు తప్ప తక్కినవన్నీ సంఖ్యానియమం పాటించాయి. సంఖ్యా నియమంతో పాటు తెలుగు శతకాలకు మకుట నియమం కూడ ఖచ్చితమైనది. అయితే ఈ మకుట నియమం సాధారణంగా పద్యాంతంలో కనిపిస్తే కొన్నింటిలో పద్యారంభంలో కూడా కనిపిస్తున్నది. ఇలా మకుట నియమాన్ని పాటించిన ప్రసిద్ధ శతకాలన్నీ ఖచ్చితంగాఛందో నియమాన్ని పాటించాయి. శతకాలు వేనికవి స్వయంసంపూర్ణాలు కావడం వలన అవి 'ముక్తకాలు' గా రాణించాయి. ఇవన్నీ భావ ప్రధానాలు కావడం వలన కవి ఆత్మానుభూతికివి నిధానాలయ్యాయి.

తెలుగు సాహిత్యంలో పండితారాధ్యుడు 'శివతత్వసారంతో' శతక రచనకు శ్రీకారం చుట్టాడు. అయితే సల్లక్షణమైన తొలి తెలుగు శతకం పాల్కురికి సోమనాధుని వృషాధిప శతకమే. ఆ తరువాత సహస్రాధికంగా శతకాలు వెలువడ్డాయి. వీనినన్నింటినీ భక్తి శతకాలని, వ్యాజస్తుతి శతకాలని, వేదాంత శతకాలని, నీతి శతకాలని, అధిక్షేప శతకాలని, శృంగార శతకాలని హాస్య శతకాలని, ప్రకీర్ణ శతకాలని, కధాత్మక శతకాలని విభజించడం జరిగింది.

6. నాటకం:- ఉత్కృష్ట సాహిత్య ప్రక్రియల్లో నాటకం ఒకటి. అనంత కావ్య జాతి నంతటినీ విని ఆనందించేది, చూచి ఆనందించేది అని ప్రధానంగా రెండు రకాలుగా విభజించడం జరిగినది. ఇందు మొదటిది శ్రవ్య కావ్యం కాగా రెండోది దృశ్య కావ్యం. ఈ దృశ్య కావ్యంలో రూపం ప్రధానం కాబట్టి దీనికి రూపమనీ, ఆయా రూపాలను వ్యక్తులు తమకు ఆరోపించుకొని రూపింప చేస్తారు కాబట్టి దీనికి రూపకమనీ, ఇందు నటన ప్రధానం కాబట్టి దీనికి నాటకమనీ వివిధ పేర్లున్నాయి. చతుర్విధాభినయంతో ఆయా వ్యక్తుల బాహ్య గత స్వరూప స్వభావాలను, మనోగత హావ భావ విన్యాసాలను ప్రేక్షకుల కనుల ముందు కదలాడే విధంగా ప్రదర్శించి అతి శీఘ్ర గతిలో వారికి బ్రహ్మానంద సదృశ్యమైన రసానందాన్ని ప్రసాదించడం చేత ఇది సాహిత్యంలో అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నది. అందుకే 'కావ్యేషు నాటకం రమ్యమ్' 'నాటకాంతం హి సాహిత్యమ్' 'నాటకాంతం హి కవిత్వమ్' అని సాహితీ ప్రియులందరి చేత ఇది పరి పరి విధాలుగా కొనియాడ బడినది. అట్టి నాటకానికి ధీరోదాత్తాది చతుర్విధ నాయకుల్లో ఎవరో ఒకరు నాయకుడుగా ఉండడం, అతని శ్రేయస్సును కోరడం, ఇతి వృత్తం 'ప్రఖ్యాత ఉత్పాదన మిశ్రమాల్లో ఏదో ఒకటి కావడం, రస ప్రధానంగా ఉండడం, అనేక పాత్రలతో నడవడం, శుభాన్ని సూచించడం మొ.. సామాన్య లక్షణాలు కాగా, దీని నిర్మాణానికి సంబంధించిన "నాంది, ప్రస్తావన, అంకం, అర్థో పక్షేపకం, పంచ సంధి సమన్వితం" అనేవి ప్రధాన లక్షణాలు. అయితే ఈ లక్షణాలన్నీ కేవలం నాటకానికి మాత్రమే సంబంధించినవి. సంస్కృత సాహిత్యం ఈ నాటకాలను దశ రూపకాలనే పేరుతో పది రకాలుగా పేర్కొన్నది. అవి 1. నాటకం. 2.ప్రకరణం. 3. డిమం. 4.ఈహామృగం. 5. సమవాకారం. 6. బాణం. 7. వీధి. 8. ప్రహసనం. 9. అంకం. 10. వ్యాయోగం. అయితే వీటన్నింటిలోనూ నటనమే ప్రధానం కావడం వలన, పైన పేర్కొన్న నాటక లక్షణాలన్నీ కేవలం నాటకానికే సమన్వయింప బడడం వలనా 'నాటకమనే' పేరే వీటన్నింటికీ సామాన్య వాచిగా స్థిర పడినది.

ప్రాచీన తెలుగు సాహిత్యంలో క్రీ. శ.15 వ శతాబ్దంలోని క్రీడాభిరామంలో 'వీధి' లక్షణాలు కనిపిస్తున్నాయి. ఆ తరువాత సంస్కృత నాటకాన్ని శ్రవ్య కావ్యం గానే తెలుగు సాహిత్యం ఆహ్వానించినది, కానీ, సంస్కృత నాటక అనువాదానికి కానీ, స్వతంత్ర నాటక రచనకు కాని తెలుగు సాహిత్యం నోచుకోలేదు. ఆధునికాంధ్ర సాహిత్యం మాత్రం నాటక రచనకు ప్రాధాన్యమిచ్చినది. కోరాడ రామచంద్ర శాస్త్రి గారి 'మంజరీ మధుకరీయ' మనేదే ప్రకరణ రూపంలో నున్న స్వతంత్ర తెలుగు నాటకం. ఆ తరువాత అనేక స్వతంత్ర నాటకాలను రచించడమే కాకుండా సంస్కృతాంగ్ల నాటకాలను అనేకాన్ని ఆంధ్రీకరించడం జరిగినది. ఆంధ్ర నాటక రచనా విస్తృతితో అనేక నాటకాలను రచించిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు ఆంధ్ర నాటక పితామహులుగా ఖ్యాతిని పొందారు.

# 2. ఆధునిక ప్రక్రియలు

ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలకన్నింటికీ ఆంగ్లసాహిత్యమే ఆధారభూమిక అవుతున్నది. ఇట్టి ఆధునిక ప్రక్రియలుగా నవల, కథానిక, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర, వ్యాసం, విమర్శ, పరిశోధన, మొ.. కనిపిస్తున్నాయి. వీటిల్లో ప్రముఖమైన వానిని క్రింది విధంగా తెలిసికోవచ్చు.

## 1. నవల:-

ఆధునికాంధ్ర సాహిత్యంలో అత్యంత విరళంగా వ్యాపించిన సాహిత్య ప్రక్రియ నవల. ఆంగ్లంలోని NOVEL అనే పదమే తెలుగులో నవలగా రూఢి కెక్కినది. "నవాన్ విశేషాన్ లాతి గృహ్ణాతీతి నవల" (క్రొత్త విశేషాలు కలిగింది నవల) అని కొందరు పేర్కొంటే, రచనాకాలంనాటి వాస్తవికాలగు జీవితాచార వ్యవహారాలను చిత్రించేదని మరికొందరు పేర్కొన్నారు. ఇంకొందరు నవలను సాంఘిక జీవితానికి ప్రతిబింబంగా వ్యక్తుల జీవిత గమనాన్ని చిత్రిస్తూ, జనుల ఆచార వ్యవహారాలను వ్యక్త పరిచే గద్య ప్రబంధంగా తెలిపారు. కొందరు మాత్రం "వ్యక్తుల జీవితాన్ని ప్రధానంగా తీసికొని సామాజిక జీవితాన్ని స్ఫురింపజేసే సాహిత్య ప్రక్రియ" గా భావించారు. వీని అన్నింటి ఆధారంగా సమాజంలోని వ్యక్తుల యధార్థ జీవన విధానాన్ని కళాత్మకంగా చిత్రిస్తూ, వ్యక్తుల ఆచారవ్యవహారాదులను సహజంగా వర్ణించేది నవల అని మనం చెప్పుకోవచ్చు. వ్యావహారిక భాషలో సరళశైలిలో, వాస్తవిక వస్తువుతో, ధారాళమైన కథా కధనంతో సాంఘిక- చారిత్రిక -పౌరాణికాది' విషయాలతో నవల నడువవలెను.

కందుకూరి వీరేశలింగం గారి రాజశేఖర చరిత్రను మొట్టమొదటి సారిగా కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి 'నవల' గా పేర్కొన్నాడు. తరువాతి కాలంలో కూడ అదే తొలి తెలుగు సాంఘిక నవలగా స్థిర పడిపోయినది. ఆ తరువాత ఎన్నో చారిత్రిక, పౌరాణిక మనోవైజ్ఞానిక నవలలు తెలుగులో కట్టలు త్రెంచుకొన్నాయి.

## 2. కథానిక :-

నేటికాలంలో నవల తరువాత విస్తృతంగా కనిపించే ప్రక్రియ కథానికి ఆంగ్లంలోని Short -Story కి సమానార్థకంగా నేటి 'కథానిక' అనే పదం వాడబడుతున్నది. కొందరు కథానికను "సాధారణంగా అతి విస్తృతం కాకుండా, ఒకానొక సంవేదనతో, స్వయం సంపూర్ణతతో, విభిన్న తత్వాలను ఏకోన్ముఖం చేసే ఇత్తి వృత్తాత్మక గద్య కవితాశిల్పఖండం" గా నిర్వచించారు. ప్రాచీన కాలంలోని అగ్ని పురాణం అలాగే ఆధునికి కాలంలోని పాశ్చాత్య విమర్శ గ్రంధాలు కథానికకు లక్షణాలను తెలిపాయి. ఈ రెండు రకాలైన లక్షణాలను సమన్వయిస్తే కథానిక స్వరూపం క్రింది విధంగా తయారౌతున్నది.

"ఒక రకమైన ఎత్తుగడ, నడక తీరు, ముగింపు, పరిమిత పాత్రలు, ఆ పాత్రలకు చక్కని పోషణ, వస్తు విన్యాస వైశిష్ట్యం, ఒక జీవిత సత్యాన్ని ప్రతిపాదించుట అన్నింటిని మించి వస్త్వైక్యంతో వినోదమో, విజ్ఞానమో, వికాసమో కలిగించగల చిన్న కథయే కథానిక" సంక్షిప్తత, ఏకాగ్రత, సమగ్రత, నిర్భరత అనేవి కథానికకు ప్రధాన లక్షణాలు. ఇది 10నుండి 60

నిముషాలకాలపరిమితిలో చదవడానికి వీలైనంత చిన్నదిగా ఉండవలెను. వ్యావహారిక భాషలో, సరళ శైలిలో ఇది నడువ వలెను.

తెలుగు సాహిత్యంలో 'దిద్దుబాటు' తో గురజాడ అప్పారావు కథానికకు శ్రీకారం చుట్టాడు. ఆ తరువాత కథానికలు తామర తంపరగా పుడుతూ తెలుగులో విశ్వ వ్యాప్తమౌతున్నాయి.

### 3. జీవిత చరిత్ర :-

నవల, కథానికల్లాగ కాకపోయినా ఏదో ఒక మేరలో సాహిత్యంలో జీవిత చరిత్ర కూడా ప్రాధాన్యాన్ని సంతరించుకొంటున్నది. జీవిని ఆంగ్లంలో Biographyఅంటారు. "ఒకమహాపురుషుని జీవిత మహత్వం వలన కలిన ప్రేరణతో అట్టి మహత్వ విశిష్టతను లోకులకు తెలువుటకై రాయబడెడి కథయే జీవిత చరిత్ర". ఇది ఏ వ్యక్తి యొక్క చరిత్రను చెప్పుటకు ఉద్దేశించునో అతని ఆత్మను వ్యక్తం చేయటానికి ప్రయత్నిస్తుంది. ఆ వ్యక్తి యొక్క జీవితంలో ఏయే ఘట్టాలు అతని మహత్వ నిరూపణకు ఉపకరిస్తాయో ఆయా ఘట్టాలన్నింటినీ కాలక్రమానుసారంగా సంఘటిత పరుస్తు, వినటానకి ఇంపైన రీతిలో, కథారూపంలో కూర్చినపుడే ఈ జీవిత చరిత్ర సాహిత్యంలోకి చేరుతుంది.

ఇది ఏక నాయకత్వంతో, కథన కౌశలంతో సౌందర్య రచనతో, రమణీయశైలిలో నడువ వలెను. "ఎవని జన్మం మానవ జాతికి అలంకార భూతమో, ఎవని వర్తనం లోక కల్యాణ హేతువో, ఎవని ప్రవృత్తి మానవ నాగరికతాభివృద్ధికి కారణ భూతమో" అట్టి అసాధారణ వ్యక్తి యొక్క జీవితాన్నే ఇది వస్తువుగా గ్రహించవలెను. కథా పురుషుని యొక్క దోషాలను, లోపాలను మరుగు పరచుటకంటే ఉద్ఘాటించటమే మేలు.

తెలుగు సాహిత్యంలో కందుకూరి వీరేశలింగం గారే జీవిత చరిత్రకు మొదట శ్రీకారం చుట్టాడు. విక్టోరియా రాణి చరిత్ర, జీసస్ చరిత్రమొ.. వారి జీవిత చరిత్రలు ఆ తరువాత విరివిగానే జీవిత చరిత్రలు వచ్చాయి.

### 4. స్వీయ చరిత్ర:-

ఇటీవలి కాలంలో జీవిత చరిత్రలాగానే స్వీయ చరిత్ర కూడ సాహిత్యంలో స్థానాన్ని సంతరించుకొన్నది. ఆంగ్లంలోని Auto-biographyఅనే దానికి సమానార్థకంగా స్వీయ చరిత్ర అనే పదం వాడబడుతున్నది. దీనినే 'ఆత్మకథ' అని కూడ అంటారు. వ్యక్తి "తన జీవిత సంఘటనలను తనకు తానుగా వ్యక్తీకరించుకొనటమే స్వీయ చరిత్ర". ఇట్టి వ్యక్తీకరణలో తన జీవితాన్ని లోకానికి యథాతథంగా ప్రదర్శించాలనుకొన్నపుడు తన బహిరంగిక, అంతరింగిక జీవితాల రెంటినీ చిత్రించుకోవడం మేలు. జీవితాన్ని యథాతథంగా చిత్రింప తలచనప్పుడు కేవలం బహిరంగిక జీవితాన్నే చిత్రించుకోవడం ఉత్తమం. అయితే బహిరంగిక జీవితానికి ప్రేరకాలైన సంఘటనలు అంతరంగిక జీవితంలో ఉన్నపుడు అవి ఎంతటి గోప్యాలైనప్పటికీ ప్రకటించుకోక తప్పదు. స్వీయ చరిత్ర కారుడు ముఖ్యంగా ఆత్మ విశ్వాస సంపన్నుడు కావలెను.

తెలుగు సాహిత్యంలో తిరుపతి వెంకట కవులు 'జాతక చర్య' అనే పేరుతో స్వీయ చరిత్రను పద్యరూపంలో వెలయించు కొన్నప్పటికీ కందుకూరి వారి 'స్వీయ చరిత్ర' యే మొదటిదిగా

భావింప బడుతున్నది. అలాగే గుఱ్ఱం జాషువా కూడా 'నా కథ' అనే పేరుతో స్వీయ చరిత్రను రచించుకొన్నాడు. ఆ తరువాత చిలకమర్తి లక్ష్మీ నరసింహాలలాంటి అనేకులు స్వీయ చరిత్రలను విరివిగానే రచించుకొన్నారు.

## 5. వ్యాసం:-

ఆధునిక కాలంలో వ్యాసం కూడా సాహిత్య గౌరవాన్ని పొందడమే కాక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా స్థానాన్ని పొందినది. ఆంగ్లంలోని Essayఅనే పదానికి సమానార్థంగా వ్యాసం అనే పదం ప్రయోగింపబడుతున్నది. వ్యాసమనగా విభాగమని అర్థం. "ఏ విషయాన్నైనా తీసికొని దానిలోని అంశాలను విభజించి వివరించి చెప్పటమే వ్యాసంగా" కొందరు చెబితే "ఉపక్రమ, ఉపసంహార- విషయ -విస్తరణాది మర్యాదలతో పూర్వపక్ష సిద్ధాంతాలను సమన్వయించుకొంటూ ఉదార గతిలో గంభీరంగా ఉండేది వ్యాసమని మరికొందరు పేర్కొన్నారు. వచనత్వం. అవిశాలత్వం, విశృంఖలత్వం, మిత్రత్వం, హాస్యత్వం, వ్యక్తిత్వం, మొ.. వ్యాస ప్రధాన లక్షణాలుగా కనిపిస్తున్నాయి.

తెలుగు సాహిత్యంలో 'హిత సూచిని' కర్తయైనట్టి స్వామినేని ముద్దు నరసింహ నాయుడే తొలి వ్యాసకర్త అనే ఊహ కలిగినప్పటికి దానిని అన్ని విధాల తీర్చి దిద్దిన ఘనత చకందుకూరి వీరేశలింగం గారికే దక్కినది. అందుకే అతనినే ప్రథమ వ్యాసకర్తగా అనేకులు గుర్తిస్తున్నారు. తరువాత వివిధ విషయాలకు సంబంధించి అనేక వ్యాసాలు ఆవిర్భవించాయి. పానుగంటి వారి 'సాక్షివ్యాసాలు' కొంత ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నాయి.

## 6. విమర్శ:-

సాహిత్యంలో విమర్శకు కూడా ఎనలేని గౌరవం దక్కుతున్నది. ఆంగ్లంలోని Criticism అనే పదానికి సమానార్థంగా 'విమర్శ' అనే పదం కనిపిస్తున్నది. ఈ పదానికి ఆలోచించు, చర్చించు, పరామర్శించు, పరిశీలించు, పరిశోధించు, విచారించు,. వివేచించు, మొ.. అర్థాలు. కాని వ్యవహారంలో విమర్శించు అనే పదం నిందించు అనే అర్థంలో వాడబడుతున్నది. ఇది వ్యవహార లోపమే తప్ప ఆ "పదానికున్న అర్థలోపం కాదు." నేర్పుతో చేయబడిన ఒక పని యొక్క తత్త్వాన్ని తెలుసుకొని దాని గుణాలను పరిశీలించి తగిన అభిప్రాయాన్ని కలిగించు కొని ఆనందించటమే విమర్శ " గా చెప్ప వచ్చు. ఇట్టి విమర్శ ప్రజ్ఞావంతంగా, పక్షపాత రహితంగా, పవిత్రవంతగా సహృదయ పూర్వకంగా, సానుభూతి సహితంగా ఉండవలెను. ఇట్టి విమర్శ చేయువాడే విమర్శకుడు. ఇతడు సాహిత్య స్రష్ట అంతటివాడై ఉండవలెను.

సాహిత్యంతో పాటుగా విమర్శ కూడా అపుడే పుట్టినప్పటికీ అది కళా తత్వంతో సాహిత్య గౌరవాన్ని పొందలేదు. ఆధునిక కాలంలో బ్రౌన్ గారి వ్యాసాలు తెలుగు సాహిత్య విమర్శకు మార్గదర్శకాలయ్యాయి. తరువాత తెలుగులో ముద్రితమైన తొలి విమర్శ కందుకూరి విరేశలింగం గారి 'విగ్రహ తంత్ర విమర్శన'మే. తరువాత కట్టమంచి వారి 'కవిత్వతత్త్వ విచారం 'సాహిత్య విమర్శలో నూతనాధ్యాయాన్ని నెలకొల్పింది. ఆ తరువాత అనేక విమర్శలు కట్టలు త్రెంచు కొని పుట్టుకొస్తున్నాయి.

**7. పరిశోధన:-**

ఇటీవలి కాలంలో కనిపించే అనేక ప్రక్రియల్లో పరిశోధన ఒకటి ఆంగ్లంలో Research అనే పదానికి ఇది సమానార్థకం, శుద్ధి చేయుట, పరిష్కరించుట, వెదకుట, విద్యన్వేషణ చేయుట మొ.. పరిశోధన పదానికి అర్థాలుగా ఆయా నిఘంటువుల్లో కనిపిస్తున్నాయి. ' విజ్ఞాన పరిధులను విస్తరింపచేసే యత్నంలో నూతన సత్యాలను, సూత్రాలను, సిద్ధాంతాలను కనుగొనటానికి, శాస్త్రీయ పద్ధతుల్లో క్రమబద్ధంగా గాఢతరమైన అన్వేషణతో పరిశీలన చేసే విధానమే పరిశోధన". అవగాహన యొక్క అవధుల విస్తృతీకరణం, వినూత్న సిద్ధాంతాల ప్రతిపాదనం, తద్వారా సత్యాన్వేషణ, వర్తత్వాన్ని సమున్మేషింపచేయటం పరిశోధన లక్ష్యం. సామాగ్రి సేకరణ, విశ్లేషణ, సమన్వయం, నిర్దిష్ట ఫలితాంశ నిరూపణం అనే విధానాలతో పరిశోధన ప్రారంభమౌతుంది. ఈ విధానమంతా ఒక వ్యాసంగా గాని, గ్రంధ రూపంగా గాని, సిద్ధాంత నిబంధన రూపంగాగాని వెలువడినపుడు అది ప్రక్రియ పరమైన రూపాన్ని సంతరించుకొంటుంది. ఎం. ఫిల్ విద్యార్థుల చేత సమర్పింపబడేది 'పరిశోధనా వ్యాసంగాను' (Dissertation) పి. హెచ్. డి. విద్యార్థుల చేత సమర్పింపబడేది 'సిద్ధాంతవ్యాసం' గాను(Thesis) వ్యవహరింపబడుతున్నాయి.

తెలుగులో భాషా పరిశోధన సాహిత్య పరిశోధన కంటే ముందుగా ప్రక్రియా గౌరవాన్ని పొందినది. ఈ ఆధునిక పరిశోధనకు తెలుగులో మొదట పునాదులు వేసినవాడు మెకంజీ దొర. ఆ తరువాత బ్రౌన్, కాల్డ్వెల్ మొ.. వారు. కందుకూరి వారి కవుల చరిత్రతో ఇది స్థిరపడినది. 'పదకొండో శతాబ్ది తెలుగు భాష' అనే అంశంపై చిలుకూరి నారాయణరావు మొట్ట మొదట మద్రాసు విశ్వవిద్యాలయం నుండి తెలుగులో పి. హెచ్. డి. పట్టా పొందాడు. ఆ తరువాత అనేకులచేత అనేక రీతుల్లో అనేక పరిశోధనలు వెలువడుతున్నాయి.

## తెలుగు సాహిత్యంలో వివిధ కవితా ధోరణులు (or) ఉద్యమాలు

సామాజికావసరాను తీరుస్తూ సామాజికాభిరుచులకు అనుకూలంగా సామాజిక శ్రేయస్సును కాంక్షిస్తూ సమాజంలో పుట్టి పెరిగేదే సాహిత్యం. ఇటువంటి సాహిత్యం తెలుగు సమాజంలో నన్నయ కాలం నాటికి అనగా క్రీ. శ. 11వ శతాబ్దం నాటికి స్థిరపడినది. ఆ తరువాత క్రమంగా అది వికాసాన్ని పొందుతూ, పరవస్తు చిన్నయ సూరి దాకా ఒకే మూసలో అవిచ్ఛిన్నంగా, విశృంఖలంగా సాగినది. దాదాపు తొమ్మిది శతాబ్దాల్లో అవిరళంగా విస్తృతంగా వ్యాపించిన ఈ తెలుగు సాహిత్యమంతా స్వరూపంలో కొద్ది పాటి వైవిధ్యాన్ని పొందినా, స్వభావంలో మాత్రం ఎలాంటి మార్పులకు లోను కాకుండా 'ఉపదేశానందాలనే' పరమావధులుగా కొనసాగినది. ఇలా నన్నయ నుండి చిన్నయ దాకా సాగిన ఈ కవిత్వాన్నే ప్రాచీన కవిత్వంగా, సంప్రదాయ కవిత్వంగా సాహితీ కారులు పిలిచారు. ఈ కవిత్వమంతా స్వరూపంలో పురాణం , ఇతిహాసం , కావ్యం , ప్రబంధం , శతకం నాటకం మొ.. వానిగా కనిపించినప్పటికీ స్వభావంలో మాత్రం ఒకే తత్వాన్ని కలిగి ఉండటం వలన ఇదంతా ఒకే రకమైన కవితా ధోరణిగా ఉండిపోయినది. ఆశు, మధుర విస్తర చిత్ర కవిత్వాలనే

చతుర్విధ కవితా ధోరణులు కొన్ని పొడసూపినప్పటికి అవి అంతగా ప్రాచుర్యాన్ని పొందలేదు. కారణం క్రొత్త సీసాలో పాత సారాలాగా ఇవి ఉద్భవించాయే తప్ప ప్రాచీన కవిత్వపు స్వరూప స్వభావాల్లో లేని ప్రత్యేకమైన తేడాలను, గుణాలను ఇవి పొందలేక పోయాయి.

19వ శతాబ్దంలో ప్రపంచమంతా అనేక మార్పులకు లోనైనది. సామాజికుల అవసరాల్లో, అభిరుచుల్లో విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. వీటి ప్రభావం తెలుగు సమాజం పై కూడ పడ్డది. వీటికి తోడు భారతీయ భాషల -సాహిత్యాల అన్నింటి మీద ఆంగ్లభాషా - సాహిత్యాల ప్రభావం తీవ్రమైనది. దానితో భారతీయ సాహిత్యాలన్నీ అనేక మార్పులకు లోనయ్యాయి. అందులో భాగంగానే ఆంధ్ర సాహిత్యం కూడ అనేక మార్పుల్ని పొందింది. నవల, కథానిక, స్వీయ - జీవిత చరిత్రలు, వ్యాసం, విమర్శ మొదలైనవి ప్రక్రియాపరంగా స్వయం ప్రతి పత్తిని పొందాయి. అలాగే కవితా వ్యక్తీకరణంలో కూడా మార్పులు సంభవించి అనేక నూతన కవితా ధోరణులు ఉద్భవించాయి. ఇవి ఉద్యమ రూపాన్ని కూడ పొంది విస్తృతంగా వ్యాపించాయి. వీటిల్లో భావ-అభ్యుదయ - దిగంబర - విప్లవ-మినీగేయాది కవితాధోరణులు ముఖ్యమైనవి. వీనినే నూతన కవితా ధోరణులు అంటున్నాం. కవులంతా వీనిని ఉద్యమంగా చేపట్టి వ్యాపింప చేసిన కారణంగా ఇవి ఆధునిక కవితోద్యమాలుగా పిలువబడుతున్నాయి.

## సంప్రదాయ కవిత్వం (Classical Poetry)

పరంపరగా సంప్రసరణమైనదే (సంక్రమించినదే) సంప్రదాయం. అనగా నన్నయ నుండి చిన్నయ దాకా పరంపరగా సంక్రమించిన కవిత్వమే సంప్రదాయ కవిత్వం. దీనికున్న మరోపేరు ప్రాచీన కవిత్వం. రామాయణ భారతాదులన్నీ ఈ కోవకు చెందుతాయి. ఇట్టి కవిత్వం యొక్క ప్రధాన లక్షణాలు క్రింది విధంగా ఉంటాయి.

1. ధీరోదాత్తాది నాయకుల్లో ఎవరో ఒకరు నాయకుడుగా ఉండడం , అతడు కూడ ఉన్నత కులజుడై, రాజై ఉండడం, ఇతని అభ్యుదయం కోసమే కవిత్వమంతా సాగడం.
2. ఇతి వృత్తమంతా రాజుకు, రాణికి సంబంధించినదిగా ఉండడమే కాక వారి విలాస జీవితాన్ని వర్ణించడమే ధ్యేయంగా పెట్టుకొనడం.
3. కేవలం వీర, శృంగార రసాలకు ప్రాధాన్యమివ్వడం.
4. అష్టాదశ వర్ణలను కలిగిఉండడం.
5. ప్రకృష్టమైన రచనతో సాగడం.
6. వ్యాకరణ బద్ధంగా నడవడం.
7. ఛందో నియమాన్ని పాటించడం.
8. అలంకారాలకు ప్రాధాన్యమివ్వడం.

9. ప్రఖ్యాత - ఉత్పాద్య - మిశ్రమాది ఇతి వృత్తాలను కలిగి ఉండడం.
10. అలంకార శాస్త్రానుకూలంగానడవడం.
11. పురాణ, ఇతిహాస, కావ్య, ప్రబంధాది మార్గాల్లోనే నడవడం.
12. ఉపదేశానుకూలంగా ఉండడం.
13. ఆనందాన్ని ఇవ్వడం.

పై లక్షణాలతో నడచిన సంప్రదాయ కవిత్వమంతా సామాన్య మనిషిని, అతని అవసరాన్ని, అభిరుచిని, శ్రేయస్సును సంపూర్ణంగా నిర్లక్ష్యం చేసిందనే మాట అక్షరాల సత్యం. ఇటువంటి సామాన్య ప్రజలు సమాజంలో ఎనభై శాతానికి పైగా ఉండడం వలన సమాజంలో ఇది స్థానాన్ని కోల్పోవలసి వచ్చినది. దానితో దీనిపై తిరుగుబాటుగా నూతన కవితా ధోరణులు వెల్లి విరిసాయి. అయితే అవి కూడ వానికి సంబంధించిన కొన్ని స్వతస్సిద్ధమైన లోపాలను కలిగి ఉండడం వలన మరలా కొందరు తిరిగి సంప్రదాయ కవిత్వాన్నిఎంతో కొంత మేరలో సృజిస్తూనే ఉన్నారు.

## ఆధునిక కవితా ధోరణుల్లో (or) ఉద్యమాల్లో శ్రీ

### 1. భావకవిత్వం (Romantic Movement)

ఆంగ్ల కాల్పనికోద్యమ (Romantic Movement)మానస పుత్రికయే భావ కవిత్వం. ఇది లిరిక్ (Lyric)కు సమానార్థం. దీనికి గీత కవికత్వమని, అభినవ కవిత్వమని, నవ్యకవిత్వమని అనేకులు అనేక పేర్లను సూచించినప్పటికీ, గాడిచర్ల హరి సర్వోత్తమరావు సూచించిన 'భావకవిత్వమనే' పేరుతోనే ఇది స్థిరపడినది. కవి యొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురం, ఒక అంతర్నిగూఢ తాపం ఒక చిన్నకావ్యంలో ఊదబడటమే 'భావకవిత్వ' మని విశ్వనాథ సత్యనారాయణగారి అభివాక్కు. అనగా కవి తన హృదయగత భావావేశాన్ని అతిస్పష్టంగా వ్యక్తీకరించడమని భావం. ఇట్టి ఈ భావ కవిత్వ లక్షణాలుగా క్రిందివి కనిపిస్తున్నాయి.

1. వస్తువు - భావం - రచనల్లో భావానికి ప్రాధాన్య మివ్వడం.
2. సమాజానికి దూరంగా ఊహాతీతంగా ఉండడం.
3. కల్పనలకు ప్రాధాన్యమివ్వడం.
4. అస్పష్టంగా వ్యక్తీకరింపబడడం.
5. అత్యధికంగా ఆత్మాశ్రయం కావడం.
6. ఏక భావాశ్రయంగా నడవడం.
7. అలౌకికతను కలిగి ఉండడం.
8. గీతి రూపంలో నడవడం.
9. స్త్రీని తల్లిగా, చెల్లిగా, చెలిగా పూజించడం.

10. అమలిన శృంగారానికి ప్రాధాన్యమివ్వడం.

11. ప్రకృతిని ఆరాధించడం మొదలైనవి.

పై లక్షణాలతో కనిపించే భావకవిత్వాన్ని, ఆత్మాశ్రయ కవిత్వం, దేశభక్తి కవిత్వం, ప్రకృ కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, స్మృతి కవిత్వం, భక్తి కవిత్వం అని ప్రధానంగా 6 రకాలు విభజించారు. రాయప్రోలు, కృష్ణ శాస్త్రి, విశ్వనాథ, పింగళి, కాటూరి, దువ్వూరి, కవికొండ బసవరాజు మొదలైనవారు, ఈ భావ కవిత్వంలో ప్రముఖ వ్యక్తులు. కృష్ణ పక్షం, తృణ కంకణ ఊహాగానం మొ.. ఇట్టి రచనలు.

అయితే ఈ భావ కవిత్వం అందరికీ అర్థం కాకపోవడం, సమాజానికి దూరంగా ఉండడ కవి ఆత్మీయాంశానికే సంబంధించిందిగా ఉండడం, ప్రజల ఆర్తనాదాలను ఆకలి మంటలన పట్టించు కోక పోవడం మొదలైన లోపాలుండటం వలన కొంతమంది కవులు తీవ్రంగా దీనిి ఖండించి సమాజ శ్రేయస్సు కోరే మరోకవిత్వానికి అజ్ఞులు చాచారు.

## 2. అభ్యుదయ కవిత్వం (Progressive poetry):-

ఆంగ్లంలోని 'progress' అనే పదానికి సమానార్థకంగా వాడబడుతున్న అభ్యుదయమనే పదానికి' మంగళం, శుభం' అనే రూఢ్యర్థాలతో పాటు 'పురోగమనం, ప్రగతి' అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఆధునిక సమాజం పోవాలనుకోవడమే అభ్యుదయం. ఇది మనస్సులో పెట్టుకొని రాసేది అభ్యుదయ రచన' అని దేవుల పల్లి కృష్ణశాస్త్రి పేర్కొంటే, సాహిత్యం ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథం మీద అభ్యుదయ కవులు తిరుగబడుతున్నారు. నేటి రచయితకు ప్రజలే ప్రమాణం. కొన్ని కారణాల వలన సాహిత్యానికి దూరమై పోయిన ప్రజల జీవితాలను మళ్ళీ సారస్వతోన్ముఖంగా త్రిప్పటానికి నేటి రచయితలు పాటు పడుతున్నారని అభ్యుదయ కవిత్వాన్ని గురించి శ్రీ . శ్రీ పేర్కొన్నారు.

"సమకాలీకమైన జీవిత పరిస్థితులకు, రాజకాయ వాతావరణానికి, ఆర్థిక సమస్యలకు, సమాజ సంఘర్షణలకు,. నైతిక సందర్భాలకు, ఐహిక-ముష్మిక సిద్ధాంతాలకు, వైజ్ఞానిక విశేషాలకు అనుగుణంగా, అనుకూలంగా అవసరమైన మార్పులతో విలసిల్లాల" ని అభ్యుదయ కవిత్వాన్ని మరికొందరు ఆకాంక్షించారు. ఇట్టి అభ్యుదయ కవిత్వ లక్షణాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. సామాన్య మానవునికి ప్రాధాన్యమివ్వడం.
2. సామాజిక చైతన్యాన్ని పెంపొందించడం.
3. మార్క్స్ వాదాన్ని ఆత్మ స్థానంగా భావించడం.
4. వాస్తవికతా దృక్పథంతో నడవడం.
5. గతాన్ని నిరసించడం.
6. వర్గ సంఘర్షణను ప్రేరేపించడం.
7. విప్లవాన్ని ప్రబోధించడం.
8. వీరగాధా కథనం చేయడం.

9. సమసమాజ నిర్మాణాన్ని ధ్యేయంగా భావించడం.

10. విశ్వ శ్రేయస్సును కాంక్షించడం.

11. సరళంగా నడవడం.

12. స్పష్టంగా ఉండడం.

పై లక్షణాలతో కూడిన అభ్యుదయ కవిత్వంలో శ్రీ. శ్రీ, వరాభి, పురిపండ, నారాయణబాబు, ముద్దుకృష్ణ, అనిసెట్టి, అజంతా దాశరధి, కుందుర్తి, మొదలైన వారు ప్రముఖులు. మహాప్రస్థానం, పులిపంజా, తెలంగాణా, రుధిర జ్యోతి మొ.. అభ్యుదయ కవిత్వంలో ఇట్టి ప్రసిద్ధ గ్రంథాలు.

అయితే అభ్యుదయ కవిత్వం ఆశించినంత రీతిలో సమాజం మారక పోవడం, అభ్యుదయ కవుల్లో చిత్తశుద్ధి లోపించడం, కళావిలువలను కోల్పోయి అత్యంత పేలవంగా దీని రచన సాగడం, ఉన్నత వర్గాల వారి ఆక్షేపణకు గురికావడం, వారిని ఎదిరించే శక్తి లేక పోవడం మొదలైన లోపాల వలన అభ్యుదయ కవిత్వాన్ని కాదని, "ఏ లక్ష్య సాధనకై కవిత్వాన్ని విరచిస్తున్నాయో ఆ లక్ష్య సాధనకై అవసరమైతే ప్రాణాన్ని కూడా త్యాగం చేయాలనే దృక్పధంతో, సమాజంలోని కుళ్ళును ఎటువంటి ఆచ్ఛాదన లేకుండా ఉన్నది ఉన్నట్లుగా స్వతస్సిద్ధంగా వ్యక్తీకరించాలనే తత్వంతో కొంతమంది కవులు మరో నూతన కవితా ధోరణి వైపు మరలారు.

### 3. దిగంబర కవిత్వం :-

దిక్కునే అంబరంగా కలిగిన కవిత్వమే దిగంబర కవిత్వం. ఈ రకమైన కవిత్వానికి ఎటువంటి అచ్ఛాదన ఉండదని భావం. అనగా సమాజంలోని కుళ్ళు, రుగ్మత, అలజడి మొ.. వానిని ఉన్నది ఉన్నట్లుగా అత్యంత సత్యంతో, సహజమైన దోరణిలో వ్యక్తీకరించడమని అర్థం. మనిషి తన అవయవాలను కాపాడుకోటానికి అంబరాలను ధరిస్తాడు, కాని రహస్యంగా దాచుకోవలసినవేవి లేనవుడు అంబరాలతో కూడ అవసరం లేదనే సిద్ధాంతంపై ఆవిర్భవించిచదే దిగంబర కవిత్వం. " ఈ ప్రాపంచిక ఆచ్ఛాదనల్ని చీల్చుకొని కొత్త రకాన్ని ఇంజెక్టు చెయ్యటానికి వస్తున్న దిగంబర కవుల గుండెల్లోంచి ధైర్యంగా, స్థైర్యంగా దూసుకొచ్చిన కేకలు దిగంబర కవిత" ఆజీవిత వాస్తవికతను చిత్రించలేని పూర్వ కవితా రీతులపై తిరుగుబాటుగా వచ్చినదే దిగంబర కవిత్వం"అని ఈ కవిత్వాన్ని గూర్చి దిగంబర కవులు స్పష్టం చేశారు. దీని లక్షణాలు క్రింది విధంగా ఉన్నాయి.

1. సమాజాన్ని ఉన్నది ఉన్నట్లుగా చిత్రించడం.
2. కళకు కాకవిషయానికి ప్రాధాన్యమివ్వడం
3. వ్యక్తీకరణ అత్యంత సత్యంగా ఉండడం.
4. ఎంతటి అశ్లీలాన్నైనా దాచకుండా చిత్రించడం.
5. విప్లవ పంథాలో నడవడం.
6. వ్యక్తికి పూర్తి స్వేచ్ఛ నివ్వడం.
7. అత్యంత సరళంగా ఉండడం.
8. స్పష్టతకు అధిక ప్రాధాన్యమివ్వడం.

9. పూర్వ సంప్రదాయాలను తిరస్కరించడం.

10. వాస్తవికతకు అత్యంత ప్రాధాన్య మివ్వడం.

నగ్నముని (మానేపల్లి హృషికేశవరావు), నిఖిలేశ్వర్ (యాదవరెడ్డి), చెరబండరాజు (బద్దం భాస్కర రెడ్డి) మహాస్వప్న (కమ్మిశెట్టి వెంకటేశ్వర రావు), జ్వాలాముఖి (వీర రాఘవాచార్యులు) భైరవయ్య (మన్మోహన్ సహాయ్) లు మారు పేర్లతో దిగంబర కవిత్వాన్ని వెలయించారు. నన్నెక్కనివ్వండి బోను, ఎముకల కేకలు, జైల్లో సముద్రం, తొడ విరిగిన తరం, ఆకాశం వెక్కి వెక్కి ఏడుస్తుంది మొ.. దిగంబర కవితా రచనలు.

సామాజిక రుగ్మతను ఉన్నది ఉన్నట్లుగా చిత్రించడంలో అనుకోకుండానే తీవ్ర అశ్లీలం చోటు చేసుకోవడంతో ప్రజా నిరసన వెల్లువ కావడం, కళా విలువలు సంపూర్ణంగా పడిపోయి పేలవంగా తయారు కావడం, పిచ్చిగాఅరచినంత మాత్రాన సామాజిక మార్పు రాదనే భావన ప్రజల్లో కలగడం మొ.. కారణాలవల్ల ఇది ప్రజా బాహుళ్యాన్ని సంపబర్ణంగా కోల్పోయింది. పీడితులు - తాడితులు బాగు పడాలన్నా, సమాజ నిర్మాణం సాగాలన్నా, అట్టడుగు వర్గాల మహారాజులు కావాలన్నా చైతన్యమే చక్కటి సాధనమనీ, విప్లవమే బహు చక్కటి మార్గమనీ కొంతమంది కవులు ఆలోచించి సరిక్రొత్త నూతన ధోరణికి ఆహ్వానం పలికారు.

**4. విప్లవ కవిత్వం**

దెబ్బకు దెబ్బ, కత్తికి కత్తి అనే సిద్ధాంతంతో, సమాజంలోని ధనిక వర్గాన్ని సమూలంగా పెకిలించాలనే ఉద్దేశ్యంతో, సమ సమాజ స్థాపన చేయాలనే సదాశయంతో, ముఖాముఖిగా పోరాడాలనే తత్వంతో, అట్టడుగు వర్గాల్లో చైతన్యాన్ని రంగరించి వారిని విప్లవ యోధులుగా సిద్ధ పరచాలనే ఆవేశంతో బహిర్గమించినదే విప్లవ కవిత్వం. క్రింది వానిని దీని లక్షణాలుగా పేర్కొనవచ్చు.

1. మార్క్స్ వాదాన్ని ఆధార భూమికకగా గ్రహించడం

2. తాడితులను, పీడితులను మకుట ధారులుగా తయారు చేయడం.

3. వీరోచిత కథనం చేయడం.

4. ఓర్పును, సహనాన్ని అసహ్యించుకోడం.

5. వర్గ చైతన్యాన్ని ఊపిరిగా గ్రహించడం.

6. అవసరమైనపుడు మానవతా విలువలకు కూడా ప్రాధాన్యమివ్వక పోవడం.

శ్రీ. శ్రీ., సుబ్బారావు పాణి గ్రాహి, శివుడు - శివసాగర్ మొ.. కలం పేర్లతో ఉన్నట్టి కె. జి. సత్యమూర్తి, చెరబండరాజు, నగ్నముని, కె.వి. రమణా రెడ్డి, వర వర రావు, గదర్ మొ.. వారు ఈ కవిత్వంలో ప్రముఖులు. నరుడో భాస్కరుడా, మరో ప్రస్థానం, శిశిరోషస్సు మొ.. ప్రముఖ రచనలు.

దీనిలో కూడ ఎటువంటి కళా విలువలు లేకపోవడం, సామాజికి విలువలను కోల్పోడం, అట్టడుగు వారి పక్షమే వహించడం, అట్టి వారికి సమాజంలో స్థానం లేకపోవడం, ఉన్నత వర్గాలలో మార్పురాక పోవడం. చేతకాక పిచ్చెత్తి అరచినంత మాత్రాన సమ సమాజం రాదని ప్రజలు నమ్మడం, అన్నంటికి మించి ప్రభుత్వపు ఆంక్షలు అధికం కావడం మొ.. కారణాలతో ఇది ఆశించిన

ఫలితాలను సాధించలేక పోతున్నది.

పై కవిత్వాలన్నీ ఏదో కొంత మేరకు లోపాలను కలిగి ఉండడం వలన పై వానిలో ఏ ఒక్క దానికి కట్టుబడని కవులందరూ సమాజంలోని వివిధ అంశాల పైతమ అనుభవాలను, అనుభూతులను తక్కువ విస్తృతితో, అతి తక్కువ కాలంలో వ్యక్తీకరించే కవిత్వం వైపు మొగ్గు చూపారు.

## 5. మినీ కవిత్వం

"నిగూఢమైన భావాన్ని కొది పంక్తులలో పొదిగి, ఒక రసవత్కావ్యఖండికను చదివిన అనుభూతిని కలిగించడం మినీ కవిత" అని కొందరు పేర్కొంటే "ఉక్తి వైచిత్రితో చిటికెలో చదివి ముగించడానికి వీలౌతూ ఆనందం అందించగలిగేది మినీ కవిత "అని మరికొందరు తెలిపారు. "వ్యర్థపదం ఒక్కటి లేకుండా చెప్పదలచిన భావంపూర్తిఅయ్యాక గీతం పూర్తయిందా లేదా అని చూడక అక్కడే ఆపివెయ్య బడడం" దీని తత్వం. పద్యాల్లో, గేయాల్లో ఇది వస్తున్నప్పటికీ ముఖ్యంగా వచనంలోనే ఇది విశేష సార్థకతను సంతరించుకొంటున్నది. దీని లక్షణాలుగా క్రింది వానిని పేర్కొనవచ్చు.

1. సంక్షిప్తతను, క్లుప్తతను, స్పష్టతను పాటించడం.
2. భావ తీవ్రతను కలిగి ఉండడం.
3. అల్పాక్షర, అనల్పార్థ రచనను పాటించడం
4. అనుభవ ప్రధానంగా సృజింపబడడం.
5. అనుభూతికి అత్యంత ప్రాధాన్యాన్ని ఇవ్వడం.
6. రాసావేశాన్ని కలిగించడం.
7. ఆనంద ప్రధానంగా ఉండడం.
8. అతి తక్కువ కాలంలో పఠించటానికి వీలుగా వుండడం

పై లక్షణాలతో ఆవిర్భవిస్తున్న మినీ కవిత ప్రస్తుత కాలంలో ఆంధ్ర పాఠకలోకపు ఆదరాభిమానాలను విరివిగా చూరగొంటున్నది. ఆచార్య సి. నారాయణ రెడ్డి, గుంటూరు శేషేంద్ర శర్మ, అద్దేపల్లి రామ మోహన్ మొ:. వారు ఈ మినీ కవిత నిర్మాణంలో పేర్కొనదగినవారు. 200 మంది కవుల కవితలు 'మినీ కవితా విప్లవం' అనే పేరుతో సంకలన గ్రంథంగా వెలువడింది. ఇలాంటి గ్రంథాలు ఇంకెన్నో వెలువడ్డాయి. వెలువడుతున్నాయి.

## 6. గేయ కవిత్వం

భావ కవిత్వంలో అంతర్వాహికగా, సూచనాప్రాయంగా గేయ కవిత్వం కనిపిస్తున్నది. మాత్రా ఛందస్సుతో రాగ- తాళ యుక్తంగా, గానానుకూలంగా, సంగీతయోగ్యంగా సంతరింప బడుతున్న కవిత్వమే గేయ కవిత్వం. గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, డా. సి. నారాయణరెడ్డి మొ.. వారిలో ఈ గేయ కవిత్వం కనిపిస్తున్నది. ఇటీవలి కాలంలో ఈ గేయ కవిత్వానికి విశేష ఆదరం లభిస్తున్నది. నేటి సినిమాకవిత్వమంతా దాదాపు గేయ కవిత్వంలోనే పుడుతున్నది.

# కావ్య భేదాలు

నన్నయ నుంచి చిన్నయదాకా సాగిన తొమ్మిది శతాబ్దాల సువిశాల తెలుగు సాహిత్యంలో అనేక కావ్యాలు వివిధ రూపాల్లో, విభిన్న నామాలతో పుంఖాను పుంఖంగా వెలువడ్డాయి. వీని నన్నింటినీ కొన్ని మౌలిక లక్షణాల ఆధారంగా, ప్రమాణాల ఫలితంగా కొన్ని శాఖలుగా భారతీయాలంకారికులు విభజించారు. ఇలా వివిధ ప్రమాణాల ఆధారంగా విభజింపబడి, నిర్ణయింపబడిన కావ్య భేదాలు క్రింది విధంగా ఉన్నాయి.

ఛందస్సును ప్రమాణంగా తీసికొని కావ్యాన్ని ప్రధానంగా 1. పద్యకావ్యమనీ, (కేవల పద్య రచన ఉదా.. నిర్వచనోత్తర రామాయణం) 2. గద్య కావ్యమనీ (కేవల గద్యరచన ఉదా.. దశకుమార చరిత్ర) చంపూ(ఉభయ) కావ్యమనీ (పద్యం, గద్యం రెండు కలిగిన రచన ఉదా.. మహాభారతం) విభజించారు.

ప్రదర్శనా యోగ్యతను ప్రమాణంగా తీసికొని కావ్యాన్ని ప్రధానంగా 1. శ్రవ్య కావ్యమనీ (కేవలం వినటానికి మాత్రమే యోగ్యమైనట్టిది. ఉదా.. ఆముక్త మాల్యద మొ.. ) 2. దృశ్యకావ్యమనీ (వినడంతో పాటు చూడటానికి యోగ్యమైనట్టిది. ఉదా..నాటకాలు) విభజించారు.

గీతి లక్షణాన్ని పురస్కరించుకొని కావ్యాన్ని 1.సంగీత కావ్యమనీ (అచ్చంగా సంగీతానుకూలమైనది). 2. సాహిత్యకావ్యమనీ (సంగీత లక్షణం అంతగా లేనిది) అప్ప కవి లాంటికొందరు విభజించారు. దీనినే పాఠ్యగేయ విభాగమంటారు.

పైన పేర్కొన్న పద్యకావ్య జాతిని అందలి రచన-ఇతివృత్తం-విస్తృతుల ఆధారంగా 1. నిబద్ధ కావ్యమనీ. 2.అనిబద్ధకావ్యమనీ రెండుగా విభజించారు. విటిల్లో నిబద్ధ కావ్యమనగా "ప్రకృష్టమైన రచనాబంధంతో విస్తృతమూ ఉదాత్తమూ - ఆది మధ్యాంత సహితమూ అయినట్టి ఇతి వృత్తాన్ని కలిగినట్టిది"

అనిబద్ధ కావ్య జాతిని మరలా 1.ముక్తకమనీ (స్వయం ప్రతిపత్తి కలిగిన స్వేచ్ఛాయుతమైన ఒకే ఒక పద్యం ఉదా.. శతకం) 2. కులకం (క్రియాపద సమాప్తికై పరస్పర సంబంధమున్న ఐదు పద్యాల సముదాయం) 3. పంచరత్నాలు, 4. నవరత్నాలు. 5. నక్షత్ర మాలికలు (ఈ3, 4, 5 లలోని కావ్యభేదాలన్నీ ఖండకావ్య భేదాలే) 6. ఇతివృత్త రహితాలైన ఆధునిక ఖండ కావ్యాలు.

పై పద్య కావ్య జాతినే ఛందో వైవిధ్యాన్ని బట్టి మరలా 1. శతకం. 2. ద్విపద. 3. ఉదాహరణం. 4. యక్షగానం. మొ.. వానిగా విభజించారు.

గద్య కావ్య జాతిని మరలా 1. ముక్తకం (సమాస రహితమైనట్టిది) 2. వృత్తగంధి (వృత్త భాగం(పద్యస్థితి) కలిగింది.) 3. ఉత్కలిగా ప్రాయం (ధీర్ఘ సమాస బహుళమైనట్టిది). 4.చూర్ణకం (అల్పసమాసమైనట్టిది) అని విభజించారు. అయితే ఈ గద్యకావ్య భేదాలు సంస్కృతంలో విరివిగా ఉన్నాయికాని తెలుగులో కనిపించడం లేదు.

పైన పేర్కొన్న దృశ్యకావ్యాన్ని కూడా మరలా 1. నాటకం. 2.ప్రకరణం. 3. భాణం.

4. వీధి. 5. అంకం. 6. ప్రహసనం. 7. ఈహామృగం. 8. సమవాకారం. 9. డిమం. 10. వ్యాయోగం. అని పది రకాలుగా విభజించారు.

ఆధుని కాలంలోని సర్వ సాహిత్య ప్రక్రియలకూ, నూతన కవితా ధోరణులకూ అన్నింటికీ ఏకైక ఆధార భూమికగా 'వచనం' నిలుస్తూ, ఆధునికాంధ్ర సాహిత్యంలో నిరుపమానమైన స్థానాన్ని పొందుతున్నది. ఈ వచనం పైన చెప్పుకొన్న గద్యం రెండూ ఒకటి కావు.

# సంధి

## నిర్వచనం - ప్రాధాన్యం

సంధి (Connection (or) Junction) అనగా 'కలయిక' లేదా 'కూడిక' అని సాధారణార్థం. సంస్కృతంలో దీనిని 'సంహిత' అంటున్నారు. భాషాపరంగానైతే 'వర్ణాల కలయిక' లేదా 'దగ్గరితన' మని అర్థం. దీనినే సంస్కృతంలో "పరస్సంనికర్షః సంహితా" (వర్ణాల దగ్గరితనం) గా చెప్పారు. ఇక్కడ వర్ణాల కలయిక లేదా దగ్గరితనమనగా రెండు పదాల్లోని లేదా పద స్వరూపాల్లోని మొదటి పదం చివరి వర్ణంతో రెండవపదం మొదటి వర్ణం కలిసి పోవడం లేదా దగ్గరవ్వటమని భావం. దీనిని దృష్టిలో పెట్టుకొనే పరవస్తు చిన్నయసూరి బాల వ్యాకరణంలో "పూర్వ పరస్వరంబులకు పరస్వరంబే కాదేశంబగుట సంధియనంబడు", అని సంధిని భాషాపరంగా నిర్వచించాడు. అనగా రెండు పదాలు పరస్పరం ఒకదాని ప్రక్క మరొకటి ఉన్నపుడు అందు మొదటి పదంలోని చివరి స్వరం (అచ్చు) స్థానంలో రెండవపదం మొదటి స్వరం (అచ్చు) రావడమని భావం. తెలుగు భాష అజంత భాషకావడం వలన, అచ్చులకే ప్రాధాన్యమధికమవ్వడం వలన సూరి అచ్చుల ఆధారంగానే సంధి నిర్వచనం చెప్పవలసి వచ్చింది. అందుకే అచ్చ తెలుగు భాషకు అచ్సంధియే అత్యంత సహజమైన సంధి. సంస్కృత భాషకు అచ్సంధితో పాటు హల్సంధి, విసర్గ సంధులు కూడా సహజమైనవే. ఇట్టి ఈ సంధి వలన భాషకు క్రింది ప్రయోజనాలు చేకూరుతున్నాయి.

1. ఉచ్చారణ వేగవంతమవుతుంది, మరియు సులభతరమౌతుంది. 2. ఉచ్చారణా శక్తి అవిచ్ఛిన్నంగా సాగుతుంది. 3. ఉచ్చారణా శక్తి ఆదా అవుతుంది. 4. వాగ్యంత్రానికి భారం తగ్గుతుంది. 5. భాష సంగీతానుకూలమౌతుంది. 6. భాష ధారాళంగా సాగుతూ నాదా సౌందర్యాన్ని పొందుతుంది. 7. భాషకు గంభీరత్వం ఏర్పడుతుంది. 8. భాష చక్కటి అభివృద్ధి వైపు పయనిస్తుంది

## తెలుగు భాషలోని సంధి విధానం

నిన్న మొన్నటి దాక తెలుగు భాషలో ముఖ్యంగా సాహిత్య భాషలో కనిపించే పదజాలంలో అత్యధిక భాగం (దాదాపు 80%) సంస్కృతానిదే. అత్యల్పంగా మాత్రమే తెలుగు పదజాలం కనిపించేది. ఇలా రెండు భాషల పదాలు వేరైనప్పటికీ రెండూ కలసి సహజీవనం చేస్తున్నకారణాన తెలుగు భాష అత్యధిక సంస్కృత పదాలను కొద్దిపాటి మార్పులతో తనలో గర్భీకరించుకొన్నది.

ఇలా తెలుగు భాషలో అచ్చమైన తెలుగు పదాలు. కొద్దిపాటి తెలుగుతనాన్ని పొందిన సంస్కృత పదాలు, అచ్చమైన సంస్కృత పదాలు ఉండి పోయాయి.

దీనితో తెలుగు భాషకు సంధి విధానం రెండు రకాలుగా ఏర్పడ వలసి వచ్చింది. తెలుగు పదాల సహజత్వానికి, నిర్మాణానికి సంబంధించిన సంధి విధానం ఒకటి కాగా సంస్కృత పదాల సహజత్వానికి, నిర్మాణానికి సంభందించిన సంధి విధానం రెండవది. తెలుగు పదాలకు సంబంధించిన సందులే తెలుగు సంధులు కాగా సంస్కృత పదాలకు సంబంధించిన సంధులే సంస్కృత సంధులు. రెండిటిలోనూ సంధులు జరుగునపుడు వర్ణాలు లోపించడంతో పాటు ఆగమాదేశ రూపాల్లో కొన్ని వర్ణాల రావడం కూడా జరుగును.

### 1. తెలుగు సంధులు

ఇవి అచ్సంధులని (అచ్చుల మధ్య జరిగేవి), హల్సంధులనీ (హల్లుల మధ్య జరిగేవి) ప్రధానంగా రెండు రకాలు. ఇందులో అకార - ఇకార - ఉకార, ఆమ్రేడి - తాదులు అచ్సందులు కాగా ద్విరుక్తటకారం, గసడదవా దేశం, ద్రుతం, ప్రాతాది, పడ్వాది, త్రిక, సమానాధికరణం, లులన సంధి మొదలైన వాటితో పాటు, ఆగమ సంధులైన టుగాగమ, రుగాగమ, అలిగాగమ, మగాగమాది సంధులు,ఆదేశాలైన పుంప్వాదేశ, పజ్ఞ్వర్ణాదేసాధి సంధులు ఉన్నాయి. వీనిలో ఖచ్చితంగా జరిగే సంధులను నిత్య సంధులని జరగడం - జరక్క పోవడం అయినట్టి సంధులను వైకల్పిక సంధులనీ, ఖచ్చితంగా జరగడం-ఖచ్చితంగా జరగకపోవడం - అన్యవిధంగా జరగడం అయినట్టిసంధులను బహుళ సంధులనీ, ఖచ్చితంగా జరక్క పోయెడి సంధులను నిషేధ సంధులని (యడాగమం) పిలుస్తారు.

### 2. సంస్కృత సంధులు

ఇవి అచ్సందులు, హల్సంధులు, విసర్గ సంధులని ప్రధానంగా మూడు రకాలు. వీట్టిల్లో సవర్ణదీర్ఘ, గుణ, యణాదేశ, వృద్ధి,పరరూప, పూర్వరూప, అయవాయావాదేశ, ప్రకృతి భావాది సంధులు అచ్సంధులు కాగా ; శ్చుత్వ, ష్టుత్వ, జస్త్వ, చర్త్వ, ఛత్వ, రుత్వ, తుగాగమ, జముడాగమ, ధుడాగమ, అనునాసిక, అనుస్వారాదేశ, పరసవర్ణాదేశ, పూర్వ సవర్ణాదేశ మొ.. హస్సంధులు. హల్సంధిలో భేదాలు లేవు. ఆగమా దేశ సంధులు సంస్కృతంలోనూ ఉన్నాయి

## సమాసం

### నిర్వచనం -ప్రాధాన్యం

సమసించునది సమాసం (సమసనం సమాసః) రెండు గాని, అంతకు మించిగాని పదాలు ఏక పదంగా సమ్మిళించటమే (కలసిపోవటమే) సమాసం. అనగా అర్థవంతాలైన పదాలు అర్థవంతమైనఏకపదంగాఏర్పడమే సమాసం. అందుకే చిన్నయ "సమర్థాలైన పదాలు ఏకపదమగుట

సమాసమ" ని (సమర్థంబులగు పదంబు లేక పదంబగుట సమాసంబు) నిర్వచించాడు. ఇక్కడి ఈ సమర్థం రెండు రకాలుగా ఉంటుంది. 1. వ్యపేక్షారూప సామర్థ్యం. 2. ఏకార్థీ భావ రూప సామర్థ్యం. వాక్యంలోని పదాలు ఒకదానితో మరొకటి కలిసిపోవాలనే తీవ్రమైన ఆకాంక్షను కలిగి ఉండటమే వ్యపేక్షారూప సామర్థ్యం. అలాగే వాక్యంలోని వేర్వేరర్థాలను కలిగిన పదాలు సముదాయంగా ఏర్పడి విశిష్టమైన ఏకార్థాన్ని బోధించగలగటమే ఏకార్థీ భావరూప సామర్థ్యం. కాబట్టి అర్థవంతాలైన పదాలు ఏకార్థ బోధకంగా ఏక పదంగా ఒక దానితో మరొకటి కలిగి పోవటమే సమాసం. ఇలా పదాలు సమాసంగా సమసించటంలో వాని విభక్తి ప్రత్యయాలు లోపిస్తాయి. ఇట్టి ఈ సమాసం వలన కలిగే ప్రయోజనాలను క్రింది విధంగా చెప్పుకోవచ్చు. 1. అనేక పదాలు ఒక పదమవ్వటం వలన పదం పొదుపు జరుగుతుంది. 2. ఉచ్చారణ శక్తి ఆదా అవుతుంది. 3. భాష స్వరానుకూల మవుతుంది. 4.భాషకు గంభీరత, సంక్షిప్తత అలవడుతుంది. 5. పదాల మధ్య సమన్వయం ఏర్పడుతుంది. 6. భాషలో ధారాళత పెరుగుతుంది. 7. భాష భావానుకూలమౌతుంది. 8. భాషకు సౌందర్యం కలుగుతుంది. 9. అల్పార్థ అనల్పార్థరచనకు తోడ్పడుతుంది.

## *తెలుగులోని సమాస విధానం*

తెలుగులో కనిపించే పదాల్లో అత్యధిక భాగం సంస్కృతానివి కాగా అత్యల్పం మాత్రమే అచ్చ తెలుగు పదాలు సంస్కృత పదాలతో కలసిన మిశ్రమ పదాలు కూడా కొన్ని ఉన్నాయి. అందుచేతనే తెలుగు పదాలను, సంస్కృత పదాలని, ఆచ్ఛిక పదాలని, మిశ్రమ పదాలని మూడు రకాలుగా విభజించడం జరిగినది. వీటిలో కేవలం సంస్కృత పదాల మధ్య జరిగే సమాసాలను 'సంస్కృత సమాసాలనీ' కేవలం అచ్చ తెలుగు పదాల మధ్య జరిగే సమాసాలను 'ఆచ్ఛిక సమాసాలని ' ,మిశ్రమ పదాల మధ్య జరిగే సమాసాలకు' మిశ్ర సమాసాలనీ' అంటారు.

### 1. సంస్కృత సమాసాలు

సంస్కృత భాషలో సమాసాలు ఐదు రకాలుగా ఏర్పడుతున్నాయి. 1.కేవలం సమాసం: సమాసంలోని ఏ పదానికి కూడ విశేష ప్రాధాన్యం లేకపోవడం. 2. అవ్యయీభావ సమాసం: సమాసంలోని పూర్వ పదానికి ప్రాధాన్యముండడం. 3. తత్పురుష సమాసం: సమాసంలోని ఉత్తర పదానికి ప్రాధాన్యముండడం. ఇది రెండు రకాలు. 1. వ్యధికరణ సమాసం. 2. సమానాధికరణ సమాసం: ద్వితీయ మొదలు సప్తమీ వరకూ గల విభక్తి ప్రత్యయాల తోడి పదాలు మీది పదాలతో సమసించడం వలన ఏర్పడేవి 'వ్యధికరణ సమాసాలు' ఇవే తత్పురుష సమాసాలుగా కూడా వ్యవహరింపబడుతున్నాయి. వీటిల్లో 'నఞ్తత్పురుష సమాసం' కూడ ఉన్నది. విశేషణం విశేషంతో సమసించడం వలన ఏర్పడే ది ' సమానాధీకరణ సణాసం ' ఇదే కర్మధారయ సమాసంగా కూడా పిలువబడుతున్నది. ఈ కర్మధారయ సమాసంలోని పూర్వపదం సంఖ్యను తెలియ చేస్తే అది ద్విగు సమాసమౌతుంది. ఇట్టి కర్మధారయ సమాసాలతో పాటుగా తెలుగు భాషలో ఉపమాన పూర్వ పద, ఉపమాన ఉత్తర పద కర్మధారయాలు, సంభావనా పూర్వపద కర్మధారయాదులు విశేషంగా కనిపిస్తున్నాయి. 4. బహువ్రీహి సమాసం సమాసంలోని రెండు పదాలకు కాక అన్య

పదం యొక్క అర్థానికి ప్రాధాన్యముండడం. 5. ద్వంద్వ సమాసం: సమాసంలోని రెండు పదాలకు ప్రాధాన్యముండడం.

**2. ఆచ్ఛిక సమాసాలు**

అచ్చ తెలుగు పదాల మధ్య ఏర్పడే ఈ ఆచ్ఛిక సమాసాలు పైన పేర్కొన్న ఐదు రకాల సంస్కృత సమాసాల్లో మొదటిదైన కేవల సమాసాన్ని మినహాయిస్తే మిగిలిన నాలుగు రకాలైన అవ్యయీభావ, తత్పురుష (వ్యధికరణ, సమానాధికరణ లేదా కర్మధారయ, ద్విగువు) బహువ్రీహి,ద్వంద్వ సమాసాలుగనే ఉంటున్నాయి. అయితే కర్మధారయ సమాసంలో ఈ ఆచ్ఛిక పదాల్లో ఉపమాన పూర్వపద -ఉపమాన ఉత్తరపద-సంభావనా పూర్వ పద-కర్మధారయాదులు, రూపకాదులు కొన్ని విశేషంగా కనిపిస్తున్నాయే తప్ప సాధారణంగా క్రొత్తవేమీ లేవు.

**3. మిశ్ర సమాసాలు**

మిశ్ర పదాల మధ్య ఏర్పడే ఈ మిశ్ర సమాసాలు అన్ని విధాలుగా ఆచ్ఛిక సమాసాల్లాగానే ఉంటున్నాయే తప్ప మరో విధంగా సాధారణంగా కనిపించడం లేదు.

# అలంకారం

## *నిర్వచనం - ప్రాధాన్యం*

అలంకార మనగా 'భూషణ మ' ని అర్థం. భూషణ మంటే సౌందర్యమని భావం. కాబట్టి అలంకార మనగా సౌందర్యం. దీనినే వామనుడు "సౌందర్య మలంకారః" (సౌందర్యమే అలంకారం) అని చెప్పాడు. సృష్టిలోని మానవుడు సహజంగానే సౌందర్యంగా ఉన్నప్పటికీ, అతని సౌందర్యాన్ని మరికొంత ద్విగుణీకృతం చేసేది అలంకారం. అలాగే కావ్యకన్నె అందంగా ఉన్నప్పటికీ ఆ అందానికి మెరుగులు దిద్ది శోభను అతిశయింప చేసేది కావ్యాలంకారం. అందుకే 'కావ్య శోభాకరాన్ ధర్మానలఙ్కారాన్ప్రచక్షతే " (కావ్య శోభకు హేతువులు అలంకారాలు) అని దండి చెబితే, అసలు కావ్యమనేది "అలంకారాల" తోనే గ్రహింపబడుతుందని (కావ్యం గ్రాహ్య మలంకారాత్) వామనుడు చాటుచ్చాడు. ఇలా కావ్యంలో అలంకారం అగ్రపీఠాన్ని అధిష్ఠించినది. కావ్య స్వరూపం శబ్దార్థాలే కావడం వలన కావ్యాన్ని అలంకరించే అలంకారం శబ్దార్థాలనే అలంకరించవలసి ఉంటున్నది. అందుకే అలంకారం శబ్దాన్ని అలంకరించే శబ్దాలంకారంగాను, అర్థాన్ని అలంకరించే అర్థాలంకారం గాను ప్రధానంగా రెండుగా విభక్తమైనది.

పై విధంగా కావ్యాన్ని అలంకరించటానికే కాక ఇంకొక ముఖ్యమైన విషయకంగా కూడా అలంకారం మనకు ఉపయోగపడుతున్నది. అదేమంటే ఏదైనా వస్తువును గాని, రూపాన్ని కాని

మనం చూసినపుడు, అది మనలో ముద్రింపబడినపుడు దానిని ఎదుటి వారిలో కూడా ముద్రించటానికై దానిని గురించి వివరించటమో లేదా వర్ణించటమో చేయక తప్పదు. ఆ స్థితిలో మనం దానిని సరిగా వర్ణించ లేక పోయినా, వర్ణించి నప్పటికీ ఎదుటి వాడు సరిగా గ్రహించలేక పోయినా మన ప్రయత్నమంతా వ్యర్థమై పోతుంది. అట్టి క్లిష్టస్థితిలో మనకు ఉపయోగపడే ఏకైక సాధనం అలంకారం మాత్రమే. ఉదా.. ఒక మహా బలవంతుణ్ణి మనం చూశామనుకోండి. అతని మహా బలాన్ని ఎదుటి వారికి చెప్పటానికి అతని కాళ్ళు చేతులంత పొడవుగా ఉన్నాయి. ఉదరమంత లావుగా ఉన్నది. మొ.. రీతుల్లో వివరించినప్పటికీ అతని నిజమైన మహాబలమేమిటో వానికి అర్థం కాదు. ఈ స్థితిలో మనం 'అతడునిజంగా భీముడే' అని అలంకార ప్రయోగంతో ఒక్క మాటలో చెప్పంగానే అతని మహాబలమేమిటో అతడు అత్యంత సులభంగా, స్పష్టంగా , అతి తక్కువ కాలంలో అర్థం చేసికో గలుగుతాడు.

ఈ విధంగా అలంకార ప్రాధాన్యాన్ని మనం క్రింది విధంగా గణించవచ్చు. 1.కావ్యాన్ని మిక్కిలి సౌందర్య వంతం చేస్తున్నది. 2. చెప్పదలచిన అంశాన్ని స్పష్టంగా, నాజూగ్గా చెబుతున్నది. 3. చెప్పబడిన అంశం అతి తక్కువ కాలంలో సులభంగా అవగాహనకు వస్తున్నది. 4. చెప్పలేని, చెప్పరాని అంశాన్ని కూడా చెప్పటానికి ఉపకరిస్తుంది. 5. చూపలేని, చూపింపరాని రూపాన్ని చూపటానకి దోహదపడుతున్నది. 6. రచనకు తుష్టిని, పుష్టిని చేకూరుస్తున్నది. 7. శబ్దాలంకారం రచనకు మాధుర్యాన్ని, చమత్కారాన్ని ప్రసాదిస్తున్నది. 8. అర్థాలంకారం అర్థానికి గంభీరతను, సౌందర్యాన్ని చేకూరుస్తున్నది.

అలంకారాలు కావ్యంలో ఇలా ఇంతటి ప్రాధాన్యాన్ని పొందాయి కాబట్టే భరతునితో 3 గా ఆవిర్భవించిన అర్థాలంకారాలు మొన్న మొన్నటి అప్పయదీక్షితుల కాలంనాటికి 124 గా, భరతునితో ఒకటిగా ఆవిర్భవించిన శబ్దాలంకారం అనేకంగా వృద్ధి చెందాయి. వీటిల్లో మరలా అనేక అవాంతర భేదాలు కూడా ఉన్నాయి. వీనినన్నింటినీ గణిస్తే ఇవి దాదాపు 200 పైగా అవుతున్నవి. ఇందులో ప్రధాన శాఖలైన శబ్దఅర్థాలంకారలను క్రింది విధంగా తెలిసికొందాం.

### 1. శబ్దాలంకారాలు

ఇవి శబ్దాన్ని అలంకరించునట్టివి. శబ్దం లేకుండా కావ్యమే లేదు. కాబట్టి అట్టి శబ్దాన్ని ఇవి అలంకరిస్తూ ఒక రకమైన లయను నాద సౌందర్యాన్ని కూడా కలిగిస్తున్నాయి. వీటిల్లో ఛేకాను ప్రాసాదులు, యమకం - ముక్తపద గ్రస్తాదులు, ప్రహేళికాదులు, చక్ర - బంధ - గర్భాదులు ఉన్నాయి.

### 2. అర్థాలంకారాలు

ఇవి అర్థాన్ని అలంకరించునట్టివి. కావ్యంలో శబ్దమే ముఖ్యమైనప్పటికీ, అర్థంలేని శబ్దం

వ్యర్థం కనుక అట్టి అర్థానికి ఇవి తుష్టిని - పుష్టిని, సౌందర్యాన్ని కలిగిస్తున్నాయి. వీటిల్లో ఉపమ - ఉత్ప్రేక్ష, రూపక - దీపక, స్మృతి - భ్రాంతి, సందేహ - అపహ్నవాతిశయోక్త్యాదులు; సంసృష్టి - సంకరాది మిశ్రత్వాన్ని పొందిన అలంకారాదులు ఎన్నో ఉన్నాయి.

## ఛందస్సు

### ప్రాధాన్యం

ఛందస్సనగా యథేచ్ఛమైన నడక అని అర్థం. పాణిని వేదానికి ఛందస్సు పాదమ ని ఎఛందః పాదౌ తు వేదస్యఏ చెప్పాడు. ఇది రుచికరంగా శ్రుతి పేయంగా, లయబద్ధంగా ఉంటుందని చందయతి ప్రుణాతి రుచతీ ఇతి ఛందః అనే వాక్యం చెబుతున్నది. వేదాలు ఛందస్సుతో నడుస్తూ శ్రుతిపేయాలుగా ఉంటున్నాయి. కాబట్టే అవి శ్రుతులు గా కూడా చెప్పబడ్డాయి. ఇలా వేదాలు ఛందస్సులోనే ఉండడం వలన వేదాధ్యయనానికి ఛందస్సు అత్యవసరమై వేదాంగాల్లో తాను కూడా స్థానాన్ని పొందినది. అందుకే పంచమ వేదంగా పరిగణింపబడుతున్న నాట్య శాస్త్రంలో నాట్య బ్రహ్మయైన భరతుడు ఛందః ప్రాధాన్యాన్ని ఛందోహీనో న శబ్దోస్తి, నచ్ఛంద శ్శబ్దః వర్జితమ్ ఎఛందో హీనమైన శబ్దం లేదు ఒక వేళ ఉంటే అట్టి ఛందో బద్ధంకాని శబ్దాన్ని విసర్జింప వలెనుఏ అని స్పష్టపఱచాడు. ఈ విధంగా అలౌకిక ఎవైదికఏ, లౌకిక ఎలోకసంబంధమైనఏ సాహిత్యాల్లో అమేయమైన స్థానాన్ని పొందిన ఈ చందస్సుకు దాదాపుగా భారతీయ సాహిత్యాలన్నీ స్వాగతం పలికాయి. ముఖ్యంగా సంస్కృత సాహిత్యంలో ఛందస్సు బాగా అభివృద్ధిని సాధించినది. లయ సంబంధితాలైన యతి ప్రాసలు చంధస్సుకు స్వభావసిద్ధాలై అందులో భాగాలౌతున్నాయి. ఇట్టి ఛందస్సు వలన లభించే ప్రయోజనాలను క్రింది విధంగా గణించవచ్చు

1. భాషకు ధారాళమైన నడకను నేర్పుతున్నది. 2. భాషకు లయ స్థితిని కలుగచేస్తున్నది. 3. భాషను సంగీతానుకూలం చేస్తున్నది. 4. కవితా రచనకు సౌందర్యాన్ని ఆపాదింపచేస్తున్నది. 5. ఛందస్సంబంధితమైన ప్రాస నాద మాధుర్యాన్ని కలిగిస్తున్నది. 6. ఉచ్చారణనుసులభతరం, త్వరితగతం చేయడానికి చంధస్సు చక్కటి సాధనం. 7. ఏదైనా అంశాన్ని సులభంగా కంఠస్థం చేసికోటానికి, కంఠస్థమైన దానిని చక్కగా ధారణ చేసికోటానికి ఛందస్సే ప్రధానమైన ఆధారం.

## తెలుగు ఛందో విధానం

మొట్ట మొదట తెలుగు భాష సాహిత్య స్థితిని పొందినపుడు తనకనుకూలమైన, సహజ సిద్ధమైన ఛందస్సును కూడా ఏర్పాటు చేసికొన్నది. దీనినే 'దేశీయ ఛందస్సు' అని పిలిచారు. ఆ తరువాత క్రమంగా ఇది సంస్కృత సాహిత్యంలో సమ్మిళితం కావటంతో దాని స్వతస్సిద్ధమైన ఛందస్సును కూడా ఇది తనలో గర్భీకరించుకొన్నది. క్రమంగా ఈ సంస్కృత ఛందస్సు దేశీయ ఛందస్సును అణగద్రొక్కి తాను స్థిరపడి అదే తెలుగు సాహిత్యానికి సహజ ఛందస్సన్నంత భావన వరకు ఎదిగినది. ఈ విధంగా తెలుగు సాహిత్యంలో ఛందస్సు దేశీయ ఛందస్సు -

సంస్కృత ఛందస్సు అని రెండు రకాలుగా కనిపిస్తున్నది.

## దేశీయ ఛందస్సు

తెలుగు భాషలో సహజ సిద్ధమైన ఈ చంధస్సు తెలుగు సాహిత్య తొలి దశలో అనగా క్రీ. శ. 11 వ శతాబ్దానికి పూర్వం శాసనాల్లోను సామాన్య ప్రజాజీవనంలోను కనిపిస్తున్నది. ముఖ్యంగా గేయ రూపంలో ఇది ఉండేది. తరువాత 12 వ శతాబ్దంలో పాల్కురికి సోమన దీనిని విశేషంగా అభిమానించి, ఆదరించి, అభివృద్ధి పఱచి మహా కావ్యరచనకు ఉపయోగ పడేటట్లుగా సిద్ధపఱచాడు. తరువాతి కాలంలో ఇది మరుగున పడిపోయి18, 19 శతాబ్దాల్లో కొంత ప్రాచుర్యాన్ని సంతరించుకొని విశేషంగా అభివృద్ధిని సాధించుకొంటూ, 20 వ శతాబ్దంలో సంస్కృత ఛందస్సును అన్ని విధాలుగా అణగద్రొక్కుతూ మకుటాయ మానంగా కాంతి ప్రభలతో విరాజిల్లుతున్నది. కందం, సీసం, తరువోజ, అక్కఱ, ద్విపద, మొ.. రీతులు, ఆధునిక కాలంలో అధికంగా కనిపించే ద్వ్యక్షర-త్ర్యక్షర-చతురక్షిర-ఖండగతి-ముత్యాల సరాలు మొ.. రీతులు ఈ దేశీయ ఛందస్సులో ప్రముఖంగా కనిపిస్తున్నాయి.

## సంస్కృత ఛందస్సు

సంస్కృత భాషకు సహజ సిద్ధమైన ఈ ఛందస్సు తెలుగు సాహిత్యంలో క్రీ. శ. 11వ శతాబ్దానికి పూర్వం శాసనాల్లో అక్కడక్కడా కనిపిస్తూ 11 వ శతాబ్దంలో నన్నయతో స్థిరపడి పోయినది. సంస్కృత ఛందస్సులో అత్యధిక భాగాన్ని నన్నయ తెలుగు భాషకనువైన రీతిలో తెలుగులో గుమ్మరించాడు. ఏ శుభముహూర్తాన సంస్కృత ఛందస్సుకు ఈయన స్వాగతం పలికాడో కాని తొమ్మిది శతాబ్దాల తెలుగు సాహిత్యాన్ని ఏక ఛత్రాధిపత్యంగా ఇది ఏలుకొన్నది. ఆధునిక కాలం వరకు విశాలంగా విస్తరించిన ఈ సంస్కృత ఛందస్సనే మఱ్ఱి వృక్షపు నీడలో తుంగబొటికనే దేశీయ ఛందస్సు కమురుకొని పోయినది. ఇటివలి కాలంలో మాత్రం తెలుగు సాహిత్యంలో సంస్కృత ఛందస్సుకు ప్రాధాన్యం అంతకంతకూ తగ్గుతూ వస్తున్నది. ఇట్టి ఈ సంస్కృత ఛందస్సులో ఉత్పల మాల-చంపకమాల - మత్తేబం - శార్దూలం - స్రగ్ధర మొదలగునవి విశేషంగా కనిపిస్తాయి.

# IV. మాతృభాషగా తెలుగు

## మాతృభాష నిర్వచనం - ప్రాధాన్యం

'Lingua' అనే లాటిన్ పదం నుంచి ఏర్పడినదే 'language' అనే పదం. దీనికి సమానార్థంగా సంస్కృతంలోనూ, తెలుగులోనూ 'భాష' అనే పదం వాడబడుతున్నది. 'Lingua' అనే పదానికి 'నాలుక' (tongue) అనేది అర్థం. Lingua లేక పోతే language లేనట్లే. నాలుక లేకపోతే భాషయే లేదు. నాలుక లేని వ్యక్తి భాషించడం అనేది అసంభవం. అయితే అది మందంగా ఉంటే మాట స్పష్టంగా రాదు. అందుకే నాలుక మందంగా ఉంటే సరస్వతి (చదువు అనగా మాట) అబ్బదనే వ్యవహారం స్థిరపడినది. ఎటొచ్చి భాషలో నాలుక(lingua )ప్రధాన భూమిక వహిస్తున్న కారణాన దాని పేరు మీదుగానే వారు దానిని language గా పిలిచారు. భారతీయులు మాత్రం 'భాషింపబడేది భాష' (భాష్యత ఇతి భాష) అని పేర్కొన్నారు. భాషించడమనగా మాట్లాడడం. ఈ మాట్లాడటానికి నాలుకయే ఆధారమైనప్పటికీ మనవారు దానిని కాక దాని ప్రక్రియకు (భాషించడం) ప్రాధాన్యమిచ్చి ఆ పేరుతోనే దానిని పిలిచారు.

ప్రపంచంలో ఏ జాతిలోనైనా, ఏ ప్రాంతంలోనైనా ప్రతి బిడ్డకు తల్లియే (Mother) మొదటి సారిగా ఈ సృష్టిని పరిచయం చేస్తున్నది. ఆ తరువాత అతి సాధారణంగా ఆమెయే ప్రాథమిక దశలో ఆ బిడ్డ శారీరక, మానసిక అభివృద్ధులకు కారకురాలౌతున్నది. ఇలా తల్లి దగ్గర బిడ్డ పోషింపబడుతున్నపుడు అన్ని విధాలుగా ఆమె నతడు అనుకరించడం అనేది అతి సాధారణంగా జరుగుతున్నది. ఈ అనుకరణలో తల్లి నుండి బిడ్డ మొట్ట మొదటిసారిగా అనుకరించేవి కొన్ని సంజ్ఞలు, తరువాత కొన్ని భాషా సూచకాలు, ఆ తరువాత భాష. ఇలా తల్లి ద్వారా బిడ్డ నేర్చుకొంటున్న ఈ భాషనే 'తల్లి భాష' (లేదా) 'మాతృభాష' అని, ఆంగ్లంలో 'Mother Tongue'అని పిలుస్తున్నారు. ఇట్టి ఈ మాతృభాషను వ్యక్తి అనుకరణతో, అత్యంత సహజ పద్ధతిలో, అతి సులభంగా నేర్చుకొని దాని సహాయంతో పరభాషలను కూడ సులభంగా నేర్చుకొంటున్నాడు. అందుచేత మాతృభాషను క్రింది విధంగా నిర్వచింపవచ్చు.

"నేర్చుకొంటున్నాననే స్పృహ కూడా లేకుండా, అత్యంత సహజ పద్ధతిలో, అతి సులభంగా శిశువు మొదట ఏ భాషనైతే నేర్చుకొంటున్నదో ఏ భాషా సహాయం పరభాషాభ్యసనంలో అత్యంత కీలక పాత్ర వహిస్తున్నదో ఆ భాషయే" మాతృభాష.

పై విధంగా మాతృభాషను శిశువు తన తల్లి దండ్రుల నుండి యే నేర్చుకోవడమనేది సహజమైన విషయం. అయితే కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో శిశువు తల్లిదండ్రులకు దూరమై మరొకరిచేత పెంచబడినపుడు పెంచిన వారి భాషయే శిశువుకు అలవడుతున్నది. అపుడదే ఆ వ్యక్తికి 'మాతృభాష' అవుతున్నది. అందుచేత మాతృభాష అనేది పరిసర ప్రభావం వల్ల అలవడేదే తప్ప వంశపారంపర్యం కాదు. కాకపోతే దాదాపు 99% శిశువులు తమ స్వంత తల్లిదండ్రుల నుంచే భాషను అలవఱచుకొంటారు. కాబట్టి 'మాతృభాష' అనే పదం స్థిరపడి పోయిన్నది.

## మాతృభాషా ప్రాధాన్యం

మిగిలిన భాషలతో పోల్చినపుడు ఏ ప్రయత్నం లేకుండా శిశువు మాతృ భాషను అత్యంత సులభంగా నేర్చుకొంటున్నది. పరభాషలను నేర్చుకోడంలో దీని పాత్ర ప్రముఖంగా కనిపిస్తున్నది. భావ వ్యక్తీకరణ అత్యంత సులభంగా జరగడానికి దోహదపడేది కేవలం మాతృభాషయే. అలాగే భావ గ్రహణను త్వరిత గతం చేయండలో కూడా మాతృభాషదే ప్రథమ స్థానం. సాధారణంగా బోధనా మాధ్యమంగా ఉంటున్న మాతృభాష జ్ఞానార్జనలో ప్రధాన భూమిక స్థానాన్ని పొందుతున్నది. వ్యవహారాన్ని సులభతరం చేయండంలో దీనికత్యంత ప్రాధాన్యమున్నది. సాధారణంగా ఒక జాతి సంస్కృతి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలన్నీ ఆజాతి మాతృభాషలోనే నిక్షిప్తం చేయబడుతున్న కారణాన వానిని పొంది వికాసం చెందటానికి మాతృభాషయే ఏకైక ఆధారం. అలాగే జాతి యొక్క ఆనందాభిరుచులన్నీ ఆ జాతి మాతృభాషలోనే ఉంటున్న కారణాన వానిని పొందటంలో దీని కత్యంత ప్రాధాన్యమున్నది. జాతి జీవనాడిని పటిచ్చె జాతీయాలను, సామెతలను, లోకోక్తులను జీర్ణించు కోటానికి మాతృభాష ఒక్కటే మహా సాధనం.

## మాతృభాషా ప్రయోజనాలు

1.సులభంగా నేర్చుకోవచ్చు. 2. వ్యవహారాన్ని అత్యంత సులభతరం చేస్తున్నది. 3. పరస్పర అవగాహన శక్తిని పెంపొదిస్తున్నది. 4. జాతీయతను కాపాడుతున్నది. 5. సంస్కృతి సంప్రదాయాలను, అచారవ్యవహారాదులను పరిరక్షిస్తున్నది. 6.పరభాషాభ్యాసానికి దోహదపడుతున్నది. 7.భాషేతరాంశాలను సులభంగా అర్థం చేసికోటానికి మాతృభాషయే ప్రధానంగా ఉపయోగపడుతున్నది. 8. విద్యాలక్ష్యాలను నెరవేర్చడంలో బోధనా మాధ్యమంగా మాతృభాష ఎంతగానో కృషి చేస్తున్నది. 9. భావ వ్యక్తీకరణాన్ని,గ్రహణాన్ని అత్యంత సులభతరం చేస్తున్నది. 10. దూర ప్రాంతంలో నివసిస్తున్న వారితో సహసంబంధాలను ఏర్పఱచటానికి మాతృభాష చక్కటి సాధనంగా ఉపకరిస్తున్నది. 11. జీవనోపాధికి దోహదపడుతున్నది. 12. ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని అమితంగా పెంపొందిస్తున్నది. 13. మూర్తి మత్వాన్ని వికసింపచేస్తున్నది. 14. ప్రేమాభిమానాలను, స్నేహపూర్వక వాతావరణాన్ని సృష్టిస్తున్నది. 15. దేశభక్తిని పెంచుతున్నది. 16. జ్ఞానసౌధానికి (Building of Knowledge) దీపికలాగా రాణిస్తున్నది. 17. మనో వికాసాన్ని త్వరిత గతిన అభివృద్ధి పఱుస్తున్నది. 18. అనువాద సామర్థ్యాన్ని వృద్ధి చేస్తున్నది. 19. రచనా నైపుణ్యాన్ని కలిగిస్తున్నది. 20. ఉత్తమ వ్యక్తులుగా తీర్చి దిద్దుతున్నది. 21. కవితా పరమైన ఆనందాన్ని అనుభవింపచేస్తున్నది.

## మాతృభాషా స్థానం

విశేషమైన ప్రాధాన్యాన్ని, అమితమైన ప్రయోజనాలను కలిగిన మాతృభాష ఇటు సమాజంలోనూ, అటు విద్యా వ్యవస్థలోను అమేయమైన స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

## 1. సమాజంలో మాతృభాషా స్థానం

వ్యక్తుల మధ్య పరస్పర అవగాహనకు దోహద పడుతూ, సహసంబంధ బాంధవ్యాలను ఏర్పఱుస్తూ ఒకరితో మరొకరిని భావనాపరంగా కలుపుతూ, సమాజమనే భావాన్ని విత్తి పెంచి పెద్ద చేస్తున్నది మాతృభాషయే. వ్యక్తుల నిత్య దైనందిన జీవన వ్యవహారసరళిని సులభతరం చేస్తూ వారి అభివృద్ధికై నిరంతరం మాతృభాష పాటుపడుతున్నది.

ధర్మార్థకామ మోక్షాలను ప్రసాదిస్తూ , అధర్మ హేతువులైన కామ - క్రోధ - మద-మాత్సర్యాదులను అడ్డగిస్తూ , సాహిత్యపరంగా సమాజాన్ని సన్మార్గంలో నడిపిస్తున్నది కేవలం మాతృభాషయే. హితోపదేశాన్ని-ఆనందాన్ని కవితా రూపంలో ప్రసాదిస్తూ సమాజాన్ని ఆనందముఖంగా పయణింప చేస్తున్నది కూడా మాతృభాషయే. జ్ఞాన విజ్ఞానాంశాలను సామాన్యమానవుని అవగాహనలోకి తెస్తూ, వారి అభివృద్ధికై మాతృభాష అత్యధికంగా కృషి చేస్తున్నది. నీతినియమాలను నిర్దేసిస్తూ సమాజానికి సత్ప్రవర్తనను, చక్కటి నడవడికను నేర్పుతున్నది కూడా సాహితీ రూపంలో నున్న మాతృభాషయే. సమాజంలో వ్యక్తి ఉనికిని, వ్యక్తిత్వాన్ని, మూర్తిమత్వాన్ని కాపాడుతూ, అతని మానసిక వికాసానికి అహర్నిశలు కృషిచేస్తున్నది కేవలం మాతృభాషయే. ఈ విధంగా వ్యక్తి మాతృచనుబాలతో శరీరాన్ని వృద్ధి చేసుకొంటూ, మాతృభాషతో మనస్సును అభివృద్ధి పఱచుకొంటున్నాడు.

## 2.విద్యావ్యవస్థలో మాతృభాష స్థానం

ఏదైతే జ్ఞానమో దాని సముపార్జనయే 'విద్య ' యొక్క పరమార్థం. ఇట్టి విద్య ఏదో ఒక వ్యక్తికి, ఒక ప్రాంతానికి, ఒక కాలానికి సంబంధించినదిగా కాకుండా సార్వకాలికమై, విశ్వజనీనమై గ్రంధ రూపంలో నిక్షిప్తం చేయబడి ఉంటున్నది. ఇలా జ్ఞానప్రతిపాదితమైన విద్యను అక్షరబద్ధం చేయడానికి, అక్షరబద్ధమైనదానిని గ్రహించడానికి ఏకైక సాధనం కేవలం భాష ఒక్కటే. అందుకే విద్యాభ్యాసంలోని అధ్యనాంశాలను భాషాంశాలు,భాషేతరాంశాలు అని రెండుగా విభజించడం జరిగినది. అందులో కూడా ముందుగా ముఖ్యంగా మాతృభాషా బోధనయే జరిగెడిది. ఒక్క మాటలో చెప్పాలంటే విద్యాబోధన మాతృభాషతోనే ఆరంభమౌతున్నది. అందుకే విద్యకిది ఓంకార మౌతున్నది. దానికి కారణం పైన తెలిసికొన్న దీని ప్రాధాన్యత, ప్రయోజనాలే. అంతేకాక దీని ఆవశ్యకత కూడా క్రింది విధంగా ఉన్నది.

బయటి ప్రపంచలోంచి విద్యార్థి పాఠశాలలోకి అడుగు పెట్టే సమయానికి తన మాతృభాషలో ఎంతోకొంత జ్ఞానాన్ని పొంది ఉంటాడు. ఈ తెలిసిన మాతృభాషా జ్ఞానం ఆధారంగా తెలియని మాతృభాషాంశాల బోధనతో విద్యాభ్యాసం ఆరంభించబడుతున్నది. తరువాత ఈ మాతృభాష సహాయంతోనే భాషేతరాంశాలను బోధించడం జరుగుతున్నది. ఆ తరువాత కేవలం మాతృభాషా పరిజ్ఞానంతోనే మాతృభాషేతర భాషలను బోధించడం జరుగుతున్నది. ఇదే వాస్తవానికి సరైన పద్ధతి. ఎందుకంటే "తెలిసిన దాని ఆధారంగా తెలియని దానిని, సులభమైన దాని ఆధారంగా కష్టమైన దానినిఅభ్యసించటమే వాస్తవికమైన అభ్యసనం.

ప్రాథమిక దశలో ఇట్టి అభ్యసన విధానం కేవలం మాతృభాషతోనే సాధ్య పడుతున్నది. భాషేతరకాంశాలకు సంబంధించిన జ్ఞానాంశాలను సుభంగా, స్పష్టంగా, ప్రత్యక్షంగా బోధించాలన్నా, అలాగే గ్రహించాలన్నా బోధనా మాధ్యమంగా మాతృభాష ఉన్నపుడే సాధ్యమౌతున్నది. ఒక జాతికి సంబంధించిన సమగ్రమైన సంస్కృతి-ఆచార వ్యవహారాలు, జీవనవిధానం మొ.. అన్నీ ఆ జాతి మాతృభాషలోనే నిక్షిప్తం చేయబడి ఉంటాయి. ఈ జ్ఞానాంశాలను పొందడం విద్యలో ప్రధానమైన ఘట్టం కావడం వలన వానిని పొందటానికై ఖచ్చితంగా మాతృభాషను ఆశించక తప్పదు. అలాగే జాతి ప్రజల జీవన విధానం తో పాటు వారి ఆనంద జీవితాన్ని తెలిసికోటం కూడా ముఖ్యాంశమే. ఇందుకోసం కూడా మనం మాతృభాషపైననే ఆధారపడక తప్పదు. మంచి వక్తలుగా, సంస్కర్తలుగా, రచయితలుగా కవులుగా, ప్రేమమూర్తులుగా, స్నేహశీలులుగా, సత్ప్రవర్తనా పరులుగా, చక్కటి సామాజికులుగా వ్యక్తులను మలచడం, సమాజాన్ని అభివృద్ధి పఱచటం విద్య పరమ ధ్యేయం. అందుకు చక్కటి సాధనం కేవలం మాతృభాషయే. ఇట్లు ఆకాశంలో చుక్కలెన్ని ఉన్నా వెలుగంతా చంద్రునిదే అయినట్లు, విద్యలో జ్ఞానాంశాలెన్ని ఉన్నా మాతృభాషదే నిజమైన జ్ఞానం. అందుకే 'ఉడ్సు నివేదిక' లోను(1854), ఉడ్సు మరియు అబ్బట్ నివేదికలోనూ (1937)గాంధీజీ ప్రాతిపదిక విద్యలోను(1938), త్రిభాషా సూత్రంలోను(1962), కొఠారి కమిషన్ లోను(1966), మాతృభాష ప్రాధాన్యం స్పష్టంగా లిఖించబడింది.

పై విధంగా సమాజంలోను, విద్యా వ్యవస్థలోనూ ఉన్నత పీఠస్థానాన్ని పొందిన మాతృభాషను అభివృద్ధి పఱచుకోటానికై అన్ని రాష్ట్రప్రభుత్వాలు అవిరళంగా కృషిసాగిస్తున్నాయి. ఆంధ్రరాష్ట్రప్రభుత్వం కూడా మాతృ భాషయైన తెలుగు భాషను అభివృద్ధి పఱచటంలో ఇతోధికంగా తన వంతు కర్తవ్యాన్ని పాటిస్తున్నది.

## మాతృభాషాబోధనా విలువలు

సాధారణంగా విద్య పెంపొందించవలసిన విలువలు సామాన్య విలువలు, ప్రత్యేక విలువలని రెండు రకాలుగా ఉంటున్నాయి. వీటిల్లో సామాన్యవిలువలు మరలా వ్యక్తి వ్యక్తిత్వాన్ని పెంపొందించే వైయక్తిక విలువలు, సమాజాభివృద్ధికి తోడ్పడే సామాజిక విలువని రెండుగా విభజంపబడుతున్నాయి. విద్యలో మాతృభాష అనేది ప్రధమ స్థానాన్ని అలంకరిస్తున్న కారణాన ఇది ఈ విలువలను సాధించడానికి బధ కంకణం కట్టు కొంటున్నది.అందు చేత ఈ విలువలన్నీ మాతృభాష బోధనా విలువలౌతున్నాయి.

### 1. వైయక్తిక విలువలు (Individual Values) :-

వ్యక్తిలో వ్యక్తిత్వాన్ని పెంపొందించి సమాజంలో అతణ్ణిరాణింప చేసేవి వైయక్తిక విలువలు, వ్యక్తిత్వం లేని మనిషి వెన్నెముకలేని ప్రాణితో సమానం. అందుచేత వ్యక్తి జీవితానికి వ్యక్తిత్వమనేది ప్రధాన ఆధారభూమిక. ఇట్టివ్యక్తిత్వాన్ని పెంపొందింప చేయడానికి మాతృభాష సాహిత్యముఖంగా అహర్నిశలు కృషి చేస్తున్న కారణాన మాతృభాషా బోధనలో ఇవి స్థానాన్ని పొందుతున్నాయి.

**2. సామాజిక విలువలు (Social Values):-**

సమాజాన్ని ఉన్నత ప్రమాణాలవైపు నడిపించేవే సామాజిక విలువలు. ప్రతి సమాజంలో ఆర్థిక వ్యత్యాసాలు, వర్ణ వ్యత్యాసాలు, సంస్కృతి వ్యత్యాసాలు, భాషా వ్యత్యాసాలు, విజ్ఞాన వ్యత్యాసాలు మొ.. ఎన్నో వ్యత్యాసాలు కనిపిస్తాయి. వీటిని తొలగించి సమాజాన్ని ఉన్నత ప్రమాణాలతో అభివృద్ధివైపు నడిపించడం సామాజిక విలువల ధ్యేయం. అందుకు చక్కగా ఉపకరించేది మాతృభాషయే. అందుచేత మాతృభాషా బోధనలో సామాజిక విలువలకు అధిక ప్రాధాన్యమున్నది.

**3. ప్రత్యేక విలువలు (Special Values):-**

వ్యక్తి వ్యక్తిగా రాణిస్తూ సమాజంలో మనిషిగా మనుగడ సాగిస్తునపుడు అతనికి అనేక అవసరాలు ఆవిర్భవిస్తాయి. ఇవి అతని మానసికోల్లాసానికి, మతానికి, సాధారణ నైతిక జీవనాలకు, సృజనాత్మకతకు మొ.. వానికి సంబంధించినవిగా ఉంటాయి. వీటిని తీర్చుకోటానికి వ్యక్తి నిరంతరం కృషి చేస్తూనే ఉంటాడు. వీటినే ప్రత్యేక విలువలుగా భావిస్తున్నాం. ఈ విలువలను సాధించటంలో మాతృభాష కీలక పాత్రను వహిస్తున్నది. ఇట్టి మాతృభాష ప్రత్యేక భోధనా విలువలు క్రింది విధంగా కనిపిస్తున్నాయి.

**1.సౌందర్య విలువలు:-**

స్థావర జంగమాత్మకమైన ఈ సృష్టి సౌందర్యంలోనే పుడుతున్నది. పెరుగుతున్నది, చివరకు లయిస్తుంది. కాబట్టి సృష్టి అంతా సౌందర్యమయం. అందుకే "సత్యమ్ శివమ్ సుందరమ్" అన్నది అంతటి ప్రాధాన్యాన్ని పొందినది. సృష్టిలో భాగమైన మానవుడు సౌందర్యపరుడే. అయితే ఆ సౌందర్యాన్ని అనుభవిస్తున్నడా లేదాఅనేది అతని అనుభవానికి సంబంధించినది. అనుభవంలో లేని సౌందర్యం జీవంలేని అందమైన దేహంతో సమానం. అందుచేతప్రతి మనిషీ అందమైన అనుభవం కోసం అఱ్ఱులు చాస్తాడు. ఈ ప్రయత్నంలో అతనికి ప్రధానంగా ఉపకరించే ఏకైక సాధనం మాతృభాష, అందులో భాగమైన సాహిత్యం. ఈ సాహిత్యంలో ముఖ్యంగా భావకవిత్వం మనిషిని ప్రకృతి ఒడిలో పరవశింప చేస్తున్నది. కేవలం ప్రకృతియే అతనికి సర్వస్వం. అనేక విధాలైన స్త్రీగా ప్రకృతి అతనికి కనిపిస్తున్నది. ఇలా ఈ సౌందర్య విలువలు మాతృభాషా బోధనా విలువల్లో స్థానాన్ని పొందాయి.

**2. నైతిక విలువలు : (Moral Values):-**

నీతికి సంబంధించిన విలువలే నైతిక విలువలు. ఇవి శీలం, ప్రవర్తన, ధర్మం, సత్యం,న్యాయం, విత్తార్జన, మొ.. వానికి సంబంధించినవిగా ఉంటాయి. ఇట్టి ఈ నైతిక విలువలు లేని సమాజం మొగద్రాడు లేని ఆబోతుతో సమానం. ఇట్టి నైతిక విలువల పరిరక్షణే మాతృభాష పరమ ధ్యేయం. ఇందు కోసం మాతృభాష కాలానుగుణంగా అనేక సాహిత్య ప్రక్రియలను, కవితా ఉద్యమాలను

చేపడుతున్నది. ముఖ్యంగా నీతి సాహిత్య మంతా దీనికి సంబంధించినదే. ఈ విధంగా ఇవి మాతృ భాషా బోధనా విలువలౌతున్నాయి.

### 3. ఆధ్యాత్మిక విలువలు (Spiritual Values):-

సృష్టి శాశ్వతం కాని అందులోని మానవుడు శాశ్వతం కాదు. అయితే పైకి కనిపించే మానవుని భౌతిక ఆకారం (దేహం) శాశ్వతం కాదు కాని అందులోని ఆత్మ శాశ్వతమనీ 'మత' నమ్మకం. ఇట్టి ఈ ఆత్మకు కోరికలెక్కువైనపుడు అవి తీరక గాలిలోని దీపంలా కొడక లాడుతూ అసంతృప్తితో ఉంటుంది. ఇలా అసంతృప్తితో ఉన్నట్టి ఆత్మకు సంతృప్తిని చేకూర్చే ఏకైక మార్గమే మతమని నమ్మకం. ఇట్టి ఈ మత సంబంధమైన, ఆత్మ అంతర్గతమైన విలువలే ఆధ్యాత్మిక విలువలు. ఇట్టి ఆధ్యాత్మిక విలువలు లేని మనిషి మనిషిగా కాక జంతువుగా ప్రవర్తించునని ఆద్యాత్మిక వాదుల అభిప్రాయం. కాబట్టి ఇటువంటి ఆధ్యాత్మిక విలువలను సాధించడం కూడా మాతృభాష కర్తవ్యం. సాహిత్యంలోని భక్తి తత్వమంతా ఈ కోవకు చెందినదే.

### 4.సాంస్కృతిక విలువలు : (Cultural Values):

సంస్కృతి తెలియని మనిషి పుట్టుక తెలియని మనిషితో సమానం. సృష్టిలోని ఏ జాతియైనా తనదంటూ ఏదో ఒక సంస్కృతిని కలిగే ఉంటుంది. జాతికి సంబంధించిన ఈ సంస్కృతి కాలానుగుణంగా తరువాతి వారికి నిరవధికంగా సంక్రమించే ఏకైక గుప్తధనం. ఇటువంటి సంస్కృతికి సంబంధించిన విలువలే సాంస్కృతిక విలువలు. తరతరాలుగా సంక్రమిస్తున్న సంస్కృతి సంబంధితాలైన అనేకాంశాలను సప్రమాణీకరించడం, అభివృద్ధి పఱచడం, ప్రజల్లో వానిపై నమ్మికను కలిగించడం, సమాజాన్ని అభివృద్ధి మార్గంవైపు నడిపించడం మొ.. వానిని పెంపు చేయటమే సాంస్కృతిక విలువల ధ్యేయం. ఇట్టి ఈ ధ్యేయ సాధనకు పరమ ప్రామాణికమైన సాధనం మాతృభాష. ముసుగులోనున్న సంస్కృతియే మాతృభాష. మాతృభాషలోని నుడికారాలు,జాతీయాలు, సామెతలు, సాహిత్య ప్రక్రియలు మొదలైనవన్నీ ఈ సాంస్కృతిక విలువల పరిరక్షకాలే అందుకే ఇవి కూడా బోధనా విలువలౌతున్నాయి.

### 5.సృజనాత్మక విలువలు (Creative Values):

సృష్టిలో కెల్లా అత్యంత తెలివైన జంతువు 'మనిషి' అని తెలుస్తూనే ఉన్నది. అనగా తెలివి అనేది మనిషిని జంతువు నుంచి వేరు చేస్తున్నదని అర్థమౌతున్నది. ఈ తెలివి మనసుకు, ముఖ్యంగా అందులోని సృజనాత్మకతకు, సంబంధించినది. సృజన లేని మనిషి జీవం పోయిన కొయ్యతో సమానం. ఈ సృజనాత్మకత మేధావంతమై, నైపుణ్యభరితమై, సప్రమాణబద్ధమై, ఆనంద ప్రతిపాదితమై, అభివృద్ధిబోధకమై చలనరూపంలో ఉంటుంది. ఇట్టి ఈ సృజనాత్మకతను వెలికి తీసి సక్రమ రీతిలో ఉపయోగించుకొన్నపుడు లోక కల్యాణం జరుగుతుంది. ఇట్టి సృజనాత్మక విలువలను వెలికి తీయటానికి మాతృభాష దోహదపడుతూ వానిని బోధనా విలువలుగా స్వీకరిస్తున్నది.

### 6.జ్ఞానాత్మ క విలువలు(Knowledge Values):

వేద-పురాణ-ఇతి హాసాదులన్నీ నిజంగా జ్ఞాన ప్రతి పాదకాలే. వీని వివరణ కూడా సాహిత్ ధ్యేయాల్లో ఒకటి. ఈ విధంగా మాతృభాష జ్ఞానాత్మక విలువలను కూడా పెంపొందిస్తున్న కారణాన ఇవి కూడా బోధనా విలువలౌతున్నాయి.

### 7.ప్రజాస్వామ్య విలువలు (Democretic Values):

ప్రజలే స్వాములు కావడం ప్రజాస్వామ్యం కొన్ని హక్కులతో, విధులతో ఉత్తమ పౌరులు రాణించడానికి ప్రజలే తమలను తాము పాలించుకోడం. ఈ వ్యవస్థలో ప్రతి ఒక్కరికీ సంపూ స్వేచ్ఛ ఉంటుంది. అయితే స్వేచ్ఛ ఉంది గదాయని ఒక్కొక్కరు ఒక్కొక్క పంథాలో నడిస్తే సమాజం పని శూన్యమౌతుంది. అందుకోసం వ్యక్తుల మధ్య సమన్వయ భావాన్ని, పరస్ప అవగాహనను, విశాల దృక్పథాన్ని రేకెత్తించక తప్పదు. అందుకు నిజంగా ఉపయోగ పడేది మాతృభాషయే. ఆ విధంగా మాతృ భాష ప్రజాస్వామ్య విలువలను పరిరక్షిస్తున్న/కారాణాన ఇవి కూడా దాని బోధనా విలువలుగా రాణిస్తున్నాయి.

### 8. వృత్తి విలువలు :-(Vocational Values)

ఇంచు మించు ప్రతి వ్యక్తీ విద్యనార్జించడంలో జ్ఞానాన్ని పొందడం, తద్వారా జీవనో పాధిని పెంపొందించుకోడం, అందుకోసం ఏదో ఒకత వృత్తిని ఆశ్రయించడం, ఆతరువాత దానిలోనే రాణించడం అనే వానిని ధ్యేయాలుగా పెట్టుకొంటాడు. ఇట్టి ఈ ధ్యేయాల సాధనకు మాతృభాష, అందులోని నైపుణ్యాలు అత్యధికంగా దోహదపడతాయి. ఈ విధంగా మాతృభాష వృత్తి విలువలను మెరుగు పరుస్తున్న కారణాన ఇవి కూడ దాని బోధనా విలువలయ్యాయి.

### 9.రసానుభూతి :(Aesthetic Value):

సాధారణంగా సాహిత్యమంతా రసమయంగా ఉంటుంది. ఆనందోపేతమైన రస జీవితాన్ని ప్రజలకు పంచిపెట్టడమే సాహిత్య లక్ష్యం. పంచేంద్రియాలను పరవసింపచేసే మహానందాన్ని కావ్యం అందిస్తుంది. వెయ్యేళ్ళ తపఃఫలంగా లభించే బ్రహ్మానందాన్ని కావ్యం రసమూలంగా అతి సునాయాసంగా ఇస్తుంది. ఆనందమెలా ఉంటుందో, దాని నేలా అనుభవించాలో కావ్యం నేర్పుతుంది. ఇట్టి ఈ సాహిత్యం మాతృభాషలోనే అధికంగా ఉంటున్న కారణాన మాతృభాష బోధనా విలువల్లో ఇదొకటైనది.

## పాఠ్యప్రణాళికలో మాతృ భాషా స్థానం

ఒకనాటి భారతీయ విద్యా విధానంలో మాతృభాష మకుటంలేని మహారాణిగా రాణించినది. అనుషంగికంగా సంస్కృత భాషాభ్యసనాన్ని చేయించేవారు. బోధనా భాషగా మాతృభాష మాత్రమే ఉండేది. ఇదే పద్ధతి మొన్న మొన్నటి దాకా కొనసాగినది. నిన్న మొన్నటి రోజుల్లో

భారతదేశంలోకి ఆంగ్లేయులు ప్రవేశించడం, క్రమంగా భారతదేశం పెగుత్తాధిపత్యాన్ని పొందడం, ఆ తరువాత భారతదేశాన్నంతటినీ తమ పలుకుబడిలోకి తెచ్చుకోవడం, వెంటనే సనాతన విద్యావిధానాన్ని ఛిన్నాభిన్నం చేసి దాని స్థానంలో నూతన విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం మొదలైనవన్నీ జరిగిపోయాయి. ఈ నూతన విద్యా విధానంలో వారు తమ మాతృ భాషయైన ఆంగ్లానికి అత్యధిక ప్రాధాన్యాన్ని ఇచ్చారు.

పాఠ్య ప్రణాళికలో ఆంగ్లానికి వారు ప్రథమ స్థానాన్ని ఇచ్చారు. విధి లేక మొదటి మూడు తరగతుల్లో మాతృభాషను మాత్రమే బోధించేవారు. అంతే కాక ప్రాథమిక దశ వరకు బోధనా భాషగా మాతృభాషను మాత్రమే ఉపయోగించేవారు. నాలుగో తరగతి నుంచి ఆంగ్లాన్ని బోధించడం మొదలు పెట్టారు. ఇలా నాలుగో తరగతిలో మొదలు పెట్టబడిన ఆంగ్ల భాష ఆపై తరగతున్నింటిలో ఖచ్చితమై నిర్బంధ ప్రథమ భాషగా స్థిరపడి పోయినది. ద్వితీయ భాషగా మాతృభాష ఉండేది. అయితే ఇది ఖచ్చితం కాదు. అవసరమనుకొంటే దీనికి ప్రత్యామ్నాయంగా మరో దేశీయ భాషను నేర్చుకోవచ్చు. అంతేకాక మధ్యమ దశారంభం నుంచి ఉన్నత దశాంతం వరకు భాషేతరాంశాలను బోధించడానికి ఆంగ్లభాషనే ఉపయోగించారు. కళాశాల, విశ్వ విద్యాలయ దశల్లో ఆంగ్లానికి, భాషేతరాంశాలకే ప్రాధాన్యముండేది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేంతవరకూ ఇదే విధానం కొనసాగినది.

అయితే పాఠ్యాంశాల నన్నింటినీ బోధించటానికి ఉత్తమ ఏకైక సాధనం నిజంగా కేవలం మాతృభాషయేననీ, అందుచేత దానికి ప్రథమ స్థానాన్ని ఇవ్వాలని ముక్త కంఠంగా చెబుతున్న విద్యావేత్తల మాటలను, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన నాయకులు కొందరు గమనించారు. ఫలితంగా పాఠ్య ప్రణాళికలో కొంచెం మార్పును కూడా తెచ్చారు. అదే మంటే మాతృభాషకు ప్రథమ స్థానాన్ని , ప్రభుత్వ వ్యవహారానికి ఉపయోగపడుతున్న ఆంగ్లానికి ద్వితీయ స్థానాన్ని జాతీయ భాషయైన హిందీకి తృతీయ స్థానాన్ని ఇవ్వడం జరిగినది.

దేశ స్వాతంత్ర్యం తరువాత భారత దేశంలో తలెత్తిన మరో ఉద్యమం భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం. దీని ఫలితంగా 1953 నాటికి అనేక భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఆ తరువాత ఆయా రాష్ట్రాల మాతృభాషలే ఆయా రాష్ట్రాల అధికార భాషలుగా స్థానాన్ని పొందాయి. అంతే కాక అంతవరకూ పాఠశాల దశవరకే బోధనా మాధ్యమంగా పరిమితమై ఉన్నట్టి మాతృభాష క్రమంగా కళాశాల, విశ్వవిద్యాలయ దశ వరకూ బోధనా మాధ్యమంగా ఎదిగినది.

పై విధంగా మాతృభాష పాఠశాలలో విద్యార్థి ప్రవేశించి నప్పటి నుండి విద్యాభ్యాసాన్నంతటినీ ముగించుకొనేంత వరకూ బోదించ వలసిన నిర్బంధమైన ప్రథమ భాషగా స్థిరపడటమే కాక, భాషేతరాంశాలనన్నింటినీ బోధించటానికి ఉపయుక్తమైన బోధనా మాధ్యమంగా ఉంటూ పాఠ్య ప్రణాళికలో ప్రథమ స్థానాన్ని పొందుతున్నది.

## బోధనా మాధ్యంగా మాతృభాష

పాఠ్యాంశ బోధనకు, బోధితాంశ గ్రహణకు మధ్య వాహికయే బోధనా మాధ్యమం (Medium of Instruction). అనగా ఉపాధ్యాయుడు ఏదైనా అంశాన్ని బోధించడంలో, బోధించబడిన

అంశాన్ని విద్యార్థి గ్రహించడంలో ఇరువురికీ పరస్పరం ఉపయుక్తమయ్యేదే బోధనా మాధ్యమం. దీనినే 'బోధనా భాష' అని కూడా పిలుస్తారు. వైద్య వ్యవస్థలో వైద్యునికి, రోగికి మధ్య 'చిరంజికి' (Insturment to inject) ఎంతటి ప్రాధాన్యమున్నదో విద్యా వ్యవస్థలో ఉపాధ్యాయునికి విద్యార్థికి మధ్య బోధనా భాషకు అంతటి ప్రాధాన్యమున్నది. చిరంజి సరిగా పనిచేయక పోతే వైద్య వ్యవస్థ ఎలా ఛిన్నా భిన్నమౌతుందో బోధనా భాష సరిగా లేకపోతే విద్యా వ్యవస్థ కూడా అలాగే ఛిన్నా భిన్న మౌతుంది. ఇలా విద్యా వ్యవస్థలో ఇంతటి ప్రాధాన్యాన్ని పొందిన బోధనా భాష మాతృ భాషగా (తెలుగు) ఉండాలా? లేక పరభాషగా (ఆంగ్లం) ఉండాలా? అనేది ప్రశ్నార్థకంగా తయారైనది. దీనికి సమాధానంగా కొందరు పరభాషను (ఆంగ్లాన్ని) ఆమోదించారు. కాని బోధనా భాషగా పరభాషలో (ఆంగ్లంలో) క్రింది లోపాలున్నాయి.

1. పరభాషయైన ఆంగ్లంలో సర్వసమగ్రులైన ఉపాధ్యాయులు దొరకడం కష్టం.
2. ఆంగ్లంలో ఎంతటి సమగ్రులైనప్పటికీ అన్ని విషయాలను అర్థమయ్యే రీతిలో బోధించడం ఇంకా కష్టం.
3. ఉపాధ్యాయులు ఆంగ్లంలో ఎంతగా బోధించిప్పటికీ విద్యార్థులకు అర్థం కావడం చాలా కష్టం.
4. అర్థం కాక పోవడంతో విద్యార్థి ఆంగ్లాన్ని కంఠస్థం చేయవలసి ఉంటుంది. దానితో అతనిలో సృజనాత్మకత లోపించే ప్రమాదమున్నది.
5. అర్థమైన దానిని వ్యక్తీకరించాలన్నా కూడా విద్యార్థులకు కష్టమే.
6. ఆంగ్ల భాష ప్రాధాన్యాన్ని సంతరించుకొంటే మాతృభాష అడుగంటి పోతుంది.
7. మాతృభాష అడుగంటినపుడు దాని వలన లభించే ప్రయోజనాలన్నీ శూన్యమౌతాయి. మొదలైనవి దీని లోపాలు.

పై లోపాలున్నాయి కాబట్టే అనేక మంది మాతృభాషనే బోధనా భాషగా ఆమోదించారు. క్రింది మాతృభాష లాభాలే అందుకు కారణం.

1. మాతృభాషలో చక్కగా బోధించే ఉపాధ్యాయులు అనేకులున్నారు.
2. అన్ని విషయాలను అర్థమయ్యే రీతిలో మాతృభాషలో బోధించడం సులభం.
3. మాతృ భాషలో బోధింపబడిన దానిని విద్యార్థులు సులభంగా అర్థం చేసుకొంటారు
4. కంఠస్థం చేయవలసిన అవసరం లేదు. ఫలితంగా సృజనాత్మకత పెంపొందుతుంది.
5. అర్థమైన దానిని విద్యార్థులు యథేచ్ఛగా వ్యక్తీకరిచగలరు.
6. మాతృభాష ప్రాధాన్యాన్ని సంతరిచుకొంటుంది.
7. మాతృ భాష వలన వివేచనా శక్తి, తార్కికశక్తి పెరుగుతుంది.

8. దీని వలన విమర్శనా శక్తి, పరిశోధనా తత్వం మొ.. వన్నీ వృద్ధి చెందుతాయి
9. మాతృభాషకు ప్రాధాన్యం లభించడంతో దానివలన లభించే ప్రయోజనాలన్ని సమకూరుతాయి.
10. మాతృ భాష వలన సంస్కృతి అభివృద్ధి చెందుతుంది.
11. రసానుభూతి కలుగుతుంది.
12. సామాజిక-సాంస్కృతిక-సౌందర్యాది విలువలన్నింటినీ పొంది సమాచారాన్ని ముందుకు నడిపించుకోటానికి వీలౌతుంది.

పై లాభాలున్నాయి కాబట్టే బోధనా భాషగా మాతృ భాషను అనేక మంది అనేక విధాలుగా ఆకాంక్షించారు. "తల్లిపాలకు, దాది పాలకు ఎంత తేడా ఉంటుందో బోధనా భాషగా మాతృభాషకు - పరభాషకు అంతే తేడా ఉంటుందని " ప్రసిద్ధ పండిత - పరిశోధక - విమర్శకుడైన శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు సెలవిచ్చారు. అలాగే ప్రముఖ విద్యావేత్తలు, విద్యా విషయిక సంఘాలు బోధనా మాధ్యమంగా మాతృభాషా ప్రాధాన్యాన్ని ముక్తకంఠంతో గుర్తించడం జరిగింది. ఎంతగా గుర్తించినా స్వాతంత్ర్యానికి పూర్వం ఆంగ్లమే బోధనా భాషగా ఉండేది. స్వాతంత్ర్యానంతరం బోధనా భాషగా మాతృ భాషను పాఠశాల దశతో పాటు కళాశాల దశ వరకూ విస్తరించారు. ఇటీవలి కాలంలో విశ్వవిద్యాలయ దశ వరకు దీనిని భధనా భాషగా విస్తరింస్తున్నారు. ఇలా మాతృ భాష విద్యార్థి పాఠశాలలో అడుగు పెట్టినప్పటి నుంచి విద్యాభ్యాసాన్ని సంపూర్ణం చేసికొని బయటకు వెళ్ళేంత వరకూ బోధనా భాషగా స్థిరపడి విస్తరిస్తున్న ఈ శుభ తరుణంలో తగినన్ని పారిభాషిక పదాలు మాతృ భాషలో లేవనీ, కొన్ని సాంకేతిక పదాలను మాతృ భాషలోనికి అనువాదం చేయలేమనీ, ఒక వేళ చేసినా అవి మొదటి పదాలకన్నా ఇంకా కష్టంగా ఉంటాయనీ, అలాగే విజ్ఞానాంశాలైన వైద్యం, ఇంజనీరింగ్ మొ.. శాస్త్రాంశాలను మాతృ భాషలో బోధించలేమని, బోధించినా విద్యార్థులకు అర్థం కావనీ కొంతమంది బోధనా భాషగా మాతృభాషను సందేహిస్తున్నారు. అయితే పట్టుదల, దృఢ సంకల్పం, స్థిరాభినివేశం, అభిరుచి, ఆసక్తి మొ.. ఉన్నప్పుడు సాధించలేనిదేదీ లేదని తెలుస్తూనే ఉన్నది. అందుచేత బోధనా భాషగా మాతృ భాషపై తీక్షణమైన దృష్టిని సారిస్తే అది తప్పక సత్ఫలితాలనిస్తుందని ముక్త కంఠంతో చెప్పవచ్చు.

## మాతృ భాష బోధనా (బోధకుని) లక్ష్యాలు - స్పష్టీకరణలు.

ఎవరైనా, ఎప్పుడైనా, ఏపనినైనా చేయాలనుకొన్నపుడు అతడా పనిని ఎందుకు చేయాలనుకొంటున్నాడో, ఆ చేయడంలోని ఉద్దేశాలేమిటో ముందుగా నిర్ణయించుకోట మనేది సాధారణ విషయం. ఈ ఉద్దేశాలనే లక్ష్యాలు (Objectives) లేదా ధ్యేయాలు అంటున్నారు. ఇట్టి ఈ లక్ష్య లేదా ధ్యేయ సాధనకై అతడు చేపట్ట దలచిన కార్యక్రమ విశేషాలనే (చర్యలనే) స్పష్టీకరణలు (Specifications) అంటారు. మాతృభాషను బోధించాలను కొన్నపుడు ముందుగా బోధనలోని ముఖ్యోద్దేశాలను నిర్ణయించుకోటం, వాటితో పాటు వానిని సాధించే మార్గాలను సిద్ధపఱచుకోడం జరుగుతుంది. వీనినే మాతృ భాష బోధనా లక్ష్యాలు - స్పష్టీకరణలంటారు. మాతృభాషను

బోధించే వ్యక్తిని మాతృ భాషా బోధకుడంటారు. మాతృ భాషా బోధనా లక్ష్యాలు - స్పష్టీకరణలు ఏవైతేఉన్నవో అవేదానిని బోధించే వారి లక్ష్యాలు స్పష్టీకరణలు కూడా అవుతున్నాయి. అందుచేత మాతృ భాష బోధనా లక్ష్యాలు స్పష్టీకరణలు, మాతృభాషా బోధకుని లక్ష్యాలు స్పష్టీకరణలు రెండూ ఒకటే. ఇట్టి లక్ష్యాలు స్పష్టీకరణలు దశలవారిగా క్రింది విధంగా ఉన్నాయి.

## ప్రాథమిక దశ.(Primary Stage)

1 నుండి 5 వ తరగతి వరకు గల విద్యార్జన దశను ప్రాథమిక దశ అంటారు. ఈ దశలో భాషా నైపుణ్యాలైన 1. శ్రవణం , 2. భాషణం, 3. పఠనం, 4. లేఖనం, అనేవాని పరిజ్ఞానాన్ని బోధించడం మాతృభాషా బోధనా లక్ష్యాలు. వీనిని బోధించే మార్గాలను సిద్ధపఱచుకోడం స్పష్టీకరణలు. ఈ లక్ష్యాలు - స్పష్టీకరణలు క్రింది విధంగా ఉన్నాయి.

### 1. శ్రవణం. (Listening) :-

విద్యార్థి పాఠశాలలో అడుగుపెట్టేనాటికే ధ్వనులను వినడంలో ఎంతో కొంత అనుభవాన్ని పొంది ఉంటాడు. అయితే అతడు పుట్టి పెరిగిన వాతావరణాన్ని, తప్పుడు ఉచ్చారణను అనుసరించి శ్రవణంలో కొన్ని లోపాలను కలిగి ఉంటాడు. ఇట్టి ఈ శ్రవణ లోపాలను తొలగించడం మాతృ భాషా బోధనా (బోధకుని) లక్ష్యాలలో ఒకటి. ఈ లక్ష్య సాధనకై క్రింది స్పష్టీకరణలు ఉపయోగపడతాయి.

1. అల్ప-మహా ప్రాణాల మధ్య ఉండే భేదాన్ని వినేటట్లు చూడడం.
2. దంత్య-తాలవ్యాక్షరాలను వినేటప్పుడు వాటి మధ్య భేదాల్ని తెలియ చేయడం.
3. న ణ, థ ధ, ర ఱ, ల ళ, శ ష స ధ్వనుల మధ్య ఉండే ఉచ్చారణ బేధాన్ని వినిపించడం
4. స్ట ష్ట, శ్చ చ్ఛ ల వంటి సంయుక్తాక్షరాల ఉచ్చారణలోని తేడాను వినేటట్లు విశద పఱచడం
5. పద్య గద్య పఠన నడకల్లోని భేదాన్ని వినిపించడం.
6. వాక్యాంతంలోని విరామానిక, మధ్యలోని విరామానికి మధ్యగల తేడాను వినేటట్లు చేయడం మొదలైనవి.

### 2. భాషణం (Speaking) :-

విద్యార్థి పాఠశాలలో ప్రవేశించే నాటికి శ్రవణంలో మాదిరిగా భాషణంలో కూడ కొంత పరిజ్ఞానాన్ని పొంది ఉంటాడు. అయితే అతడు పుట్టి పెరిగిన వాతావరణాన్ని అనుసరించి ధ్వనుల ఉచ్చారణలోను, భాషణంలోను కొన్ని లోపాలను కలిగి ఉంటాడు. వీనిని సరిదిద్దడం అనేది మాతృభాష బోధనా లక్ష్యాల్లో మరోకటి ఈ లక్ష్య సాధనకు క్రింది స్పష్టీకరణలు ఉపకరిస్తాయి

1. అల్ప-ప్రాణాలు మహా ప్రాణాలు వేరుపడే విధంగా భాషింప చేయడం
2. దంత్య-తాలవ్య బేధం స్పష్టపడే విధంగా మాట్లాడించడం.
3. న ణ, థ ధ, ర ఱ, ల ళ, శ ష స వర్ణాలను ఉచ్చారణ తేడాతో పలికించడం.
4. గద్యాన్ని, పద్యాన్ని అనుకూలమైన నడకతో భాషింప చేయడం.
5. సమవేగంతో, ధారాళంగా మాట్లాడించడం.
6. భావానికి తగినట్లుగా తగిన కంఠస్వరంతో భాషింప చేయడం.
7. గంభీరంగా, ధైర్యంగా మాట్లాడింప చేయడం.
8. వినుగును హరిస్తూ ఆహ్లాదం కలిగే విధంగా భాషింప చేయడం.

**3. పఠనం (Reading) :-**

పూర్వ పరిజ్ఞాన మేమీ లేకుండా పాఠశాల ప్రవేశానంతరమే విద్యార్థి నేర్చుకొనేది పఠనం. ఈ పఠనం బాహ్యా లేద ప్రకాశ పఠనమనీ, మౌన పఠనమనీ రెండు రకాలుగా ఉంటుంది. ఇట్టి ఈ పఠనాన్ని పెంపొందింప చేయడ మనేది భాషా బోధనా లక్ష్యాల్లో మరొకటి. అందుకై క్రింది స్పష్టీకరణలను అనుసరింపవలెను.

1. ధ్వనికి, లిపికి మధ్య పరస్పర సంబంధం ఉండే విధంగా పఠింప చేయడం
2. అర్థవంతంగా, ధారాళంగా పఠింప చేయడం.
3. పఠనంలో విరామ చిహ్నాలను, ఊనికను, స్వరాన్ని పాటించేటట్లు చూడడం.
4. తగినంత స్వరంతో, సమ వేగంతో పఠించేటట్లు చూడడం.
5. గద్య పద్యాలను వాటి నడక కనుకూలంగా పఠింప చేయడం.
6. పఠనంలో వాచికాభినయానికి మాత్రమే ప్రాధాన్య ముండేటట్లు చూడడం మొ..నవి.

**4.లేఖనం.(Writing) :-**

పాఠశాలలో ప్రవేశించేంత వరకు విద్యార్థికి లేఖనంలో ఎలాంటి పరిజ్ఞానం ఉండదు. అట్టి లేఖనాన్ని పెంపొందించడం బోధనా లక్ష్యాల్లో ఇంకొకటి . ఈ లక్ష్య సాధనకు క్రింది స్పష్టీకరణలు తోడ్పడతాయి.

1. అక్షరాలు ఒకదానితో మరొకటి కలిసిపోకుండా, పదాలమధ్య కొంత వ్యవధానం ఉండే విధంగా చూడడం.
2. అక్షరాలను గుండ్రంగా, అందంగా, దోషరహితంగా వ్రాసేటట్లు చూడడం.

3. పదాలను సందర్భాను కూలంగా ప్రయోగింప చేయడం.
4. వాక్యాలను భావాను కూలంగా నిర్మింప చేయడం.
5. విషయాను కూలంగా వావ్యాలను పేరాలుగా విభజింప చేయడం.
6. జాతీయాలను, లోకోక్తులను; సామెతలను ప్రయోగింప చేయడం.
7. కథన, వర్ణన, సృజనాత్మక శక్తులను పెంపొందించే విధంగా రచనను సాగింప చేయడం
8. విమర్శనా దృక్పథాన్ని పెంపొందింప చేయడం. మొదలైనవి.

**2.మాధ్యమిక దశ (Upper - Primary Stage) :-**

విద్యా వ్యవస్థలో 6 నుండి 7 వ తరగతి వరకు గల విద్యార్జన దశను మాధ్యమిక దశ అంటారు. ఈ దశలో జ్ఞాన- అవగాహన శక్తులను పెంపొందించడం అనేవి మాతృ భాష బోధనా లక్ష్యాలు, వీని సాధనకై ఉపకరించే స్పష్టీకరణలు క్రింది విధంగా ఉంటాయి.

**1. జ్ఞానం :-**

భాషకు సంబంధించిన జ్ఞానాన్నే 'భాషా జ్ఞానం ' అంటారు. ఈ భాషా జ్ఞానం వలన అనుకోకుండానే లభించేది విషయ విజ్ఞానం. ఈ భాష -విషయ జ్ఞానాలు రెండు ఒక దానిని విడచి మరొకటి ఉండలేవు. ఇవి రెండు ఒకే నాణేనికి ఉండే బొమ్మ - బొరుసు లాంటివి. విశిష్టమైన భాషవలన లభించేది ఆనందం. ఈ ఆనందానికి సంబంధించినదే సాహిత్యం. దీనికి సంబంధించిన జ్ఞానమే 'సాహిత్య జ్ఞానం' . అందు చేత జ్ఞానమనేది భాషా జ్ఞానం. విషయ జ్ఞానం. సాహిత్య జ్ఞానం. అని మూడు రూపాల్లో ఉంటుంది.

**a. భాషాజ్ఞానం :-**

భాషాజ్ఞానాన్ని పెంపొందించటమనేది భాషా బోధనలో ఒక లక్ష్యం ఈ లక్ష్య సాధనకు క్రిందివి స్పష్టీకరణలు.

1. క్రొత్త పదాలకు అర్థాలను గ్రహింప చేయడం,వానిని స్వంత వాక్యాల్లో ప్రయోగింప చేయడం.
2. నానార్థాలను, పర్యాయ పదాలను తెలియచేయడం.
3. నానుడులను, జాతీయాలను, సామెతలను, లోకోక్తులను వివరించడం.
4. ప్రకృతి వికృతులను గ్రహింప చేయడం.
5. సంధి, సమాస పరిజ్ఞానాన్ని కలిగించడం.

6. పద్య గద్యాల మధ్య ఉండే స్పష్టమైన భేదాన్ని గ్రహింపచేయడం మొదలైనవి.

**b. విషయ పరిజ్ఞానం:-**

భాషా జ్ఞానంతో పాటు విషయ పరిజ్ఞానాన్ని కూడా అభివృద్ధి పఱచడం భాషా బోధనలో మరో లక్ష్యం. ఈ లక్ష్య సాధనకు అవసరమయ్యే స్పష్టీకరణలు ఆయా పాఠాలపై ఆధారపడి ఉంటాయి. ఉదాహరణకు 'కర్ణ దాతృత్వం ' అనే పాఠం ఉన్నపుడు కర్ణుని పరిచయం, దాతృత్వ ప్రాధాన్యం, దాతృత్వంలో కర్ణుని యొక్క విశేషం మొదలైన విషయాల గురించి తెలియ చేయడం. అలాగే 'అడవులు' అనే పాఠం ఉన్నపుడు అడవుల గురించిన పరిచయం, మానవ జీవితంలో వాని ప్రాధాన్యం మొదలైన విషయాల గురించి వివరించడం మొదలైనవి స్పష్టీకరణలు.

**c. సాహిత్య పరిజ్ఞానం:-**

సాహిత్య జ్ఞానాన్ని కలిగించడం కూడా భాషా బోధనలో ఒక లక్ష్యమే. అందుకోసం వివిధ పాఠాల ఆధారంగా వివిధ గ్రంథాలు, ఆయా గ్రంథ కర్తలు, వారి దేశ-కాల-బిరుదాదులు, ఇతర రచనలు మొదలైన వానిని గురించి తెలియచేయడం అనేవి స్పష్టీకరణలు.

**2. అవగాహన**

జ్ఞానాన్ని అభివృద్ధి పరచడంతో పాటు దానిని సులభంగా అర్థం చేసికొనే అవగాహన శక్తిని పెంపొందించటమనేది భాషా బోధనలో మరో లక్ష్యం. ఈ అవగాహన భాషావగాహన, విషయావగాహన, సాహిత్యావగాహన అని మూడు రకాలుగా ఉంటుంది.

**a. భాషావగాహన:**

సంధులను అర్థం అయ్యేటట్లు బోధించటం , వాని ఆధారంగా వివిధ పదాలను విడదీయించడం, తిరిగి కలిపింప చేయడం, అలాగే సమాసాలను బోధించడం, వివిధ పదాలను సమాసంగా కూర్పించడం, సమాస రూపాలకు అర్థమయ్యే రీతిలో విగ్రహ వాక్యాలను తయారు చేయించడం, జాతీయాలు - నుడికారాలు - సూక్తులు - నానార్థాలు - పర్యాయ పదాలు మొదలైన వానిని అర్థమయ్యే రీతిలో బోధించడం, వానిని స్వంత వాక్యాల్లో ఉపయోగింప చేయడం మొదలైనవి స్పష్టీకరణలు.

**b. విషయావగాహన:**

పాఠ్యాంశాల్లోని విషయాన్ని అవగాహనలోకి తేవడం, దానిని నిత్య జీవితంలో ప్రయోగింప చేయడం, విమర్శనా దృక్పథాన్ని పెంపొందించడం మొ..వి దీనికి సంబంధించిన స్పష్టీకరణలు

**c. సాహిత్యావగాహన:**

ఏ ఉద్దేశం కోసం గ్రంథ నిర్మాణం జరిగిందీ, అది ఎంత వరకు సఫలీకృతం అయిందీ,

భావానికి తగినట్లుగా వ్యక్తీకరణ ఉన్నదీ లేనిదీ పరిశీలింపచేయడం మొదలైనవి స్పష్టీకరణలు.

**3.ఉన్నత దశ :-**

పాఠశాల విద్యా వ్యవస్థలో 8 నుండి 10 వ తరగతి వరకు గల విద్యార్జన దశను ఉన్నత దశ అంటారు. ఈ దశలో ఆనందానుభూతిని, సాహిత్యాభిరుచిని, నైపుణ్యాన్ని, ఆసక్తి వైఖరులను పెంపొందించడం మాతృభాషా బోధనా లక్ష్యాలు. ఈ లక్ష్యాలు వాని స్పష్టీకరణలు క్రింది విధంగా ఉంటాయి.

**a.ఆనందానుభూతి:**

సాహిత్యం యొక్క పరమ ప్రయోజనాల్లో ఆనందం ఒకటి గనుక ఇట్టి ఆనందోపేతమైన సాహిత్యం సాధారణంగా మాతృభాషలోనే లభిస్తుందీ గనుక, మాతృ భాషా బోధనా లక్ష్యాల్లో ఆనందానుభూతిని కలిగించడం కూడా ఒకటి.

1. శబ్ద-అర్థ చమత్కారాల ద్వారా ఆనందాన్ని కలిగింప చేయడం.
2. వ్యంగ్య భావాన్ని వివరిస్తూ ఆనందింప చేయడం.
3. రమణీయమైన ఘట్టాలను మళ్ళీమళ్ళీ పఠింప చేయడం.
4. అత్యంత రమణీయాలైన పద్యాలను కంఠస్థం చేయించడం.
5. వివిధమైన శైలి బేధాలను గ్రహింపచేయడం.
6. ధారాశుద్ధి శోభితమైన పద్యాలనుమళ్ళీ మళ్ళీ పఠింప చేయడం మొదలైనవి.

**b.సాహిత్యాభిరుచి:**

సత్సాహిత్యాన్ని పెంపొందింప చేయడానికి ముందుగా అభిరుచిని కలిగించాలి. అందుకే సాహిత్యాభిరుచిని అభివృద్ధి పఱచటమనేది బోధనా లక్ష్యాల్లో ఒకటైనది. దీని కోసం క్రింది స్పష్టీకరణలను అనుసరించవలెను.

1. పాఠాలను పఠింప చేసే ముందు వాని వెనుకటి- ముందటి కథా సందర్భాలను తెలియ పరచడం.
2. వివిధ సాహిత్య వేత్తలను, వారి వ్యక్తిత్వాలను పరిచయం చేయడం.
3. ఒకే సాహిత్యాంశాన్ని వివిధ రచయితలు వ్యక్తీకరించిన తీరును తెలియచేయడం
4. సాహిత్య సభల-గోష్ఠుల గురించి వివరించడం.
5. రసవత్తర ఘట్టాలను వివరించడం.
6. సంస్కృతి-సంప్రదాయాలను తెలియచేయడం.

7. వివిధ పాత్రలను, వాని చిత్రీకరణ రీతులను వివరించడం.
8. అనేక గ్రంథాలను చదవాలనే ఆసక్తిని కలిగించడం, మొదలైనవి.

**3. నైపుణ్యం :-**

నిపుణత్వంతో చేసే పనిని నైపుణ్యం అంటారు. ఇట్టి నైపుణ్యం పఠన - వ్యక్తీకరణ - వినియోగ - సృజనాత్మక నైపుణ్యాలని నాలుగు రకాలుగా విభజింప బడుతున్నది. ఈ నాలుగు నైపుణ్యాలను పెంపొందింప చేయటమనేది భాషా బోధనా లక్ష్యాల్లో ఒకటి.

**a. పఠన నైపుణ్యం :-**

పఠనాన్ని పెంపొందించటమనే లక్ష్యం, దాని స్పష్టీకరణలు ప్రాథమిక దశలో ఉన్నప్పటికీ, పఠనాన్ని నైపుణ్యంగా చేయించటమనేది ఇక్కడ లక్ష్యం . ఈ లక్ష్య సాధనకు క్రింది స్పష్టీకరణలు ఉపయోగపడతాయి.

1. భావ, భాషా దోషాలు లేకుండాపఠింప చేయడం.
2. సభాకంపం లేకుండా ధైర్యంగా, ధారాళంగా చదివింప చేయడం.
3. భావానుగుణమైన వాచికాభినయంతో పఠింప చేయడం.
4. పఠనంలో స్వీయ శైలిని పెంపొందించడం, మొదలైనవి.

**b.వ్యక్తీకరణ నైపుణ్యం :-**

భావాన్ని అందంగా, ఆహ్లాదంగా వ్యక్తీకరింప చేయటమనేది ఇక్కడి లక్ష్యం. ఈ వ్యక్తీకరణ వాగ్రూపమనీ, లిఖిత రూపమనీ రెండు రకాలు. ఇందు కోసం స్పష్టీకరణలు క్రింది విధంగా ఉన్నాయి

1. స్పష్టంగా, నిర్దుష్టంగా వ్యక్తీకరింప చేయడం / రాయింప చేయడం.
2. భావ, భాషా దోషాలు లేకుండా వ్యక్తీకరింప చేయడం / రాయింపచేయడం.
3. సమవేగంతో, ధారాళంగా వ్యక్తీకరింపచేయుట / రాయింప చేయుటం
4. జాతీయాలతో, పలుకుబడులతో, సామెతలతో వ్యక్తీకరింప చేయడం/రాయింప చేయడం
5. సందర్భాను కూలంగా విషయాన్ని విపులీకరిస్తూ, సంక్షిప్తీకరిస్తూ వ్యక్తీకరించడం. / రాయింపచేయడం.
6. ఆకర్షణీయమైన శైలిలో వ్యక్తీకరింపచేయడం. / రాయింపచేయడం, మొదలైనవి.

**c. వినియోగ నైపుణ్యం:-**

భాష - విషయ - సాహిత్యపరమైన జ్ఞానాన్ని పొందిన తరువాత దానిని తగిన రీతిలో

నిపుణంగా వినియోగించటమే దీని లక్ష్యం. అందుకై క్రింది స్పష్టీకరణలను అనుసరించవలెను

1. భాషాజ్ఞానానికి సంబంధించిన పదాలను, అర్థాలను; సంధి, సమాసాలను, జాతీయాలను స్వంత వాక్యాల్లో ప్రయోగింప చేయడం, క్రొత్త పదాలను, సమాసాదులను సృష్టింప చేయడం.
2. విషయ జ్ఞానానికి సంబంధించిన అంశాలను నిత్య జీవన వ్యవహారంలో సంధర్భాను కూలంగా వినియోగింప చేయడం.
3. సాహిత్య జ్ఞానానికి సంబంధించి మనసును ఉవ్విళ్ళూరించే మంచి మంచి పద్యాలను, గేయాలను సందర్భాన్ని బట్టి అవసరానుకూలంగా వినియోగింప చేయడం వీలైతే వాని మాదిరిగానే క్రొత్త పద్యాల్ని , గేయాల్ని రచింప చేయడం మొదలైనవి.

**d. సృజనాత్మకనైపుణ్యం :-**

వ్యక్తికి ప్రాణమెంత ముఖ్యమో విద్యకు సృజన అంత ముఖ్యం. భాషా విషయంలో దీనికి మరీ ప్రాధాన్య మెక్కువ. ఇట్టి సృజనాత్మకతను పెంపొందించడం అనేది ఒక లక్ష్యం. అందుకు క్రింది స్పష్టీకరణలు అవసరమౌతాయి.

1. క్రొత్త శీర్షికలను నిర్ణయింప చేయడం.
2. అసంపూర్ణ రచనలను పూరింప చేయడం.
3. సామెతల ఆధారంగా కథలను నిర్మింప చేయడం.
4. కవితలు, నాటికలు మొదలైన వానిని రచింపచేయడం.
5. ఏదైనా అంశాన్ని సద్విమర్శ చేయించడం.
6. స్వీయ భావంతో అంశాన్ని పరిశీలించచేయడం మొదలైనవి.

**4. ఆసక్తి :-**

భాషా - సాహిత్యాంశాలపై ఆసక్తిని పెంపొందించడం. క్రింది స్పష్టీకరణలు అందుకు దోహద పడతాయి.

1. పాఠ్యాంశాల మూల గ్రంథాలను చదవాలనే ఆసక్తిని పెంచడం.
2. ఉత్తమ పద్య గద్య భాగాలను ధారణ చేయించడం.
3. సారస్వత సంఘాదులను నిర్వహింప చేయడం.
4. అత్యంత తర్కబద్ధమైన వ్యాకరణంపై దృష్టిని మరలింప చేయడం.
5. ఛంధస్సు ఆధారంగా పద్య రచనపై ఆసక్తిని పెంచడం మొదలైనవి.

**5. వైఖరి :-**

వివిధ పాఠ్యాంశాల ఆధారంగా తగిన మనోవైఖరిని ఏర్పరచడం. దీనికి క్రింది స్పష్టీకరణలు ఉపయుక్త మౌతాయి.

1. గ్రహించిన పాఠ్యాంశాల ఆధారంగా సత్ప్రవర్తనను పెంపొందింప చేయుట.
2. సాహిత్యకారులపై గౌరవ భావాన్ని రేకెత్తింప చేయుట.
3. మాతృ భాషతో పాటు ఇతర భాషలపై కూడ ఆదరాన్ని పెంపొందింప చేయుట.
4. సామాజిక చైతన్యంపై దృక్పథాన్ని పెంపొందించుట.
5. మూఢాచారాలను ఖండింప చేయుట..
6. జాతి పట్ల ప్రేమను, ఆర్ద్రతా గుణాన్ని ఆలోచనను అభివృద్ధి పఱచుట మొదలైనవి

## *మాతృభాషా బోధకుని లక్షణాలు*

"గురు బ్రహ్మ గురుర్విష్ణుః

గురుదేవో మహేశ్వరః

గురు సాక్షాత్పర బ్రహ్మ

తస్మై శ్రీ గురవేనమః"

త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల అపర రూపమే గురువని, అతడే పరబ్రహ్మ స్వరూపమనీ భారతీయ వాఙ్మయం గురు ప్రామాణికతను, ప్రాధాన్యతను, పవిత్రతను స్థిర పఱచినది.

"మాతృ దేవో భవ

పితృ దేవో భవ

గురుదేవో భవ"

తల్లి - తండ్రి తరువాత గురువేనని నిత్య జీవన వ్యవహారం కూడ గురు స్థానాన్ని నిర్ణయించినది. తల్లి దండ్రులు ఓ మాంసపు ముద్దను ఈ ప్రపంచానికి పరిచయం చేస్తే దానికి జ్ఞాన జ్యోతిని పరిచయం చేసే వాడు గురువేనని స్పష్టమౌతూనే ఉన్నది. ఇట్టి ఈ గురువు సమాజంలోని మామూలు వ్యక్తుల మాదిరిగా కాక కొన్ని విశిష్టమైన అధిక లక్షణాలతో సమాజ ప్రతి నిధిగా రాణిస్తాడు. కాబట్టే పై విధంగా అతనిని కొనియాడ వలసి వచ్చినది. ఇటీవలి కాలంలో పాఠశాల దశ వరకూ కనిపించే ఈ గురువులనే ఉపాధ్యాయులుగా భావిస్తున్నాం. ఈ ఉపాధ్యాయుల్లో కేవలం మాతృ భాషను బోధించే వానిని మాతృ భాషా బోధనోపాధ్యాయునిగా పిలుస్తున్నాం. ఇతడు అన్ని విధాలుగా ఉపాధ్యాయుని లక్షణాలను పుణికి పుచ్చుకోటమే కాక వారికి లేని కొన్ని లక్షణాలను కూడా కలిగి ఉంటాడు. అపుడే అతడు మిగిలిన వారి కంటే ప్రత్యేకంగా కొనియాడబడతాడు. ఇట్టి ఈ మాతృ భాషా బోధనోపాధ్యాయుడు అందరిలాగా కలిగి ఉండే

సాధారణ లక్షణాలు క్రింది విధంగా ఉన్నాయి

**1. వృత్తి గౌరవం :-**

సహజంగా వివిధ వృత్తుల్లో ఉండేవారు తమ తమ వృత్తుల పట్ల గౌరవాన్ని పెంపొందిచుకొంటారు. తమ వృత్తులపై తమకే గౌరవం లేనినాడు ఇతరులు వానిని గౌరవించడం అనేది అసలు జరిగే పనికాదు. పైగా చేస్తున్న వృత్తిపై సంపూర్ణ విశ్వాసం, గౌరవం లేనపుడు అసంతృప్తి, విసుగుదల ఏర్పడి యాంత్రికమై పోతుంది. అట్టిస్థితిలో అతడా వృత్తిలో రాణించటం కష్టం. ముఖ్యంగా ఉపాధ్యాయ వృత్తిలో ఈ వృత్తి గౌరవానికి అత్యధిక ప్రాధాన్యమున్నది. ఒకప్పుడు 'బ్రతక లేక బడి పంతులు 'అనే న్యూన భావం వ్యవహారంలో స్థిరంగా ఉండేది. ఈ నాటికి కూడా అది ఏదో ఒక రూపంలో కనిపిస్తూనే ఉన్నది. ఇట్టి స్థితిలో తనను తానైనా ఉపాధ్యాయుడు గౌరవించుకోకపోతే అతడా వృత్తికి న్యాయం చేకూర్చలేడు. ఆశించిన ఫలితాలను అందించలేడు

**2. నిష్ణాతుత్వం :-**

ఉపాధ్యాయుడు తాను బోధించే అంశంలో ఖచ్చితంగా నిష్ణాతుడై ఉండవలెను. అట్లు కానపుడు అతనికి నష్టం రావడం అటుంచి మొత్తం సమాజమే నష్టపోవలసి వస్తుంది. ఎట్లంటే ఒక ఇంజనీర్ నిష్ణాతుడు కాక పోతే కొన్ని భవనాలే కూలి పోతాయి. అల్లాగే ఒక డాక్టర్ నిష్ణాతుడు కానపుడు కొన్ని ప్రాణాలే బలైపోతాయి. కాని ఒక ఉపాధ్యాయుడు నిష్ణాతుడు కాకపోతే ఇంజనీర్లు, డాక్టర్లు, న్యాయవేత్తలు, తత్వవేత్తలు, రాజకీయ వేత్తలు, సామాజిక వేత్తలు, శాస్త్రవేత్తలు మొదలైన ఎందరో వ్యక్తులు నాశనమై మొత్తం సమాజమే సర్వనాశనమౌతుంది.

**3. బోధనా సామర్థ్యం :-**

ఉపాధ్యాయునికి తాను బోధించే అంశంలో నిష్ణాతుత్వం ఎంత అవసరమో దానిని విద్యార్థికి అందించే బోధనా సామర్థ్యం కూడ అంతే అవసరం. ఖచ్చితంగా చెప్పవలసి వస్తే బోధనా సామర్థ్యానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుంది. వైద్యునికి - రోగికి మధ్య ఇంజెక్షన్‌కు ఎంతటి ప్రాధాన్యమున్నదో ఉపాధ్యాయునికి, విద్యార్థికి మధ్య బోధనా సామర్థ్యానికి అంతటి ప్రాధాన్యమున్నది. తన కర్థమయ్యే రీతిలో ఉపాధ్యాయుడెలా బోధిస్తూన్నాడనేది విద్యార్థికి ముఖ్యంకాని అతని మహాపాండిత్యం కాదు. సౌందర్యవాసన తెలియని వానికి వజ్రమెలా నిరుపయోగమౌతుందో బోధనా సామర్థ్యం లేని వానికి మహా పాండిత్యం అలా నిరుపయోగమౌతుంది.

**4. సమయస్ఫూర్తి :-**

ఉపాధ్యాయునికి కావలినంత నిష్ణాతత్వం, బోధనా సామర్థ్యం ఉన్నప్పటికీ బోధనలో అప్పుడపుడు కొన్ని సమస్యలు ఖచ్చితంగా ఎదురౌతుంటాయి. వానిని సమర్థవంతంగా ఎదుర్కోనటానికి ఉపాధ్యాయునికి తప్పకుండా సమయస్ఫూర్తి అవసరమౌతుంది. ఎంత అందంగా

ఉన్నా, ఎంతటి పరిమళాన్ని వెదజల్లుతున్నా, తుమ్మెదను ఆకర్షించలేని పువ్వెంత నిరుపయోగమౌతుందో సమయస్ఫూర్తి కొఱవడిన ఉపాధ్యాయుడు కూడా అంతే.

**5. నిష్పాక్షికత్వం :-**

ఉపాధ్యాయుడు నిజంగా నిష్పక్షపాతుడై ఉండవలెను. బోధనలోను, ముఖ్యంగా ఉత్తీర్ణతా విషయంలోను, యోగ్యతా యోగ్యతలను నిర్ణయించడంలోను, స్థానాలను (Divisions) నిర్దేశించడంలోను ఈ నిష్పాక్షికతను పాటించవలెను.

**6. సత్ప్రవర్తన :-**

ఉపాధ్యాయుడు ఖచ్చితంగా సత్ప్రవర్తనాపరుడై ఉండవలెను. సత్ప్రవర్తన లేని విద్యావంతుడు ఒంటి మీద బట్టలు లేని ఆదిమ మానవునితో సమానం. కత్తి మీద సాములాగ ఇది కష్టతరమైనదే అయినప్పటికి ఉపాధ్యాయుడు దీనిని ఖచ్చితంగా పాటించవలెను. వాసనలేని పువ్వెలా రాణించదో సత్ప్రవర్తన లేని ఉపాధ్యాయుడలా రాణించడు.

**7. సహనం :-**

ఉపాధ్యాయునికి సహనమనేది కవచకుండలంలాగా ఉండవలెను. తరగతి గదిలోని విద్యార్థులంతా విభిన్న ప్రాంతాలకు, వర్గాలకు, మనస్తత్వాలకు చెందిన వారుగా ఉంటారు. వారందరినీ ఒకే చోట కూర్చో బెట్టి సమంగా బోధించటానికి ఉపాధ్యాయునికి ఈ సహనగుణం ఖచ్చితంగా ఉపయోగపడుతుంది. అలాగే బాహ్య జీవితంలో కూడా ఉపాధ్యాయునికి ఇది ఎంతగానో ఉపకరిస్తుంది. సహనంలేని ఉపాధ్యాయుడు శోభలేని ముత్యంతో సమానం.

**8. గంభీరత :-**

ఉపాధ్యాయుడు గంభీరుడుగా ఉండవలెను. గంభీరత్వం లేకపోతే విద్యార్థులు ఉపాధ్యాయుని మాటను పెడచెవిన పెట్టే ప్రమాదమున్నది. ముఖ్యంగా క్రమశిక్షణను పెంపొందించే విషయంలో ఉపాధ్యాయునికిది అత్యవసర మౌతున్నది. అయితే ఈ గంభీరత్వం అవసరాన్ని బట్టి తగు మాత్రంగా ఉండవలెను.

**9. నిరహంకారత్వం:-**

ముఖ్యంగా ఉపాధ్యాయుడు నిరహంకారుడై ఉండవలెను. సహజంగానే ఉపాధ్యాయునికి పాఠశాలలోను, బయటి సమాజంలోను అత్యధిక గౌరవం లభిస్తుంది. దానిని కాపాడుకోటానికతడు నిరహంకారుడై ఉండాలే తప్ప అహంకారుడైతే ఉపాధ్యాయ కత్వానికే మచ్చ తెచ్చిని వాడౌతాడు

**10. వస్త్ర ధారణ :-**

సమాజంలో ఉపాధ్యాయునికి అత్యధిక గౌరవం ఉంటున్న కారణంగా అందరూ అతనినే అనుసరించటానికి సహజంగా ప్రయత్నిస్తారు. అట్టిస్థితిలో ఉపాధ్యాయుడు ఆదర్శవంతంగా మెలగ వలసి వస్తుంది. ఇట్టి ఆదర్శవంతమైన జీవనంలో వస్త్రధారణ ఒకటి. సాధారణంగా అతడు ధరించే దుస్తులు వాతావరణ పరిస్థితులకు తట్టుకొనే విధంగాను, సంస్కృతి - సంప్రదాయాలను పెంపొందిచే విధంగాను, నిండుదనాన్ని -గౌరవాన్ని- గంభీరతను - పవిత్రతను కాపాడే విధంగాను ఉండవలెను.

మాతృ భాషా బోధకుడు మాత్రమే కలిగి ఉండే ప్రత్యేకమైన లక్షణాలు క్రింది విధంగా ఉన్నాయి.

**11. పరభాషా జ్ఞానం :-**

సాధారణంగా మాతృభాషా బోధకుడు ఆభాషలోనే కాకుండా దానితో దగ్గర సంబంధాన్ని కలిగి ఉండే ఇతర భాషలలో కూడ జ్ఞానాన్ని పొంది ఉండవలెను. మాతృ భాషయైన తెలుగు తమిళ, మలయాళ, కన్నడాది ద్రావిడ భాషలతోను, సంస్కృతంతోను అత్యంత దగ్గరి సంబంధాన్ని కలిగి ఉన్నది. అలాగే ఇటీవలి కాలంలో పాశ్చాత్య భాషలైన ఆంగ్లం, ఫ్రెంచి, పోర్చుగీసు, మొదలైన భాషా పదాలు తెలుగులో సహజంగా కలిసిపోయి ఉన్నాయి. ఇట్టి స్థితిలో ఆయా భాషల పరిజ్ఞానమున్నపుడు మాత్రమే తెలుగును అత్యంత సహజంగా బోధించటానికి వీలౌతుంది

**12. చక్కటి ఉచ్చారణ :-**

శరీరానికి ప్రాణమెంతో శబ్దానికి ఉచ్చారణ అంత. వేదాలు ఈ నాటికి చక్కటి ఉచ్చారణవలననే బ్రతుకు తున్నాయి. చక్కటి ఉచ్చారణ వలన భాష అందంగా, ఆహ్లాదంగా ఉంటూ శ్రోతలను అత్యధికంగా ఆకర్షిస్తుంది.

**13. వక్తృత్వం :-**

విభిన్న ప్రాంతాలకు, మనస్తత్వాలకు, అభిరుచులకు చెందిన కొన్ని వేలమంది వ్యక్తులను ఒకే చోట ఒకేసారి అతి తక్కువ కాలంలో మంత్రముగ్ధులుగా చేసి విశేషంగా ఆకర్షించే ఏకైక సాధనం వక్తృత్వం. ఇట్టి వక్తృత్వాన్ని విద్యార్థుల్లో పెంపొందించవలసిన బాధ్యత మాతృభాషా బోధకునిదే. అందుచేత అతడు మంచి వక్తయై ఉండవలెను. శరీరాన్ని ఆభరణం అలంకరించనట్లే మాతృ భాషా బోధకుణ్ణి వక్తృత్వం అలంకరిస్తుంది.

**14. సృజనాత్మ కత :-**

సృజనను వెలికి తీయడ మనేది విద్యాలక్ష్యాల్లో ఒకటి. ఇట్టి సృజనను వెలికి తీయడంలో మాతృ భాషకు అత్యధిక ప్రాదాన్యమున్నది. అందుచేత మాతృభాషా బోధకుడు ఖచ్చితంగా

సృజనాత్మకతను కలిగి ఉండవలెను. పద్యాలు, నాటికలు, కవితలు, కథ, కథానికి, మొదలైన వానిని కళాత్మకంగా విమర్శించడం, వానిని క్రొత్తగా సృజించడం మొదలైన వానిని మాతృ భాషాబోధకుడు చేయవలెను.

**15. సాహిత్యలోకజ్ఞత :-**

సాహిత్య స్వరూప, స్వభావాలను, వివిధ సాహిత్య ప్రక్రియలను, కవితా ధోరణులను, సాహిత్యాంశాలైన రసం, ధ్వని, వక్రోక్తి, అలంకారం, గుణం, చమత్కారం మొదలైన వానిలో మాతృ భాషా బోధకుడు చక్కటి ప్రావీణ్యాన్ని కలిగి ఉండవలెను.

**16. సంస్కృతి పరిరక్షణ :-**

అతి సాధారణంగా ఒక జాతి సంస్కృతి సంప్రదాయాలు, ఆచార-వ్యవహారాదులన్నీ ఆ జాతి మాతృ భాషలోనే ప్రతి బింబిస్తాయి. అట్టి మాతృ భాషను ఆపోశనం పట్టి జాతి యొక్క సంస్కృతి పరిరక్షణా బద్ధ కంకణుడై ఆ జాతికి భాషా బోధకుడు ప్రతినిధిగా నిలువవలెను.

## త్రిభాషా సూత్రం - ప్రాధాన్యం.

ఆధునికి కాలంలో పాఠశాలలో బోధింపబడే అంశాలు స్థూలంగా భాషలని, భాషేతరాంశాలని రెండు రకాలు. ఇందులో భాషల విషయంలో ఎన్నింటిని బోధించాలనేది సమస్యగా తయారైనది. అనేక భాషలను విద్యార్థికి పరిచయం చేసి వదలి పెట్టే బదులు సాధారణ నిత్య వ్యవహారంలో అత్యధికంగా ఉపయోగపడుతూ, పరభాషలను నేర్చుకోటానికి కూడ మూలమైనట్టి భాషనొక దానినీ, జాతీయ - అంతర్జాతీయ అవగాహనకు ఉపయుక్తమయ్యే భాషను మరొకదానినీ సమగ్రంగా బోధిస్తే చాలనే అభిప్రాయానికి దాదాపు అందరూ వచ్చారు. దీనితో రెండు భాషలను బోధించాలనుకొన్నారు. ఈ రెండింటిలో మొదటి దానిని అందరూ ఒప్పుకొన్నారు. ఇంక రెండో భాషగా కొంతమంది హిందీని సూచిస్తే మరికొంతమంది ఇంగ్లీషును సూచించారు. ఇదే స్థితిలో భారతదేశాన్ని శాసిస్తున్న ఆంగ్ల ప్రభుత్వం మాతృ భాషను, 1నుండి 3 వ తరగతి వరకు ప్రథమ భాషగాను, 1 నుంచి 5 వ తరగతి వరకు బోధనా భాషగాను, 4 వ తరగతి నుంచి ఇంగ్లీషును ప్రథమ భాషగాను, మాతృభాషలేదా మరేయితర భారతీయ భాషను ద్వితీయ భాషగాను, 6 వ తరగతి నుంచి ఆంగ్లాన్ని బోధనా భాషగాను నిర్దేశించారు. దీనినే "ద్విభాషా సూత్రము" ని పిలిచారు. పాఠశాల్లో ఇదే స్థితి 1937 వరకు కొనసాగినది.

1937 లో అనేకరాష్ట్రాల్లో కాంగ్రెస్ పార్టీ అధికారం లోకి రావడంతో హిందీపై మక్కువెక్కువై భవిష్యత్తులో దానిని అధికార భాషగా చేయాలనే తలంపుతో పాఠశాలల్లో తృతీయ భాషగా హిందీని ప్రవేశ పెట్టారు. దీనితో ఉత్తర భారతదేశంలో మాతృ భాషగా హిందీ, నిర్బంధ భాషగా ఆంగ్లం అనే రెండు భాషలు మాత్రమే బోధింప బడేవి. కాని దక్షిణ భారతదేశంలో మాతృ భాషగా ప్రాంతీయ భాష,ప్రథమ భాషగా ఆంగ్లం, తృతీయ భాషగా హిందీ అనే మూడు భాషలు బోధింప బడేవి. అయితే ఉత్తీర్ణతా విషయంలో హిందీ మార్కులను గణించే వారు కాదు. ఏది ఏమైనప్పటకి

దక్షిణ భారత దేశ విద్యార్థుల్లో కొంత అసంతృప్తి బయలు దేరినది.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక హిందీని రాజ భాషగా చేయాలని కొందరు ముఖ్యంగా ఉత్తర భారతీయులు పట్టు పట్టారు. కొందరు మాత్రం వ్యతిరేకించారు. రాజ్యాంగ పరిషత్తులో ఇరు వర్గీయులకు ఓటింగును జరిపినపుడు హిందీని రాజ భాషగా చేయాలనే వారు (ఒక్క ఓటు తేడాతో) నెగ్గడంతో 1965 లో ఇంగ్లీషు స్థానంలో హిందీని రాజ భాషగా తీర్మానించారు. అంతే కాక ఉత్తర భారతదేశంలో మాతృ భాషగాను, తృతీయ భాషగాను హిందీని, ద్వితీయ భాషగా ఆంగ్లాన్ని, దక్షిణ భారతదేశంలో ఆయా మాతృ భాషలను ప్రథమ భాషలుగాను, ఇంగ్లీషును ద్వితీయ భాషగాను, హిందీని తృతీయ భాషగాను స్థిరపరిచారు. దీనితో పాటు ఉత్తీర్ణతకు హిందీ మార్కులను కూడ గణించడం మొదలు పెట్టారు. దీనితో దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా తమిళనాడులో తీవ్ర ప్రతిఘటన మొదలైనది. ఈ ప్రతిఘటనను నిరోధించి జాతీయ సమైక్యతను కాపాడుటకై భాషల పరంగా నూతన ప్రతిపాదన చేశారు. అదే త్రి భాషా సూత్రం.

దీని ప్రకారం దేశంలోని విద్యార్థులందరూ సమానంగా పాఠశాల దశలో ఖచ్చితంగా మూడు భాషలను నేర్చుకొనవలెను. హిందీ మాతృ భాషకాని వారు మాత్రం తమ మాతృ భాషను ప్రథమ భాషగాను, ఆంగ్లాన్ని ద్వితీయ భాషగాను, హిందీని తృతీయ భాషగాను, హిందీని మాతృ భాషగా కలిగిన వారు మాత్రం ప్రథమ భాషగా హిందీని, ద్వితీయ భాషగా ఆంగ్లాన్ని , తృతీయ భాషగా హిందీ యేతర భారతీయ భాషను నేర్చుకొనవలెను. ఇట్టి ఈ త్రిభాషా సూత్రానికి అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అంగీకరించి అమలు జరుపుతున్నాయి.

అయితే ఉత్తర భారతీయులు హిందీ, ఇంగ్లీషు భాషలను మాత్రమే నేర్పుతూ హిందీయేతర భారతీయ భాషను గాలికి వదులుతుండటంతో దక్షిణ భారత దేశంలో మరల అసంతృప్తి, అలజడి చెలరేగాయి. ముఖ్యంగా తమిళనాడులో హిందీకి తీవ్ర ప్రతిఘటన ఎదురైనది. ఈ సమస్యను ఇలాగే వదిలేస్తే ఇవ్వాళతమిళనాడు రేపు ఆంధ్ర ప్రదేశ్, మరునాడు కర్ణాటక, ఆ తరువాత కేరళ రాష్ట్రాల్లో ఇది గంద్ర గొడ్డలిగా మారి అఖండ భారతదేశాన్ని దక్షిణ భారతదేశం, ఉత్తర భారత దేశం అనే రెండు దేశాలుగా ఖండించి వేసే ప్రమాదమున్నది. అందు కోసం ఉత్తర భారత దేశంలో ఈ త్రిభాషా సూత్రాన్ని ఖచ్చితంగా పాటింప చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

## ద్వితీయ భాషగా తెలుగు బోధన.

1953 నాటికి ఏర్పడిన భాషా ప్రయుక్త రాష్ట్రాల్లో అత్యధిక సంఖ్యాకుల భాష స్థూలంగా మాతృ భాషయే అయినప్పటికీ మిగిలిన భాషలు కూడా ఉంటాయనీ, అలాగే ఆ భాషను మాట్లాడే ప్రజలు ఇతర రాష్ట్రాల్లో కూడా ఉంటారని తెలుస్తున్నది. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్‌లోని 6 కోట్ల మందిలో దాదాపు 5 కోట్ల మందికి పైగా తెలుగు మాతృ భాషగా ఉన్నప్పటికి, తక్కిన వారికి ఉర్దూ, తమిళం, కన్నడం, ఒరియా, మొ..నవి మాతృ భాషలుగా ఉంటున్నాయి. అలాగే తెలుగును మాతృభాషగా కలిగిన ప్రజలు కూడా కేవలం ఆంధ్రప్రదేశ్ లో మాత్రమే కాకుండ తమిళనాడు, కర్ణాటక, ఒరిస్సామొదలైన రాష్ట్రాల్లోను, విదేశాల్లోను నివసిస్తున్నారు. అంతే కాక

త్రిభాషా సూత్రాన్ని అనుసరించి ఉత్తర భారతదేశంలో కొన్ని ప్రాంతాల్లో తెలుగు ద్వితీయ భాషగా ఉంటున్నది

**1. ప్రాంతీయ భాషగా తెలుగు బోధన :-**

ఒక ప్రాంతంలో నివసించే ప్రజల్లో అత్యధికులు తమదైనందిన జీవన వ్యాపారానికి ఏ భాషను ఉపయోగిస్తారో అదే భాషనే మిగిలిన వారు కూడా ఉపయోగిస్తారు. ఈ విధంగా ఒక ప్రాంతంలోని ప్రజలందరి ప్రాంతీయావసరాలను తీరుస్తూ వారిని అభివృద్ధి మార్గం వైపు నడిపించడానికి ఉపయోగపడే భాషనే 'ప్రాంతీయ భాష' అంటారు. ఇట్టి ఈ ప్రాంతీయ భాష ఆ ప్రాంతంలో నివసించే అత్యధికులకు మాతృభషయై ఉంటుంది. వీరికి మాతృభాషగా బోధించడం ద్వారానే ప్రాంతీయ భాషగా బోధించి సాధించివలసిన లక్ష్యాలను సాధించవచ్చు. అలాగే తక్కిన వారికి కూడా ప్రాంతీయ భాషను మాతృభాషా పద్ధతిలోనే బోధించవచ్చు. అయితే ప్రాంతీయ భాషగా బోధించడంలోని లక్ష్యాలు, ప్రయోజనాలు కొంచెం వేరుగా ఉంటాయి. ఇట్టి ప్రాంతీయ భాషగా తెలుగు ఆంధ్రప్రదేశ్‌లో రెండు విధాలుగా ఉంటున్నది

**a. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర మధ్య భాగంలో ప్రాంతీయ భాషగా తెలుగు :-**

ఆంధ్ర ప్రదేశ్‌లో అత్యధికులకు మాతృ భాషగాను, అందరికీ ప్రాంతీయ భాషగాను చెలామణి అవుతున్న భాష తెలుగు. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర మధ్య భాగంలో తెలుగును మాతృ భాషగా కాకుండా ఉర్దూ మొదలైన వానిని మాతృ భాషలుగా కలిగిన వారు నివసిస్తున్నారు. వీరి సంఖ్య అధికంగా ఉంటున్న పాఠశాలలో వారి మాతృ భాషనే ప్రథమ భాషగాను, బోధనా మాధ్యమంగాను బోధిస్తున్నారు. అయితే ప్రాంతీయ భాషా అవసరాన్ని బట్టి వారికి తెలుగును రెండో భాషగా బోధిస్తున్నారు. ఇలా వీరికి తెలుగును ప్రాంతీయ భాషగా బోధించడంలో ప్రధాన ప్రయోజనం నిత్య వ్యవహారాన్ని సులభతరం చేయించడం. అందుకోసం భాషణం, పఠనం, లేఖనం అనే వానిని ప్రధాన లక్ష్యాలుగా తెలుగును బోధించవలెను. సాహిత్యాభిరుచి, అభినవేశం, ఆనందానుభూతి మొదలైన వానిని ఆనుషంగిక లక్ష్యాలుగా పాటించవచ్చు.

**b. ద్విభాషా ప్రాంతాల్లో (Bilingual Areas) ప్రాంతీయ భాషగా తెలుగు :-**

వేరు వేరు మాతృ భాషలను కలిగిన రెండు రాష్ట్రాల లేదా ప్రాంతాల సరిహద్దు ప్రాంతంలో నివసించే ప్రజలు పరస్పర సహసంబంధ బాంధవ్యాల వలన కలిసి పోయి ఒకరి మాతృ భాషను మరొకరు ప్రాంతీయ భాషగా వ్యవహారం జరుపుకోవడం ఉన్నది. ఇలా రెండు భాషలు ఇంచుమించు సమాన ప్రతిపత్తితో వ్యవహారంలో ఉండే ప్రాంతాలకే ద్విభాషా ప్రాంతాలని (Bilingual Areas) పేరు. ఉదాహరణకు ఆంధ్ర రాష్ట్రంలో చిత్తూరు, అనంతపురం, శ్రీకాకుళం మొదలైన జిల్లాల్లో ఇట్టి ద్విభాషా ప్రాంతాలు కనిపిస్తున్నాయి. ద్విభాషా ప్రాంతాల్లో తెలుగు మాతృ భాషగా కాకుండా నివసించే వారికి తెలుగును ప్రాంతీయ భాషగా బోధించవలసి ఉంటుంది. ఇలా సరిహద్దు ప్రాంతంలో తెలుగును ప్రాంతీయ భాషగా బోధించడంలోని లక్ష్యాలు, రాష్ట్ర మధ్య భాగంలో ప్రాంతీయ భాషగా తెలుగును బోధించడంలోని లక్ష్యాలు రెండూ ఒకటే. అయితే ద్విభాషా ప్రాంతంలో

తెలుగును ప్రాంతీయ భాషగా బోధించడంలో భాషణానికి అత్యధిక ప్రాధాన్యమీయ వలసి ఉంటున్నది. దానికి ప్రధాన కారణం వారి మాతృ భాషా ప్రభావమే.

**2. అన్య భాషా ప్రాంతాల్లో తెలుగును ద్వితీయ భాషగా బోధించడం :-**

త్రిభాషా సూత్రాన్ని అనుసరించి ఉత్తర భారత దేశంలో కొన్ని రాష్ట్రాల వారు (ఉదా :- హర్యానా ) తెలుగును ద్వితీయ భాషగా బోధిస్తున్నారు. ఇలా ద్వితీయ భాషగా అన్య ప్రాంతాల్లో తెలుగును బోధించడంలోని లక్ష్యాలు ప్రాంతీయ భాషగా తెలుగును బోధించడంలోని లక్ష్యాల కంటే వేరుగా ఉంటాయి. అందుకు ప్రధాన కారణం తెలుగను ప్రాంతీయ భాషగా బోధించడంలో ఆశించే పరమ ప్రయోజనం వ్యవహారాన్ని సులభతరం చేయడం. ఈ ప్రయోజనాన్ని సాధించటానికి ఇక్కడ భాషణానికి అత్యధిక ప్రాధాన్యమీయ వలసి ఉంటున్నది. కాని అన్య ప్రాంతాల్లో తెలుగును ద్వితీయ భాషగా బోధించడంలో ఆశించే పరమ ప్రయోజనం తెలుగు భాషా సాహిత్యాలపై అభిరుచి, ఆసక్తి, ప్రోత్సాహాలను కలిగించడం. ఈ ప్రయోజనాన్ని సాధించటానికి ఇక్కడ పఠనానికి అత్యధిక ప్రాధాన్య మీయ వలసి ఉంటున్నది. అందు చేత పఠన ప్రక్రియను విస్తృతంగా అభివృద్ధి పఱచడమనేది ఇక్కడి ప్రధాన లక్ష్యమైతే భాషణ ప్రక్రియను విస్తృత పఱచటమనేది అక్కడి ప్రధాన లక్ష్యమౌతున్నది.

# V. భాషా నైపుణ్యాలు

## *భాషా నైపుణ్యాలు (చతుష్కం ). ప్రాధాన్యం*

భావ వినిమయ సాధనమే భాష. అనగా వ్యక్తి తన భావాన్ని ఎదుటి వారికి వ్యక్తీకరించటానికీ, ఎదుటి వారి వ్యక్తీకరణ భావాన్ని తాను గ్రహించడానికి మధ్య వాహికగా భాష ఉపయోగ పడుతున్నది. ఇలా భాష భావాన్ని వినిమయం చేయడానికి ప్రధానంగా నాలుగంశాలపై ఆధారపడుతున్నది. అవి 1. శ్రవణం. 2. భాషణం. 3. పఠనం. 4. లేఖనం. వీటిల్లో ఏ ఒక్క అంశం లోపించినా భాష తన కర్తవ్యమైన భావ వినిమయాన్ని సంపూర్ణంగా, సమర్థవంతంగా నిర్వర్తించలేదు. ఉదాహరణకు శ్రవణం లోపిస్తే వ్యక్తి తానేమి వ్యక్తీకరించినా ఎదుటి వానికి బోధ పడదు. ఒక వేళ భాషణం లోపిస్తే వ్యక్తి తన అంతర్గత భావాన్ని ఎదుటి వారికి అసలు వ్యక్తీకరించనే లేడు. అలాగే పఠనం లోపిస్తే వ్యక్తి తన భావాన్ని దూరంగా ఉన్న వానికి అందించలేడు. ఇంక లేఖనం గనుక లోపిస్తే పఠనమసలు ఉండనే ఉండదు. ఈ విధంగా ఈ నాలుగు ఒక దానిపై మరొకటి ఆధార పడుతూ అన్నీ కలిసికట్టుగా సక్రమంగా పనిచేసినపుడే భాష భాషగా రాణిస్తుంది. ఇలా భాష నడవటానికివి కారకాలౌతూ ఇవి భాషకు ప్రధానాంగా లౌతున్నాయి. అలాగే భాషకొక స్వరూపాన్ని, స్వభావాన్ని ఏర్పఱచి, స్థిరపరుస్తూ భాషా భవనానికి ప్రధాన మూల స్తంభాలౌతున్నాయి. కాబట్టి భాష అనగా ఈ నాలుగింటి కూడలి, లేదా సమన్వయం లేదా సమాహారఫలం. భాషలో జ్ఞానం పొందడమంటే ఈ నాలుగింటిలో జ్ఞానం పొందటమనే అర్థం. అందుకే భాషలో ఈ నాలుగింటి ప్రాధాన్యాన్ని బట్టే వీనిని సాంకేతికంగా భాషా చతుష్కంగా వ్యవహరిస్తున్నారు.

పై నాలుగింటిలో జ్ఞానాన్ని సంపాదించటానికి, సక్రమ రీతిలో వీనిని వినియోగించుకోటానికీ తగినంత ఆసక్తి, ఆత్రుత, పట్టుదల ఉన్నప్పటికీ నైశిత్యం లేదా నిపుణత్వం అత్యవసరం. ఉదాహరణకు కొంతమంది నోటి మాట బాంబులాగా బయటికొస్తే మరికొంతమంది నోటి మాట ముత్యాల మూటలాగా జాలు వారుతుంది. ఇక్కడ అందరికీ భాషణ శక్తి ఉన్నప్పటికీ దానిని కొంతమంది మాత్రమే అత్యంత నిపుణత్వంతో అందంగా, ఆహ్లాదంగా వినియోగించుకొంటున్నారు. అలాగే కొంతమంది పఠనం చేస్తుంటే ఎదురుగా ఉండేవాళ్ళు భరించలేక ఎక్కడికో వెళ్ళి పోతుంటారు. కాని కొంతమంది పఠిస్తుంటే ఎక్కడో ఉన్నవాళ్ళు కూడ అక్కడికి ఆత్రుతతో ఆకర్షింపబడుతుంటారు. ఇక్కడ కూడా అందరికి పఠనశక్తి ఉన్నప్పటికీ కొందరే దానిని అత్యంత ఆహ్లాదంగా ఉపయోగించుకొంటున్నారు. అలాగే లేఖనంలో కూడా పరిస్థితి ఇంతే. ఎట్టి స్థితిలోనూ అర్థం చేసికోలేని బ్రహ్మరాతనైనా అర్థం చేసికోవచ్చు కాని కొంతమంది చేర్రాతను మాత్రం అర్థం చేసికోలేం. కాని కొంత మంది రాతలో ముత్యాల చాల్లు కనిపిస్తాయి. అనగా లేఖనంలో నైశిత్యం కొంతమందికే సాధ్యమని తెలుస్తున్నది. కాబట్టి భాషకు అత్యవసరాలు, ప్రధానాంశాలు అయినట్టి ఈ నాలుగింటిని విశేష నైశిత్యంతో అతి నిపుణంగా నేర్చుకోడం, ప్రధానంగా వినియోగించడం అనేవి ప్రతి వ్యక్తికీ అత్యంత అవసరం. అందుకే భాషలో నైపుణ్యాన్ని సాధించటమంటే ఈ నాలుగింటిలో నైపుణ్యం సాధించడమని అర్థం. అందుకే ఈ నాలుగు భాషానైపుణ్యాలుగా రాణిస్తున్నాయి. ఇట్టి ఈ నాలుగు భాషా నైపుణ్యాలను సంక్షిప్తంగా క్రింది విధంగా తెలిసి కోవచ్చు.

### 1. శ్రవణ నైపుణ్యం (Listening Skill) :-

సర్వసాధారణంగా అనుకరణం భాషకు మూలం. ఈ అనుకరణానికి శ్రవణం మూలం. అందుచేత శ్రవణమే భాషా భ్యాసానికి మొదటి సోపానం. భాషను నేర్చుకొనే వ్యక్తి మొదట ఇతరుల భాషా ధ్వనులను వింటూ వానిని అనుసరించి ఉచ్చరిస్తూ భాషాభ్యాసాన్ని ఆరంభిస్తాడు. క్రమంగా దానిని పెపొందించుకొంటాడు. ఈ విధంగా భాషాభ్యసనంలో మొట్ట మొదటగా అలవఱచుకోవలసినిది శ్రవణమౌతున్నది. సాధారణంగా పుట్టిన వెంటనే శిశువు చేసే ధ్వని ఏడవటం. ఏ అనుకరణ లేకుండా శిశువు చేశా ఏకైక ధ్వని కూడా ఇదే. తరువాత శిశువు తల్లి లేదా తనను నిరంతరం వీడకుండా ఉండే వ్యక్తి చేసే ధ్వనులను వింటూ వానిని అనుకరిస్తూ ఊ కొట్టడం, క్రమంగా క, త , ప , లాంటి ధ్వనులను చేయడం, ఆ తరువాత మెల్లిగా అత్త, అమ్మ, అక్క, లాంటి పద రూపమైన ధ్వనులు చేయడం జరుగుతున్నది. శారీరకంగా, మానసికంగా శిశువు ఎదిగే కొద్ది అతని శ్రవణ శక్తి కూడా పెరుగుతూ ఉంటుంది. ఆ తరువాత విద్యార్థిగా పాఠశాలలో అడుగు పెట్టడం ఉపాధ్యాయులు చేత శ్రవణనైపుణ్యాన్ని ఇంకొంచెం పెంపొందించుకోడం మొదలైనవి జరుగుతున్నవి. ఈ విధంగా పాఠశాలలో ప్రవేశించే నాటికి విద్యార్థి శ్రవణంలో కొంత పరిజ్ఞానాన్ని పొంది ఉంటాడు.

### 2. భాషణ నైపుణ్యం (Speaking Skill) :-

భాషాధ్వనులను శిశువు వినడం, అదే రీతిలో వానిని అనుకరించి ఉచ్చరించడం, క్రమంగా

భాషించడం జరుగుతున్నది. ఇలా శిశువు అనుకరణ ఆధారంగా భాషించడమనేది అత్యంత సహజమైన స్థితి. అయితే ఇది అందరిలో ఒకే విధంగా ఉండదు. కొందరిలో ఎక్కువగా మరికొందరిలో తక్కువగా ఉంటుంది. ఇది పరిసరాలపై ఆధారపడి ఉంటుందే తప్ప వంశ పారంపార్యంపై మాత్రం కాదు. ఎట్లంటే శిష్టమైన భాషణం ఉన్నట్టి ఇంటిలో పుట్టిన ఇద్దరు శిశువులలో ఒకనిని దుష్టమైన భాషణం ఉన్నట్టి ఇంటిలో పెంచినపుడు వీనికి దుష్టభాషణశక్తియే అలవడగా మొదటివానికి శిష్ట భాషణ శక్తి అలవడుతున్నది. అందుచేత భాషణ శక్తి అనేది శిశువును పోషించే వారిపై ఆధారపడి ఉంటుందే తప్ప వంశ పారంపర్యం మాత్రం కాదు. ఇలా శిశువు శారీరకంగా, మానసికంగా అభివృద్ధి చెందుతూ భాషణ శక్తిని కూడా పెంచుకొంటాడు. తరువాత పాఠశాలలో ప్రవేశించి ఉపాధ్యాయుని శిక్షణలో ఈ భాషణ శక్తిని ఇంకా బాగా మెరుగు పఱచుకొంటాడు. అందులో చక్కటి నైపుణ్యాన్ని కూడా సాధించుకొంటాడు. ఇలా శిశువు పాఠశాలలో ప్రవేశించేనాటికే శ్రవణంతో పాటు భాషణంలోనూ కొంత పరిజ్ఞానవంతుడై ఉంటాడు. శ్రవణం ఆధారంగానేఅ భాషణం జరుగుతున్నది.

### 3. పఠన నైపుణ్యం (Reading Skill) :-

శ్రవణం ద్వారా ఇతరుల భావాలను గ్రహించవచ్చు. భాషణం ద్వారా తన భావాలను ఇతరులకు మౌఖికంగా వ్యక్తీకరించవచ్చు. అయితే ఎదురుగ్గా కాకుండా ఎక్కడో ఉండే వారికి విషయాన్ని అందించాలంటే భాషణం ఉపయుక్తం కాదు. అలాగే గతకాలం నాటి విషయాన్ని తెలిసికోవాలన్నా కూడా భాషణం పనికిరాదు. అంతేకాక మనకు తెలిసిన అంశాన్ని భావి తరాల వారికి అందించాలన్నా భాషణం పని చేయదు. ఇలా భాషణం పని చేయని స్థితిలో భాషాకార్యాన్ని నిర్వర్తించే మరో భాషాంగం పఠనం. అనగా లిఖితరూప వ్యక్తీకరణ. దీనికి ప్రధాన ఆధారం లిపి(Script). ఈ పఠనం-ప్రకాశ మౌన పఠనాలని రెండు రకాలు. వీటిల్లో ప్రకాశ పఠనానికి భాషణం ప్రధానంగా దోహదపడుతుంది. శ్రవణ - భాషణాల మాదిరిగా విద్యార్థి పాఠశాలలో ప్రవేశించే నాటికి పఠనంలో ఎలాంటి జ్ఞానాన్ని పొంది ఉండడు. పాఠశాల ప్రవేశానంతరమే విద్యార్థి క్రొత్తగా దీనిని ఉపాధ్యాయుని సమక్షంలో అభ్యసిస్తూ అందులో క్రమంగా మంచి నైపుణ్యాన్ని పెంపొందించుకొంటాడు. ఈ పఠనం సంపూర్ణంగా కాకపోయినా కొంతవరకైనా భాషణం పై ఆధారపడక తప్పదు.

### 4. లేఖన నైపుణ్యం (Writing Skill) :-

ఎక్కడో ఉన్నవారికి భావాన్ని వ్యక్తీకరించటానికి, గతకాలంలో వ్యక్తమైన భావాన్ని గ్రహించటానికి, వర్తమాన కాలపు భావాన్ని భవిష్యత్కాలానికి వ్యక్తీకరించటానికి పఠనం ఎంత అవసరమో దానికి మూలమైన లేఖనం అంతకన్నా అత్యవసరం. లేఖనం లేకపోతే పఠనమసలే లేదో పఠనం లేకపోతే లేఖనం కూడా రాణించలేదు. ఇవి రెండూ పరస్పరం ఒకదానిపై మరొకటి అవినాభావ సంబంధాన్ని కలిగి ఉంటాయి. మౌఖిక వ్యక్తీకరణ భాషణమైతే లిఖితరూప వ్యక్తీకరణ పఠనమైతే, ఈ లిఖిత రూప వ్యక్తీకరణకు మూలమైమ లిపియే (Script) 'లేఖనం'. పాఠశాలలో ప్రవేశించే నాటికి విద్యార్థికి పఠనంలో పరిజ్ఞానం లేనట్లే లేఖనంలో కూడా ఎటువంటి పరిజ్ఞానం

ఉండదు: పాఠశాల ప్రవేశానంతరమే విద్యార్థి ఉపాధ్యాయుని మూలంగా లేఖనాన్ని అలవఱచు కొంటాడు. ఆ తరువాత క్రమంగా అందులో నైపుణ్యాన్ని సాధించు కొంటాడు.

పై విధంగా శ్రవణం లేకపోతే భాషణ మెలా పనిచేయదో, భాషణం లేక పోతే పఠనం కూడా సరిగా రాణించలేదు. అలాగే పఠనం లేక పోతే లేఖనం లేదు. అంటే లేఖనం పఠనం మీద, పఠనం భాషణం మీద, భాషణం శ్రవణం మీద ఆధారపడుతున్నాయి. ఇలా ఈ నాలుగు ఒక దానిపై మరొకటి ఆధారపడి తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించినపుడే భాష భాషగా రాణిస్తూ తన బాధ్యతను నిర్వర్తిస్తున్నది. అందుచేత ఈ నాలుగింటిలో ఏ ఒక్కటి లోపించినా మొత్తం భాషంతా ఛిన్నా భిన్నమౌతున్నది. అందుకే ఈ నాలుగింటిలో ఏ వ్యక్తి కనీస నైపుణ్యాన్ని సాధిస్తాడో అతనే భాషలో సాధారణ జ్ఞానాన్ని పొంది, సమాజంలో తన వ్యవహారాన్ని నిర్వర్తించుకొంటాడు. ఒక వ్యక్తి అక్షరాస్యుడా లేక నిరక్షరాస్యుడా అని తేల్చి చెప్పడానికి ఈ నాలుగు నైపుణ్యాల్లో అతనికున్న ప్రాభవమే ఆధారం. ఇలా నిత్య జీవితంలో ఈ నాలుగు భాషా నైపుణ్యాలకు ఇంతటి ప్రాధాన్యమున్నది.

## పఠన లేఖనాల్లో ముందేది ?

విద్యార్థి పాఠశాలలో ప్రవేశించేనాటికి శ్రవణ భాషణాల్లో కొంత జ్ఞానాన్ని పొంది ఉంటాడు. అయితే పఠన లేఖనాల్లో మాత్రం అతనికెలాంటి జ్ఞానముండదు. ఈ స్థితిలో ఈ రెండింటిలో దేనిని ముందు నేర్పించాలనేది ఉపాధ్యాయునికి సమస్యగా తయారౌతున్నది. ఈ సమస్యకు పరిష్కార మార్గంగా ప్రాచీన కాలం నుండి కూడా విద్యార్థి పాఠశాలలో అడుగు పెట్టంగానే "అక్షరాభ్యాసం" అనే పేరుతో అక్షరాలను, గుణింతాలను, చిన్న చిన్న పదాలను దిద్ద బెడతూ ముందుగా లేఖనానికి శ్రీకారం చుట్టేవారు. ఈ విధంగా విద్యార్థికి ముందుగా లేఖనాన్ని నేర్పించటమనేది మనో విజ్ఞాన శాస్త్రజ్ఞుల (Psychologists) ఒప్పుకోవడం లేదు. పఠనాన్ని ముందుగా నేర్పించాలనేది వీరి అభిమతం. అందుకు వారు క్రింది వానిని కారణాలుగా చూపిస్తున్నారు.

### 1. తెలిసిన దాని ఆధారంగా తెలియని (Known to Un-Known) దానిని నేర్చుకోడం సులభం :-

విద్యార్థికి పాఠశాలలో ప్రవేశించేనాటికే భాషణంలో కొంత పరిచయం ఉంటుంది. భాషణంతో ప్రత్యక్ష సంబంధాన్ని కలిగి ఉండేది పఠనం. ఈ విధంగా తెలిసిన భాషణం ఆధారంగా, దాని సహాయంతో తెలియని పఠనాన్ని నేర్చుకోడం సులభం.

### 2. సులభమైన దాని ఆధారంగా కష్టమైన దానిని (Easy to Difficult) నేర్చుకోడం సులభం :-

శ్రవణ, భాషణ, పఠన, లేఖనాల్లో లేఖనం పఠనం, పఠనం కంటే భాషణం, భాషణం కంటే శ్రవణం అత్యంత సులభ తరాలు. ఉదా.. గంటలో రాయగలిగిన దానిని అర్థ గంట కంటే తక్కువ కాలంలో చదవటానికి అకాశం ఎక్కువగా ఉన్నది. అంతే కాక పఠనానికి కన్ను , నోరు పని చేస్తే సరిపోతుంది. కాని రాయటానికి కన్ను నోటితో పాటు, చేయి కూడా ప్రధానంగా పని చేయ వలసి ఉంటుంది. అందుచేత లేఖనం కంటే పఠనాన్ని ముందు నేర్చుకోడం సులభం.

**3. ఎక్కువ అభిరుచి ఉన్నదాని ఆధారంగా తక్కువ అభిరుచి ఉన్న దానిని (Most Interest to Interest) నేర్చుకోడం సులభం.**

సాధారణంగా ప్రతి వ్యక్తికీ చదవడం మీదనున్న అభిరుచి రాయడంలో ఉండదు. ముఖ్యంగా విద్యార్థి విషయంలో ఇది ఇంకా ఎక్కువ. అంతే కాక శారీరకావయవాలు కూడా పఠనానికి ఉన్నంత ఉన్ముఖంగా రాయటానికి ఉండవు. అందుచేత పఠనాన్ని ముందుగా నేర్చుకోడం సులభం.

అయితే సాధారణంగా పాఠశాలల్లో లేఖనాన్నే ముందుగా నేర్పుతున్నారు. ఇది సరైన పద్ధతి కాదని కొందరికి తెలిసినా చేసేదేమి లేక ఆ పద్ధతినే అనుసరిస్తున్నారు. కొందరు మాత్రం తాము చేస్తున్నదే మంచి పని అని, లేఖనాన్ని ముందు నేర్పించటమే న్యాయమని వాదిస్తున్నారు. అందుకు వారు క్రింది కారణాలను చెబుతున్నారు.

**1. ఈ పద్ధతి అతి సనాతనమైనది :-**

మహా మేధావులూ, విద్వాంసులందరూ ఈ పద్ధతి ఆధారంగానే విద్య నభ్యసించారు.

**2. సాధన సామగ్రి తక్కువ :-**

పఠనాన్ని ముందుగా నేర్పించాలంటే ఎన్నో సాధనాలు అవసరమౌతాయి. కాని లేఖనానికైతే కేవలం పలక, బలపం మాత్రమే సరిపోతుంది. అవీ లేకపోతే ఇసుకనేల సరిపోతుంది.

**3. ఉపాధ్యాయునికి శ్రమ ఎక్కువ :-**

లేఖనాన్ని నేర్పించటానికి ఉపాధ్యాయుడు పెద్దగా శ్రమ పడవలసిన అవసరం లేదు. కాని పఠనాన్ని ముందుగా నేర్పించాలంటే ఉపాధ్యాయుడు మౌఖికంగా ఎంతగానో శ్రమ పడవలసి ఉంటుంది.

**4. వర్ణమాలను, గుణింతాన్ని సంపూర్ణంగా నేర్చుకోవచ్చు :-**

లేఖనాన్ని ముందుగా నేర్పటం వలన అన్ని అక్షరాలను, గుణింతాలను వరుసగా విద్యార్థులందరూ నేర్చుకుంటారు. కానీ పఠనంలో అది సరిగా వీలు పడదు.

కాని విద్యార్థి శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొంటే పఠనాన్ని ముందుగా నేర్పించటానికి పైవన్నీ కారణాలే కావు.

# భాషణం

## ఆవశ్యకత

వ్యక్తి తన భావాన్ని వాగ్రూపంలో అర్థ యుక్తంగా వ్యక్తీకరించటాన్ని 'భాషణం' అంటారు. భావ వినిమయమనే భాషా ధ్యేయానికి ప్రధాన హేతువు భాషణం. భాషణం లేక పోతే శ్రవణం ఉండీ ప్రయోజనం లేదు. అలాగే ఇది లేక పోతే పఠనం రాణించలేదు. పఠనమే లేకపోతే లేఖనానికి స్థానమే లేదు. ఈ విధంగా భాషానైపుణ్యాల్లో ఇది అగ్ర పీఠాన్ని అధిష్ఠిస్తున్నది. ఇక సమాజ పరంగా ఆలోచిస్తే అందరికీ అత్యవసరమైనదీ, నిరంతరం ఉపయోగపడేది భాషణమే . భాషణమే లేకపోతే వ్యక్తుల మధ్య అవగాహనే లేదు. భావ వినిమయమే లేదు. సమన్వయ భావనే కుదరదు. ఇవన్నీ లేనపుడు సమాజమే నడవదు. అందుచేత సమాజానికి ఆయువుపట్టు భాషణం. ఈ విధంగా ఇది సమాజంలో విస్తృతమైన స్థానాన్ని పొందినది. పఠన-లేఖనం లేకపోయినా సమాజంలో వ్యక్తి వ్యక్తిగా రాణించవచ్చు.కాని భాషణమే లేకపోతే ఎట్టి పరిస్థితులలోను వీలుకాదు. సమాజంలోని అందరు వ్యక్తులు దీనిని తమ నిత్య దైనందిన జీవన వ్యాపారానికి ఏకైక సాధనంగా అను నిత్యం ఉపయోగించుకొంటూ, దీని సహాయంతోనే తమ వ్యక్తిత్వాన్ని, మూర్తిమత్వాన్ని బహిర్గతం చేసికొంటుంటారు. సమాజాన్నంతటినీ ఏక త్రాటిపై నిలిపి దానిని ఒక్కసారిగా కదిలించే మహత్తరమైన శక్తి కేవలం ఒక్క భాషణానికే ఉన్నది. ఎట్టి ఆయుధంతోనూ చేయలేని ఎంతటి శక్తి వంతమైన కార్యాన్నైనా భాషణంతో అత్యంత సులభంగా చేయవచ్చు. ఒక ఆటంబాంబును పేల్చితే కొంత ప్రాంతమే ధ్వంసమౌతుంది. కాని ఒక మహా వక్త తన వాక్పటిమతో, వాగ్ధాటితో, వాక్శుద్ధితో అత్యల్పకాలంలోనే మొత్తం సమాజాన్నే తన వెంట నడిపించుకోగలుగుతాడు. ఇట్టి వ్యక్తి భాషణాన్ని భూషణంగా ఉపయోగించుకొని అంతటి మహాకార్యాన్ని సాధిస్తాడు మొత్తం సమాజాన్నే మంత్రముగ్ధం చేసి గారడీ వాని బొమ్మ లాగా తన వెంట త్రిప్పు కొంటాడు.

పై విధంగా భాషా పరంగా, సమాజపరంగా, జీవన పరంగా **ఇంతటి** ప్రాధాన్యాన్ని పుచ్చుకొన్న ఈ భాషణం అనుకరణ, అభ్యసనల ఆధారంగానే లభిస్తుందే తప్ప పుట్టుకతో ఎవరికీ అబ్బదు. శిశువు పుట్టగనే ధ్వనులను వినడం, క్రమంగా వానిని అనుకరించడం తరువాత భాషా రూపమైన ధ్వనులు తానూ చేయడం, చివరికి భాషించడం నేర్చుకొంటుంది. పరిసర ప్రభావానికి అనుకూలంగా తన భాషణా శక్తిని పెంపొందించు కొంటుంది. తరువాత విద్యార్థిగా పాఠశాలలో ప్రవేశించిన తరువాత ఉపాధ్యాయుని శిక్షణలో భాషణంలో అత్యధిక జ్ఞానాన్ని పొందటమే కాక దానిని నైపుణ్యంతో నిత్య జీవితంలో వినియోగించుకోటానికి నేర్చుకొంటుంది. విద్యార్థిలో భాషాజ్ఞానాన్ని పెంపొందించటానికై పాఠశాలలో ఉపాధ్యాయుడు చేపట్టే మొట్ట మొదటి ప్రక్రియ భాషణాన్ని అభివృద్ధి పఱచడం. ఈ భాషణ శక్తిని పెంపు చేయటానికై భాషోపాధ్యాయుడు దశల వారిగా సంభాషణలు, శిశు గీతాలు, కథా కథనం, నాటకీకరణం మొదలైన రూపాల్లోనే 'వాచిక చర్య' చేపడతాడు.

## వాచిక చర్య

భాషించడమనగా మాటా(ట్లా)డటమని అర్థం. అనగా మాటలతో ఆడడం లేదా మాటలను

ఉత్పత్తి చేయడం. ఈ మాటనే 'వచనం' అని కూడా అంటారు. వచనానికి సంబంధించినదే వాచకం. వాచకశక్తిని పెంపొందించే మార్గమే 'వాచిక చర్య.' .అనగా భాషణాన్ని పెంపొందించే మార్గం. నిత్య జీవితంలో భాషణానికి ఎంతటి ఆవశ్యకత ఉందో అదే వాచికావశ్యకత కూడా. ఇట్టి భాషణావశ్యకతను గుర్తించిన ఉపాధ్యాయుడు విద్యార్థిలో దానిని పెంపొందించటానికై నిరంతరం కృషి చేస్తాడు. ఎంతో కొంత భాషణ పరిజ్ఞానం తో పాఠశాలలో ప్రవేశించిన విద్యార్థికి ఉపాధ్యాయుడు తరగతి గదిలో దశల వారీగా సంభాషణలు, శిశు గీతాలు, అభినయ గీతాలు, కథా కథనం, నాటకీకరణం, ఉక్త రచన, వక్తృత్వ శిక్షణ, మొ.. మార్గాల ద్వారా భాషణ శక్తిని పెంపొందించే ప్రక్రియకే స్థూలంగా 'వాచిక చర్య 'అని పేరు. ఈ వివిధ రకాలైన మార్గాల ద్వారా ఉపాధ్యాయుడు ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత దశల్లో క్రింది విధంగా వాచిక చర్యను చేపడతాడు. లేదా భాషణ శక్తిని పెంపొందిస్తాడు.

## ప్రాథమిక దశలో వాచిక చర్య :-

ప్రాథమిక దశలో వాచిక చర్యకై లేదా భాషణ శక్తిని పెంపొందించటానికై ఉపాధ్యాయుడు సంభాషణలు, శిశుగీతాలు, అభినయ గీతాలు, బాల్య క్రీడలు, కథా కథనం, మొ.. మార్గాలను అనుసరిస్తాడు.

**1. సంభాషణలు :-**

విద్యార్థి పాఠశాలలో ప్రవేశించే నాటికే కొంత సంభాషణా శక్తిని కలిగి ఉంటాడు. కాబట్టి దాని సహాయంతో అతడు తోటి విద్యార్థులతోను ఉపాధ్యాయుని తోను సంభాషిస్తుంటాడు. అయితే ఈ సంభాషణలను అతడు ఎవరికి ద్వారా పొంది ఉంటాడో వారి సంభాషణల్లో దోషాలున్నపుడు అవే దోషాలు ఈతని సంభాషణల్లో కూడ ఉండడం సహజం. అట్టి దోషాలను తొలగిస్తూ విద్యార్థిలో భాషణ శక్తిని పెంపొందించటానికై అతనితో ఉపాధ్యాయుడు సంభాషిస్తుంటాడు. అలా ఉపాధ్యాయుడు విద్యార్థితో సంభాషించే టపుడు క్రింది జాగ్రత్తలను పాటింపవలెను.

1. ఉపాధ్యాయుని సంభాషణలు విద్యార్థికి వెంటనే స్పష్టంగా అర్థం కావలెను.
2. విధ్యార్ధి వెంటనే సమాధానం చెప్పగలిగిన ప్రశ్నలతోడి సంభాషణలనే చేయవలెను.
3. సంభాషణలు విద్యార్థికి బాగా పరిచితమై ఆసక్తిని కలిగించేవిగా ఉండవలెను.
4. విద్యార్థిని ప్రశంసించే ధోరణిలో సంభాషణలు సాగవలెను.
5. తన సంభాషణలో తప్పులున్నాయనే న్యూన భావం విద్యార్థిలో కలుగని రీతిలో సంభాషించ వలెను.
6. పై జాగ్రత్తలను పాటిస్తూ ఉపాధ్యాయుడు విద్యార్థితో సంభాషిస్తూ, లోపాలను సరిదిద్దుతూ అతనిలో భాషణ శక్తిని పెంపొందిస్తాడు.

**ప్రయోజనాలు**

1. విద్యార్థికి ఉచ్చారణ దక్షత కొంతవరకు కలుగుతుంది.
2. విద్యార్థి నూతన పదజాలాన్ని కొంతవరకు పరిచయం చేసి కొంటాడు.
3. కుటుంబంలాగా పాఠశాలను భావించి, స్వేచ్ఛగా విద్యార్థి మసలు కొంటాడు.
4. విద్యార్థుల మనోగత వైఖరులను అర్థం చేసికోటానికి వీలౌతుంది.

**2. శిశుగీతాలు :(Nursery Rhymes) :-**

వీటికే 'బాలగేయాల'ని కూడ పేరు. చిన్న పిల్లలు సాధారణంగా ఆటల మీద ఎంతటి ఆసక్తిని చూపిస్తారో పాటల మీద కూడా అంతే ఆసక్తని చూపిస్తారు. పాటలు శబ్ద ప్రధానంగా లయబద్ధంగా ఉండడం వలననూ, వానిలోని విషయం చిన్న పిల్లల అనుభవానికి తగినట్లుగా ఉండడం వలననూ వానిని విద్యార్థులు అతి శీఘ్ర కాలం లో నేర్చుకొంటారు. వీనిని నేర్పించేటపుడు ఉపాధ్యాయుడు క్రింది జాగ్రత్తలను పాటించవలెను.

**జాగ్రత్తలు:-**

1. మొదట తానే గీతాన్ని రెండు మూడు సార్లు పాడవలెను.
2. తరువాత తనతో కలిసి విద్యార్థుల చేత పాడించవలెను.
3. ఆ తరువాత విద్యార్థులందరినీ కొన్ని వర్గాలుగా విభజించి ఒక్కొక్క వర్గంలో బాగా పాడగల విద్యార్థితో తక్కిన వారిని కలిపి రెండు మూడు సార్లు పాడించవలెను.
4. చివర్లో ప్రతి విద్యార్థి చేత గీతాన్ని పాడించవలెను.

పై శిశు గీతాల వలన కలిగే ప్రయోజనాలు క్రింది విధంగా ఉన్నాయి.

**ప్రయోజనాలు**

1. ఉచ్చారణ స్పష్టమౌతుంది మరియు నిర్దుష్టమౌతుంది.
2. విద్యార్థుల్లో సాంఘిక భావం పెంపొందుతుంది.
3. విద్యార్థులకు మానసికానందం కలుగుతుంది.
4. విద్యార్థుల పదజాలం అభివృద్ధి చెందుతుంది
5. విద్యార్థులు ఉత్సాహంతో పాఠశాలకు రావడానికి వీలౌతుంది.

**3. అభినయ గీతాలు : (Dramatic Rhymes) :-**

ఇవి కూడా లయ బద్ధంగానే ఉంటూ, అర్థవంతమై అభినయానుకూలంగా ఉంటాయి.

భావ భరితాలై వాచికాభినయంతో పాటు అంగికాభినయ ప్రాధాన్యంతో నడవడం వలన ఇవి పిల్లల ఆసక్తికి అత్యంత అనుకూలంగా ఉంటాయి. వీటిని నేర్పేటపుడు కూడా ఉపాధ్యాయుడు పై శిశు గీతాల వంటి జాగ్రత్తలనే పాటించవలెను. అనగా

**జాగ్రత్తలు:-**

1. ఉపాధ్యాయుడు మొదట పాడడం.
2. తనతో కలిపి విద్యార్థులచేత పాడించడం.
3. విద్యార్థులను వర్గాలుగా విభజించి పాడించడం.
4. ప్రతి ఒక్క విద్యార్థిని పాడించడం.

ఈ అభినయ గీతాల వలన కలిగే ప్రయోజనాలు క్రింది విధంగా ఉన్నాయి. శిశుగీతాల వలన కలిగే ప్రయోజనాలన్ని వీని ద్వారా కూడా సమకూరుతాయి. అనగా

**ప్రయోజనాలు:-**

1. ఉచ్చారణ నిర్దుష్టం కావడం. 2. సాంఘిక భావం పెంపొందడం.3. మానసికానందం కలగడం. 4. పదజాలం అభివృద్ధి చెందడం. 5. పాఠశాలకు ఉత్సాహంతో రావడం వీనితో పాటు మరికొన్ని ప్రయోజనాలు కూడా ఈ గీతాల వలన లభిస్తున్నాయి. 6. భావాన్ని గ్రహించే శక్తి పెరుగుతుంది. 7. భావానుకూలంగా అభినయించడం అలవడుతుంది. 8.వాచికాభినయానికి వీలుంటుంది. 9. గీతం ఆట లాగ సాగిపోతుంది.

**4. భాషా క్రీడలు : (Language Games ):-**

సహజంగా క్రీడలపై విద్యార్థులకు అత్యధిక ఆసక్తి ఉంటుంది . అట్టి ఆసక్తి ఆధారంగా భాషా కార్యకలాపాలను క్రీడలుగా మార్చి బోధించే పద్ధతులకే 'భాషా క్రీడల' ని పేరు. ముఖ్యంగా భాషణ శక్తిని పెంపొందించడంలో ఈ భాషా క్రీడలకు అత్యధిక ప్రాధాన్యమున్నది. ఇట్టి భాషా క్రీడలు క్రింది విధంగా సాగుతుంటాయి.

1. తరగతిలో ఏదో ఒక విద్యార్థి చేత ఒక పదాన్ని చెప్పించడం, అలా చెప్పబడిన పదం యొక్క చివరి అక్షరంతో మరొక విద్యార్థి చేత మరొక పదాన్ని చెప్పించడం, మరలా ఈ పదం యొక్క చివరి అక్షరంతో మరొక విద్యార్థితో మరొక పదాన్ని చెప్పించడం.ఈ విధంగా ప్రతి విద్యార్థి చేత పదాలను చెప్పిస్తూ క్రీడగా భాషణాన్ని నేర్పించడం. ఉదా:పలక కమల-లత -తల వంటి పదాలు.

2. ఉపాధ్యాయుడే కొన్ని పదాలను చెప్పి వాటిలో ఏదో కొన్ని అక్షరాలను మార్చి క్రొత్త పదాలను తయారు చేయమని చెప్పడం. ఉదాహరణకు 'చిలక ' అనే పదాన్ని చెప్పి దీనిలో మొదటి అక్షరాన్ని తీసివేసి మరో క్రొత్త పదాన్ని తయారు చేయమనగా విద్యార్థి 'చి' స్థానంలో

'పి' ని చేర్చి 'పిలక' అనే పదాన్ని తయారు చేస్తాడు. దీనిలో మరలా 'క' అనే అక్షరాన్ని తీసివేసి మరో పదాన్ని తయారు చేయమనగా విద్యార్థి 'ల 'కు 'ల' వత్తు ఇచ్చి 'పిల్ల' పదాన్ని తయారు చేస్తాడు.-

3. ఆసక్తికరమైన కొన్ని సామెతలను, పొడువు కథలను, జాతీయాలను చెబుతూ భాషణ శక్తిని పెంపొందించడం. ఉదా: " పొట్టి వానికి పుట్టెడు అంగీలు " అనగా ఏమిటో కనుకొనమనగా విద్యార్థి 'ఉల్లిపాయ' అని సమాధానం చెబుతాడు. అలాగే ' పెద్దలు మాటలు చద్ది మూటలు ' అంటే ఏమిటో చెప్పమని స్థాయిని బట్టి అడిగినపుడు ' పెద్దలను గౌరవించవలెనని' విద్యార్థులు చెప్పెదరు.

**5. కథాకథనం : (Story Telling) :-**

చిన్నపిల్లలకు ఆటల మీద ఎంత ఆసక్తి ఉంటుందో కథలమీద కూడా అంతే ఆసక్తి ఉంటుంది. ఈ అనురక్తిని దృష్టిలో పెట్టుకొని వివిధ రకాలైన కథలను ఉపాధ్యాయుడు చెబుతూ, విద్యార్థుల చేత చెప్పిస్తూ వాచిక చర్యను పెంపొందించవచ్చు. వివిధ స్థాయిల్లో ఉన్న విద్యార్థులందరికీ కథలపై ఆసక్తి ఉన్నప్పటికీ ప్రాథమిక స్థాయిలోని వారిలోనే వీనికి అత్యధిక ప్రాధాన్యమున్న కారణాన ఆ ఆశలోనే దీనికి గట్టి పునాది వేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఇట్టి ఈ కథలను స్థాయిని బట్టి అనేక రకాలుగా వర్గీకరించారు. వీటిల్లో సాధారణంగా 1, 2 తరగతుల వారికి ఉపయుక్తమయ్యే వానిని నీతి కథలు, అద్భుత కథలుగాను; 3, 4, 5 తరగతుల వారికి సంబంధించిన వానిని చారిత్రక కథలు, పౌరాణిక కథలు గాను, మధ్యమ దశలో ఉపయోగపడేవానిని సాహస కథలు, యాత్రా కథలుగాను పేర్కొన్నారు. ఇలా స్థాయిని బట్టి ఎన్నుకొన్న కథలను విద్యార్థులకు చెప్పడంలో ఉపాధ్యాయుడు క్రింది జాగ్రత్తలను పాటించవలెను.

**జాగ్రత్తలు**

1. కథను చెప్పటానికి ఉపయోగించబడే భాష సరళంగా, స్పష్టంగా ఆహ్లాదకరంగా ఉండవలెను.2. కథను చెప్పేటపుడు పరోక్ష వాక్యాలకు కాక ప్రత్యక్ష వాక్యాలకే ప్రాధాన్యమీయవలెను. 3. పుస్తకం మొ.. వానిని చూస్తూ కాక, సహజంగా, ఆశువుగా కథను చెప్పవలెను. 4. కథను చెప్పేటపుడు కేవలం వాచికాభినయానికే ప్రాధాన్యమియ్యవలెను. 5. కథను చెప్పేటపుడు విద్యార్థులు అవధానంతో వింటున్నదీ లేనిదీ తెలిసికోవలెను. 6. కథను ఆరంభించేటపుడు కాని లేక ముగించే టపుడు కాని కుతూహలాన్ని కలిగించే వాక్యాలను ఉపయోగిచవలెను. 7. కథాభాగాలను సూచించే కథా చిత్రాలను అవసరాన్ని బట్టి ఉపయోగించవలెను. 8. చెప్పబడిన కథను వివిధ ప్రశ్నల ద్వారా విద్యార్థుల నుండి రాబట్ట వలెను 9. ఒక విద్యార్థి కథ చెప్పడంలోని దోషాలను మరొక విద్యార్థి పరిహాసించకుండా ఉండేటట్లు చూడవలెను. 10. వాచికంగా విద్యార్థుల చేత చెప్పబడిని కథలను లిఖితబద్ధం చేయించవలెను.

పై విధంగా కథలను చెబుతూ, చెప్పిస్తూ భాషణశక్తిని పెంపొందించే ఈ కథా కథనం ద్వారా క్రింది ప్రయోజనాలు లభిస్తాయి.

**ప్రయోజనాలు:-**

1. చక్కటి ఉచ్చారణ పెంపొందుతుంది.2. భావ వ్యక్తీకరణలో క్రమం పాటింపబడుతుంది. 3. మనస్సులోని విసుగు, శ్రమ మొ..వి తొలగి పోవును.4. క్రొత్త పదజాలం అభివృద్ధి చెందుతుంది. 5. పఠనాభిలాష విస్తృతమౌతుంది.6. సభాకంపం, తొట్రుపాటు మొ..వి పోవును. 7. కల్పన సృజనాత్మకాది అంతర్గత శక్తులు వృద్ధి చెందును.

## మాధ్యమికోన్నత దశల్లో వాచిక చర్య:-

ప్రాథమిక దశలో వాచిక చర్యను పెంపొందించడంలో ప్రధాన ధ్యేయం భాషణంలో స్పష్టతను, నిర్దుష్టతను సాధించడం కాగా మాధ్యమికోన్నత దశల్లో జాతీయాలు, సామెతలు, లోకోక్తులు, సూక్తులు, నుడికారాలు, అలంకారాలు, మొదలైన వానిని ఉపయోగింప చేస్తూ భాషణ శక్తని పెంపొందించడం, భాషను చమత్కారంగా, అందంగా, ఆహ్లాదంగా, వినియోగింప చేయడం. అందుకోసం నాటకీ కరణం, ఉక్త రచన, సారస్వత సమావేశాలు మొదలైన వానిని ఉపాధ్యాయుడు చేపడతాడు.

**1. నాటకీకరణం :( Dramatisation) :-**

నటనానుకూలంగా చేయడమే నాటకీకరణం. అనగా సంభాషణా రూపంలో నున్న పాఠాలను (Lessons) విద్యార్థులచేత నాటక రూపంగా ప్రదర్శింపచేయడం . కథానాత్మకాలైన వానిని కూడా సంభాషణాత్మకాలుగా మార్చి నాటకీకరణం చేయింపవచ్చు. అవసరానుకూలమైన అభినయం కూడా ఇందులో చోటు చేసికొంటుంది. ఇట్టి ఈ నాటకీకరణంలో ఉపాధ్యాయుడు క్రింది జాగ్రత్తలను పాటింప వలెను.

**జాగ్రత్తలు:-**

1. నాటకీకరణానికై గ్రహింపబడిన అంశం విద్యార్థులకు ముందే తెలిసినదై ఉండవలెను. 2. వివిధ పాత్రలకు విద్యార్థులను ఎంపిక చేసేటపుడు వారి శక్తి సామర్థ్యాలను, ఆసక్తిని పరిగణనలోనికి తీసికొనవలెను. 3. వాచికాభినయానికి మాత్రమే ప్రాధాన్యమీయవలెను. 4. విద్యార్థులందరినీ రెండు వర్గాలుగా విభజించి ఒక వర్గం వారు అభినయించేటపుడు రెండవ వర్గం వారిని ప్రేక్షకులుగా చేయవలెను. 5. అభినయంలో పొరపాట్లు జరిగినపుడు ప్రేక్షకులుగా ఉన్నవారు పరిహసింపకుండా ఉండే విధంగా చూడవలెను. 6. చక్కగా అభినయించిన వారిని ప్రశంసిస్తూ ప్రోత్సహింపవలెను. నాటకీకరణం వలన కలిగే ప్రయోజనాలు క్రింది విధంగా ఉన్నాయి.

**ప్రయోజనాలు**

1. విద్యార్థులు స్పష్టంగా, అర్థవంతంగా, ఇంపుగా మాట్లాడటం నేర్చుకుంటారు. 2. సభాకంపం పోవడంతో పాటు భాషణంలో సమయ స్ఫూర్తిని పెంపొందించుకుంటారు. 3.

విద్యార్థుల్లో సంఘీభావం అభివృద్ధి చెందుతుంది. 4. ఆకర్షణీయమైన నటన అలవడుతుంది. 5. సరిగా బోధించటానికి, అర్థం చేసుకోటానికి వీలుగాని అంశాన్ని దీని ద్వారా చక్కగా బోధించ వచ్చు - అర్థం చేసుకోవచ్చు. 6. క్లిష్టమైన పాఠాలను చదవడం వలన కలిగిన విసుగుదల, శ్రాంతి (శ్రమ )దీని ద్వారా తొలగిపోవును.

**2. ఉక్త రచన (Debate) వక్తృత్వ శిక్షణ :(training of Eloquence) :-**

ఉక్తి అనగా మాట అనీ, రచన అనగా కూర్పు అనీ అర్థం. ఇట్టి మాటల కూర్పుకే "ఉక్త రచన " అని పేరు. అయితే మాటలన్నీ కాక, "ఒక ప్రత్యేక ప్రయోజనం కోసం, ఒక ప్రత్యేక క్రమంలో మౌఖిక రూపంలో అమరిన మాటల కూర్పే ఉక్త రచన". అనగా చమత్కారవంతమైన, ఇంపైన ,ఆహ్లాదకరమైన మాటల మౌఖిక వ్యక్తీకరణమని అర్థం. ఏదైనా అంశంపై రెండు - మూడు, నిముషాల పాటు ఎలాంటి తడబాటు లేకుండా, ఎటువంటి సభాకంపం పొందకుండా సరియైన క్రమంలో ఆసక్తికరంగా ఆకర్షణీయంగా ప్రసంగించటమని భావం. ఇలా అనర్గళంగా మాట్లాడగలిగే వారినే 'వక్తల'ని (Orators) పిలుస్తున్నాం. ఇలాంటి వక్తలుగా విద్యార్థులను మలచటానికి ఇచ్చే శిక్షణయే వక్తృత్వ శిక్షణ. సాధారణంగా సారస్వత సంఘాల ద్వారా ఉపాధ్యాయుడు విద్యార్థుల ఉక్త రచనను పెంపొందిస్తాడు. అలా ఉక్త రచనను పెంపొందిస్తూ వక్తృత్వంలో శిక్షణ నిచ్చేటపుడు ఉపాధ్యాయుడు క్రింది జాగ్రత్తలను పాటించవలెను.

**జాగ్రత్తలు:-**

1. ఉక్త రచనాంశం విద్యార్థుల అభిరుచికి, సామర్థ్యానికి తగినట్టిదిగా ఉండవలెను. 2. ఉక్త రచనకు సంబంధించిన విషయసేకరణకై విద్యార్థులను ప్రోత్సహించవలెను.3. విషయాన్ని సేకరించిన తరువాత దానిని క్రమమార్గంలో అమర్చడంలో దోహదపడవలెను. 4. సభాకంపం తొలిగే విధంగా తగిన సూచనలనివ్వవలెను. 5. ఉపన్యాసంలో విద్యార్థుల శాఖా చంక్రమణ స్థితిని పోగొట్టవలెను. 6. ఉపన్యాస సమయంలో ఆంగికాభినయానికి కాక వాచికాభినయానికి ప్రాధాన్యమిచ్చేటట్లు చూడవలెను. 7. ఉపన్యాసంలో లోపాలు ఉన్నపుడు ఇతర విద్యార్థులు పరిహసించకుండా చూడవలెను.8. ఉన్నత దశ విద్యార్థులకు కథన శక్తితో పాటు ఊహా శక్తిని కూడ పెంపొందించే వానిని, వాద ప్రతివాదాలకు తావున్న వానిని ఉక్తరచనాంశాలుగా నిర్ణయింప వలెను.

**ప్రయోజనాలు:-**

1. సభాకంపం తొలగిపోవును. 2. విషయ వ్యక్తీకరణం క్రమ పద్ధతిలో సాగును. 3. వ్యక్తీకరణ సులభంగాను, ఆహ్లాదకరంగాను ఉండును. 4. ఎదుటి వారిని సులభంగా ఆకర్షించ వచ్చును.5. చక్కటి వక్తలుగా రాణించవచ్చు.

**3. సారస్వత సమావేశాలు :-**

సరస్వతి చదువుల తల్లి. ఇట్టి సరస్వతి సంబంధమైనదే సారస్వతం. ఇట్టి సారస్వతాన్ని

పెంపొందించే నిమిత్తం ఏర్పాటు చేసే సమావేశాలకే సారస్వత సమావేశాలని పేరు. జ్ఞానాంశ ప్రతిపాదకాలైనప్పటికి ముఖ్యంగా సాహిత్యాంశాల మీద ఇవి ఎక్కువ దృష్టిని కేంద్రీకరిస్తాయి. భూత - వర్తమాన కాలాంశాలకు, పాఠ్య - పాఠ్యేతరాంశాలకు ఇవి సంబంధించినవిగా ఉంటాయి. వివిధ రకాలుగా సాగే చర్చలు, గోష్ఠులు, వాద - ప్రతివాదాలు, విమర్శలు, ఉపన్యాసాలు, సభలు, కవిసమ్మేళనాలు మొదలైన కార్యకలాపాలు ఈ సారస్వత సమావేశాల్లో సాగుచుండును.

**ప్రయోజనాలు:-**

1. భాషణాన్ని పెంపొందించవచ్చు. 2. భావానుకూలమైన వ్యక్తీకరణను అలవాటు చేయవచ్చు. 3. జాతీయాలు, సామెతలు ఉపమానాలు, దృష్టాంతాలు, అలంకారాలు మొ..నవానిని ప్రయోగించే తీరును తెలుపవచ్చు. 4. వివిధ రకాలైన కవుల శైలి భేదాలను, వాని వ్యక్తిత్వాలను గమనింపచేయవచ్చు. 5. ఉపన్యాస ధోరణిని తెలుపవచ్చు.6. సభాధ్యక్షుని, అతిథిని, శ్రోతలను సంబోధించే తీరును స్పష్టం చేయవచ్చు. 7. సంభాషణారీతి, వర్ణనారీతి, విశ్లేషణారీతి మొదలైన భాషణా వైవిధ్యాన్ని చూపించవచ్చు. 8. సృజనాత్మక శక్తిని పెంపొందించవచ్చు.9. సాహిత్యంలోని వివిధ ధోరణులను, వివిధ ప్రక్రియలను తెలుపవచ్చు. 10. వ్యక్తీకరణాంశంపై అధికారికతను పెంపొందించవచ్చు. 11. సమస్యాపూరణాదులను ,ఆశుకవితాదులను అలవాటు చేయవచ్చు. 12. సాహిత్యాంశాలపై చక్కటి అభిరుచిని, అనురక్తిని, ఆసక్తిని పెంపొందించవచ్చు.

## వాచిక చర్య దోషాలు -నివారణోపాయాలు

వాచిక చర్యా సందర్భంలో సర్వసాధారణంగా కనిపించే దోషాలను 1. భావ దోషాలు 2. భాషా దోషాలు 3.ఉచ్చారణా దోషాలు 4. వాగింద్రియలోపజనిత దోషాలు 5. పరిసర ప్రభావ జనిత దోషాలుగా గుర్తింప వచ్చు. ఇట్టి ఈ దోషాలు ఏర్పడటానికి గల కారణాలను, వాని నివారణా మార్గాలను క్రింది విధంగా చూడవచ్చు.

**1. భావ దోషాలు :-**

1. విద్యార్థి గ్రహించిన విషయంలోనే తప్పులుండడం భావదోషాలు ఏర్పడడానికి ఒక కారణం. విద్యార్థుల్లో ఈ రకమైన దోషాలున్నపుడు ఉపాధ్యాయుడు తానుగా కాని లేక ఇతర విద్యార్థుల చేతగాని సవరింపచేస్తూ వీనిని తొలగించవలెను.2. విద్యార్థుల సభాకంపం భావ దోషాలేర్పడటానికి మరో కారణం.విద్యార్థుల్లో ధైర్యాన్ని, ఉత్సాహాన్ని కలిగింపచేస్తూ వారి , భావోద్రేకాన్ని తగ్గిస్తూ ఉపాధ్యాయుడు ఈ రకమైన దోషాలను నివారించవలెను.

**2. భాషా దోషాలు :-**

1. విద్యార్థి అనుకరించిన భాషాజ్ఞానం సరైనది కాకపోవడం, అనుకరింపబడిన భాష సరైనదే అయినప్పటికీ అనుకరణలో లోపం ఉండడం అనేవి ఈ రకమైన దోషాలేర్పడడానికి ఒక కారణం. విద్యార్థుల్లో ఈ రకమైన దోషాలున్నప్పుడు వానిని వారికి తెలియ చేయడంతో పాటు

వాని సరైన రూపాలను కూడా తెలుపుతూ ఈ దోషాలను నివారింపవలెను. 2. ఈ దోషాలేర్పడటానికి సభాకంపం కూడా రెండో కారణం. ఇట్టి ఈ సభాకంపాన్ని తొలగించటానికి ధైర్యాన్ని, ఉత్సాహాన్ని విద్యార్థుల్లో కలిగింపవలెను.

**3. ఉచ్చారణా దోషాలు :-**

**I.** 1. వేగంగా మాట్లాడటం అనేది ఒక రకమైన ఉచ్చారణా దోషం. దీనినే 'వేగోచ్చారణ' అంటారు. భయం, తాము మాట్లాడేది సరైనదో కాదో అనే సందేహం ఈ రకమైన దోషం ఏర్పడటానికి ఒక కారణం. విద్యార్థుల్లో ఆత్మ విశ్వాసాన్ని, ధైర్యాన్ని పెంపొందిస్తూ ఈ దోషాన్ని నివారించవచ్చు. 2. విద్యార్థి అనుకరించిన భాష వేగవంతం కావడమనేది ఈ రకమైన దోషమేర్పడటానికి రెండో కారణం. ఆదర్శప్రాయమైన ఉచ్చారణతో ఉపాధ్యాయుడు ఈ దోషాన్ని నివారించవలెను. **II** మొదట నెమ్మదిగాను క్రమంగా వేగంగాను మాట్లాడటమనేది మరొక రకమైన ఉచ్చారణదోషం. దీనినే 'సమవేగ రాహిత్యం' అంటారు. భయం, సందేహం, అనుకరణలోపం అనేవి ఈ రకమైన దోషం ఏర్పడటానికి కారణాలు. వీనిని తొలగించటానికి ఉపాధ్యాయుడు ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని ఆదర్శప్రాయమైన ఉచ్చారణను విద్యార్థులకు అందించవలెను. **III.** మొదట బిగ్గరగా మాట్లాడటం క్రమంగా స్వరాన్ని తగ్గించడం అనేది మరోరకమైన ఉచ్చారణా దోషం. దీనినే 'సమస్వర రాహిత్యం' అంటారు. దీనికి కూడా భయం, సందేహం, అనుకరణమే కారణాలు. వీనిని కూడా ధైర్యం ఉత్సాహం, ఆత్మ విశ్వాసాదుల్ని కలిగిస్తూ నివారించవలెను. **IV.** పలుకవలసిన వానిని పలుకక పోవడం, పలికిన దానిని మరల మరలా పలకడం, మధ్యలో కాలహరణం చేయడం అనేది ఇంకొకరకమైన ఉచ్చారణా దోషం. దీనినే 'ధారాళత' లోపించడం అంటారు. 1. భావాలు వెంటనే స్ఫురించకపోవడం ఈ రకమైన దోషానికి ఒక కారణం. విద్యార్థిచేత విషయాన్ని ముందుగానే సేకరింపచేయడం, దానిని క్రమమార్గంలో అమర్చుకొనేటట్లు చూడడం అనే వాని ద్వార ఈ దోషాన్ని నివారింపవలెను. 2. సభాకంపం కూడా ఈ రకమైన దోషానికి రెండో కారణం. దీనిని తొలగించటానికి ధైర్యం, ఉత్సాహాదుల్ని కలిగింపవలెను. **V .** ధ్వనులను తారుమారు చేయట మనేది మరొక రకమైన ఉచ్చారణా దోషం. దీనినే ' ధ్వని మార్పిడి' అంటారు. అల్ప ప్రాణాల స్థానంలో మహా ప్రాణాలను పలకడం ఉదా:. విద్య - విధ్య ,అనునాసికాలను ఇతర హల్లులతో సమానంగా పలుకడం. ఉదా: జ్ఞానం - జ్నానం, ఊష్మాలలో ఒకదానికి బదులుగా ఇంకొక దానిని పలుకడం ఉదా: దేశం - దేషం, ర -ఱ, ల - ళ, లను తారుమారు చేయడం ఉదా: ఱంపం - రంపం, కళ కళ - కల కల, సంయుక్తాక్షరాలను ద్విత్వాక్షరాలుగా పలుకడం, ఉదా: పాశ్చాత్య - పాచ్చాత్య మొ॥ నవి ఈ రకమైన ఉచ్చారణా దోషాలు.

పై విధమైన ఉచ్చారణా దోషాలు ఏర్పడటానికి 1. వాగింద్రియలోపం ఒక కారణం. ఈ వాగింద్రియ లోపాలను వైద్యుని (Doctor) సహాయంతో తొలగించటానికై ఉపాధ్యాయుడు కృషి చేయవలెను. 2. పరిసర ప్రభావం, శ్రద్ధగా వినకపోవడం అనేవి కూడా ఈ రకమైన దోషాలు ఏర్పడటానికి ఇంకో రకమైన కారణాలు. ఉపాధ్యాయుడు ఈ రకమైన దోషాలను గమనించి వానికి సరైన రూపాలను సూచింపవలెను.

# పఠనం

## 1. ఆవశ్యకత :-

భావ వినిమయమే భాషకు ప్రధాన ధ్యేయమైనపుడు ఈ భావ వినిమయంలో ప్రధాన స్థానమాక్రమిస్తున్నది భాషణం. అయితే భాషణం ద్వారా భావ వినిమయమనేది వ్యక్తులు ముఖాముఖిగా ఒకే చోట ఉన్నపుడు మాత్రమే సాధ్యమౌతుంది. అలా కాకుండా వారు దూర దూర ప్రాంతాల్లో, విభిన్న స్థితిలో ఉన్నపుడు వారి భావ వినిమయానికి భాషణం వీలుకాదు. అంతేకాక ఎప్పటికప్పుడు సమకాలంలోని నూతన జ్ఞాన విజ్ఞానాంశాల్ని గ్రహిండంతో పాటు గత కాలంలోని వ్యక్తుల అనుభవాల ఆధారంగా నిక్షేపింపబడిన జ్ఞానాంశాల్ని గ్రహించడం కూడ మానవుడి ప్రధాన కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణకు కూడా భాషణం ఒక్కటే సరిపోదు. అలాగే వ్యక్తులు తాము గ్రహించిన నూతన జ్ఞానాంశాలను సమకాలంలో ముఖాముఖిగా ఉన్న వ్యక్తులకు అందించడంతో పాటు భవిష్యత్కాలం వారికి కూడా అందించడానికై తపనతో నిరంతరం కృషి చేస్తూనే ఉంటారు. ఇట్టి ఈ స్థితిలో కూడా భాషణం నిరుపయోగమౌతుంది. అందుచేతక ఎదురుగ్గా ఉన్నవారికి కాక ఎక్కడో ఉన్నవారికి భావాన్ని చేరవేయాలన్నా, సమకాలీన జ్ఞానాంశలతో పాటు గతకాలపు జ్ఞానాంశాల్ని పొందాలన్నా, పొందిన జ్ఞానాంశాల్ని సమకాలపు వారికే కాక భవిష్యత్కాలపు వారికి కూడా అందిచాలన్నా అత్యంత ఆవశ్యకమైన ఏకైక సాధనం పఠనం. అందుచేత పాఠశాల దశలో విద్యార్థుల్లో పఠన నైపుణ్యాన్ని పెంపొందించవలసిన బాధ్యత ఉపాధ్యాయునిపై ఎంతైనా ఉన్నది. 'పాఠశాల' అనే పేరులోనే పఠనం యొక్క ప్రాధాన్య మేమిటో మనకు బోధకమౌతునే ఉన్నది. ఎట్లంటే పాఠాలకు శాలయే పాఠశాల. పఠనానికి సంబంధించినదే పాఠం కాబట్టి పాఠశాలలో పఠనం ప్రధాన భూమిక అని అర్థమౌతున్నది. భాషణాన్ని భూషణంగా తయారు చేయటంలో పఠనానిదే ప్రధానమైన స్థానం. ఇంతటి అపారమైన ఆవశ్యకతను కలిగిన పఠానాన్ని గుర్తించి దానిని విద్యార్థులలో పెంపొందిస్తూ వారిని ఉత్తమ పఠితలుగా ఉపాధ్యాయుడు తీర్చి దిద్దవలెను.

## ఉత్తమ పఠన లక్షణాలు

సాధారణంగా పఠనం ద్వారా రెండు రకాలైన ప్రయోజనాలు లభిస్తాయి. వ్యక్తి తనకు తానుగా తెలియని అంశాల్ని పఠనం ద్వారా తెలిసికోడం మొదటిది. ఇది వ్యష్టి ప్రయోజనానికి సంబంధించినది కాగా వ్యక్తి పఠనం ద్వారా తమకు తెలియని అంశాన్ని ఇతరులు తెలిసికోడం రెండోది. ఇది సమిష్టి ప్రయోజనానికి సంబంధించినది. ఇదే ప్రధానమైన ప్రయోజనం. నిరక్షరాస్యులకు ఏదైనా అంశాన్ని చదివిచేప్పేటపుడు, రేడియో, టెలివిజన్, వార్తా పత్రికలు లాంటి సాధనాలద్వారా వార్తలు మొదలైన వానిని చదివేటపుడు ఒక విషయాన్ని ఒకే సమయంలో అనేక మందికి చేరవేయాలన్నపుడు మొదలైన పరిస్థితుల్లో ఈ రకమైన సమిష్టి ప్రయోజనం సిద్ధిస్తున్నది. అందుకే ఎంత పఠించాడన్నది కాక ఎంత మందికి అర్థమయ్యే విధంగా పఠించాడన్నదే పఠనానికి పరమ ప్రధానమైన అంశమైనది. అదే ఉత్తమ పఠనం. దీని లక్షణాలు క్రింది విధంగా ఉన్నాయి.

1. స్పష్టంగా - నిర్దుష్టంగా పఠించడం. 2. దోష రహితంగా , సభా కంపం లేకుండా పఠించడం. 3. భావయుక్తంగా అర్థవంతంగా పఠించడం. 4. పదాల మధ్య, వాక్యాల మధ్య సరియైన వ్యవధానాన్ని పాటించడం. 5. విరామ చిహ్నాలను చక్కగా పాటించడం. 6. చక్కటి భావ ప్రకటనకు దోహదకారిగా భాషణాన్ని - పఠనాన్ని ఒకే రకమైన ఉచ్చారణతో సాగించడం. 7. నయన - వాఙ్మితుల్లో రెంటికీ సమ ప్రాధాన్యమిస్తూ ధారాళతను పాటించడం. 8. మెల్లిగా కాక శీఘ్రంగా కాక సమవేగంతో పఠించడం. 9. వాచికాభినయానికి ప్రాధాన్యమివ్వడం. 10. తగిన పదవిభాగంతో సరైన ఊనికతో (Stress), చక్కటి స్వరంతో (Tone) పఠించడం. 11. హీనస్వరం కాని, ఉచ్చ స్వరం కాని కాక స్వరంలో క్రమాన్ని పాటించడం. 12. వచన - గేయ పద్యాల మధ్య భేదం స్పష్టమయ్యే విధంగా పఠించడం.

**2. పఠన బోధనా పద్ధతులు :-**

విద్యార్థులను ఉత్తమ పఠితలుగా చేయటానికై పఠనావశ్యకతను గుర్తించిన ఉపాధ్యాయుడు దానిని ప్రాథమిక దశ నుండే వివిధ పద్ధతుల ద్వారా వారికి బోధించడం జరుగుతున్నది. అట్టి పఠన బోధనా పద్ధతులు క్రింది విధంగా ఉన్నాయి.

**అక్షర పద్ధతి :-**

ఇది అత్యంత ప్రాచీనమైన పద్ధతి. దీనిలో వర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకోవడం జరుగుతున్నది. ఈ పద్ధతి ప్రకారం వర్ణమాలలోని అక్షరాలన్నింటినీ మొదట వరుసగా చదువటానికి నేర్పించడం, తరువాత ఆయా అక్షరాలకు సంబంధించిన గుణింతాలను కూడా వరుసగానే చదువటానికి నేర్పించడం, ఆ తరువాత అక్షరాల కలయిక వలన ఏర్పడిన పదాలను, చివర్లో పద సముదాయమైన వాక్యాలను చదివిస్తూ పఠనాన్ని నేర్పించటం జరుగుతున్నది. ఇలా ఈ పద్ధతి అక్షరాన్ని చదివించటంతో ఆరంభింపబడి వరుసగా వాక్యాన్ని చదివింపచేయటంతో సంపూర్ణమౌతున్నది. ఇది అత్యంత ప్రాచీనమైన పద్ధతి. ఇది ఆధునికి మనోవిజ్ఞాన శాస్త్ర బోధనా నియమాలకు వ్యతిరేకమైనది. అందుకు క్రింధివి కారణాలౌతున్నాయి.

**లోపాలు :-**

1. ఒక్కొక్క అక్షరాన్ని విడివిడిగా అర్థరహితంగా చదివించటం వలన విద్యార్థుల అభిరుచి తగ్గిపోయి అనాసక్తి ఏర్పడడం . 2. ధ్వనికి - లిపికి సరియైన సంబంధం లేక పోవడం వలన విసుగుదల ఏర్పడడం. 3. అక్షరాలు, గుణింతాలు, సంయుక్తాక్షరాలు, ద్విత్వాలు మొదలగు వానిని విడివిడిగా నేర్పించడం వలన కాలం వృథా కావడం. 4. నిత్య వ్యవహారంలో ఉచ్చారణలో లేని క, గ్గ, చ, జ మొదలగు వానిని అనవసరంగా నేర్పించడం . 5. వాడుకలో అంతగా ఉపయోగపడని ఋ, ౠ, మొదలగు వానిని తక్కిన వానివలే నేర్పించడం వలన కొంత కాలహరణం జరగడం. 6. మనస్సుకు ఉత్సాహాన్ని కలిగించే బొమ్మలు మొదలైన ఉపకరణాలను ఉపయోగించకపోవడం.

**2. నవీనాక్షర పద్ధతి :-**

అక్షర పద్ధతిని కొంచెం మార్చడం ద్వారా నవీనాక్షర పద్ధతి ఏర్పడుతున్నది. దీనిలో కూడా

వర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకోవడం జరుగుతున్నది. ఈ పద్ధతి ప్రకారం నిత్య వ్యవహారంలో ఉపయోగంలో లేని వానిని వదిలివేసి అత్యంత సాధారణంగా ఉండే అక్షరాలను వర్ణమాలలో మాదిరిగా వరుసగా కాక వాని ఆకార సామ్యాన్ని బట్టి కొన్ని వర్గాలుగా విభజించి నేర్పించడం. ఏ వర్గంలోనూ చేరని అక్షరాలను చివరలో ప్రత్యేకంగా నేర్పించడం, ఆతరువాత ఆయా వర్గాలలోని అక్షరాలతో ఏర్పడిన పదాలను నేర్పించడం, క్రమంగా అవసరమైన గుణింతాలను, సంయుక్తాక్షరాలను నేర్పి అన్ని రకాలైన పదాలను వాక్యాలను నేర్పించడం. ఈ రకమైన నవీనాక్షర పద్ధతిని కూడా మనో విజ్ఞాన శాస్త్రవేత్తలు అంగీకరించటం లేదు. దానికి కారణం అక్షర పద్ధతిలోని లోపాలన్నీ ఈ పద్ధతిలో కూడా ఉండడమే. కాకపోతే ధ్వనికి లిపికి మధ్య సామ్యముండడం, అనవసరమైన వర్ణాలను నేర్పించక పోవడం అనే సుగుణాలు మాత్రం ఇందులో ఉన్నాయి.

ఇలా ఈ రెండు పద్ధతులు పఠన బోధనకు సరైనవి కాక పోవడం వలన ఆధునికులు మనో విజ్ఞాన శాస్త్రానుకూలంగా పద వాక్య కథా పద్ధతులనే మరో మూడింటిని ప్రవేశ పెట్టారు. ఈ మూడు కూడా చూచి చెప్పుట అనే సూత్రం మీద ఆధారపడ్డాయి.

**3. పద పద్ధతి :-**

పదాన్ని ప్రాతిపదికగా తీసికొని పఠనాన్ని నేర్పించడం ఇందులో ప్రధానమైన విషయం. ఈ పద్ధతిననుసరించి పఠనాన్ని బోధించటానికి మెరుపు అట్టలను (Flash Cards) ఉపకరణాలుగా ఉపయోగిస్తారు. ఒక్కొక్క పదాన్ని పఠింపచేయటానికి ఈ రకమైన మెరుపు అట్టలు ఒక సెట్ (నాలుగు రకాలు) అవసరమౌతాయి. ఇందులో ఒక దాని మీద విద్యార్థుల చేత పఠింపవలసిన పదాన్ని రాసి, దానికి పైన కాని, క్రింద గాని ఆ పదం సూచించే బొమ్మను చిత్రించవలెను. దీనినే 'గుర్తింపు అట్ట' అంటారు. రెండో అట్ట మీద ఒకవైపున బొమ్మను (మొదటి అట్ట మీది బొమ్మను) చిత్రించి రెండోవైపున దాని పేరును (మొదటి అట్ట మీది పదం పేరు) రాయవలెను. దీనిని 'స్వయం సవరణపు అట్ట' అంటారు. మూడో అట్ట మీద ఒకవైపున బొమ్మను మాత్రం చిత్రించి రెండో వైపును ఖాళీగా ఉంచవలెను. నాలుగో అట్ట మీద ఒకవైపున పదం పేరును మాత్రం రాసి రెండో వైపున ఖాళీగా ఉంచవలెను. ఈ మూడు నాలుగు అట్టల రెండింటినీ కలిపి 'జతకూర్పు అట్టలు ' అంటారు. ఈ విధంగా మెరుపు అట్టలను సిద్ధ పఱచుకొన్న తరువాత క్రింది విధంగా పఠన బోధనను నిర్వహింపవలెను.

**నిర్వహణ**

మొదటి అట్టలను (గుర్తింపు అట్టలను) తీసికొని వాని మీద ఉన్నట్టి బొమ్మలను విద్యార్థులకు చూపించి వాని పేర్లే ఇవి అని అక్కడున్నట్టి పదాలను చదివించవలెను. పదాలతో పాటు ఆ పదాలలో ఉండే అక్షరాలను విడివిడిగా చదివించవలెను. ఈ విధంగా గుర్తింపు అట్టల మీది పదాలను గుర్తించేంత వరకు కొంత అభ్యాసాన్ని ఇవ్వవలెను. తరువాత స్వయం సవరణపు అట్టలను (రండో అట్ట) తీసుకొని వానిలోని పదం పేరున్న వైపును విద్యార్థులకు ముందుగా చూపించి ఆ పదాలను చదివించవలెను. విద్యార్థులుతప్పుగా చదివిన యెడల అట్టలను త్రిప్పి వాని రెండో వైపును (బొమ్మ ఉన్నట్టి వైపు) చూపించవలెను. దీనితో విద్యార్థులు తమ తప్పును

సరిదిద్దుకో గలరు. ఈ విధంగా కొంత అభ్యాసమిచ్చిన తరువాత జత కూర్పు అట్టలను తీసికొని ఆయా బొమ్మలున్న అట్టలకు ఎదురుగా ఆయా పదాలున్న అట్టలను జత చేయవలెను. ఆ విధంగా అభ్యాసమిస్తూ క్రమంగా పెద్ద పెద్ద పదాలను (ఎక్కువ అక్షరాలున్న పదాలు) ద్విత్వ - సంయుక్తాక్షరాలున్న పదాలను పఠింప చేయవలెను. తరువాత రెండు మూడు పదాలున్న చిన్న వాక్యాలను, ఆతరువాత పెద్ద పెద్ద వాక్యాలను చదివించడం నేర్పించవలెను.

**ప్రయోజనాలు:-**

1. అర్థవంతమైన పదాలతో పఠనం సాగడం వలన ఈ పఠనం వినుగుదలను కోల్పోయి ఆకర్షణీయంగా సాగుతుంది. 2. మనసును ఆకట్టుకునే బొమ్మలుండడం వలన పఠనం ఆహ్లాదకరంగా సులభంగా సాగుతుంది. 3. ఈ పఠనం వలన ఇటు విద్యార్థులకు, అటు ఉపాధ్యాయునికి శ్రమ తగ్గుతుంది. 4. పఠనం శీఘ్రగతిన సాగుతుంది.

## 4. వాక్య పద్ధతి :-

వాక్యాన్ని ప్రాతిపదికగా తీసికోటం ఇందులో ప్రధానమైన విషయం. ఈ పద్ధతి ప్రకారం పఠనాన్ని బోధించడానికి 'వాక్య పత్రాలు' (Sentence Charts) ఉపకరణాలుగా ఉపయోగపడతాయి. ఒక్కొక్క వాక్యాన్ని బోధించటానికి ఒక సెట్ (నాలుగు) వాక్య పత్రాలు అవసరమౌతాయి., పద పద్ధతిలో నాలుగు రకాలైన మెరపు అట్టలను తయారుచేసికొన్నట్లే ఇక్కడ కూడా గుర్తింపు పత్రాలను, స్వయం సవరణపు పత్రాలను, జతకూర్పు పత్రాలను తయారు చేసి కోవలెను. పద పద్ధతి మాదిరిగానే ఇక్కడ కూడ మొదట గుర్తింపు పత్రాలను చూపించి పదాలను, వానిలోని అక్షరాలను గుర్తింపచేయవలెను. ఇలా కొంత అభ్యాసమిచ్చిన తరువాత, స్వయం సవరణపు పత్రాలను తీసికొని ఆయా వాక్యాలను గుర్తింప చేస్తూ అవసరమైతే సవరింపచేయవలెను. ఆ తరువాత జతకూర్పు పత్రాల సహాయంతో ఆయా బొమ్మలను ఆయా వాక్యాలతో జతచేయవలెను. క్రమంగా పెద్ద పెద్ద వాక్యాలను కూడా ఇదే పద్ధతిలో పఠింపచేస్తూ పఠనాన్ని సంపూర్ణం చేయింపవలెను.

**ప్రయోజనాలు:-**

పద పద్ధతిలోని ప్రయోజనాలన్నీ దీనిలో ఉండడమే కాక దానికన్నా ఇదే మెరుగైనదిగా కనిపిస్తున్నది. కారణమేమనగా వాక్యాల వలన విద్యార్థులకు భావం అర్థమౌతుంది. దాని వలన పఠనం మరికొంత శీఘ్రంగా సాగుతుంది.

## 5. కథా పద్ధతి :-

కథను ప్రాతిపదికగా తీసికోడం ఇక్కడ ప్రధానమైన విషయం. ఈ పద్ధతి ప్రకారంపఠనాన్ని బోధించటానికి 'కథా చిత్రాలను' (Story Charts) ఉపకరణాలుగా ఉపయోగిస్తారు. ఆకర్షణీయంగా, ఆహ్లాదకరంగా ఉండే కథనొక దానిని తీసికొని దానిని కొన్ని వాక్యాలుగా విభజించుకోవాలి. ఈ వాక్యాలను ఒక క్రమంలో ఒక పెద్ద అట్ట మీద రాసికొని, ఆ వాక్య భావాలు సూచించే బొమ్మలను ఆయా వాక్యాల పై భాగంలో చిత్రించవలెను. ఈ అట్టను 'గుర్తింపు కాథా చిత్రం' అంటారు. ఆ తరువాత పద - వాక్య పద్ధతుల్లో మాదిరిగానే 'స్వయంసవరణపు కథా చిత్రాన్ని' 'జతకూర్పు

కథా చిత్రాన్ని' తయారు చేసికోవలె. ఈ విధంగా కథా చిత్రాలను సిద్ధం చేసికొన్న తరువాత ముందుగా గుర్తింపు కథా చిత్రాన్ని తీసికొని మొత్తం కథను బొమ్మల సహాయంతో ఒక క్రమంలో చదివేటట్లు అభ్యాసం ఇవ్వవలెను. ఈ అభ్యాసంలో కథలోని వాక్యాలను, వాక్యాలలోని పదాలను, పదాలలోని అక్షరాలను గుర్తించేటట్లు చూడ వలెను. ఆ తరువాత పద వాక్య పద్ధతుల్లో మాదిరిగానే స్వయం సవరణపు కథా చిత్రం, జతకూర్పు కథా చిత్రాల సహాయంతో కథాంశాన్ని పఠింప చేయవలెను.

**ప్రయోజనాలు:-**

పదవాక్యపద్ధతుల్లోని ప్రయోజనాలన్నీ ఈ పద్ధతిలో ఉండటమే కాక ఆ రెండు పద్ధతులకంటే కూడా ఈ పద్ధతి అత్యంత మేలైనదని మనో విజ్ఞాన శాస్త్రవేత్తల తలంపు. అందుకు కారణం ఈ పద్ధతిలో కథ ప్రాతిపదికకావడం, కథలపై విద్యార్థులకు అనురక్తి అధికంగా ఉండడం, వాక్యాలకంటే కూడా కథలు అత్యంత భావస్ఫూర్తిగా ఉండడం, కథా చిత్రాలు విద్యార్థులను అధికంగా ఆకర్షించడం, పఠనం అత్యంత సహజ స్థితిలో సాగడం మొ..వి. అందుచేతక ఆ రెండు పద్ధతుల కంటే ఈ పద్ధతే అత్యంత ప్రయోజనకరమైనది.

## పఠనాభ్యసన పద్ధతులు

పఠన బోధన పద్ధతుల ద్వార పఠనాన్ని బోధించిన తరువాత దానిని విద్యార్థుల చేత అభ్యసింప చేయవలసి ఉంటుంది. ఇలా పఠనాన్ని అభ్యసింప చేయడంలో రెండు పద్ధతులు కనిపిస్తున్నాయి.

**1. సాముదాయిక పద్ధతి** (సాముదాయిక పఠనం):-

విద్యార్థులందరి చేత ఒకే సారి పఠింప చేయడమే సాముదాయిక పద్ధతి. దీనినే 'సాముదాయిక పఠన'మంటారు. దీని వలన ఒకేసారి విద్యార్థులందరిచేత పఠింపచేయవచ్చు. విద్యార్థులందరూ ఒకేసారి పఠించడం వలన కాలం కలిసివస్తుంది. ఈ ప్రయోజనాలున్నప్పటికీ దీనిలో లోపాలు అత్యధికంగా ఉన్నాయి. విద్యార్థులందరి పఠన దోషాలను ఒకే సారి సవరించడం ఉపాధ్యాయునికి వీలుకాక పోవడం, విద్యార్థుల మూక పఠనంలో ఉత్తమ పఠన లక్షణాలు ఉన్నదీ లేనిదీ గమనించడం ఉపాధ్యాయునికి కష్టం కావడం, ఉపాధ్యాయుడు గమనించడం లేదని తెలిసికున్న విద్యార్థులకు పఠనంపై శ్రద్ధ తగ్గిపోవడం, అందరు ఒకే సారి చదవడం వలన ఎవరేమి చదువుచున్నది వారికే తెలియక పోవడం మొ..వి ఇందులో కనిపెంచే లోపాలు.

**2. వైయక్తిక పద్ధతి** (వైయక్తిక పఠనం) :-

ఒక్కొక్క విద్యార్థిని వ్యక్తిగతంగా పఠింపచేయడమే వైయక్తిక పద్ధతి. దీనినే 'వైయిక్తిక పఠన'మంటారు. ఈ రకమైన పఠనం వలన పఠనాభ్యసనం కొంత ఆలశ్యంగా జరిగినప్పటికీ, ఉపాధ్యాయుడు అధికంగా శ్రమపడవలసి వచ్చినప్పటికీ ప్రాథమిక దశలో ఈ పద్ధతే అత్యంత ప్రయోజనకరమైనది. సాముదాయిక పఠనంలోని లోపాలన్నీ దీనిలో లేక పోవడమే అందుకు

కారణం. అయితే ఒక విద్యార్థి చదువుచున్న సమయంలో అందలి దోషాలను చూసి ఇతర విద్యార్థులు పరిహరించకుండా ఉండే విధంగా ఉపాధ్యాయుడు జాగ్రత్త పడవలెను.

## పఠన భేదాలు (పఠన రకాలు) :-

పఠనం జరిగే తీరును బట్టి దీనిని రెండు రకాలుగా విభజించారు. వీటినే పఠనభేదాలని కూడా వ్యవహరిస్తున్నారు. అవి 1. ప్రకాశ పఠనం. 2. మౌన పఠనం.

**1. ప్రకాశ పఠనం :-**

దీనికే 'బాహ్య పఠన'మని మరో పేరున్నది. వాగింద్రియాల సహాయంతో శబ్ద రూపంగా, ఎదురుగా ఉండే శ్రోతలకు వినపడేటట్లు మౌఖిక రూపంలో చేసే పఠనమే ప్రకాశపఠనం.

**సుగుణాలు :-**

1. ఈ పఠనం ద్వారా పఠనాంశం పఠితకు అర్థమౌతుంది. 2. అలాగే శ్రోతలకు కూడ అది చక్కగా స్పష్టమౌతుంది. 3.ఉత్తమ పఠన లక్షణాలను ఈ పఠనంలో గమనించటానికి, దోషాలున్నపుడు సవరించటానికి వీలున్నది. 4.పఠన బోధన - పఠనాభ్యసనాలుఈ పఠనం ద్వారానే సాగును. 5.ప్రాథమిక - మాధ్యమిక దశ విద్యార్థులు తమలో తాము మౌనంగా చదుకోవడం కష్టం. కాని ఈ పఠనం ద్వారా అది చాలా సులభం. 6.ఈ పఠనం వలన పద్యాల -పాటలలోని లయను గ్రహించి ఎక్కువ ఆనందాన్ని పొందవచ్చును: 7. కంఠస్తం చేయవలసిన అంశాలను ఈ పఠనం ద్వారా సులభంగా చేయవచ్చు.8. పఠన ప్రక్రియకంతటికీ దాదాపుగా ఇదే ఆధార భూమికగా కనిపిస్తున్నది.

**లోపాలు**

వాఙ్మితి, నయన మితుల మధ్య వ్యత్యాసం ఉండడం వలన పఠనం వేగవంతంగా సాగడం కష్టం. ఈ పఠనం ప్రకాశవంతంగా (బిగ్గరగా)ఉండడం వలన ప్రక్కవారికి అసౌకర్యం కలుగును. అలాగే ఈ పఠనం వలన వాగింద్రియాలు శ్రమపడును.

**ప్రకాశపఠనాన్ని పెంపొందించే మార్గాలు**

1. పాఠ్యాంశ పఠనం:-ప్రకాశ పఠనంలో అతిస్వల్ప లోపాలున్నప్పటికి పఠన ప్రక్రియ అంతా దాదాపుగా దీని పైననే ఆధారపడి ఉండడం వలన దీని ఆవశ్యకతను గుర్తించి ఉపాధ్యాయుడు దీనిని పెంపొందించ వలెను. అందుకై క్రింది మార్గాలు ఉపకరిస్తాయి. తరగతి గదిలో ఉపాధ్యాయుడు భోధనాంశాన్ని ఉత్తమ పఠన లక్షణాలన్నీ సమన్వయించే విధంగా ఆదర్శ పఠనం చేసి అదే రీతిలో విద్యార్థులను పఠింప చేస్తూ ప్రకాశపఠనాన్ని పెంపొందించవలెను. అవసరమైనపుడు భోధనానంతరం కూడ పాఠ్యాంశాన్ని విద్యార్థుల చేత పఠింపచేస్తూ దీనిని పెంపు చేయవలెను. అవసరమైన విషయాలను కంఠస్తం చేయిస్తూ కూడ దీనిని ఎక్కువ చేయవలెను.

**2. పఠన పోటీలు**

అర్థవంతంగా - భావ భరితంగా - దోషరహితంగా పఠించడంలోనూ, పద్యానికి - గద్యానికీ - గేయానికి మధ్య గల భేదం స్పష్టమయ్యే విధంగా పఠించటంలోను, వివిధ కవుల కవితాశైలుల్లో భేదం స్పష్టమయ్యే విధంగా పఠించడంలోనూ, ఊనిక - స్వరం - కాకువు లాంటి వానిని గుర్తించే విధంగా పఠించడంలోను, నవరసభావాలు అర్థమయ్యే రీతిలో పఠించడంలోనూ పఠనపోటీలను నిర్వహించి ప్రకాశపఠనాన్ని పెంపొందింపవలెను.

**3. వార్తా పఠనం.**

ప్రపంచ జ్ఞానాంశాలకు ప్రతిరూపాలైన వార్తా పత్రికలను (దిన - వార -పక్ష -మాసపత్రికలు) పఠింపచేయడం, సాహిత్య - కళ - సాంస్కృతికాది పత్రికలను పఠింప చేయడం, వ్యవసాయ - ఆర్థిక - రాజకీయాది వివిధ రంగాలకు చెందిన పత్రికలను చదివింప చేయడం మొ..న వాని ద్వారా ప్రకాశపఠనాన్ని అభివృద్ధి పఱచవలెను.

**4. రేడియో**

ఆకాశవాణిలో వివిధ వ్యక్తుల వ్యక్తీకరణ వైవిధ్యాలను గుర్తింపచేయడం, వివిధ ఉపన్యాసాల్లో విశేషాలను తెలియచేయడం, విద్యార్థుల చేత ఆకాశ వాణి కార్యక్రమాలను ఇప్పించడం మొ..న రీతుల్లో దీనిని వృద్ధి పఱచవలెను

**5. టేపు రికార్డరు**

ప్రసిద్ధమైన వ్యక్తుల ఉపన్యాసాలను, చర్చలను గోష్ఠులను టేపు చేయించి విద్యార్థులకు వినిపించడం, విద్యార్థుల పఠనాన్ని టేపు చేయించి తిరిగి వానిని వారికి వినిపిస్తూ అందలి దోషాలను సవరిస్తూ పఠనంలోని మెలుకువలను తెలియ చేయవలెను.

**6. కవి సమ్మేళనాలు**

కవి సమ్మేళనాల్లో వివిధ కవుల కవితల్ని , కథల్ని వ్యాసాల్ని విద్యార్థులకు వినిపించడం విద్యార్థుల కవితల్ని, కథల్ని ఆ సమ్మేళనాల్లోనే పఠింపచేయడం మొ.. న వాని వలన పఠనాన్ని పెంపొందించవచ్చు.

**2. మౌన పఠనం.**

వాగింద్రియ ప్రమేయం లేకుండా కేవలం చూపుమేరతో(కేవలం కంటితో )బాహ్య పఠనంలో మాదిరిగా విషయ గ్రహణం చేస్తూ పఠనాంశాన్ని మౌనంగా పఠించడమే మౌన పఠనం.

**సుగుణాలు**

1. వాగింద్రియ శ్రమ ఉండదు. 2. ఇందులో పఠనం శీఘ్రగతిన సాగును.3. విషయ గ్రహణం కూడ వేగంగా జరుగును. 4. ఎక్కువ సేపు పఠించడానికి వీలుండును.5. ఒకే చోట ఒకే సారి అనేక మంది చదువుకోటానికి వీలుంది. 6. విస్తార పఠనాన్ని ఎక్కువగా

పెంపొందించకోవచ్చు. 7. గ్రంథాలయాలు, పఠన మందిరాలు మొ..న సామూహిక జన ప్రదేశాల్లో ఈ పఠనం వలన ఎలాంటి అసౌకర్యం కలుగదు. 8. ఉపన్యాసాలు, చర్చలు గోష్ఠులు, సభలు మొ..న వాటిల్లో పాల్గొనే ముందు పాల్గొనదలచిన అంశాన్ని పునశ్చరణ చేసికోవటానికి ఇది ఉపకరించును. 9. బాహ్యంగా పఠించటానికి వీలుకాని రహస్యాంశాల్ని సులభంగా పఠించవచ్చు. అయితే ఈ మౌన పఠనంలో ఒక్కొక్క సారి కొంతమంది చదువుతున్న ట్లే ఉంటారు. కాని విషయాన్ని గ్రహించలేరు. మరికొంత మంది చదివిన వెంటనే విషయాన్ని గ్రహించలేక చదివిన దానినే మరలా వెనక్కి త్రిప్పి చదవడం జరుగుతుంది. ఇలాంటి సమయాల్లో పఠింపదలచిన అంశంపై పఠితకు సరైన అవగాహన, అభ్యాసం, అనురక్తి లేక పోవడమే కారణం తప్ప వీనిని మౌన పఠన లోపాలుగా మనం భావించలేం. అయితే సహజంగా కనిపించే ఉచ్చారణ- భావ -భాష దోషాలను ఈ పఠనంలో సరిచేసికోటానికి వీలులేదు. అంతే కాక ఈ పఠనం వ్యష్టి ప్రయోజనానికి సంబంధించిందే తప్ప సమిష్టి ప్రయోజనానికి సంబంధించినది కాదు. పైగా మౌన పఠనం ద్వారా గ్రహించిన విషయాన్ని ఎక్కువ కాలం గుర్తుంచుకోటం కూడ కష్టమే.

**మౌనపఠనాన్ని పెంపొందించే మార్గాలు :-**

మౌన పఠనంలో ప్రయోజనాలు అధికంగా ఉండడం వలనా, ప్రాథమిక దశలో బాహ్య పఠనం ఎంత ముఖ్యమో ఉన్నత దశలో మౌన పఠనం అంత ముఖ్యం కావటం వలనా విద్యార్థుల్లో దీనిని పెంపొందించ వలసిన బాధ్యత ఉపాధ్యాయునిపై ఎంతైనా ఉన్నది. క్రింది మార్గాలు అందుకు దోహదపడతాయి.

**ప్రాథమిక దశ :-**

ప్రాథమిక దశలో కంటే మాధ్యమికోన్నత దశల్లో మౌన పఠనానికి అత్యధిక ప్రాధాన్యం ఉండడం వలన ప్రాథమిక దశలో దానిపై ప్రత్యేక కృషి అవసరం లేదు. అయినప్పటికీ ఆ దశలో దానిని విద్యార్థులకు అలవాటు చేయటం కోసం కొంత కృషి చేయవలసి ఉంటుంది. 1. నల్లబల్లపై రాసిన మాటల్ని గమనింపచేయటం. 2. వాచకాలలోని పాఠ్యాంశాల్ని చూసి రాయించడం. 3. పాఠశాల గోడలపై ఉన్నట్టి సూక్తుల్ని, సామెతల్ని గమనింపచేయడం. 4. ఆసక్తి కరంగా బొమ్మలున్నట్టి చిన్న చిన్న పుస్తకాల్ని చదిపింప చేయటం. 6. కథల్ని చదివింప చేయటం మొ.. న వాని ద్వారా ఈ దశలో మౌన పఠనాన్ని పెంపొందించవచ్చు.

**మాధ్యమికోన్నత దశలు**

ఈ దశల్లో మౌన పఠనానికి అధిక ప్రాధాన్యముండడం వలన ఉపాధ్యాయుడు వివిధ మార్గాల ద్వారా దీనిని పెంపొందించ వలసి ఉంటుంది.

**1. పాఠ్యాంశ బోధన :-**

పాఠ్యాంశాన్ని బోధించేముందు ఉపాధ్యాయుడు విద్యార్థుల చేత ప్రకాశ పఠనం చేయించి ఆ తరువాత మౌన పఠనం చేయిస్తాడు. ఉత్తమ పఠన లక్షణాలను ప్రకాశపఠనం ద్వారా పెంపొందింప చేస్తూ విషయాన్ని వేగంగా గ్రహింపచేయటం కోసం కొద్ది నిముషాల పాటు మౌన పఠనం చేయిస్తాడు.

ఇట్లు దీనిని అనుదినం చేయిస్తూ అభివృద్ధి పఱచవలెను.

**2. పఠన పోటీలు :-**

ఉపాధ్యాయుడు విద్యార్థుల పఠన వేగ శక్తిని, విషయ గ్రహణశక్తిని పరీక్షించే నిమిత్తం మౌన పఠనంలో పోటీలను నిర్వహించవచ్చు. ఏదైనా ఒక అంశాన్ని తీసికొని దానిని ఒక్కొక్క విద్యార్థి చదవటానికి పట్టిన కాలాన్ని రికార్డు చేసి వీరి పఠన వేగాన్ని గుర్తించవలె. అలాగే ఆ అంశం పై కొన్ని ప్రశ్నలను వేసి వారిచ్చే సమాధానాలను బట్టి వారి విషయ గ్రహణ శక్తిని నిర్ణయించవలెను. ఈ విధమైన పోటీలతో మౌన పఠనాన్ని పెంపొందించవచ్చు.

**3. ఉపవాచకం :-**

ఆయా తరగతులకు నిర్దేశింప బడిన ఉపవాచకాలను విద్యార్థులచేత మౌనంగా చదివింప చేసి కొన్ని ప్రశ్నలను వేసి సమాధానాలను రాబట్ట వలెను. సరైన సమాధానాలు రానపుడు మరలా మౌన పఠనం చేయించవలెను. ఈ విధంగా ఉప వాచకం ద్వారా మౌన పఠనాభ్యాసాన్ని పెంపొందింపవలెను.

**4. పత్రికలు :-**

విద్యార్థులకు ఉపయోగపడే వివిధ రకాలైన దిన- వార -పక్ష- మాస పత్రికలను తీరిక సమయాల్లో వారిచేత చదివించే నిమిత్తం వానికి సంబంధించి కొన్ని నియోజనాలను ఇచ్చి సమాధానాలను రాయించ వలెను. వానిని పరీక్షిస్తూ వారిలో ఆయా అంశాలపె మౌన పఠనాన్ని పెంపొందింపవచ్చు.

**5. గ్రంథాలయాలు :-**

విద్యార్థులకు విజ్ఞానం , వినోదం, ఉల్లాసం, ఆనందం, మొ..వి కలిగించే నిమిత్తం ఆయా అంశాలున్నట్టి పుస్తకాల్ని చదివించుటకై వారానికి ఒకటి లేదా రెండు పీరియడ్లు కేటాయించి గ్రంథాలయానికి పంపవలెను. గ్రంథాలయంలో వారా పుస్తకాల్ని మౌనంగా పఠించేట్లు చూస్తూ వారిలో మౌన పఠనాభ్యాసాన్ని పెంపు చేయవచ్చు.

**6.పర్యవేక్షణాధ్యయనం:-**

కొన్ని ప్రత్యేక కారణాల వలన పాఠ్యాంశాన్ని బోధించటానికి ఉపాధ్యాయుడు సంసిద్ధంగా లేనపుడు అత్యంత ఆసక్తి కరంగా ఉండే పుస్తకాల్ని తరగతి గదిలోనే విద్యార్థులకిచ్చి మౌనంగా చదివించవచ్చు. అలాంటి పుస్తకాలు లభించనపుడు పాఠ్యాంశాలనైనా మౌనంగా చదివిస్తూ ఈ మౌన పఠనాభ్యాసాన్ని ఎక్కువ చేయవచ్చు.

**1. అధ్యయన భేదాలు :-**

ఒక పుస్తకాన్ని లేద గ్రంథాన్ని అధ్యయనం (పఠనం )చేసే తీరు ప్రధానంగా రెండు రకాలుగా ఉంటుంది. 1. క్షుణ్ణాధ్యయనం. 2. విస్తార పఠనం. వీటినే అధ్యయన రకాలు లేద అధ్యయన

భేదాలు అంటారు.

**1. క్షుణ్ణాధ్యయనం:**

క్షుణ్ణ పఠనం అనికూడా దీనికి పేరు. ఏదైనా ఒక అంశాన్ని లేదా విషయాన్ని నిశితంగా, సూక్ష్మ దృష్టితో అత్యంత బాహ్యా లేద మౌన రూపంలో పఠిస్తూ విషయాన్ని నెమ్మదిగా గ్రహించటమే క్షుణ్ణాధ్యయనం. పాఠ్యాంశాన్ని అత్యంత లోతుగా తరచి తరచి స్పష్టంగా, సంపూర్ణంగా అధ్యయనం చేయటం ఇక్కడ జరుగును. అయా తరగతులకు నిర్దేశింపబడిన వాచకాలు (Detailed Texts) ఈ క్షుణ్ణాధ్యయనం ద్వారానే బోధింపబడతాయి. భాషాంశాలకు సంబందించిన కఠిన పదాలకు అర్థాలు, నానార్థాలు, పర్యాయ పదాలు, వ్యతిరేక పదాలు, లింగ భేదక శబ్దాలు, సంధులు సమాసాలు, ప్రకృతి - వికృతులు, తత్సమ తద్భవాది శబ్ద రూపాలు, వివిధ రకాలైన వాక్య నిర్మాణాలు మొ..న వ్యాకరణాంశాలు, పలుకు బళ్ళు, జాతీయాలు, సూక్తులు, మొ..న భాషా :జీవ నాడులు, సాహిత్యాంశాలకు సంబంధించిన వివిధ రకాలైన పద్యాలు, వాని నడకలు, శైలి భేదాలు, అర్థ తాత్పర్యాలు, భావ సౌందర్యం, ఛందస్సు, అలంకారాలు, వివిధ రకాలైన కవులు,వారి వ్యక్తిత్వాలు, కవితా సౌందర్యాలు, విషయాంశాలకు సంబంధించిన విషయ గ్రహణ తీరు, దాని ధారణ శక్తి, వినియోగ తీరు, వ్యక్తీకరణ తీరు మొ..న వన్నీ శబ్ద నిర్మాణంతో మొదలై దాని అర్థ నిర్ణయంతో పాటు కావ్య నిర్మాణాం వరకు సర్వాంశాలు ఈ క్షుణ్ణాధ్యయనం ద్వారానే అధ్యయనం చేయబడతాయి.

**2. విస్తార పఠనం :-**

విస్తారాధ్యయనమని కూడ దీనికి పేరు. ఏదైనా ఒక అంశాన్ని లేదా విషయాన్ని క్షుణ్ణాధ్యయనంలో మాదిరిగా కాక కేవలం స్థూల రూపంలో అత్యంత వేగంగా గ్రహించటానికి బాహ్యాంగా లేదా మౌనంగా చేసే పఠనమే విస్తార పఠనం. భాషా సాహిత్యాంశాలకన్నా ఇది విషయాంశాలకు అత్యంత ప్రాధాన్యమిస్తుంది. విషయాన్ని అత్యంత వేగంగా, విస్తృత స్థాయిలో పొందటానికి ఈ పఠనం ఎంతగానో ఉపకరిస్తుంది. అందుకే దీనిని కొందరు 'విస్తృత పఠనం 'గా కూడా పిలుస్తారు. ఈ విస్తృత పఠనానికి బాహ్యా పఠనం కంటే మౌన పఠనమే అత్యంత అనుకూలంగా ఉంటుంది. ఈ విధంగా విస్తృతమైన జ్ఞానాంశాల్ని అతి తక్కువ కాలంలో అత్యంత శీఘ్ర గతిన పొందటానికి చక్కటి సాధనంగా విస్తార పఠనం ప్రాధాన్యాన్ని పొందినది. పైగా క్రింది ప్రయోజనాలు కూడా దీని వలన సమకూరుతున్నవి.

**ప్రయోజనాలు**

1. ఇది మౌన పఠనానికి అత్యంత ప్రాధాన్యమివ్వటం వలన మౌన పఠన ప్రయోజనాలన్నీ దీనికి కూడ వర్తిస్తున్నవి. 2. విస్తృతమైన జ్ఞానాంశాలను పొందటానికి ఇది ఉపకరిస్తుంది. 3. అనేక రకాలైన పుస్తకాల్ని అతి తక్కువ కాలంలో చదవటానికి వీలున్నది. 4. తమంత తాముగా పుస్తకాల్ని పఠించి విషయాన్ని గ్రహించే తీరును ఇది పెంపొందిస్తుంది. 5. తీరిక సమయాన్ని చక్కగా వినియోగించుకోటానికి వీలౌతుంది. 6. దీని ద్వారా సాహిత్య పరిచయం విస్తృతమౌతుంది. 7. క్షణ్ణాధ్యయనం వలన కలిసిన విసుగును తొలగించుకోటానికి ఇది పనికి వస్తుంది.

**విస్తార పఠనాన్ని పెంపొందించే మార్గాలు :-**

విస్తార పఠనం వలన అనేకర ప్రయోజనాలు ఉండడం వలన విద్యార్థుల్లో దానిని పెంపొందించటానికి ఉపాధ్యాయుడు కృషి చేయవలెను. అయితే విస్తార పఠనమంతా దాదాపుగా మౌన పఠన రూపంలో సాగుతుండడం వలన మౌన పఠనాన్ని పెంపొందించే మార్గాలన్ని కూడ విస్తార పఠనాన్ని పెంపొందిస్తాయి. ఆయా మార్గాలను పైన వివరించడం జరిగినది. ఇవి కీక విస్తారపఠనాన్ని పెంపొందించటానికి క్రింది మార్గాలు కూడా ఉపకరిస్తున్నాయి.

**1. పాఠశాల పత్రిక:-**

ఉపాధ్యాయుడు పాఠశాల పత్రికను నిర్వహిస్తూ అందుకు అవసరమైన వివిధ రకాలైన రచనలను, రాయవలసినదిగా విద్యార్థులను కోర వలెను. విద్యార్థులు అలాంటి రచనలను రచించటానికి ఆదర్శవంతంగా ఉండే కొన్ని పుస్తకాలను ఉపాధ్యాయుడే సూచించ వలెను. వానిని విద్యార్థులు విస్తృత పఠనంతో పఠిస్తూ అవసరమైన వానిని గ్రహించెదరు.

**2. సారస్వత సంఘాలు :-**

ఉపాధ్యాయుడు సారస్వత సంఘాలను నిర్వహించవలెను. అట్టి సారస్వత సంఘాల్లో జరిగే వివిధ రకాలైన వక్తృత్వ పోటీలు, చర్చలు, ప్రసంగాలు, గోష్ఠులు, వాద వివాదాలు మొ..న కార్యక్రమాల్లో విజయవంతంగా పాల్గొనటం కోసం విద్యార్థులు వానికి సంబంధించిన వివిధ రకాలైన పుస్తకాల్ని విస్తృతంగా పఠించెదరు.

**3. పుస్తక ప్రదర్శనలు :-**

పాఠశాలలో అపుడపుడు పుస్తక ప్రదర్శనల్ని ఏర్పాటు చేసినచో వాటిల్లో ప్రదర్శించే నిమిత్తం విద్యార్థులు వివిధ రకాలైన పుస్తకాల్ని సేకరించి వాటిల్లో ఉత్తమమైన వాని కోసం వానినన్నింటినీ విస్తార పఠనంతో పఠించెదరు.

## లేఖనం

**లేఖనావశ్యకత**

ధ్వని (Sound) రూపంలోని భాషాంశం లిపి (Script) రూపాన్ని సంతరించుకోటమే లేఖనం. అనగా ధ్వనిని లిఖించటమే లేఖనం. వ్యక్తీకరింపబడిన వెంటనే క్షీణించిపోయే అశాశ్వతమైన ధ్వనిని పదికాలాల పాటు నిలబెడుతూ దానికి శాశ్వతత్వాన్ని చేకూర్చేదే లేఖనం. కేవలం వినబడే గుణమున్న ధ్వనికి చూడబడే గుణాన్ని ఆపాదించేది ఈ లేఖనమే. లేఖనం లేకుంటే పఠనం కూడ లేదు. ఈ పఠన లేఖనాలు రెండు లేకుంటే భాషకు స్థితి - సార్థకత రెండూ లేవు. అనగా భాష భాషలాగా చలామణి కాలేదన్నమాట. అందుకే భాషావ్యాపారంలో ఈ రెండు రైలు పట్టాలాంటివి. వీటిల్లో ఒకదానికెంతటి ఆవశ్యకత ఉన్నదో అంతే, అదే ఆవశ్యకత రెండో దానికి కూడా ఉన్నది. కాబట్టి పఠనావశ్యకతే లేఖనావశ్యకత కూడ అవుతున్నది.

## లేఖన బోధన విధానం.

విద్యార్థులు పాఠశాలలో 1 తరగతిలో ప్రవేశించగానే వారికి అక్షరాభ్యాసం మొదలౌతుంది. ఒకదాని తరువాత మరొక దానిని పలక మీద దిద్దబెడుతూ వర్ణమాలలోని అక్షరాలన్నింటినీ విద్యార్థులకు ఉపాధ్యాయుడు నేర్పిస్తాడు. తరువాత గుణింతాలన్నింటినీ దిద్దించి నేర్పిస్తాడు. ఆ తరువాత చిన్న చిన్న పదాలను రాయించడం, చదివించడం, నేర్పిస్తూ క్రమంగా వాచకాన్ని (Text) మొదలు పెడతాడు. ఈ విధంగా వాచకాన్ని ప్రవేశ పెట్టటానికి సాధారణ విద్యార్థికి కనీసం రెండు సంవత్సరాల కాలం పట్ట వచ్చు. నేర్చుకొన్న అక్షరాలను సులభంగా గుర్తిస్తారనే ఒకటి రెండు ప్రయోజనాలు తప్ప లోపాలే ఇక్కడ ఎక్కువ ఉన్నాయి.

### లోపాలు

1. అర్థంలేని అక్షరాలను దిద్దుతుండడం వలన విద్యార్థుల్లో విసుగుదల పెరుగును. 2. వర్ణమాలలోని అవసరమున్న అక్షరాలతో పాటు అనవసరమైన అక్షరాలన్నిటినీ నేర్పించుట వలన కాలం వృధా అగును. 3. అక్షరాలను నేర్చుకోటం పోయి దిద్దు కోటంతోనే విద్యార్థులు సరిపుచ్చుకోవచ్చు. 4. పలకమీది అక్షరాన్ని ఒకేసారి లావుగా బండదిద్దుడు. దిద్ది మిగిలిన సమయాన్ని విద్యార్థి వృధా చేయును. 5. అచ్చులు, హల్లులు, గుణింతాలు ఇలా వరుస క్రమంలో నేర్చుకోవటానికి ఎక్కువ కాలం పట్టును. 6. ఆసక్తి కలిగించే బొమ్మలు ఈ విధానంలో ఛోటు చేసికోకపోవడం వలన విద్యార్థులకు ఉత్సాహం సన్నగిల్లును. 7. కోమలంగా ఉండే విద్యార్థుల చేతి వ్రేళ్ళు అక్షరాలను దిద్ద లేక దెబ్బతినే ప్రమాదమున్నది 8. నేర్చుకోటానికి సులభంగా ఉండే పఠనాన్ని వదలివేసి, కష్టంగా ఉండే లేఖనాన్ని ముందు నేర్పటం మంచి పద్ధతి కాదు.

అనగా భాష భాషలాగ చలామణి కాలేదన్నమాట. అందుకే భాషా వ్యాపారంలో ఈ రెండూ రెండు రైలు పట్టాల్లాంటివి. వీటిల్లో ఒకదానికెంతటి ఆవశ్యకత ఉన్నదో అంతే, అదే ఆవశ్యకత రెండో దానికి కూడ ఉన్నది. కాబట్టి పఠనావశ్యకతయే లేఖనావశ్యకత కూడ అవుతున్నది.

## ఆధునిక కాలంలో లేఖనాన్ని పెంపొందించే విధానం.

సంప్రదాయంగా లేఖనాన్ని బోధిం. ంలో అనేక లోపాలుండడం వలన వానిని తొలగిస్తూ మనో విజ్ఞాన శాస్త్రానుకూలంగా లేఖనాన్ని బోధించటానికి, ఆధునికులు ప్రయత్నించారు. ఈ లేఖన విధానం ప్రకారం లేఖనాన్ని బోధి. టానికి ముందు పఠనాన్ని బోధించవలసి ఉన్నది. ఆ తరువాత లేఖనాభ్యసనానికై విద్యార్థుల్ని సంసిద్ధుల్ని చేయవలెను. అందుకోసమై విద్యార్థుల చేతి కండరాలు గట్టి పడే విధంగా కొన్ని గీతలను గీయించవలెను. అయితే ఆగీతలు ఆయా భాషాక్షరాలకు అనుకూలంగా ఉండవలెను. ఉదా:. ఆంధ్ర భాషాక్షరాలు గుండ్రంగా ఉండడం వలన విద్యార్థుల చేత గీయించవలసిన గీతలు " 0 ( )U " మొ..విగా ఉండవలెను.

విద్యార్థులు రాతకు సంసిద్ధులైన పిదప పఠనంలో మాదిరిగా ఉపాధ్యాయుడు ఒక్కొక్క పదాన్ని నల్ల బల్ల మీద రాస్తూ విద్యార్థుల చేత గమనింపచేస్తూ రాయించవలెను. ఆ తరువాత ఉపాధ్యాయుడు ఆ పదాలను వ్రాయయకుండా కేవలం ఉచ్చరిస్తూ విద్యార్థుల చేత రాయించవలెను.

క్రమంగా క్రొత్త క్రొత్త పదాలను కూడా ఇదే రీతిలో రాయించవలెను. ఈ లేఖనం క్రీడలాగ సాగటానికై పూసలు, రంగు దారాలు, చింతగింజలు మొ..న వాటితో-అక్షరాల ఆకారాలను విద్యార్థుల చేత చేయించవలెను. ద్విత్వ సంయుక్తాక్షరాలతోడి పదాలను కూడా రాయించవలెను. తరువాత వర్ణసమామ్నాయంలోని అక్షరాలన్నింటినీ క్రమంలో గుర్తింప చేయడం, అలాగే వానిలోని అచ్చు - హల్లు విభాగాలను కూడ తెలియచేయడం జరుగవలెను.

### మంచి రాతకు (దస్తూరికి) ఉండవలసిన లక్షణాలు

మనిషి తనకు ఎదురుగా ఉన్న మనిషికి కాక ఎక్కడో ఉన్న మనిషికి తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించటానికి ఉపయోగించే ప్రధానమైన భాషా సాధనం లేఖనం. ఇట్టి ఈ లేఖనం సరిగా లేనపుడు ఈ ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరు లాగ వృధా అవుతుంది. అందుకోసం లేఖనం మంచిగా, చక్కగా, అందంగా, ఆహ్లాదంగా ఉండవలెను. అట్టి మంచి లేఖనం (దస్తూరి, లేదా రాత) క్రింది లక్షణాలను కలిగి ఉండవలెను.

1. గొలుసు కట్టుగా ఒకదానికొకటి తగులుకోని రీతిలో విడివిడిగా అక్షరాలు ఉండవలెను. 2. అక్షరాలు మధ్య కంటే పదాల మధ్య వ్యవధానం ఎక్కువ ఉండవలెను. 3. కామా, చుక్క, ప్రశ్నార్థకం, ఆశ్చర్యార్థకం, ఇన్వర్టెడ్ కామాస్, మొ..న విరామ చిహ్నాలను ఖచ్చితంగా పాటించవలెను. 4. అక్షరాలు అందంగా, పొందికగా పోత పోసిన ముత్యాల్లాగా ఉండవలెను. 5. అక్షరాల పరిమాణం ఒకే విధంగా ఉండవలెను. 6. అక్షర పంక్తుల మధ్య వ్యవధానం అన్నింటిలోను సమానంగా ఉండవలెను. అలాగే ఆయా పంక్తులు చక్కగా ఉండవలెను. 7. నత్త నడకలాగా కాక రాత కొంచెం వేగంగా జరిగేటట్లు చూడవలెను. ఇవన్నీ బాహ్య లక్షణాలు కాగా 8. అక్షరాలను లోపింప చేయడం, ఎక్కువ అక్షరాలను రాయడం , అక్షరాలను తారుమారు చేయడం మొ..వి వర్ణ క్రమ దోషాలను పరిహరించటమనేది అంతర్గత లక్షణం.

### లేఖనాభ్యసనాలు

విద్యార్థుల్లో మంచి దస్తూరిని పెంపొందించటానికై ఉపాధ్యాయుడు అభ్యాసాల్ని ఇవ్వవలెను. వీటినే లేఖనాభ్యసనాలంటారు. అవి 1. దృష్ట లేఖనం. (చూసి వ్రాత) 2. ఉక్త లేఖనం.

#### 1. దృష్ట లేఖనం (చూసి వ్రాత) (Copy Writing):

విద్యార్థులకు మంచి దస్తూరిని అలవాటు చేయడానికి ఇచ్చే మొదటి అభ్యాసం చూసి వ్రాత. దృష్టమనగా చూడబడినదని, లేఖనమనగా లిఖింపబడినదని అర్థం. అందుచేత దృష్టలేఖనమనగా చూసినదానిని రాయడం. అనగా చూసి వ్రాత అని భావం. ఇది రెండు విధాలుగ జరుగుతుంది. మంచి దస్తూరి లక్షణాలు సమన్వయించే విధంగా ఉపాధ్యాయుడు పలక మీద కాని, పుస్తకం మీద కాని పై భాగంలో ఒక పంక్తిని రాయవలెను. దానిని చూస్తూ అదే రీతిలో క్రింది భాగంలో అనేక పంక్తుల్ని విద్యార్థుల చేత రాయించవలెను. ఇది మొదటి విధానం. దీని వలన మంచి దస్తూరి యొక్క బాహ్యలక్షణాలు అలవడును.

**జాగ్రత్తలు**

1. విద్యార్థులు రాసే అక్షరాల పరిమాణం ఒకే విధంగా ఉండడం కోసం గీతల్లో ఆయా పంక్తుల్ని రాయించవలెను. 2. గీతల మధ్యలో అక్షరాల క్రింది భాగం క్రింది గీతను, పై భాగం పై గీతను తగిలే విధంగా రాయించవలెను. 3. అలాగే ఆయా అక్షరాల తలకట్లు మొ..న వానిని పై గీతకు పై భాగంలోను ఒత్తులు మొ..న వానిని క్రింది గీతకు క్రింది భాగంలోను ఉండే విధంగా చూడవలెను. 4. ఉపాధ్యాయుని పంక్తినే ఆదర్శంగా గ్రహించి దాని కనుకూలంగానే చూసి వ్రాతకు చక్కగా రాయించటం కోసం పలక మీద గాని, పుస్తకం మీద గాని క్రింది భాగం నుంచి పై భాగం వైపుకు రాయించడానికి ప్రయత్నించవలెను.

మంచి దస్తూరి యొక్క అంతర్గత లక్షణాలను అలవాటు చేయటమే చూసి వ్రాతలోని రెండో విధానం. దీని ప్రకారం ఆయా తరగతులకు అనుకూలంగా ఉండే పుస్తకంలోని ఒకటి లేదా రెండు పేరా గ్రాఫ్‌లను విద్యార్థులకు చూపించి వానిని యథాతథంగా చూసి రాయించవలెను. అయితే ఆయా పేరాగ్రాఫ్‌లు విద్యార్థులకు ముందుగానే బోధించినవై ఉండవలెను.

**జాగ్రత్తలు**

1. విద్యార్థులు పలకను లేదా పుస్తకాన్ని, బలపాన్ని లేద కలాన్ని కదపకుండా పట్టుకోడంలోను, కూర్చోడంలోనూ జాగ్రత్త పడవలెను. 2. రాత బల్ల చదివేటప్పటికంటే రాసేటప్పుడు విద్యార్థికి దగ్గరగా ఉండవలెను. 3. పలకను కాని పుస్తకాన్ని గాని విద్యార్థులు నేల మీద పెట్టి వంగి రాయనీయకుండ వాని క్రింద ఏదైన ఒత్తును పెట్టించి రాయించవలెను. 4. విద్యార్థులు బలపాన్ని లేద కలాన్ని మొదట్లో కాకుండా వారి వయసును బట్టి 1నుండి 4సెం. మీ. దూరం వరకు పట్టుకొని రాసే టట్లు చూడవలెను. 5. పుస్తకం మీద మొదట పెన్సిల్ తో రాయిస్తూ క్రమంగా కలంతో రాయించడం నేర్పించవలెను.

**ప్రయోజనాలు**

1. అక్షరాలన్నింటినీ ఒకే పరిమాణంలో రాయటాన్ని నేర్చుకొంటారు. 2. అక్షర పంక్తులన్నింటినీ చక్కగా, వాని మధ్య దూరం సమంగా ఉండేటట్లు రాయటాన్ని అలవాటు చేసికొంటారు. 3. అక్షర - పద - వాక్యాల మధ్య తగినంత వ్యవధానాన్ని పాటిస్తూ రాత సులభంగా, స్పష్టంగా అర్థమయ్యేటట్లు రాయటాన్ని తెలిసికొంటారు. 4. విరామ చిహ్నాలను చక్కగా ప్రయోగించటాన్ని అలవాటు చేసికొంటారు. 5.అవసరమైన వానికన్న ఎక్కువ కాని, తక్కువ కాని రాయక పోవటానికి అలవాటు పడుదురు. 6. పదాలలో ఉండే అక్షరాలు తారుమారు కాకుండా జాగ్రత్త పడుదురు.

**2. ఉక్త లేఖనం (Dicatation):**

ఉక్తమనగా మాట్లాడబడిన , లేఖనమనగా లిఖింపబడిన అని అర్థం. అందుచేత మాట్లాడబడిన మాటలను లేద వ్యక్తీకరింపబడిన ధ్వనులను రాయటమే ఉక్తలేఖనమని భావం. ఉచ్చారణకు ,లేఖనానికి మధ్య సమన్వయాన్ని కుదర్చడం, లేఖనంలో వర్ణ క్రమ దోషాలు లేకుండా

చేయడం, లేఖనాన్ని వేగంగా సాగించడం అనేవి ఉక్త లేఖన ప్రధాన ధ్యేయాలు. ఉపాధ్యాయుడు విద్యార్థులకు బాగా తెలిసిన పదాలను ఉచ్చరిస్తూ పలకమీద కాని, పుస్తకం మీద కాని వాన్ని సరైన వర్ణక్రమంలో వారి చేత రాయించటమే ఉక్తలేఖన ప్రారంభం. క్రమంగా వాక్యాలను పేరాగ్రాఫ్‌లను ఉపాధ్యాయుడు ఉచ్చరిస్తూ విద్యార్థుల చేత వేగంగా నిర్దిష్టంగా వర్ణక్రమ దోషరహితంగా రాయించడం సంపూర్ణ ఉక్త లేఖనం. ఇట్టి ఉక్త లేఖనం చేసే సమయంలో ఉపాధ్యాయుడు క్రింది జాగ్రత్తలను పాటించవలెను.

**జాగ్రత్తలు**

1. ఉక్త లేఖనానికి విద్యార్థులు సంసిద్ధంగా ఉన్నదీ లేనిదీ గమనించవలెను. 2. విద్యార్థులకు సులభంగా అర్థమయ్యే విషయాన్నే ఉక్త లేఖనానికి గ్రహించవలెను. 3. క్లిష్టమైన క్రొత్త పదాల్ని నల్లబల్లపై రాయవలెను. 4. ఉక్త లేఖన సమయంలో విద్యార్థుల ఊకొట్టటాన్ని, చివరి అక్షరాన్ని ఉచ్చరించటాన్ని నిరోధించవలెను. 5. మరీ వేగంగా కాక, మరీ నెమ్మదిగా కాక సాధారణ విద్యార్థి స్థాయిని బట్టి ఉపాధ్యాయుడు ఉక్తలేఖనం చేయించవలెను. 6. విరామ చిహ్నాలను సూచించకుండా విద్యార్థులే గ్రహించేటట్లు చూడవలెను. 7. రాత వేగంగా సాగుతున్నప్పటికీ అది స్పష్టంగా, అందంగా, దోషరహితంగా ఉండేటట్లు హెచ్చరించవలెను. 8. ఉక్త లేఖనం ముగిసిన పిదప దానిని పరిశీలించి అందలి దోషాలను విద్యార్థులకు తెలుపవలెను. 9. దోషాలు ఉన్నపుడు వానిని సరిచేయవలెను.

**ప్రయోజనాలు**

1. ఉచ్చరణకు, శ్రవణానికి, లేఖనానికి సరియైన సమన్వయం కుదురును. 2. వర్ణక్రమదోషాలు పరిహరింపబడును. 3. లేఖనం వేగంగా సాగును. 4. పఠన - లేఖన - శ్రవన నైపుణ్యాలు మూడు అభివృద్ధి చెందును. 5. విరామ చిహ్నాలను ఉపయోగించే తీరు స్పష్టమగును. 6. విషయాన్ని అర్థవంతంగా, భావ భరితంగా రాసే తీరు తెలియును. 7. జ్ఞాపక శక్తి పెరుగును.

## *లిఖిత రచనలు*

### లిఖిత రచనల ఆవశ్యకత

రచన అనగా అక్షరాల కూర్పు. ఈ కూర్పు రెండు రకాలుగా సాగుతుంది. 1. లేఖనరూపం 2. మౌఖికంగా భాషణ రూపం, లేఖన రూపంలో సాగే కూర్పుకు 'లిఖిత రచన' అని మౌఖికంగా భాషణరూపంలో సాగే కూర్పుకు 'ఉక్త రచన' అని పేరు. మనిషి తనకు ఎదురుగా ఉన్న మనిషితో భాషా వ్యాపారాన్ని సాగించటానికి ఉక్త రచన సరిపోతుంది. అలాకాక ఎక్కడో ఉన్న మనిషితో భాషా వ్యాపారాన్ని సాగించాలన్నా, గత కాలపు జ్ఞానాంశాల్ని వర్తమాన కాలానికి అందించాలన్నా, వర్తమాన కాలాంశాల్ని భవిష్యత్కాలానికి చేరవేయాలన్నా, రహస్యాంశాల్ని గుప్తంగా తెలియచేయాలన్నా లిఖిత రచనయే శరణ్యం. ఇలా భాషా వ్యాపారంలో దీనికి అత్యధిక ప్రాధాన్యమున్నది. అందుకే దీనిని పెంపొందించ వలసిన బాధ్యత ఉపాధ్యాయునిపై ఎంతైనా

ఉన్నది. అందుకోసం ఉపాధ్యాయుడు ఈ లిఖిత రచనను వివిధ రూపాల్లో క్రింది విధంగా అభివృద్ధి పరుస్తాడు.

# లిఖిత రచనల రకాలు

## 1. *లేఖా రచన* (Letter Writing) :-

### లేఖా రచనావశ్యకత

దూరంగా ఉన్న బంధువులకు, స్నేహితులకు క్షేమసమాచారాదులను తెలుపుకోవాలన్నపుడు అవసరమైన పుస్తకాలు, వస్తువులు మొ..న వానిని తెప్పించుకోవాలన్నపుడు, దూరంగా ఉన్న వారిని ఆహ్వానించాలన్నపుడు, ఉద్యోగం కోసం అర్జీలు పెట్టుకోవాలన్నపుడు, అధికారులకు విన్నపాలను తెలుపుకోవాలన్నపుడు, సెలవుచీటి మొ..న వానిని పంపాలన్నపుడు మనకు లేఖల ప్రాధాన్యం అత్యవసరమౌతుంది. అందుచేత లిఖిత రచనాభివృద్ధిలో భాగంగా మొట్ట మొదట ఉపాధ్యాయుడు లేఖా రచనను పెంపొందించవలెను. ఈ లేఖలు వివిధ రకాలుగా ఉంటాయి.

### వివిధ రకాలైన లేఖలు -వానిని రచించే (రాసే )తీరు

విద్యార్థి మూడవ తరగతిలో ప్రవేశించిన పిదప అవసరాన్ని బట్టి ఉపాధ్యాయునికి రాసే సెలవు చీటీలను రాయించటానికి నేర్పడంతో లేఖా రచన మొదలౌతుంది. ఇలాంటి లేఖలను రాసేటపుడు లేఖ యొక్క పై భాగంలో కుడివైపున ఎక్కడి నుండి లేఖను రాస్తున్నామో ఆ ఊరి పేరు, దాని క్రింద తేదీని రాయవలెను. దీనికి ఎడమ భాగంలో ఎవరికి లేఖను రాస్తున్నామో వారి వివరాన్ని రాయవలెను. దీన్ని రాసేటపుడు ఉపాధ్యాయుని పేరు కాక తరగతి ఉపాధ్యాయుల వారికి అని మాత్రమే రాయవలెను. దీని క్రింద లేఖ రాసే వ్యక్తి పేరును ఉంచవలెను. ఈ పేరు, అతని చిరునామ అనేవి ఇంగ్లీషు సంప్రదాయం ప్రకారం ఎవరికి లేఖ రాస్తున్నామో వారి వివరానికి ముందే రాయవలసి ఉంటుంది. తరువాత ఏదో ఒక సంబోధనను ఉంచి దాని ప్రక్కలో కామా ఫ్లై ను ఉంచవలెను. ఇది లేఖ యొక్క పూర్వ భాగం.

తరువాత ఉత్తరం రాయడానికి కారణాన్ని, సెలవులు కావలసిన రోజుల్ని, అందుకు అనుమతిని రాయవలెను. ఇది లేఖకు మధ్య భాగం కాగా లేఖ యొక్క క్రింది భాగంలో కుడివైపున లేఖ రాసే వ్యక్తి తన విధేయతను తెలుపుకొని సంతకం చేయవలెను. ఇది లేఖకు ఉపసంహారం ఇలా పూర్వ - మధ్య - ఉపసంహారానే మూడ భాగాలు అన్ని రకాలైన లేఖల్లో ఉంటాయి.

4 వ తరగతిలో బంధువులకు, స్నేహితులకు మొ..న వారికి రాసే లేఖలను నేర్పవలెను. ఇటువంటి లేఖల్లో కూడ లేఖ పైభాగంలో కుడివైపున ఊరి పేరు, తేదీలు ఉండవలెను. ఎడమవైపున ఎవరికి రాస్తున్నామో వారి వివరాలు ఉండవలెను. అయితే ఉపాధ్యాయ లేఖల్లో 'ఉపాధ్యాయుల

గారికి ' అని రాసినట్లుగానే అల్లి దండ్రులకు రాసేటపుడు ' పూజ్యులైన తల్లిగారికి/ తండ్రిగా అలాగే స్నేహితులకు రాసేటపుడు "ప్రియ స్నేహితునికి " అని రాయవలెను. ఇంక లేఖ మ భాగంలోని విషయాన్ని రెండు పేరాగ్రాఫ్‌లుగా విభజించుకొని మొదటి పేరాలో తెలియచేయవ విషయాల్ని రాసి, రెండో పేరలో తెలిసికోవలని వానిని రాయవలెను. లేఖ పర భాగంలో కుడివై ఎవరికి లేఖ రాస్తున్నారకో వారితో అతనికి గల సంబంధాన్ని తెలిపే పదాన్ని (ఉదా: తం రాస్తున్నపుడు మీ కుమారుడు అని, స్నేహితునికి అయితే మీ స్నేహితుడు ) అని రాసి క్రింద సంతకం చేయవలెను. దీనికి కొంచెం క్రిందుగా ఎడమవైపున ఎవరికి లేఖ రాస్తున్నా వారి చిరునామా రాయవలెను.

5 వ తరగతిలో వ్యాపార సంభంధ లేఖలను నేర్పించవలెను. ఇటువంటి లేఖల్లో కుడి కుడి ప్రక్కన ఊరిపేరు, తేది ఉండవలెను. ఎడమ ప్రక్క లేఖ రాసే వ్యక్తి పేరు, అతని చిరునా క్రింద ఎడమవైపు రాసినను ఫరవాలేదు. ఒక్కొక్క సారి దీనిని క్రింద ఏ వ్యాపార సంస్థకు లే రాస్తున్నామో దాని పేరు, చిరునామా రాయవలెను. దాని క్రింద "అయ్యా లేదా అర్యా" సంబోధన ఉండవలెను. మధ్య భాగంలో యోగక్షేమాది విషయాలు కాకుండా అవసర విషయాలను సూటిగా రాయవలెను. క్రింది భాగంలో ఉపసంహారంలో కుడి ప్రక్కన "విశ పాత్రుడు" అని రాసి దాని క్రింద సంతకం చేయవలెను.

మాధ్యమిక దశల్లో సాంఘీక లేఖలను నేర్పించవలెను. అనగా అధికారులకు, ఉద్యోగాల పెద్దలను ఆహ్వానించటానికి మొ..న సందర్భాలకు సంబంధించిన లేఖలు. పై లేఖలలో మాదిరి వీటిల్లో కూడ పూర్వ భాగముంటుంది. లేఖ రాసే వ్యక్తికి ఆయా వ్యక్తులతో ఉన్న గౌరవా బట్టి ఉపసంహారం ముగుస్తుంది.

ఉన్నత దశలో ఓఈ లేఖారచనను ఇంకొంచచెం అభివృద్ధి పరచవలెను. ఈ దశలో లేఖల మధ్య భాగం విస్తృతంగా ఉండటమే కాక అదంతా కొన్ని పేరాలుగా విభక్తం కావలె శైలిలో భేదం ఉండవలెను. వైవిధ్య కూడ అవసరం.

**2. వ్యాస రచన (Essay Writing) :-**

ఉక్త రచనాంశాన్ని లిఖిస్తే లిఖిత వ్యాస రచన అవుతుంది. అయితే భావానికి, వ్యక్తీకరణ మధ్య చక్కటి సమన్వయాన్ని కుదర్చడం, భావాన్ని స్పష్టంగా రాయడం, భావంలో పునరు లేకుండా ఉండడం మొ..వి ఉక్త రచనలో కన్న లిఖిత వ్యాస రచనలో మాత్రమే సాధ్యమౌతాయి అందుచేత విద్యార్థుల్లో లిఖిత వ్యాస రచనను విపులంగా పెంపొందించవలసి ఉంటుంది.

## వివిధ స్థాయిల్లో నేర్పదగు లిఖిత వ్యాస రచనలు :-

ప్రాథమిక దశలో విద్యార్థులకు బాగా తెలిసిన వస్తువులు, ప్రదేశాలు , జంతువులు, పక్షులు చెట్లు మొ..న వాని గురించి వ్యాస రచనలు చేయించవలెను. అయితే వ్యాస రచనాంశం దాదాపు విద్యార్థులందరికి అభిరుచికలదిగా ఉండవలెను. ఈ అంశాన్ని గూర్చి ఉపాధ్యాయుడు ముందుగా చర్చించవలెను. అలాగే మొత్తం వ్యాస రచనాంశాన్ని వివిధ పేరాలుగా విభజించే తీరును కూడ

చించవలెను. ప్రాథమిక దశ ముగిసే నాటికి 10 లేద 12వ్యాసాలను రాయించవలెను.

మాధ్యమిక దశలో విద్యార్థులు చదివిన వాచకాలపై, ఉపవాచకాలపై అలాగే ఇంగ్లీషు హిందీ వాచకాలలోని అంశాలపై వ్యాసరచనలను రాయించవలెను. విద్యార్థులకు బాగా అభిరుచిని గించే కథనాత్మకాలు; కల్పనాత్మకాలు, వర్ణనాత్మకాలు మొ..న అంశాలనే రచనాంశాలుగా గ్రహించ వలసి ఉంటుంది. రచనాంశాన్ని క్రమంలో అమర్చుకోటాన్ని వివిధ పేరాలుగా విభజించుకోటాన్ని ఉపాధ్యాయుడు ముందుగా చర్చించవలసి ఉంటుంది.

ఉన్నత దశలో ఊహాశక్తికి ప్రాధాన్యమీయవలసి ఉంది. " భవిష్యత్తులో స్వీకరించే వృత్తి, పూలు -ముల్లు వీటిల్లో గొప్పది" మొదలైన ఊహాశక్తని పెంపొందించే అంశాలను రచనాంశాలుగా గ్రహించవలసి ఉంటుంది. అలాగే కథనాత్మకాలను సంభాషణలు గాను, సంభాషణలను కథనాత్మకాలుగను రాయించవచ్చు. సూక్తులు, సామెతలు, జాతీయాలు, విరామ చిహ్నాలు మొ..నవానిని వ్యాస రచనలో ప్రయోగించేటట్లు చూడవలెను. ఈ దశలో రచనాంశాన్ని ముందుగా నిర్ణయించి దానికి సంబంధించిన విషయాన్ని గ్రంథాలయాల నుండి కాని, ఇతర పెద్దల నుండి కాని విద్యార్థులు సేకరించేటట్లు చేయవలెను. వ్యాసాన్ని జాగ్రత్తగా రాయడం కోసం ఒకరు రాసిన వ్యాసాన్ని మరొకరిచేత చదివించవలెను. తరువాత ఆ వ్యాసాన్ని పరిశీలించి దోషాలను సరిదిద్దవలెను. సవరింపబడిన వ్యాసాన్నితిరిగి రాయించవలెను. విద్యార్థులందరు అతి సాధారణంగా చేసే దోషాలేమైనా ఉన్నపుడు వాటిని, వాటి సవరణలను అట్టల మీద రాయించి తరగతి గదుల గోడలకు తగిలించవలెను.

### 3. అనువాద రచన (Translation Writing) :-

అనువాద ఆవశ్యకత :- ఒక వ్యక్తి ఇతర వ్యక్తులతో సంబంధం లేకుండా జీవించడం ఎంతకష్టమో. భాషా సాహిత్యాలు కూడా ఇతర భాషా సాహిత్యాలతో సంబంధం లేకుండా రాణించడం అంతే కష్టం. ఒక భాషకాని సాహిత్యం కాని సర్వతో ముఖాభివృద్ధి చెందాలంటే మరొక భాష మీద కాని, సాహిత్యం మీద కాని ఆధారపడక తప్పదు. ఒక భాషలో ఉండే భాషా వేత్తలు కవులు పండితులు రచయితలు మరొక భాషలో లేకపోవచ్చు. అటువంటపుడు ఆ భాష అభివృద్ధి చెందలేదు. అలాగే ఒక కాలంలో ఒక భాషలో ఉన్న ఈ మేధావులు మరొక కాలంలో మరొక భాషలో ఉండక పోవచ్చు. ఇటు వంటి సమయాల్లో కూడ భాష వృద్ధిని సాధించలేదు. అంతెందుకు! తెలుగు భాషా సాహిత్య వ్యవహారాన్ని గమనిస్తే బాగా అభివృద్ధి చెందిన భారతీయ భాషల్లో దీని పరిమాణం చిన్నది. అలాగే ప్రపంచ భాషా సాహిత్యాలతో పోల్చినపుడు దీని పరిమాణం ఇంకా స్వల్పం. అందుకే ఇది మొన్న మొన్నటిదాకా సంస్కృత భాషా సాహిత్యాల మీద ఆధారపడి ఇవ్వాళ ఇంగ్లీషు భాషా సాహిత్యాల మీద ఆధారపడుతున్నది. అనగా ఇది సంస్కృతం ఇంగ్లీషు మొ..న అభివృద్ధి చెందిన భాషల నుండి తనకవసరమైన వానిని గ్రహించి తనూ అభివృద్ధి చెందుతున్నదన్నమాట. ఇలా ఒక భాష మరియొక భాష మీద ఆధారపడి అభివృద్ధి చెందటమంటే ఆ భాషాంశాన్ని ఈ భాష తన స్వంతం చేసికోటమని అర్థం. అలా ఒక భాష మరొక భాషాంశాన్ని స్వంతం చేసికోటానికి ఉపయోగపడే ప్రధాన సాధనం అనువాదం.

అనువాదమనగా అనుసరించి వాదించటమని అర్థం. అంటే ఒక భాషాంశాన్ని అదే రీతిలో అనుసరించి మరో భాషలో చెప్పడం లేద రాయటమని భావం. ఈ అనుసరించి చెప్పడం "లేనిది ఉన్నట్లు గా కాని, ఉన్నది లేనట్లుగా " కాని చెప్పకూడదు. నిక్కచ్చిగా ఉన్నదానిని ఉన్నట్లుగానే చెప్పాలి ఇలా ఒక భాషాంశాన్ని మరొక భాషలోనికి అనువాదం చేయటానికి ఆ రెండు భాషలతో పరిచయం ఉండాలి. అనగా ఏ భాషాంశాన్ని అనువాదం చేయాలనుకొంటున్నమో ఆ భాషకు సంబంధించిన భావ గ్రహణ పదజాలం (Passive Vocabulary), ఏ భాషలోకి అనువాదం చేయాలనుకొంటున్నామో ఆ భాషకు సంబంధించి న భావ వ్యక్తీకరణ పదజాలం (Active Vocabulary) బాగా తెలిగి ఉండాలి. ఈ రకమైన పదజాలాల జ్ఞానం విద్యార్థికి ఉన్నత దశలో మాత్రమే సాధ్యమౌతున్న కారణాన ఆ దశనుండే అనువాదాన్ని నేర్పించటానికి మొదలు పెట్టవలెను.

**అనువాదం చేయించే తీరు**

విద్యార్థులు స్వంతంగా అర్థం చేసికోటానికి వీలైనభాషాంశాన్ని అనువాదానికై ఎంపిక చేసి దానిని వారిచేత ముందుగా చదివించవలెను. అందలి భావాన్ని గ్రహింపమని కోరవలెను. ఒక్కొక్క వాక్యం కన్నా ఒక్కొక్క పేరాను ప్రమాణంగా తీసికొనేటట్లు చూడవలెనుఆతరువాత అందలి భావాన్ని అనువాదం చేయించవలెను. దీనిని మరలా మూలంతో సరిచేయించవలెను. ఏదైనా అంశం అనువాదంలో లేనపుడు దానిని మరల చేర్పించవలెను. క్రమంగా ఇదే రీతిలో అన్ని పేరాలను అనువాదం చేయించవలెను.ఆ తరువాత మొత్తాన్ని మరలా మూలంతో సరిచేయించి సవరణలుంటే చేయించవలెను. ఇలా అనువాదం చేయించేటపుడు అది సమర్థవంతంగా, సప్రమాణంగా, సహజ స్థితిలో సాగటానికి క్రింది నియమాలను పాటించవలెను.

**నియమాలు**

1. సంజ్ఞా -నామవాచకాలను, అనువాదంలో యథాతథంగా గ్రహించవలెను. 2. పారిభాషిక పదాలకు సరియైన అనువాద పదాలు ఉంటే గ్రహించవచ్చు. లేకపోతే వానిని యథాతథంగా రాయవలెను. 3. సామెతలు, జాతీయాలు, లోకోక్తులు, మొ..న వానిని ఆయా భాషా సంస్కృతులకు అనుకూలంగా అనువాదం చేయవలెను. 4. వాక్యంలో ఉండే ప్రధానమైన కర్త -కర్మ -క్రియ అనే వానిని ఆయా భాషల వాక్యనిర్మాణాలకు అనుకూలంగానే అనువాదం చేయవలెను. 5. భావానుకూలంగా అనువాదం చేయాలే తప్ప మూలంలోని వాక్యాలన్నింటినీ అదే సంఖ్యలో ఖచ్చితంగా అనువాదం చేయవలసిన అవసరం లేదు. 6. అనువాదం సరళంగా -సులభంగా ఆహ్లాదకరంగా ఉండవలెను. 7. సంయుక్త వాక్యాలకు, సంశ్లిష్ట వాక్యాలకు చోటివ్వ కూడదు. 8. మూలంలోని వాక్యంలో ఒకటి లేద రెండు పదాలకు సరైన అర్థాలు తెలియక పోయినా మిగిలిన వాని సహాయంతో అనువాదానికి ప్రయత్నించవచ్చు. 9. ఆయా భాషల స్వరూప స్వభావాలకు, ఆచార వ్యవహారాలకు అనుకూలంగా ఏర్పడిన శబ్ద ప్రయోగాన్ని ఆయా అనువాద భాషల స్వరూప స్వభావాలకు, ఆచార వ్యవహారాలకు అనుకూలంగానే అనువాదం చేయవలెను. 10. ఒక్కొక్క భాషలో ఒక్కొక్క రకంగా ఉండే వాక్య కార్య -కారణ భావాలను ఆయా భాషలకు అనుకూలంగానే అనువాదం చేయవలెను.

**4. పద్య భావ ప్రకటనం :-**

విద్యార్థులకు సారస్వతాభిరుచిని కలిగించడమనేది భాషా బోధనా లక్ష్యాల్లో ఒకటి. సారస్వతాభిరుచి పెరగాలంటే విద్యార్థులు వివిధ రకాలైన పద్య గద్య కావ్యాలను, నాటకాలను స్వంతంగా చదువుకొని ఆనందాన్ని పొందగలగాలి. అయితే ఇందులో గద్యకావ్యాల్ని, నాటకాల్ని కొంతవరకు చదువుకొని అర్థం చేసికోగలుగుతారు. కాని పద్యకావ్యాల రచన ప్రత్యేక పద్ధతిలో క్లిష్టంగా ఉంటున్న కారణాన వానిని అంత సులభంగా వారు చదువుకోలేరు. ఆనందాన్ని పొందలేరు. అట్టి స్థితిలో పద్యాలపై వారి ఆత్మ విశ్వాసం తగ్గి క్రమంగా వారి సారస్వతాభిరుచి సన్నగిల్లే ప్రమాదముంది. అందుకోసం పద్యభావ ప్రకటనం అనే లిఖిత రచనను వారిచేత చేయించవలసి ఉంటుంది. పాఠ్యాంశాలలో లేని కొన్ని పద్యాల్ని విద్యార్థులు గ్రహించి, క్షుణ్ణంగా చదివి వాని భావల్ని వారే రాయటమే పద్య భావ ప్రకటనం. ఉన్నత దశలో మాత్రమే వివిధ రకాలైన పద్యాలతో, వాని శైలీ భేదాలతో విద్యార్థులకు పరిచయం ఉంటున్న కారణాన ఆ దశలోనే దీనిని ప్రారంభించవలెను.

**పద్య భావ ప్రకటనను రచించే తీరు :-**

అన్వయ కాఠిన్యం లేకుండా, కథనాత్మకంగా సులభశైలితో తేలికగా అర్థమయ్యే పద్యాల్ని, కొన్నింటిని ఎన్నిక చేసి, వాటిని ఒకటి రెండు సార్లు విద్యార్థుల చేత చదివించవలెను. ఎంత ప్రయత్నించినా అర్థం తెలియని పదాలేమైనా ఉంటే వాటికి ఉపాధ్యాయుడె అర్థాలు చెప్పవలెను. తరువాత మరలా వానిని చదివించవలెను. ఆ తరువాత ఏ క్రమంలో రాస్తే భావం బాగుంటుందో ఆ క్రమానికి అనుకూలంగా ఉపాధ్యాయుడు ప్రశ్నలడిగి సమాధానాల్ని రాబట్టవలెను. తరువాత ఒక్కొక్క పద్యానికి వరుసగా భావాన్ని రాయించవలెను. క్రమంగా పద్య భావంతో పాటు ఆ పద్యాల్లో ఇమిడి ఉన్న శైలివైవిధ్యం, సంభాషణల తీరు, పాత్రశీలం మొ..న వాటితో మిళితమై ఉన్నట్టి భావ సౌందర్యాన్ని రాయించవలెను.

**5. సంక్షిప్త రచన :-**

సంక్షిప్త మనగా కుదింపని అర్థం. అనగా విపులంగా ఉన్న అంశాన్ని కుదించి (సంగ్రహించి) కొద్దిగా రాయటమని అర్థం. టెంకాయలోని పై పీసు, దాని తరువాతి టెంకెపోను లోలోపల తక్కువ పరిమాణంలో ఉన్నట్టి ఫలవంతమైన కొబ్బెరలాగా నిష్ప్రయోజనంగా, విపులంగా ఉన్నట్టి అంశంలోని అత్యంత ప్రయోజనవంతమైన భాగాన్ని సంగ్రహించి రాయటమని భావం. మాధ్యమిక దశలో ఉపవాచకాంశాన్ని సంక్షిప్తీకరించటానికి విద్యార్థుల చేత ప్రయత్నించవలెను.

ఉన్నత దశలో మాత్రం విద్యార్థులకు పరిచయం లేని క్రొత్త అంశాన్ని, దాదాపు 20 లేక 30 పంక్తుల పరిమాణంలో ఉన్నదానిని ముఖ్యాంశం వచ్చే విధంగా, స్వంత మాటల్లో మూడో వంతుకు సంగ్రహించి రచించే సంక్షిప్త రచనలను చేయించవలెను.

**చేయించే విధానం:-**

పరిచయం లేని కొన్ని వాక్యాలను విద్యార్థులకిచ్చి అప్రధానాలైన పదాలను

తొలగింపచేయవలెను. తరువాత రెండు మూడు వాక్యాల సారాంశాన్ని ఒకే చిన్న వాక్యంలో కుదించేటట్లు చేయవలెను. క్రమంగా వాక్యాలకు బదులుగా ఒక చిన్న పేరాను ప్రమాణంగా తీసికొని పై విధంగా సగానికి సంగ్రహించి రాయించవలెను. దానిని ఉపాధ్యాయుడు గమనించి అవసరమైన సవరణలతో సరిదిద్దవలెను. సంక్షిప్తీకరించిన దానికి సరైన శీర్షికను కూడా విద్యార్థులే నిర్ణయించేటట్లు చేయవలెను.

పై లిఖిత రచనలే కాక కవితారచన, కథా రచన, వర్ణనాత్మక రచన. స్వీయ పత్రికా రచన, నాటికా రచన, మొ..న లిఖిత రచనలను కూడా విద్యార్థులకు నేర్పించవలెను.

# VI. వివిధ బోధనా పద్ధతులు

## ఆధునిక బోధనా పద్ధతులు

### ప్రాచీన విద్యా బోధనా లోపాలు

ప్రాచీన విద్యా బోధనలో 1. శీఘ్రగతిన విద్యాబోధన సాగక పోవడం. 2. ధనిక వర్గానికే చెందడం. 3. ఒకే రకంగా సాగడం. 4. ఒకే రకమైన లక్ష్యాల్ని కలిగి ఉండడం. 5. నేర్చిన విద్యకు చేసే పనికి పొంతన లేకపోవడం. 6. ఉపాధి అవకాశాలు లేకపోవడం. 7. అన్ని వర్గాల వారికి సంబంధించక పోవడం. 8. మనస్తత్వ శాస్త్రానికి ప్రాధాన్యం లేకపోవడం. 9. బోధకులకు సరైన శిక్షణ లేకపోవడం. 10. ప్రత్యేక బోధనా పద్ధతి అంటూ లేక పోవడం. 11. పరిమిత కాలమంటూ లేకపోవడం.12. బోధకుల దయా దాక్షిణ్యాల పై ఆధారపడటం 13. బోధనలో విద్యార్థులకు ప్రాధాన్యం లేకపోవడం. 14. విద్యార్థులకు స్వయం ప్రతిపత్తి లేకపోవడం . 15. బోధకుల నివాసాలే విద్యాలయాలు కావడం . 16. ప్రత్యక్షంగా సమాజాభివృద్ధికి దోహదపడక పోవడం 17. ఆధునిక అవసరాలను తీర్చలేకపోవడం. 18. తక్కువ వ్యయంతో ఎక్కువ విద్యను అందించక పోవడం మొ..న లోపాలు ఉండడం వలన దీనిని అధికరించి ఆధునికకాలానికి, ఆధునికి సమాజానికి, ఆధునికి మనిషికి అత్యవసరమైన, విద్యార్థి మనస్తత్వానికి అనుకూలమైన విద్యా బోధనా విధానం కోసం ప్రపంచంలో అనేక మంది విద్యావేత్తలు పరిశోధనలు సాగించారు. ఆ పరిశోధనల ఫలితంగా కొన్ని నూతన బోధనా పద్ధతులు ఆవిర్భవించాయి. ఈ పద్ధతులన్నింటికీ మనస్తత్వ శాస్త్రం ఆధార భూమిక. ఇవన్నీ 1. తెలిసిన విషయం నుండి తెలియని విషయం వైపు సాగడం ( known to un-known) 2. తేలికైన విషయం నుండి కఠినమైన విషయం వైపు పయనించడం (Easy to Difficult). 3. మూర్త విషయం నుండి అమూర్త విషయం వైపు సాగడం (Concrete to Abstract) 4. ఆసక్తికరమైన విషయం నుండి అనాసక్తి కరమైన విషయం వైపు రావడం (Interest to un-interest). 5. సంపూర్ణత్వం నుండి విడి భాగాల వైపు రావడం (Whole to parts) అనే సూత్రాలపై నడిచినవి. అట్టి ఆధునిక బోధనా పద్ధతులు, వాని ద్వారా తెలుగును బోధించే విధానం క్రింది విధంగా

ఉన్నాయి.

**1. క్రీడా పద్ధతి (Play Method) :-**

విద్యాభ్యాసాన్ని వేగంగా, అభిరుచి జనకంగా సాగించటానికై, చేసిన కృషి ఫలితంగా నిర్ణయింపబడిన పద్ధతేక్రీడా పద్ధతి. దీనిపై విశేషంగా కృషి చేసిన వారిలో కాల్డ్వెల్ కుక్ (Caldwell Cook) , గలిక్(Gullick) , అనే విద్యావేత్తలు ముఖ్యులు. అత్యంత సహజంగా - సులభంగా - అభిరుచికరంగా - ఆనందకరంగా - ఉల్లాసకరంగా ఉండేది" క్రీడ". ఇట్టి క్రీడలపై విద్యార్థులు (ముఖ్యంగా ప్రాథమిక దశ) అత్యంత అనురక్తిని కలిగి ఉంటారు. అందువలన బోధనను క్రీడగా మార్చటమనేది ఇందులోని మౌలిక సూత్రం. కాబట్టి క్రీడలాగ సాగే బోధనా విధానానికే "క్రీడా పద్ధతి" అని పేరు. అయితే ఇది బోధన యొక్క స్వరూప స్వభావాలను తెలిపే ఒక మార్గమే తప్ప ప్రత్యేక పద్ధతి కాదు. ముఖ్యంగా ఇది ప్రాథమిక దశ విద్యార్థులకు అధికంగా ఉపయోగపడుతుంది.

## తెలుగు భాషను బోధించే విధానం.

**భాషణం**

క్రీడలాగ అత్యంత కుతూహలంగా ఉండే సంభాషణలను జరిపిస్తూ, ఆసక్తికరంగా ఉండే బాలగేయాలను పాడిస్తూ, అభిరుచికరంగా ఉండే అభినయగీతాలను భావస్ఫూర్తితో ఆలాపింపచేస్తూ, చిత్రాలను చూపిస్తూ కథలను చెప్పిస్తూ, ఉత్సుకత, ఉల్లాసం ఉండే నాటకీకరణను చేయిస్తూ భాషణ శక్తిని పెంపొందించవలెను.

**పఠనం**

ఆహ్లాదకత్వాన్ని, ఆకర్షణను కలిగించే బొమ్మలున్న మెరుపు అట్టలు (Flash Cards) వాక్య పత్రాలు (Sentence Charts) కథా చిత్రాలు(Story Charts) మొ..న వానిని ఉపయోగించి పదాలను, వాక్యాలను, కథలనుచదివింపచేస్తూ క్రీడలాగా పఠనాన్ని నేర్పించవలెను.

**లేఖనం**

పఠనాన్ని ముందుగా కొంతవరకు నేర్పిన తరువాత అక్షరాల ఆకారాలను పూసలతో, రంగుదారాలతో అమరింపచేయించడం, కాగితాల కత్తరింపులతో అక్షరాలను పేర్పించడం మొ..న విధాలుగా క్రీడా మార్గంలో లేఖనాన్ని నేర్పించవలెను. పదాలలోని అక్షరాలను తారుమారు చేసి సవరింపచేయడం, ఖాళీలను పూరింప చేయడం, కొన్ని అక్షరాలను ఇచ్చి వాటితో పదాలను నిర్మింప చేయడం మొ..వి కూడ ఇందుకు దోహదపడును.

**పాఠ్య బోధన**

టేపు రికార్డర్, రేడియో, టెలివిజన్, రకరకాలైన బొమ్మలు, పట్టికలు మొ..వి ఆకర్షణీయమైన అహ్లాదకరమైన ఉపకరణాల ద్వారా బోధనను క్రీడలాగా సాగింప వచ్చు.

**ప్రయోజనాలు**

1. విద్యాభ్యాసంలో శ్రాంతి, అలసట అనేవి తొలుగును. 2. విద్యాభ్యాసం అత్యంత ఉల్లాసంగా సాగును. 3. విద్యను స్పష్టంగా, వేగంగా అభ్యసింప వచ్చు. 4. నేర్చుకొన్న విషయం బాగా గుర్తుండును. 5. సమయస్ఫూర్తి అలవడును.6. ఆలోచనా శక్తి పెరుగును. 7. తెలిసికోదగు విషయాన్ని ప్రయోగపూర్వకంగా తెలిసికోవచ్చును. 8. విద్యాభ్యాసం అత్యంత సహజంగా సాగును. 9. తార్కిక శక్తి పెరుగును.

అయితే క్రీడ లాగ సాగిపోయే ఈ విద్యా విధానంలో విద్యాభ్యసనానికి సంబంధించిన హుందాతనం, గంభీరత్వాలు తగ్గిపోవునేమోనని కొందరు విమర్శించారు. అలాగే విద్య నంతటినీ ఈ పద్ధతి ద్వారా బోధించటానికి వీలు కాదు. ఏది ఏమైనా విద్యాబోధన ఉత్సాహకరంగా సాగాలంటే దీనికి ప్రాధాన్యం ఇవ్వక తప్పదు. ముఖ్యంగా ప్రాథమిక దశలో దీనికత్యంత ప్రాముఖ్యమున్న విషయం స్పష్టమౌతూనే ఉన్నది.

**2. కిండర్ గార్టెన్ పద్ధతి :-**

క్రీడా పద్ధతి లాగా మనో విజ్ఞాన శాస్త్ర నియమానుకూలంగా ఏర్పడిన మరో పద్ధతి కిండర్ గార్టెన్ పద్ధతి. కిండర్ గార్టెన్ (kinder garten) అనే ఈ జర్మన్ పద సముదాయానికి "శిశువుల తోట" అన్నది అర్థం. దీనిని రూపొందించిన వ్యక్తి ఫ్రోబెల్(Frobel) పాఠశాలను తోటగాను, విద్యార్థులను మొక్కలుగాను రూపించటం ఇక్కడ జరుగుతుంది. అనుకూల వాతావరణ పరిస్థితుల్ని కల్పించి తోటలోని లేత మొక్కల్ని పెంచినట్లే పాఠశాలలోని విద్యార్థుల్ని పెంచటమనేది ఇక్కడ మూల సూత్రం. విద్యార్థుల్ని మంచి ఆరోగ్య వంతులుగా., చక్కటి విద్యావంతులుగా చేయాలన్నది దీని లక్ష్యం. ఆ లక్ష్య సాధనకు పాఠశాలనంతటినీ నిర్వహించటానికై ఒక దర్శకురాలు (Directress), ఆమెకు సహాయంగా ఒక వైద్యురాలు, ఒక పర్యవేక్షకురాలు ఉంటారు. ఈ పద్ధతి ప్రకారం విద్యను బోధించటానికి విద్యార్థుల వయస్సు 3 నుండి 7 సంవత్సరాలకు లోపుగా ఉండవలెను. అనగా ఇది పూర్వ ప్రాథమిక దశకు, ప్రాథమిక దశలో కొంత భాగానికి సంబంధించినది. ఈ పద్ధతిలో బోధన కొఱకు ఉపయోగించే సాధన సామగ్రిని "ఫ్రోబెల్ కానుకలు " (Frobel Gifts) అనే పేరుతో పిలుసారు.

**బోధనా విధానం.**

విద్యాబోధనంతా తరగతి పద్ధతిలాగానే సాగుతుంది. ఒక్కొక్క విషయాన్ని బోధించటానికై ఏర్పాటు చేసికొన్న కాలవ్యవధి 30 ని||ల కంటే మించి ఉండరాదు. ఒక విషయాన్ని ఒక కాలవ్యవధిలో బోధించిన తరువాత విద్యార్థుల్లో కలిగిన శ్రాంతిని (అలసట) ను తొలగిస్తూ ఆసక్తిని కలిగించే విధంగా మరొక విషయాన్ని బోధించవలెను. బోధన సమయంలో శిశువుల ప్రవర్తనను పర్యవేక్షకురాలు గమనిస్తూ, లోపాలను సవరిస్తూ విద్యార్థుల్ని క్రమశిక్షణలో ఉంచవలెను. ఈవిధంగా పర్యవేక్షకురాలి సూచనల ఆధారంగా తగుమాత్రపు స్వేచ్ఛతో విద్యార్థులు విద్యనభ్యసిస్తారు.

**ప్రయోజనాలు**

1. ఇంద్రియ శిక్షణ పెరగటానికి వీలున్నది. 2. స్వయం కృషి అలవాటు అవుతుంది. 3. ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. 4. గ్రహించిన విషయం ఎక్కువ కాలం గుర్తుంటుంది. 5. ఆరోగ్య విధులు తెలుస్తాయి.6. విద్యా భ్యాసంలో శ్రాంతి తొలుగుతుంది. 7. విద్యాభ్యాసం ఉత్సాహంగా సాగుతుంది. 8. కొంత వరకు స్వేచ్ఛ లభిస్తుంది.

**3. మాంటిసోరి పద్ధతి :-**

కిండర్ గార్టెన్ పద్ధతి లాగా ఇది కూడ 3 నుండి 7 సంవత్సరాల వయస్సుకు లోపున్న శిశువుల విద్యా బోధనకు సంబంధించిన ఒక పద్ధతి. ఇటలీ దేశానికి చెందిన మానసిక వైద్యురాలైన మేరియా మాంటిసోరి మొదట దీనిని ప్రవేశ పెట్టడం వలన దీనికి "మాంటిసోరి పద్ధతి" అనే పేరు వచ్చినది. విద్యార్థులకు వ్యక్తిగత మైన స్వేచ్ఛ నివ్వడం, వారికి తగిన ఇంద్రియ శిక్షణ నివ్వడం, వారిని స్వయం కృషితో వికసింప చేయడం అనేవి ఈ పద్ధతియొక్క ప్రధాన లక్ష్యాలు . ఈ పద్ధతిని అనుసరించి బోధించే పాఠశాలను "శిశు గృహం" (children's house) అంటారు. కిండర్ గార్టెన్ పద్ధతిలో వలె ఈ పద్ధతిలో ఒక విషయం తరువాత మరొక విషయాన్ని బోధించే నియమం కాని, కాలవ్యవధి నియమం కాని లేవు.

**బోధనా విధానం**

ఇక్కడ విద్యా బోధనంతా తరగతి బోధనలాగా సాగదు. ఈ పద్ధతి ప్రకారం విద్యను బోధించటానకి " Didactic apparatus" అనే సాధన సామగ్రిని ఉపయోగిస్తారు. విద్యార్థులు సంపూర్ణమైన స్వేచ్ఛతో ఆడుకొంటున్నట్లుగానే ఈ సాగ్రిని ఉపయోగించుకొంటారు. ఇలా ఈ సాధన సామగ్రిని ఉపయోగించకోడంలో ఏవైనా పొరపాట్లు జరిగినపుడు, ఆ పొరపాట్లను విద్యార్థులే సవరించుకొనే విధంగా ఉపాధ్యాయని చూస్తూ ఉంటుందే తప్ప జోక్యం చేసుకోదు. అనగా ఆమె కేవలం పరిశీలకురాలుగా మాత్రమే వ్యవహరిస్తుంది. విద్యార్థులే తమ వ్యక్తిగత



తెలివితేటల్ని బట్టి, అభిరుచిని బట్టి అభివృద్ధి చెందుతారు. ఇంద్రియ శిక్షణకు, శరీర పరిశుభ్రతకు, ఆరోగ్యానికి ప్రాధాన్యమిస్తారు. వివిధ రకాలైన బొమ్మలకు రంగులు వేయించడం, రకరకాలైన పూల రంగుల్ని గుర్తింపచేయడం, వాసనలలోని భేదాల్ని గుర్తింపచేయడం, రుచుల్ని పరిచయం చేయడం మొ..న వాని ద్వారా శరీర శిక్షణ నిస్తారు. ఈ విధంగా జరగడం వలన భాషా పరంగా పఠన లేఖనాల్లో శిక్షణ నిచ్చినట్లు అవుతుంది. సాధారణంగా అందుబాటులో లేని తల్లిదండ్రుల పిల్లలకు ఈ శిశుగృహాలు అనుకూలంగా ఉంటాయి. (ఈ పద్ధతి ననుసరించి బోధించే పాఠశాలలకు శిశు గృహాలని పేరు).

**ప్రయోజనాలు**

1. ఇంద్రియ శిక్షణ పెంపొందును. 2. స్వయంకృషి అలవాటగును. 3. ఆత్మ విశ్వాసం పెరుగును. 4. ఆరోగ్య ప్రాధాన్యతను తెలిసికొందురు. 5. మూర్తిమత్వం వికసిస్తుంది. 6. దోషాలకు తగిన సవరణలను విద్యార్థులే తెలిసికొందురు. 7. శారీరక దారుఢ్యం పెరుగుతుంది. 8. గ్రహించిన విషయం ఎక్కువ కాలం గుర్తుంటుంది. 9. స్వేచ్ఛ అధికంగా ఉంటుంది.10. ఉపాధ్యాయులకు భారం తక్కువ . కష్టపడే గుణం అలవాటగును. 11. సంఘీభావం పెంపొందును.

**లోపాలు**

1. కాలనియమం, విషయక్రమం, ప్రత్యేకమైన పద్ధతి లేకపోవడం వలన విద్యాభ్యాసంలో సప్రమాణత లోపించవచ్చు. 2. కాలనియమాన్ని పాటింపక పోవడం వలన ఎక్కువ కాలం వృధా అయ్యే ప్రమాదముంది. 3. అన్నింటికీ ఉపకరణాల మీదనే ఆధారపడడం వలన వ్యయం అధికమౌతుంది. 4. ప్రత్యేకంగా ఉపాధ్యాయుని విద్యార్థుల దగ్గర లేకపోవడం వలనా, విద్యార్థులకు సంపూర్ణ స్వేచ్ఛ ఉండడం వలనా అపుడపుడు ప్రమాదాలు సంభవించడానికి వీలున్నది.

## *కిండర్ గార్టెన్ మాంటిసోరి పద్ధతుల మధ్య ఉండే పోలికలు తేడాలు.*

**పోలికలు**

1. ఇవి రెండూ క్రీడా పద్ధతి అనే వృక్షానికి ఆవిర్భవించిన రెండు శాఖలు. 2. రెండూ ఆధునిక మనస్తత్వశాస్త్రానుకూలంగా ప్రవేశపెట్టబడినవే.3. కొంచెం అటు ఇటుగా రెండింటిలోనూ. విద్యార్థులకు స్వేచ్ఛ లభిస్తుంది.4. రెండింటిలోనూ విద్యార్థుల ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. 5. రెండింటిలోనూ నిర్వహణ దాదాపు ఒకే రకంగా ఉంటుంది.6. రెండింటిలోనూ ఆరోగ్యానికి ప్రాధాన్యమీయబడును.

తేడాలు:

రెండింటి మధ్య పోలికలు కంటే తేడాలే ఎక్కువగా ఉన్నాయి.

### కిండర్ గార్డెన్ పద్ధతి

1. నిర్ధష్ట కాలవ్యవధి ఉంటుంది.
2. ఒక అంశం తరువాత మరొక అంశాన్ని బోధించడం జరుగుతుంది.
3. బోధనలో ఉపాధ్యాయుని మార్గ దర్శకత్వం వహిస్తుంది.
4. విద్యార్థి లోపాల్ని సవరించటానికి వీలుంటుంది.
5. విద్యాబోధాన నిర్ధిష్టక్రమంలో సాగుతుంది.
6. విద్యార్థి స్వేచ్ఛకు ప్రాధాన్యం తక్కువ.
7. విద్యార్థులు వ్యక్తిగతంగా ఉంటారు
8. తక్కువ కాలం, తక్కువ వ్యయం సరిపోతుంది:
9. విద్యార్థులు ప్రమాదాలకు గురికావడానికి వీలులేదు
10. విద్యార్థుల్లో నిర్లక్ష్యానికి అవకాశం తక్కువ
11. ఇంద్రియ శిక్షణకు తక్కువ అవకాశం ఉంటుంది.
12. విద్యార్థులకు ఆత్మ విశ్వాసం, స్వయం ప్రతిపత్తి తక్కువ.
13. ఉపాధ్యాయుని పాత్ర ఎక్కువ
14. సామాజిక సేవకు వీలులేదు.
15. విద్యార్థులకు శారీరక శిక్షణ తక్కువ.
16. విద్యా బోధనలో క్రీడత్వం తక్కువ.

### మాంటిసోరి పద్ధతి.

1. నిర్ధిష్టకాల వ్యవధి ఉండదు.
2. విద్యార్థలే తమ కిష్టమొచ్చినదానిని నేర్చుకొంటారు.
3. ఉపాధ్యాయుని కేవలం పరిశీలకురాలుగానే ఉంటుంది.
4. విద్యార్థి తన లోపాల్ని తానే సవరించుకోవాలి.
5. ప్రత్యేక క్రమ మంటూ పాటింపబడదు.
6. విద్యార్థి స్వేచ్ఛకు ప్రాధాన్యం ఎక్కువ.
7. విద్యార్థులు సంఘీ భావంతో ఉంటారు.
8. ఎక్కువ కాలం, ఎక్కువ వ్యయం అవసరకుంది.
9. ప్రమాదాలకు గురికావడానికి వీలుంది.
10. నిర్లక్ష్యానికి అవకాశం ఎక్కువ
11. ఇంద్రియ శిక్షణకు ఎక్కువ అవకాశం ఉంటుంది.
12. విద్యార్థులకు ఆత్మ విశ్వాసం, స్వయం ప్రతి ప్రత్తి ఎక్కువ.
13. ఉపాధ్యాయుని పాత్ర తక్కువ.
14. సామాజిక సేవకు వీలుంది.
15. విద్యార్థులకు శారీరక శిక్షణ ఎక్కువ.
16. విద్యాబోధనలో క్రీడత్వం ఎక్కువ.

## 4. వ్యక్తి పద్ధతి లేద డాల్టన్ పద్ధతి :-

### వ్యక్తి పద్ధతి ఆవశ్యకత :-

మనిషిని పోలిన మనిషి ఉండవచ్చు కాని మనస్సును పోలిన మనస్సు (Psychie) ఉండడం అసాధ్యం. ఇదే విషయాన్ని మనస్తత్వ శాస్త్రం బలపరుస్తున్నది. అనగా ఏ ఇద్దరు వ్యక్తుల మనస్తత్వాలు ఒకే రకంగా ఉండవు. అందుకనే 'పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకతో ' కాని పోదనే వ్యవహారం వచ్చినది. ఇలాంటి విభిన్న మనస్తత్వాలు ,తెలివితేటలు ఉన్నట్టి అనేక మంది విద్యార్థుల్ని ఒకే చోట కూర్చో బెట్టి తరగతి నియమాలకనుకూలంగా ఉపాధ్యాయుడు బోధించటమన్నది సర్వసాధారణంగా జరుగుతున్న విద్యా విధానం. ఇట్టి విధానంలో ఉపాధ్యాయుడు బాగా తెలివైన వారిని, బాగా మందమతులను కాక అత్యధికంగా ఉండే మధ్యరకం విద్యార్థుల్ని దృష్టిలో పెట్టుకొని బోధన చేస్తాడు. ఈ బోధన సామాన్య ప్రజ్ఞావంతులైన మధ్యరకం విద్యార్థులకు ప్రయోజనకరంగా ఉన్నప్పటికీ, విశేష ప్రజ్ఞావంతులైన (తెలివైన) వారికి విసుగును కల్గించగా, మందమతులకు అర్థం కాకుండా పోతుంది. మధ్యరకం విద్యార్థులు కూడ తరతమ భేదాలవల్ల అందరు సమానంగా ప్రయోజనాన్ని పొందే అవకాశం కూడ లేదు. దానికి కారణం ఈ విధానం విద్యార్థుల వైయక్తిక తేడాలను, తెలివితేటలను, అభిరుచులను దృష్టిలో పెట్టుకొని బోధించక పోవటమే. అయితే ఇలా ఒక్కొక్క వ్యక్తిని దృష్టిలో పెట్టుకొని బోధించాలంటే ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక్క ఉపాధ్యాయుడు అవసరమౌతాడు. ఇది అసలు వీలుకాని పని. కాబట్టి వీలైనంత తక్కువ ఉపాధ్యాయులతో విద్యార్థుల వైయక్తిక తేడాలకు, తెలివి తేటలకు, అభిరుచులకు అనుకూలంగా బోధించే బోధనా విధానం కోసం విద్యావేత్తలు ఆలోచించారు. ఆ ఆలోచనల ఫలితమే ఈ 'వ్యక్తి పద్ధతి' (Individual method). వ్యక్తి వ్యష్టిగా కూడా ఉండడం వలన దీనికి 'వ్యష్టి పద్ధతి' అనేది మరొక పేరు.

హెలెన్ పార్క్ హర్స్ (Helen Park Hurst)అనే ఉపాధ్యాయిని అమెరికాలోని 'డాల్టన్'అనే ప్రదేశంలో మొదట దీనిని ప్రయోగాత్మకంగా ప్రారంభించటం వలన దీనికి 'డాల్టన్ పద్ధతి' అనే పేరు వచ్చింది. ఈ పద్ధతిలో బోధన విధానమంతా 'నియోజనాల (Assignments) మూలంగా సాగడం వలన దీనికి "నియోజన పద్ధతి" అనే పేరు కూడ వచ్చినది. ఈ నియోజనాలనే కొంతమంది నిర్ణయాలని కూడా పిలవడంతో "నిర్ణయ పద్ధతి " అనే పేరు కూడా దీనికి వచ్చినది. ఇది మాధ్యమికోన్నత దశల్లో ఎక్కువగా వినియోగింపబడుతున్నది.

### బోధనా విధానం.

తరగతిలోని విద్యార్థుల్ని వారి వారి వైయక్తిక తేడాల్ని, తెలివితేటల్ని దృష్టిలో పెట్టుకొని ఉత్తమ - మధ్యమ - అధమ స్థాయిలుగా వర్గీకరించవలెను. అలాగే బోధించవలసిన పాఠ్యాంశాలన్నింటినీ కనిష్ఠ, గరిష్ఠ ప్రణాళికలుగా వేరు పఱచి సంవత్సరానికి, మూడు నెలలకు నెలకు, వారానికి తగినట్లుగా విభజించవలెను. అయా పాఠ్యాంశాల్ని ప్రధాన వర్గం, అప్రధాన వర్గం అని రెడుగా వేరు పరచవలెను. వీటిల్లో ప్రధాన వర్గానికి ఎక్కువ కాలాన్ని కేటాయించవలెను. తరువాత నియోజనాలను తయారు చేయవలెను.

**నియోజనాల తయారి - జాగ్రత్తలు :-**

తరగతిలో ఆయా సబ్జెక్టులలో భోధింపదలచిన విషయాలను సాధారణ ప్రజ్ఞావంతులు సంవత్సర కాలంలో పూర్తిచేయటానికి ని లీలుగా ఉండే విధంగా ఆయా సబ్జెక్టులకు సంబందించి యోజనాలను తయారుచేయవలెను. ఒక్కొక్క నియోజనాన్ని మధ్యరకం విద్యార్థి ఒక్క నెలకాలంలో పూర్తి చేయటానికి వీలుగా సుమారు 10 నియోజనాలను సిద్ధం చేయవలెను. నియోజనాలన్నింటిలో ఆయా బోధితాంశాలు సమానంగా ఉండే విధంగా జాగ్రత్తపడవలెను. అనగా ఒక తరగతికి సంబంధించిన నియోజనాలన్నింటినీ పూర్తి చేసే సరికి ఆ తరగతికి సంబంధించి నేర్చుకోదలచిన అంశాలన్నింటనీ విద్యార్థి నేర్చుకొన గలగాలి. అందుకోసం ఒక్కొక్క నియోజనంలో తెలిసికోదగు ముఖ్యాంశాలపై ప్రశ్నలు వేయవలెను. ఉదా:- అర్థం కాని మాటలకు శబరత్నాకరమనే నిఘంటువు ద్వారా అర్థాలు రాయుము? తెలిసిన అర్థాలతో పాఠ్యాంశాన్ని మరొకసారి చదువుము? ఫలానా పద్యాన్ని కంఠస్థం చేయుము? ఫలానా పాత్రను గూర్చి రాయుము? మొ..వి ఈ విధమైన ప్రశ్నలతో, సరైన సూచనలతో అన్ని సబ్జెక్టులకు సంబంధించి నియోజనాల్ని తయారుచేయించవలెను. ఇలాంటి నియోజనాలను విద్యా సంవత్యరం ఆరంభం నాటికే తయారుచేసి పాఠశాల తెరవగానే మొదటి నియోజనాన్ని విద్యార్థులందరికి ఇవ్వవలెను. విద్యార్థులానియోజనాన్ని పూర్తి చేస్తున్నపుడు ఉపాధ్యాయుడు పర్యవేక్షిస్తూ అవసరమైతే సందేహాల్ని తీరుస్తాడు. బాగా తెలివైన విద్యార్థి ఆ నియోజనాన్ని 15 రోజులకు లోపే పూర్తి చేస్తే, మందమతియైన విద్యార్థికి 2 నెలలు పట్టవచ్చు. ఇలా మొదటి నియోజనాన్ని పూర్తి చేసిన వెంటనే తరువాతి నియోజనాన్ని ఇస్తూ క్రమంగా నియోజనాలన్నింటినీ పూర్తి చేయించవలెను. ఇలా ఒక్కొక్క సబ్జెక్టుకు సంబంధించిన అన్ని నియోజనాలను పూర్తి చేసిన విద్యార్థులే పై తరగతిలో ఆ సబ్జెక్టులో ప్రవేశించటానికి అర్హులౌతారు. తెలివైన విద్యార్థి అన్ని నియోజనాలను 5 నెలలకు లోపే పూర్తి చేయవచ్చు. మందమతికి 2 సంవత్సరాల కాలం పట్టవచ్చు. ఈ విధంగా ఈ వ్యక్తి పద్ధతి వలన ప్రతి ఒక్క విద్యార్థి వ్యక్తిగతంగా తన తెలివితేటల - అభిరుచుల ఆధారంగా విద్యను నేర్చుకోడం జరుగుతున్నది.

**తెలుగును బోధించే తీరు**

మాధ్యమికోన్నత దశల్లో వాచక - ఉపవాచకాంశాలు, వ్యాకరణాంశాలు - లిఖిత వ్యాస రచనలు, విస్తరణ - మౌన పఠనాలు మొ..న అన్నింటిలో అన్ని అంశాలు ఆయా నిష్పత్తుల్లో అన్ని నియోజనాల్లో కలిసే విధంగా నియోజనాల్ని సిద్ధం చేసి విద్యార్థుల చేత ఒకదాని తరువాత మరియొక దానిని పూర్తి చేయించవలెను. కొత్త పదాలకు అర్థాలు వ్యాకర ణాంశాంలు ,కంఠస్థం చేయదగు పద్యాలు, కఠినమైన పద్యాలకు భావాలు, శైలివైవిధ్యాలు, పాత్రానుశీలనాలు, సంక్షిప్తాలు, వ్యాసరచనలు మొ..న వానికి సంబపంధించిన ప్రశ్నలు నియోజనాల్లో ఉండవలెను. విద్యార్థులు నియోజనాలను రాయడంలో తగు మాత్రపు సూచనలీయటమే కాకుండా పూర్తి చేసిన నియోజనాలను సరిదిద్దవలెను. సరిగా లేని నియోజనాలను త్రిప్పి రాయించవలెను.

**ప్రయోజనాలు**

1. విద్యాభ్యాసం వైయక్తికంగా, తెలివితేటలకనుకూలంగా సాగుతుంది. 2. విద్యార్థుల్లో

స్వయం కృషి పెరుగుతుంది. 3. ఆత్మ విశ్వాసం పెంపొందుతుంది. 4. తప్పి పోయిన సబ్జెక్టులో తప్ప పొసైన సబ్జెక్టులలో పై తరగతిలోనికి ప్రవేశింపవచ్చు.5. ఉత్సాహం పెరుగుతుంది. 6. గ్రంధ పరిశీలనా సామర్థ్యం పెరుగుతుంది.7. కాల నిర్ణయమాది నియమ నిబంధనలు తక్కువ కావడం వలన స్వేచ్ఛకు ప్రాధాన్య మీ యబడుచుంది. 8. విద్యార్థుల్లో ఆరోగ్యవంతమైన పోటీ తత్వం పెరుగుతుంది. 9.మూర్తిమత్వం అలవడుతుంది. 10. భాషా నైపుణ్యాలు చక్కగా అభివృద్ధి చెందుతాయి.

**పరిమితులు :-**

1. పాఠశాలకు ఖచ్చితంగా గ్రంథాలయం ఉండవలెను. 2. గ్రంథాలయంలో అవసరమైన పుస్తకాలు అధికసంఖ్యలో కావలసి ఉంటుంది. 3. విద్యార్థులు వైయక్తికంగా ఉండడం వలన వారిలో సంఘీ భావం అలవడదు. 4. కాల హరణం -ధనవ్యయం కలుగును.5. నియోజనాల తయారీలో, వానిని దిద్దడంలో ఉపాధ్యాయునికి శ్రమ ఎక్కువ. 6. విద్యార్థుల్లోఐక్యత నశించును. 7. కాపీ రాసే అవకాశం ఉన్నది. 8. వాచిక చర్యకు అవకాశం తక్కువ.

అయితే ప్రతిభకు పట్టాభిషేకం కట్టాలనుకొన్నపుడు పై పరిమితులను అధికమించక తప్పదు. పైగా పై పరిమితులు సాధింపరానివేమీ కావు. ఎలాగంటే హృదయపూర్వకంగా విద్యను అందించటానికి సిద్ధమైన ఉపాధ్యాయునికి శ్రమ అనేది సమస్యకాదు. అలాగే ధన వ్యయమైనప్పటికీ గ్రంథాలయాన్ని అభివృద్ధి పరచుకోడం మంచి లక్షణం. అంతే కాక అపుడపుడు విద్యార్థులందరినీ సమావేశ పఱచి సామూహిక ఉపన్యాసాలు ఇప్పించడం ద్వారావారిలో సమిష్టి భావాన్ని , ఐక్యతను, పెంపొందింపవచ్చు. నియోజనాలను దిద్దేటపుడు కాపీ రాతను కూడ అరికట్టవచ్చు. అలాగే విద్యార్థులు నేర్చుకొన్న అంశాల్ని వాగ్రూపంలో వ్యక్తీకరింప చేయడం ద్వారా భాషణాన్ని పెంపొందించవచ్చు. కాబట్టి ఇది అన్ని విధాలుగా మేలైనదని ఈ పద్ధతి కావాలనుకొంటున్న వారు దీనిని సమర్థిస్తున్నారు.

**ప్రకల్పన పద్ధతి (ప్రాజెక్టు పద్ధతి )లేదాఉద్య పద్ధతి :-**

**ఆవశ్యకత**

పాఠశాలలో నేర్చుకొన్న విద్యకు బాహ్యజీవన విధానానికి మధ్య సమన్వయం లోపించడం వలన విద్యాభోధన వృధా అవుతున్నది. అలా కాక ఈ రెండింటి మధ్య సమన్వయాన్ని సాధించి విద్యార్థికి బాహ్య జీవితంలో ఏది ఉపయోగపడుతున్నదో దానినే పాఠశాలలో విద్యగా బోధించే బోధనా విధానం పైపు విద్యావేత్తల ఆలోచనలు మళ్ళాయి. అట్టి ఆలోచనల ఫలితమే" ప్రకల్పన పద్ధతి" ఆవిర్భావం. భవిష్యత్తు జీవితంలో విద్యార్థి దేనిని తన జవనోపాధిగా చేపట్టాలనుకొంటాడో దానినే పాఠశాలలో బోధించడం దీని లక్ష్యం. భావి జీవితంలో చేపట్టదలచిన వృత్తి - దాని స్వరూప - స్వభావాలు -ఎదుర్కొనే సమస్యలు -పరిష్కార మార్గాలు - ఫలితాలు మొ..న వానిని పాఠశాలలో విద్యార్థి ఒక ఉద్యమంగా తీసికోడం ఈ పద్ధతిలో జరుగుతుంది. దీనికే ఉద్యమ పద్ధతి - ప్రాజెకు పద్ధతి - యత్న కాల పద్ధతి - ఎత్తుగడ పద్ధతి అనే పేర్లు కూడా ఉన్నవి. దీనిని "మిస్‌గల్" అనే ఆంగ్ల వనిత కనిపెట్టినది. ఇది ఉన్నత దశ విద్యార్థులకు ఎక్కువగా

ఉపయోగపడుతుంది.

**బోధనా విధానం:-**

తరగతి బోధనా విధానానికి దీనికి సంబంధమే లేదు. భవిష్యత్తులో విద్యార్థులు ఏయే వృత్తులను అవలంభించాలనుకొంటున్నారో వానిని ఉపాధ్యాయుడు తెలిసికొనవలెను. తరువాత వానికి సంబంధించి విద్యార్థులకు ప్రకల్పనలను ఇవ్వవలెను. ఇక్కడ ప్రకల్పన అనగా "సహజ పరిసరాలలో పూర్తి చేయటానికి వీలయ్యే సమస్యాత్మక క్రియ" అని అర్థం. అనగా విద్యార్థి అత్యంత సహజంగా, సులభంగా చేయటానికి వీలయ్యే సమస్యల్ని కలుగచేయడం. ఉదా.. భవిష్యత్తులో వ్యవసాయాన్ని వృత్తిగా చేపట్టాలనుకొన్న విద్యార్థికి " తోటపని చేయించడం" అనే ప్రకల్పనను ఇవ్వవలెను. ఆ ప్రకల్పనలో తోటను వేయడానికి ఉన్న స్థలమెంత? దాని పొడవెంత ? వెడల్పెంత ? ఒక్కొక్క కయ్య కొలతలెలా **ఉండవలెను?** అలాంటి కయ్యలను ఎన్నింటిని చేయవచ్చు? మొ..న ప్రశ్నలతో గణితాంశాల్ని **బోధింప** వచ్చు. అలాగే నేల స్వభావమేమిటి? ఏయే మొక్కలు అక్కడ పెరగడానికి వీలుంది? **శీతోష్ణస్థితి** ఎలా అనుకూలిస్తుంది? మొదలైన ప్రశ్నలతో వృక్ష - భౌగోళిక శాస్త్రాంశాల్ని బోధింపవచ్చు. ఇంకా అక్కడ పండే పంటలు ఎక్కడ ఎక్కువగా పండుతున్నవి? ఎక్కడ తక్కువగా పండుతున్నవి? ఎక్కడ అమ్మితే లాభం వస్తుంది? ఎక్కడ **అమ్మితే** నష్టం వస్తుంది? మొ..న ప్రశ్నలతో ఆర్థిక శాస్త్రాంశాలను బోధింపవచ్చు. ఇలా ఒక **వృత్తికి సంబంధించిన** ప్రకల్పనల వలన దాదాపు అన్ని అంశాల్ని బోధింపవచ్చు. ఇలాంటి ప్రకల్పనలు **పోస్ట్ ఆఫీస్**ను నడపడం, అంగడిని నడపడం మొ..న రీతుల్లో కూడా ఉండవచ్చు. ఈ విధంగా బోధన కంతటికీ ప్రకల్పన ఆధార భూమికగా ఉంటున్న కారణాన దీనిని తయారుచేసేటప్పుడు క్రింది జాగ్రత్తలు పాటించవలెను.

**జాగ్రత్తలు**

1. ఏదో ఒక పాఠ్యాంశానికి కాక దాదాపు అన్నింటికి సమ ప్రాధాన్యం ఉండే విధంగా ప్రకల్పనను నిర్మించవలెను. 2. సంవత్సరంలో ఒకటి రెండు కాక నాలుగైదింటిని పూర్తి చేయటానికి వీలుగా ఉండే ప్రకల్పనలను తయారుచేయవలెను 3. . విద్యార్థుల అభిరుచులకు అనుకూలంగా ప్రకల్పనలను నిర్మింపవలెను.

## *తెలుగును బోధించే తీరు*

**భాషణం :-**

విద్యార్థులు ప్రకల్పనలను ఎన్నుకొనే సమయంలోనూ, వారా ప్రకల్పనలనే ఎన్నుకోటానికి గల కారణాలను తెలిగికొనడం లోను, ఏయే రోజు ఏయే పనులను చేయాలని చర్చింటలోనూ, చేసిన దాని మీద మాట్లాడింపచేయటంలోనూ భాషణ శక్తిని అత్యంత సహజంగా, సులభంగా పెంపొందింపవచ్చు.

**పఠనం :-**

విద్యార్థులు ప్రకల్పనలను నిర్ణయించుకొన్న తరువాత వానిని చక్కగా నిర్వహించుటకై విషయ పరిజ్ఞానం కోసం పఠించే నిమిత్తం కొన్ని గ్రంథాలను ఉపాధ్యాయుడు వీరికి సూచింప వలెను. విద్యార్థులు అయా గ్రంథాలను గ్రంథాలయాలనుంచి కాని, మరో చోటునుంచి కాని తెప్పించుకొని కావలసిన పరిజ్ఞానం కోసం పఠిస్తూ ప్రకల్పనలను సమర్థవంతంగా నిర్వహించెదరు. ఈ విధంగా ప్రత్యక్ష ప్రయత్నం లేకుండానే పఠనాన్ని పెంపొందించవచ్చు.

**లేఖనం :-**

ప్రకల్పనలను నిర్వహించే విద్యార్థులకు నోటు పుస్తకాలలాగ ప్రకల్పన పుస్తకాలు (Project Books) అవసరమౌతాయి. ప్రకల్పనకు సంబంధించి ప్రతి విద్యార్థి ఏరోజుచేసిన పనులను ఆరోజు ప్రకల్పన పుస్తకంలో రాసికొనవలెను. అది వారికి లిఖిత రచనలాగ సాగిపోతుంది. అంతేకాక ప్రకల్పన నిర్వహణలో విద్యార్థులకు అనేక రకాలైన పుస్తకాలు - పరికరాలు అవసరమౌతాయి. అవన్నీ గ్రంథాలయంలో కాని, పాఠశాలలో కాని లభ్యం కాక పోవచ్చు. అలాంటి సమయంలో వానిని ఇతిర ప్రాంతాలనుంచి తెప్పించుకొనుటకై విద్యార్థులు ఉత్తర ప్రత్యుత్తరాలు చేయవలసి ఉంటుంది. ఆ విధంగా లేఖారచన సాగుతుంది. ఈ విధంగా లేఖనం అత్యంత సహజంగా సుభంగా అభివృద్ధి చెందుతుంది.

**ప్రయోజనాలు:-**

1. నేర్చిన విద్య వెంటనే జీవనోపాధికి ఉపకరిస్తుంది.2. జీవితంలో ఎదురయ్యే సమస్యల్ని ఎదుర్కొనే సామర్థ్యం పెరుగుతుంది. 3. విద్యార్థుల్లో స్వయం కృషి, ఆత్మ విశ్వాసం పెంపొందుతాయి. 4. విద్యార్థుల అంతర్గత శక్తులు బహిర్గతమౌతాయి. 5. విద్యాభ్యాసం వేగంగా, చురుగ్గా, ఉత్సాహవంతంగా సాగుతుంది. 6. విద్యార్థులకు సాంఘిక జీవనం అలవడుతుంది. 7. మానసిక శక్తితో పాటు శారీరక శక్తి పెరుగుతుంది. 8. సహనం - ఓర్పు - ఐకమత్యం మొ..న గుణాలు అలవడతాయి. 9. విద్యను అనుభవ పూర్వకంగా నేర్చుకోడం జరుగుతుంది. 10. స్వేచ్ఛకు ప్రాధాన్యముంటుంది.

**పరిమితులు :-**

1. అన్ని సబ్జెక్టుల్ని బోధించడం కొంచెం కష్టం. 2. అందరు విద్యార్థులకు ఇది ఆచరణయోగ్యం కాకపోవచ్చు. 3. వివిధ రకాలైన విజ్ఞానాన్ని పొందటం కష్టం. 4. విద్యార్థుల తల్లి దండ్రులు కూడ ఈ బోధనా విధానానికి సుముఖులు కాక పోవచ్చు.

**6. ప్రాతి పదిక విద్య (Basic Education) :-**

విద్యార్థిని భావిజీవితానికి అన్ని విధాలుగా సిద్ధం చేయాలనే తలంపుతో ఏర్పడిన విద్యా విధానమే "ప్రాతిపదిక విద్య". భవిష్యత్తులో ఉపయోగపడే విద్యనే నేర్చుకోవాలనే ప్రకల్పన పద్ధతికి దీనికి దగ్గరి సంబంధం ఉంది. వ్యక్తి స్వతంత్రంగా జీవిస్తూ భారత జాతీయి జీవన విధానానికి

అనుకూలంగా ఉండాలన్నది దీని ఉద్దేశం. దీనిని గాంధీ మహాత్ముడు "వార్దా" పట్టణంలో రూపొందించడం వలన దీనికి "వార్ధావిధానమనేది" మరొక పేరు. క్రిందివి దీనిలోని ప్రధానమైన అంశాలు.

**విద్యా విధానంలో ప్రాధాన్యం :-**

1. వృత్తి కేంద్రంగా ఉండడం :- ఈ విద్యా విధానంలో ఏదో ఒక వృత్తి ప్రధాన కేంద్రంగా ఉంటుంది. విద్యాబోధన అంతా ఆ వృత్తికి అనుబంధంగానే సాగుతుంది. భవిష్యత్తులో ఉపయోగపడే ఏదో ఒక వృత్తిని పాఠశాలలో ప్రవేశపెట్టి దీనికి సంబంధించి మాత్రమే పాఠ్యాంశాలైన చరిత్ర - లెక్కలు - భాష - భూగోళం - విజ్ఞాన శాస్త్రం - సంగీతం మొ..న వానిని బోధింపవలెను. దీని వలన విద్యార్థికి తన వృత్తి యందు ప్రావీణ్యం, గౌరవ భావం ఏర్పడి భవిష్యత్తులో తన జీవనోపాధిని తానే సంపాదించుకోగలుగుతాడు.

2. స్వయం పోషకత్వాన్ని పొందడం :- ఈ విద్యా విధానంలో పాఠశాలలు ప్రభుత్వం మీద ఆధారపడక తమకు తామే స్వయం పోషకాలుగా రాణిస్తాయి. ఎలాగంటే పాఠశాలలోని విద్యార్థులచేత వస్తువుల్ని తయారుచేయించి వానిని అమ్మడం ద్వార లభించే ధనాన్ని పాఠశాల భవనాలు, ఉపాధ్యాయుల జీతాలు, ఇతర వస్తుసామగ్రి మొ..న అన్ని ఖర్చులకు వినియోగిస్తారు. దీని వలన ప్రభుత్వం పాఠశాలల నిర్వహణకు కేటాయించిన ధనాన్ని ఇతర శాఖలకు మళ్ళించడం ద్వారా దేశాభివృద్ధి సత్వరంగా జరగటానికి వీలున్నది.

3. నిర్బంధ ఉచిత విద్య :- ఈ విద్యా విధానంలో ఏడేళ్ళ నుండి పధ్నాలుగేళ్ళ లోపున్న బాల బాలికలందరు అత్యంత నిర్బంధంగా -ఉచితంగా పాఠశాలకెళ్ళి విద్యనభ్యసించవలెను. నేర్చుకొనేది వృత్తి విద్య కావడం వలన, కొద్దిగా వయస్సున్న వారే దానిని నేర్చుకోడం సులభం కావడం వలన దీనిలో వయోనియమం పాటింపబడినది. నిర్బంధం , ఉచితం కావడం వలన అందరూ విద్యను నేర్చుకోటానికి ప్రయత్నిస్తారు.

4. మాతృభాషకు ప్రాధాన్యం :- ఈ విధానంలో మాతృ భాషకు అత్యధిక ప్రాధాన్యం ఉన్నది. బోధనంతా మాతృభాషద్వారానే సాగుతుంది. విద్యార్థికి అత్యంత సహజంగా, సులభంగా, బాగా తెలిసినదిగా మాతృభాషే ఉండడం వలన దాని ద్వారానే బోధననంతటినీ సాగించడం సమంజసంగా ఉన్నది.

ఈ విధంగా ఇది జాతి - మత విద్వేషాలకు అతీతంగా, అత్యంత ప్రయోజనకారిగా స్వయం పోషకత్వంతో అందరికీ సౌలభ్యాన్ని చేకూరుస్తూ, ప్రజలందరికీ మూలాధారంగా ఉంటున్న కారణాన దీనికి " ప్రాతిపదిక విద్య " అనే పేరు చక్కగా సమన్వయమౌతున్నది. అయితే ఇది సత్ఫలితాల్ని ఇవ్వలేక పోవడం దురదృష్టకరం.

**7. పర్యవేక్షితాధ్యయనం (Supervised Study) :-**

ఇది ప్రత్యేకమైన బోధనా విధానం కాదు. తరగతి బోధనకు అనుబంధంగా ఉపాధ్యాయుని పర్యవేక్షణలో విద్యార్థులు చేసే అధ్యయనమే పర్యవేక్షితాధ్యయనం. బోధింపబడిన పాఠ్యాంశాల్ని

ఇంటి దగ్గర అధ్యయనం చేయటానికి అవకాశం లేని విద్యార్థుల చేత తరగతి గదిలోనే మరో సారి అధ్యయనం చేయించడం దీని లక్ష్యం. పాఠశాల సమయంలో తరగతిలో బోధింపబడిన పాఠ్యాంశాల్ని ఆ తరగతి గదుల్లోనే పాఠశాల సమయానికి ముందు కాని (ఉదయం), పాఠశాల సమయానికి తరువాత కాని (సాయంత్రం) ఉపాధ్యాయుని పర్యవేక్షణ క్రింద రోజుకు ఒకటి రెండు గంటలపాటు విద్యార్థుల చేత చదివించడం జరుగుతుంది. సెలవు దినాల్లో అయితే ఇంకొంచెం ఎక్కువ కాలం కేటాయింపబడుతుంది.

పర్యవేక్షణాధ్యయన సమయంలో విద్యార్థులు వ్యక్తి గతంగా కాని లేక ఇద్దరు ముగ్గురు కలిసి వర్గంగా కాని బోధింపబడిన పాఠ్యాంశాల్ని నెమరు వేసికోవచ్చు. ఇంటిపనినైనా చేసికోవచ్చు. తరువాత చెప్పబోయే పాఠ్యాంశాలకు సంసిద్ధులైనా కావచ్చు. ఇలా విద్యార్థులు మౌనంగా అధ్యయనం చేస్తున్నపుడు ఉపాధ్యాయుడు గమనిస్తూ ఉంటాడు. విద్యార్థులకు సందేహాలు వస్తే తీరుస్తాడు. ఇట్టి పర్యవేక్షణకు ఒకే పాఠ్యాంశాన్ని బోధించే ఉపాధ్యాయున్ని కాక వివిధ పాఠ్యాంశాల్ని బోధించే ఉపాధ్యాయుల్ని రోజుకొకరి చొప్పున కేటాయించవలెను. దాని వలన అన్ని పాఠ్యాంశాల్లోని సందేహాల్ని విద్యార్థులు సులభంగా తీర్చుకోగలుగుతారు.

**ప్రయోజనాలు**

1. మౌన పఠనం అభివృద్ధి చెందుతుంది. 2. విద్యార్థులకు సందేహాలు తీరుతాయి. 3. విషయం చక్కగా అవగాహనకు వస్తుంది. 4. ఇంటి పనిని చక్కగా పూర్తి చేస్తారు. 5. మందబుద్ధులు కూడా చురుకుగా చదువుకోటానికి వీలుంది.6. బోధింప బోవు పాఠ్యాంశాల్ని ముందుగానే విద్యార్థులు చూసి కోడం వలన వానిని సులభంగా అర్థం చేసికోగలుగుతారు. 7. పాఠ్యాంశాలతో పాటు పాఠ్యేతరాంశాల్ని కూడా చదివించటానికి వీలున్నది.

అయితే ఉపాధ్యాయులకు ఈ విధానం వలన అత్యధిక శ్రమ కలుగుతుంది.

## వివిధ పాఠ బోధనా పద్ధతులు

పాఠశాలలో పాఠాలను బోధించే పద్ధతులకే 'పాఠబోధనా పద్ధతు'లని పేరు. పాఠాలు వివిధ రకాలుగా ఉంటున్న కారణాన వాని బోధనా పద్ధతులు కూడా వివిధ రకాలుగా ఉంటున్నాయి. పాఠశాలలో బోధించవలసిన అంశాలు వివిధ రకాలుగా ఉంటాయి. వీనినే పాఠ్యాంశాలు అంటాం. ఈ పాఠ్యాంశాలు ఒక్కొక్క తరగతికి ఒక్కొక్క రకంగా ఉంటాయి. అంతే గాక ఒక్కొక్క తరగతిలో ఉండే పాఠ్యాంశాలు కొన్ని వర్గాలుగా విభక్తమై ఉంటాయి. ఉదా.. సంఘానికి సంబంధించిన అంశాలన్నీ సాంఘిక శాస్త్రంగా, విజ్ఞానానికి (Science) సంబంధించిన అంశాలన్నీ విజ్ఞాన శాస్త్రంగా , లెక్కలుకు సంబంధించినవన్నీ గణితంగా, భాష - సాహిత్యానికి సంబంధించనవన్నీ భాషగా విభక్తమౌతాయి. ఈ భాష ఒకే రకంగా కాక తెలుగు, ఇంగ్లీషు, హిందీ మొదలైన రూపాల్లో ఉంటుంది. ఈ పాఠ్యాంశాలన్నింటినీ పాఠశాలలో ఒకే రకంగా బోధించటానికి వీలుండదు. అందుకు కారణం వాని స్వరూప స్వభావాల్లో తేడాలుండటమే. అందుకే భాషేతకరాంశాలన్నింటినీ దాదాపుగా ఒక రకంగా బోధిస్తే భాషాంశాలన్నింటినీ మరొక రకంగా బోధించవలసి ఉంటుంది.. ఈ

పాఠ్యాంశాలన్నింటినీ మరలా తరగతి భేదాన్ని బట్టి ఒకే రకంగా కాక రకరకాలుగా బోధించవలసిన ఉంటుంది. ఉదా.. తెలుగు భాషలో ప్రాథమిక - మాధ్యమిక - ఉన్నత దశల్లోని పాఠ్యాంశాల స్వరూప స్వభావాల్లో తేడాలుండడం వలన వానిని బోధించడంలో కూడా తేడాలుంటాయి. ప్రాథమిక దశలో బోధించవలసిన పాఠ్యాంశాలన్నింటినీ వాచకమనే ఒకే వర్గంతో బోధిస్తారు. కాని మాధ్యమిక ఉన్నత దశల్లో బోధించవలసిన వానిని వాచకమనీ, ఉపవాచకమనీ రెండు వర్గాలుగా విభజించి బోధిస్తారు. మరలా వాచకంలో ఉండే పాఠ్యాంశాలన్నింటినీ వాని స్వరూప స్వభావాల్ని బట్టి పద్యం - గద్యం - వ్యాకరణం - అలంకారం - నాటకం మొ..న రూపాలుగా వేరు పరచి బోధించడం జరుగుతుంది ఇలా వీనిని వేరుపరచటానికి కారణం వీని స్వరూప - స్వభావాలు - లక్ష్యాలు - ప్రయోజనాలు మొ..న వాటిల్లో తేడాలుండడమే. అందుకే వీనిని బోధించే పద్ధతుల్లో కూడా తేడాలు ఉండవలసి వచ్చినది. కాబట్టి వివిధ రకాలైన పాఠ బోధనా పద్ధతులు ఏర్పడ్డాయి. అవి క్రింది విధంగా ఉన్నాయి.

## 1 పద్య బోధన

సారస్వతంలో పద్యానికి ఉండే స్థానం, లక్ష్యం, ప్రయోజనం మొ..న వానిని బట్టి బోధనా విధానం ఆధారపడి ఉన్నది.

### సారస్వతంలో స్థానం :-

భారతీయ సాహిత్యమైన సంస్కృత సాహిత్యంలో పద్యానికి అగ్రతాంబూలమున్నది. ఆది కావ్యమైన రామాయణం పద్య రూపంలోనే ఆవిర్భవించినది. జగద్విఖ్యాతమైన మహాభారతం పద్యంలోనే పరిఢవిల్లినది. తరువాత తామర తంపరగా పద్య కావ్యాలు వెల్లి విరిశాయి. ఇక్కడ పద్యమనగా విశిష్టమైన రచన. ఈ విశిష్ట రచన అక్షర కూర్పుకు సంబంధించినది. అనగా అక్షరాల్ని కూర్చడంలో ఒక క్రమాన్ని, ఒక లయను , ఒక నాద సౌందర్యాన్ని, ఒక మాధుర్యాన్ని పాటించడం. దీనినే ఛందస్సు అంటున్నాం. అనగా ఛందస్సు లేనిదే పద్యం లేదు. కాబట్టి పద్యమంటే ఛందోబద్ధమగు రచన. (ఆధునికి వచన సాహిత్యానికి వర్తించదు). ఇట్టి ఛందోబద్ధముగా రచన వలన చెవికి ఇంపైన ఒక నాద మాధుర్యం, హృదయాన్ని ఉఖ్ఖాత లూగించే ఒక లయ, మనస్సుకు పదును పెట్టే ఒక క్రమం అనుకోకుండానే సాధింపబడడం వలన ఒక మహానందం చేకూరుతున్నది. అందుకే సంస్కృత సాహిత్యం పద్యానికి అత్యధిక ప్రాధాన్యమిచ్చింది. ఒక సంస్కృత సాహిత్యమేకాదు దాదాపుగా ప్రపంచ సాహిత్యాలన్నీ కూడ దీనికి పట్టం గట్టాయి. ఉదా:- Samuel JohnSon అనే ఆంగ్ల కవి "Poetry is Metrical Composition"(కవిత్వం ఛందో బద్ధమగు రచన) అని సిద్ధాంతీకరించాడు.

తెలుగు సాహిత్య విషయంలో పద్యం మకుటం లేని మహారాజుగా వెలిగింది. కావ్యం కాని - కవిత్వం కాని చెప్పాలంటే పద్యమే శరణ్యం తప్ప అన్యం కాదన్నది ఆంధ్ర కవుల అభిమాన విషయం. ఆ విషయాన్ని ఒక ఆంధ్ర లాక్షణికుడు "విద్యల లోపలనుత్తమ; విద్యకవిత్వంబు మరి కవిత్వంబు ఛందో వేద్యమని " స్పష్టం చేశాడు. 11 వ శాతబ్దంలో ఆంధ్ర సాహిత్యాన్ని నన్నయ పద్యంతోనే ఆరంభించాడు. ఈ రచనా మార్గమే ఆంధ్ర సాహిత్యంలో నిన్న మొన్నటి వరకు

పద్యాలు ఒక దానితో మరొకటి సంబంధాన్ని కలిగి ఉంటాయి. అటువంటి సమయంలో వానిని ఒక ప్రమాణంగా (Unit) తీసికొని అందలి భావాన్ని స్థూల రూపంలో బోధించవలసి ఉంటుంది.

అలా స్థూల భావాన్ని తెలిపిన తరువాత "Whole to Parts" అనే మానసిక శాస్త్ర నియమమాధారంగామాధారంగా దానిని కొన్ని ఉపభాగాలుగా విభజించి ఒక్కొక్క ఉపవిభాగంలోని సూక్ష్మాతి సూక్ష్మ భావాల్ని తెలియ చేయవలెను. ఇలా స్థూల భావం తెలిసిన తరువాత సూక్ష్మ భావాన్ని తెలిసికోటమనేది విద్యార్థుల ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని, ఆసక్తిని పెంపొందిస్తుంది. ఇలా ఈ పూర్ణ పద్ధతిని ఉపయోగించి పద్యాన్ని లేద పద్య సముదాయాన్ని సంపూర్ణంగా, సమగ్రంగా బోధించడం జరుగుతుంది. ఈ పద్ధతిని మనస్తత్వ శాస్త్రం కూడా అంగీకరించినది.

**2. ఖండ పద్ధతి :-**

పద్యాన్ని ప్రమాణంగా కాక అందలి భాగాల్ని ప్రమాణాలుగా తీసికొని స్థూల రూపంలో కాక విడి విడిగా విభాగాలుగా పద్య భావాన్ని బోధించటమే ఖండ పదతి. ఇలా ముక్కలు ముక్కలుగా భావాల్ని తెలిసికొని ఆతరువాత మొత్తం భావాన్ని స్థూల రూపంలో తెలిసికోటమనేది విద్యార్థుల ఉత్సాహానికి, ఆసక్తికి, అభిరుచికి అనుకూలమైనది కాదు. అందుకే మనస్తత్వ శాస్త్రం దీనిని అంగీకరించడం లేదు.

## సాంప్రదాయికంగా పద్య బోధన

ఉపాధ్యాయుడు తరగతి గదిలో ప్రవేశించగనే ఏదోయొక పాఠం తీసికొని విద్యార్థులు సంసిద్ధంగా లేకున్నా పాఠం చెబుతాడు. చెబుతూ చెబుతూమిగిలిపోయిన దానిని మరునటి రోజు వచ్చి చెబుతాడే కాని అంతకు ముందు రోజు చెప్పిన దానిని పూర్వజ్ఞానంగా అందించడు. ఇంక చెప్పే విధానానికి వస్తే సంపూర్ణంగా ఖండపద్ధతిని ఉపాయోగిస్తాడే కాని పూర్ణ పద్ధతిని ఉపయోగించడు. పద్యాన్ని మొదట చదవటం, పద విభాగం చేయటం. కఠిన పదాలకు అర్థాలు, నానార్థాలు, పర్యాయ పదాలు, వ్యాకరణాంశాలు, అలంకారాలు, ఛందస్సు, తాత్పర్యం, భావం మొ..న వానిని అన్నింటిని చెప్పేస్తాడు. ఉపాధ్యాయుడు పాఠం చెబుతూన్నంత సేపు విద్యార్థులు రామాయణాన్నో, భారతాన్నో వింటున్నట్లు తలవూపు కొంటూ శ్రోతలుగా ఉంటారు. వారిని మధ్య - మధ్యలో ప్రశ్నించడం కాని, చెప్పించటంకాని జరుగదు. పాఠం చెబుతున్నపుడే మధ్య మధ్యలో అవసరమైన వానిని నోటు పుస్తకాల్లో రాయిస్తాడు. కొన్నింటిని కంఠస్థం చేయిస్తాడు. ఈ విధంగా ఈ బోధనంతా ఉపాధ్యాయ ముఖంగా సాగుతుందే తప్ప విద్యార్థికి ఎలాంటి ప్రమేయం ఉండదు. ఇలాంటి బోధనా విధానంలో బోధనా లక్ష్యాలు నెరవేరక పోవడమే కాక క్రింది లోపాలు కూడా కనిపిస్తున్నాయి.

**లోపాలు:-**

1. పద్యాన్ని ముక్కలు ముక్కలు చేసి చెప్పటం వలన అసలు చెప్పవలసిన పద్య సౌందర్యం మరుగునపడి పోతుంది.2. ఉన్ముఖీకరణకు కాని,. పూర్వజ్ఞాన పరిశీలనకు కాని తావు లేక పోవుట వలన బోధనాంశాన్ని విద్యార్థులు వెంటనే గ్రంహించలేరు. 3. ప్రశ్నించడం కాని, చెప్పించడం

కాని లేకపోవటం వలన విద్యార్థులకు ఉత్సాహం కాని, ఉల్లాసం కాని నన్నగిల్లును. 4. బోధనంతా ఉపాధ్యాయ కేంద్రంగా సాగడం వలన అది ఉపాధ్యాయునికి పనికి వచ్చేదిగా ఉంటుందే తప్ప విద్యార్థులకు పనికి వచ్చేదిగా ఉండదు.5. ఉపాధ్యాయుడు తరగతిలో ప్రవేశించింది మొదలు వెళ్ళేంత వరకూ పాఠాన్ని చెప్పుకొంటూ పోవటం వలన విద్యార్థులకు విసుగు కలుగుతుంది. 6. ఉపాధ్యాయుడు తాను చెప్పే దాని మీదనే దృష్టిని కేంద్రీకరించడం వలన చెప్పే దానిని విద్యార్థులు గ్రహించిందీ, లేనిదీ తెలుసుకోలేడు. 7. బోధనాంశాల్లో ఒక దానితో మరొక దానిని సంబంధం లేకపోవటం వలన వానిని గ్రహించడం విద్యార్థులకు చాలా కష్టం. 8. పద్య భావాన్ని ముక్కలు ముక్కలుగా విద్యార్థులు గ్రహిస్తుండడం వలన అందలి రసానుభూతిని వారు సులభంగా పొందలేరు. 9. పద్యాన్ని విద్యార్థులు ఎంత మాత్రం గ్రహించారో తెలిసికొనే అవకాశమే లేదు. 10. భాషా జ్ఞానం కొంత వరకు కలిగినా విషయజ్ఞానం అభివృద్ధి కాదు. 11. రచనా శక్తి అభివృద్ధి కాదు. 12. విమర్శనా శక్తి, సృజన శక్తి మొ..వి అసలు బహిర్గతమయ్యే అవకాశమే లేదు. 13. స్వయం గా ఆలోచించే శక్తి నన్నగిల్లుతుంది.14. భాషణ శక్తి బాగా అభివృద్ధి చెందటానికి వీలు లేదు.

## ఆధునికంగా పద్య బోధన (పద్య బోధనా సోపానాలు) :-

సాంప్రదాయిక పద్య బోధనలోని లోపాల్ని పరిహరిస్తూ, పద్య బోధనా లక్ష్యాలన్నింటినీ నెరవేరుస్తూ, మనస్తత్వ శాస్త్ర సూత్రాలకనుకూలంగా ఆధునిక కాలంలో పద్యాన్ని బోధిస్తారు. ఈ బోధనంతా ఒక క్రమంలో కొన్ని సోపానాల ఆధారంగా సాగుతుంది. ఆయా సోపానాల ద్వారా ఆధునిక కాలంలో పద్యాన్ని క్రింది విధంగా బోధిస్తారు.

### I. ఉన్ముఖీకరణం - పూర్వ జ్ఞాన పరిశీలనం :- (Motivation - Observation of past knowledge)

ఆధునిక పద్య బోధనలో ఇది మొట్ట మొదటి సోపానం. ఉన్ముఖీ కరణమనగా ముఖాముఖి చేసికోటమని అర్థం. అనగా మానసికంగా ఎక్కడో ఉన్న వారిని తనకభిముఖంగా చేసికోటమని భావం. ఉపాధ్యాయుడు తరగతి గదిలోకి ప్రవేశించే సమయానికి విద్యార్థుల మనస్సు అంతకు పూర్వపు పాఠ్యాంశాల మీదనో, బయటి పరిసరాల మీదనో, ఇంటి పరిస్థితుల మీదనో, శారీరిక - మానసిక వత్తుడుల మీదనో ఉండవచ్చు. అటువంటపుడు ఉపాధ్యాయుడు వెంటనే పాఠ్యబోధనకు ఉపక్రమించినచో విద్యార్థుల మనస్సు దాని మీద కేంద్రీకృతం కాదు. అట్టి పరిస్థితుల్లో ఉపాధ్యాయుడు వారిని తన బోధనాంశం వైపుకు ఆకర్షించటం కోసం, బోధనకు వారిని సంసిద్ధుల్ని చేయటం కోసం, బోధనాంశం మీద వారి దృష్టిని కేంద్రీకరింప చేయడం కోసం చేసే ప్రయత్నమే ఉన్ముఖీ కరణం. ఈ ఉన్ముఖీకరణం ప్రశ్నల రూపంలో కాని, చిత్ర ప్రదర్శన రూపంలోకాని, కొద్ది పాటి కథారూపంలో కాని, ఉపకరణాల రూపంలోకాని, పూర్వ జ్ఞాన రూపంలో కాని, అవసరమైనపుడు వివరణ రూపంలో కాని ఉండవచ్చు. వీటిల్లో ప్రశ్నల రూపంలో ఉండడం మిగిలిన వానికన్న కొంచెం మేలైనది. ఈ ఉన్ముఖీకరణ చిట్ట చివరి పదం కాని, వాక్యం కాని బోధింప బోవు పాఠ్యాంశపు పేరును సూచించటమనేది సమర్థవంతమైన ఉన్ముఖీకరణ.

ఉన్ముఖీకరణ తరువాత తనకు కేటాయించిన సమయంలో ఉపాధ్యాయుడు

బోధనాంశంలోని కొంత భాగాన్ని బోధించి మిగిలిన దానిని బోధించటానికై మరునటి రోజు తరగతి గదిలోకి ప్రవేశిస్తాడు. అపుడు మరలా వారిని బోధనాంశానికై సంసిద్ధుల్ని చేయటానికి అంతకు ముందురోజు బోధింపబడిన దానిని సంక్షిప్తంగా ప్రశ్నల రూపంలో జ్ఞప్తికి తెస్తాడు. దీనినే "పూర్వ జ్ఞాన పరిశీలన " అంటారు. దీని సహాయంతో బోధనకు ఉపక్రమిస్తాడు. క్రొత్త పాఠం మొదలు పెట్టబడే రోజుకాక తక్కిన అన్ని రోజుల్లో ఆ పాఠం సంపూర్ణమయ్యేంత వరకు ఈ పూర్వజ్ఞాన పరిశీలనలనే ఉపాధ్యాయుడు చేపడతాడు. అయితే బోధనాంశాలన్ని ఒకదానితో మరొకటి సంబంధాన్ని కలిగి ఉన్నపుడే ఈ పూర్వజ్ఞాన పరిశీలనకు ఆస్కారముంటుంది. అలా కానపుడు ముఖ్యంగా వేటికవే స్వయం సిద్ధాలైన శతక పద్యాల విషయంలో ఈ పూర్వజ్ఞాన పరిశీలనలు ఉపయోగపడవు. అటువంటపుడు 'ఉపశీర్షికల' నే పేరుతో ఉన్ముఖీకరణలను చేయటమే శరణ్యం.

**II. శీర్షికా ప్రకటన (Announcement of the Topic) :-**

బోధనలో ఇది రెండో సోపానం ఉన్ముఖీకరణ ముగిసిన వెంటనే మొదలౌతుంది. దీనిని ఉపాధ్యాయుడు ప్రకటించటమే కాక నల్లబల్ల (Black Board) మీద రాస్తాడు. ఇది ఆ రోజు బోధింపబోవు పాఠ్యాంశపు పేరు. దీనిని ఉపాధ్యాయుడు ఉన్ముఖీకరణ ద్వారా విద్యార్థుల నుండి యథాతథంగా రాబడతాడు. అయితే అది ఉపాధ్యాయుని నైపుణ్యం మీద ఆధారపడుతుంది. ఒక్కొక్క సారి ఎంతనైపుణ్యమున్నా దీనిని యథాతథంగా రాబట్టలేక పోవచ్చు. అటువంటపుడు ఆ పేరుకు దగ్గరి సంబంధమున్న దానిని రాబట్ట వచ్చు. అదీ వీలు కాక పోతే అవసరమనుకొన్నపుడు ఉపాధ్యాయుడే కొంత వివరణ నిచ్చి దాని సహాయంతో దీనిని ప్రకటించవచ్చు.

అయితే శీరికను ప్రకటించి కేటాయించిన సమయంలో కొంత పాఠాన్ని బోధించి తక్కిన దానిని మరునటి రోజు బోధించవలసి వచ్చినప్పుడు మరలా మొదటి రోజు మాదిరిగా శీరికను ప్రకటించ కూడదు. అట్లా చేయటం వలన కాలం వృధా కావటమే కాక విద్యార్థులకు విసుగుదల ఏర్పడుతుంది. అందువల్ల ముందు రోజు బోధింపబడిన పాఠ్యాంశం మీద పూర్వ జ్ఞాన పరిశీలన చేసి దాని ద్వార బోధనకు ఉపక్రమించవలెను. ఒకవేళ ఆయా పాఠ్యాంశాలకు ఒకదానితో మరొక దానికి సంబంధం లేనపుడు ఆపాఠ్యాంశాలకు సంబంధించి ఉపశీర్షికలను తయారు చేయింప వచ్చు.

**III. ప్రదర్శన (Presentation) :-**

బోధనలో ఇది ప్రధానమైన సోపానం. అసలైన బోధనంతా దీనితోనే మొదలై తిరిగి దీనితోనే ముగుస్తుంది. దీనిని కొన్ని ఉపసోపానాలుగా విభజించి వాని ఆధారంగా దీనిని క్రింది విధంగా నిర్వహించవలెను.

**1. కవి కాలాదులు :-**

పద్యాన్ని బోధించే ముందు ఆపద్యమున్న పాఠాన్ని లేదా గ్రంథాన్ని రచించిన కవిని గురించి, అతని కాలం, ఇతర గ్రంథాలు, సమకాలికులు, అతని కవిత్వంలోని విశేషాలు మొ..న వానిని ఉపాధ్యాయుడు చెప్పవలెను. ఒక వేళ విషయం విద్యార్థులకు తెలిసినదైతే ప్రశ్నల రూపంలో వారి నుండి రాబట్ట వచ్చు. అయితే ఈ కవికాలాదుల్ని పాఠాన్ని ఆరంభించిన తొలిరోజు మాత్రమే

చెప్పవలెను. మిగిలిన రోజుల్లో అవసరం లేదు. కొన్ని పాఠాలకు కవికాలాదులు తెలియనపుడు వానిని తెలియచేయవలసని అవసరం లేదు.

**2. సందర్భం :-**

బోధింపబోవు పద్యం ఏ సందర్భానికి సంబంధించినదో తెలియ చేయుట. ఇది ఎవరు ఎవరితో ఎపుడు ఎందుకు చెబుతున్నారనే అంశాలకు సంబంధించిది. విద్యార్థులకు తెలుసుననుకొన్నపుడు వారినుండే దీనిని రాబట్ట వచ్చు. తెలియదనుకొన్నపుడు ఉపాధ్యాయుడే దీనిని తెలియచేయవలెను. ఒక్కొక్కసారి ఇది ఉన్ముఖీకరణంలోకాని, పూర్వజ్ఞాన పరిశీలనంలో కాని ఉండవచ్చు. అటువంటపుడు దీనిని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. అలాగే దీనికి ప్రాధాన్యం లేదనుకొన్నపుడు కూడా దీనిని చెప్పవలసిన అవసరం లేదు.

**3. పఠనం :-**

**ఆదర్శపఠనం :-**

కేటాయించిన సమయంలో బోధించటానికి వీలైన ఒక పద్యాన్ని కాని లేక రెండు మూడు పద్యాల్నికాని వాని స్థూలార్థాన్ని విద్యార్థులు గ్రహించే విధంగా, అర్థవంతంగా -భావ భరితంగా, పఠనాభిలాషను పెంపొందించే విధంగా, లయానుకూలంగా ఉపాధ్యాయుడు చదువవలెను. రాగయుక్తంగా, సంగీతానుకూలంగా పాడాలనే నియమమేది లేదు. అలా పాడగలిగితే మంచిది. పద్యం యొక్క కాఠిన్యాన్ని బట్టి, భావాన్వయ క్లిష్టత్వాన్ని బట్టి ఒకటి లేక రండు మూడు సార్లైనా చదువవచ్చు. ఇన్ని సార్లని కాదుకాని పద్యమందలి భావాన్ని, శబ్దస్వరూపాన్ని విద్యార్థులు స్థూలంగా గ్రహించేంత వరకూ ఉపాధ్యాయుడు తన ప్రతిభను - నైపుణ్యాన్ని ఉపాయోగించి చదువవలెను. ఈ పఠనం మీదనే విద్యార్థుల పఠన శక్తి, పఠనా సక్తి ఆధారపడటం వలన ఇది వారికి ఆదర్శపఠనమౌతుంది.

**బాహ్యపఠనం :-**

ఉపాధ్యాయుడు పద్యాన్ని పఠించిన వెంటనే పఠన శక్తిని పెంపొందించటానికి, పఠనాసక్తిని కలిగించటానకి విద్యార్థుల చేత అర్థవంతంగా, దోషరహితంగా పఠింపచేయవలెను. విద్యార్థులందరి చేత పఠింపచేయటానికి వీలు కాదు గనుక కొందరి చేత పఠింపచేయవలెను. ఈ కొద్ది మందిని కూడ సామూహికంగా కాక ఒకరితరువాత మరొకరిని పఠింపచేయవలెను. వారు చదువుచున్నపుడు అందలి దోషాలను అందరికి తెలిపే విధంగా ఉపాధ్యాయుడు సరిదిద్దవలెను. ఒక విద్యార్థి చదువుచున్నపుడు తక్కిన విద్యార్థులందరినీ ధానిని గమనింపచేయవలెను. అందుకోసం ఈ పఠనాన్ని అందరికీ వినబడేటట్లు బాహ్యంగా, ప్రకాశవంతంగా చదివింపవలెను. అందుకే ఈ పఠనాన్ని బాహ్య పఠనమని, ప్రకాశ పఠనమని పిలుస్తున్నారు.

అన్వయ కాఠిన్యం లేని పద్యాల విషయంలో ఈ బాహ్య పఠనాన్ని ఆదర్శపఠనం అయిన వెంటనే చేయించవచ్చు. అలా కాక చాలా క్లిష్టంగా ఉంటూ, అన్వయ కాఠిన్యం ఉండే పద్యాల విషయంలో మాత్రం వానిని సంపూర్ణంగా బోధించిన తరువాత చివర్లో ఈ బాహ్య పఠనం చేయించడం మంచిది.

**మౌన పఠనం:-**

పఠన శక్తిని, పఠనాసక్తిని పెంపొందించటంలో భాగంగా విద్యార్థుల చేత మౌన పఠనాన్ని కూడ చేయించవలెను. వేగంగా పఠించటానికి, పఠించిన దానిని శీఘ్రంగా గ్రహించటానికి, అనేక మంది ఒకేసారి చదువు కోటానికి ఈ మౌన పఠనం చక్కగా ఉపకరిస్తుంది. అయితే ఇది ప్రాథమిక దశ విద్యార్థులకు కష్టంగా ఉండటం వలన మాధ్యమికోన్నత దశల్లో దీనిని ఎక్కువగా అభివృద్ధి పఱచ వలసి ఉన్నది. ప్రకాశ పఠనం ముగిసిన వెంటనే మౌన పఠనం చేయించవలసి ఉన్నది. విద్యార్థుల చేత చదివించే ఈ ప్రకాశ మౌన - పఠనాల్ని 'పాఠనమ'ని పేర్కొంటారు. ఉపాధ్యాయుడు చదివిన దానిని 'పఠన' మంటారు.

**4. బోధనాంశ విశదీకరణ (విషయ వివరణ) :-**

పఠన పాఠనాలు పూర్తి అయ్యే సమయానికి పద్యానికి సంబంధించిన స్థూల భావం విద్యార్థులకు తెలిసే ఉంటుంది. అలా వారికి తెలిసిన విషయాల్ని ఉపాధ్యాయుడు తెలిసికొంటూ, తెలియని సూక్ష్మాంశాల్ని బోధించవలసి ఉన్నది. ఇక్కడ బోధన అంటే పాత పద్ధతిలో లాగ ఉపాధ్యాయుడే తనకు తాను విద్యార్థుల ప్రమేయం లేకుండా చెప్పడం కాదు. ప్రతి అంశాన్ని ఆలోచింపచేయాలి, ప్రేరేపింప చేయాలి. అందు కోసం ఉపాధ్యాయుడు ప్రశ్నోత్తర విధనాన్ని అనుసరించాలి. ఒక్కొక్క సారి బోధించే అంశానికి సంబంధించి ప్రశ్నల రూపంలో సమాధానాల్ని రాబట్టలేనపుడు విద్యార్థులతో దానిని చర్చింపవలెను. అవసరమైనపుడు సూచనను కాని, వివరణను కాని ఇవ్వవచ్చు. ఇట్లా చేయడం వలన బోధనలో విద్యార్థులు - ఉపాధ్యాయుడు ఇద్దరు పాల్గొనడం జరుగుతుంది. ఇలా విద్యార్థుల్ని బోధనలో పాల్గొనింప చేస్తూ క్రమంగా వారికే ప్రాధాన్యమిచ్చి బోధననంతటినీ విద్యార్థి కేంద్రంగా మార్చవలెను. బోధనను 'పూర్ణ పద్ధతి' లో సాగింపవలెను.

పద్య భావం సంపూర్ణంగా అర్థమై భావ సౌందర్యాన్ని, రసానుభూతిని విద్యార్థులు పొందాలంటే అందులోని పదాలన్నింటికీ అర్థం తెలియాలి. పఠన - పాఠనాల వలన కొన్ని పదాలకు అర్థం తెలిసినప్పటికీ అత్యంత కఠినంగా ఉండే పదాలు కొన్ని ఉంటాయి. అటువంటి పదాలకు ఉపాధ్యాయుడు ప్రత్యక్షంగా అర్థాల్ని చెప్పకూడదు. వాక్య ప్రయోగ విధానాన్ని అనుసరించి ఆయా పదాల అర్థాలు సులభంగా తెలిసే విధంగా వానిని వాక్యాలలో ప్రయోగింపవలెను. వాక్య భావం తెలిసే సమయానికి అందలి కఠిన పదానికి అర్థం కూడ తెలియవలెను. ఉదా:-"ఇచ్ఛ" అనే పదానికి అర్థాన్ని చెప్పటానకి వాక్యాన్ని ఇలా ప్రయోగింపవచ్చు. "రామునికి ఆటలపై ఎంత కోరిక ఉన్నదో చదువుపై కూడా అంతే "ఇచ్ఛ" ఉన్నది. కొన్ని పదాలకు అర్థాలు వ్యాకరణ సంబంధితాలుగా ఉంటాయి. అవి ముఖ్యంగా సంధులు - సమాసాల రుపాల్లో ఉంటాయి. వీటికి అర్థాలు తెలియాలంటే సంధి - సమాస పరిజ్ఞానం కొంత వరకు అవసరమౌతుంది. అట్లని సంధుల -సమాసాలకు సంబంధించిన సర్వవ్యాకరణాంశాల్ని పద్యాన్ని బోధించే సమయంలో బోధించకూడదు. అర్థం తెలిసే విధంగా పదాల్ని విడదీసేంత వరకు, అలాగే విగ్రహ వాక్యాలు తెలిసేంత వరకు వానిని బోధించవలెను. అందుకోసం ముఖ్యంగా సామ్య విధానం ఉపకరిస్తుంది. అవసరమైనపుడు తక్కిన విధానాల్ని కూడ ఉపయోగించవచ్చు. ఉదా:- 'వాఙ్మయమ'నే శబ్దాన్ని విడదీసి అర్థాన్ని బోధించటానకి 'దిఙ్మయమ' నే పదాన్ని తీసికొని దిక్+ మయం = దిఙ్మయం అనగా 'దిక్కుల మయమ'ని అర్థాన్ని చెప్పి దాని సామ్యంతో వాఙ్మయమనే

శబ్దాన్ని విడదీయించి అర్థాన్ని రాబట్ట వచ్చు. కొన్ని కఠిన పదాలకు అర్థాల్ని చెప్పటానికి బొమ్మల్ని కూడా ఉపయోగింప వచ్చు. ఉదా:- 'లత' అనే పదానకి అర్థాన్ని తెలపటానికి తీగలున్న బొమ్మను ఉపయోగించవచ్చు. కొన్ని పదాలకు ఆ పదాలిచ్చే అర్థాల్ని ఉపాధ్యాయుడే ప్రయోగాత్మకంగా తరగతిలో చూపించవచ్చు. ఉదా:-'స్పృశించుట' అనే పదానికి అర్థాన్ని చెప్పటానికి ఉపాధ్యాయుడు టేబుల్‌ను తాకుతూ "నేను టేబుల్‌ను స్పృశిస్తున్నాన"ని పలికినపుడు, 'తాకటం' ఆ పదానికి అర్థమని విద్యార్థులు గ్రహిస్తారు. కొన్ని పదాలకు వాని వ్యుత్పత్తుల ఆధారంగా అర్థాన్ని బోధించవలసిన ఉంటుంది. ఉదా:- 'నీరదం' అనే పదానికి అర్థాన్ని చెప్పవలసినపుడు 'నీరమ'నగా నీరని, 'ద' అనగా ఇచ్చునదని, కాబట్టి 'నీరదమ'నగా నీటినిచ్చేదని, నీటినిచ్చేది మేఘం కావడం వలన నీరదమనే శబ్దానికి 'మేఘమనే' ది అసలైన అర్థమని బోధింపవలెను. అవసరమైనపుడు మెరుపు అట్టల్ని, చిత్రాల్ని ఉపయోగించవచ్చు.

భావం తెలుసుకోటానికి అవసరమనుకొన్న పదాలకు నానార్థాల్ని, పర్యాయ పదాల్ని, ప్రకృతి - వికృతుల్ని తెలుప వలసి ఉన్నది. అయితే ప్రత్యేకంగా బోధించటమనేది ఉద్దేశం కాదు. ఈ విధంగా కఠినపదాలకు అర్థాల్ని రాబడుతూ వానిని అన్నింటినీ నల్లబల్లపై రాయవలెను. విద్యార్థుల్ని తమ నోటుపుస్తకాల్లో రాయించవలెను.

భావ సౌందర్యం కోసం కవి తన శక్తి యుక్తిని బట్టి పద్యంలో చక్కని అలంకారాన్ని ఉపయోగించి ఉంటాడు. అలాంటి సమయాల్లో ఆ అలంకారంలో కవి నిక్షిప్తం చేసిన సౌందర్యాన్ని ఉపాధ్యాయుడు విద్యార్థులకు తెలియచేయవలెను. ఆ తెలియ చేసే విధానం కూడా ప్రత్యక్షంగా కాక పై విధానాల్లాగా ప్రశ్నా రూపంలో కాని, చర్చా రూపంలో కాని అవసరమైతే వివరణ రూపంలో కాని ఉండవలెను. ఇక్కడ అలంకార బోధన భావ సౌందర్యం కోసమే తప్ప అలంకార పరిజ్ఞానం కోసం కాదు. ప్రత్యేకమైన కాల వ్యవధుల్ని (Periods) కేటాయించి వాటిల్లో మాత్రమే ఈ అలంకారాలను, వ్యాకరణాంశాలను బోధించవలసి ఉన్నది.

కఠిన పదాలున్న పద్యాలతో పాటు జటిలమైన దీర్ఘసమాసాలున్న పద్యాలు కూడా అక్కడక్కడా ఎదురౌతాయి. వానిని బోధించటానికి ఉపాధ్యాయుడు "ఆకాంక్ష పద్ధతి" ని ఉపాయోగింపవచ్చు. ఈ పద్ధతిని ఉపయోగించి ఈ రకమైన పద్యాల్ని బోధించే సమయంలో ఉపాధ్యాయుడు ఆ పద్యంలోని క్రియా పదాన్ని మొదట విద్యార్థుల చేత గుర్తింప చేయాలి. తరువాత దాని కర్తృ పదాన్ని - దానికి సంబంధమున్న పదాలను, ఆ తరువాత కర్మవాచిక పదాన్ని దానికి సంబంధమున్న పదాల్ని బోధించి, క్రియా పద కేంద్రంగా మొత్తం భావాన్ని బోధించవలెను. పై విధంగానే ఇక్కడ కూడ ప్రశ్నోత్తర - వివరణాది విధానాల్లోనే పదాల్ని బోధింపవలెను. అవసరమైతే ఆయా భావాల్ని సూచించే చిత్ర పటాల్ని ఉపయోగించవచ్చు.

అవసరమనుకొన్నపుడు పద్యంలోని ఆయా అంశాలకు సంబంధించిన పూర్వగాథల్ని, విశేషాల్ని బోధింపవలెను. సౌందర్యహేతువులైన శబ్ద - అర్థచమత్కారాలను విద్యార్థులే ఊహించి చెప్పే విధంగా ఉపాధ్యాయుడు ప్రశ్నించవలెను. అవసరమైతే సూచనలను ఇవ్వవలెను. ఈ విధంగా బోధన పూర్తి అయ్యేటప్పటికి పద్యభావాన్ని విద్యార్థులే వారి స్వంతమాటల్లో చెప్పగలగాలి. ఈ రకమైన బోధన వలన విద్యార్థుల్లో ఆలోచన - విమర్శన - సృజన శక్తులు బాగా అభివృద్ధి చెందగలవు.

## IV. మూల్యాంకనం :-

నిర్ణయింపబడిన పద్య బోధనా లక్ష్యాలు నెరవేరింది లేనిదీ, తాను బోధించిన అంశాన్ని విద్యార్థులు గ్రహించింది లేనిదీ ఉపాధ్యాయుడు తెలిసికోవలసి ఉన్నది. అందుకోసం అతడు బోధించిన అంశానికంతటకీ సంబంధించి మూల్యాంకనం చేయవలసి ఉన్నది. మూల్యాంకనం అనగా విలువకట్టడమని అర్థం. అనగా సాధించవలసిన లక్ష్యాలతో సాధించిన లక్ష్యాల్ని సరిచూడటం. అలా చూసినపుడు అవి రెండు సరిపోతే బోధన సక్రమంగా సాగినట్లే. అలా కాక సాధించవలసిన వానిని సాధించలేకపోతే ఆ లోపం తనదో లేక విద్యార్థులదో గుర్తించి సవరించవలెను. అందుకు మూల్యాంకనం ఉపకరిస్తుంది. ఈ మూల్యాంకనాన్ని సాధారణంగా క్రింది విధంగా చేయవచ్చు. అయితే మూల్యాంకనాన్ని చేసేటప్పుడే నల్లబల్లమీది అంశాలన్నింటినీ తుడిపివేయింపవలెను. అలాగే విద్యార్థుల పుస్తకాలన్నింటినీ మూసి వేయించవలెను.

### 1. ప్రశ్నలడగడం :-

ఆ కాలవ్యవధి బోధించిన అంశాలన్నింటి మీద ప్రశ్నలు వేయవలెను. ఉదా.. కఠిన పదాలకు అర్థాలు, పదాలను విడదీయటం, విగ్రహవాక్యాలు, వ్యుత్పత్తులు మొ..న భాషాంశాల (భాషా జ్ఞానం) మీద, ఎవరు ఎవరితో ఏమి చెబుతున్నారనే విషయాంశం (విషయజ్ఞానం) మీద, భావసమన్వయం (అవగాహన )మీద అలాగే వినియోగానికి సంబంధించి ప్రశ్నలు వేయవలెను. సమాధానాల్ని జాగ్రత్తగా గమనింపవలెను.

### 2. భావ సంగ్రహణ :-

భావానికి సంబంధించి మాత్రమే అన్వయ క్రమంలో ప్రశ్నలు వేస్తూ సమాధానాల్ని రాబడుతూ ఒక్కొక్క విద్యార్థి చేత కొంత భాగం చొప్పున భావాన్ని చెప్పిస్తూ క్రమంగా ఒకే విద్యార్థి చేత మొత్తం భావాన్ని చెప్పించవలెను. అవసరమైతే ఉపాధ్యాయుడు సూచనలనివ్వవచ్చు. ఉపకరణాలనుపయోగింపవచ్చు. దీని వలన విద్యార్థుల వాగ్రూప వ్యక్తీకరణ సామర్థ్యం తెలుస్తుంది.

### 3. నూతన శీర్షికా నిర్ణయం :-

విద్యార్థులు గ్రహించిన పాఠ్యాంశానికి వారిచేతనే ఒక క్రొత్త శీర్షికను నిర్ణయింపచేయవలెను. వారికి కష్టమని భావిస్తే ఉపాధ్యాయుడు కొంత సూచన చేయవచ్చు. దాని వలన విద్యార్థుల ఆలోచన శక్తులు, సృజనశక్తులు బహిర్గతమౌతాయి.

### 4. పునర్విమర్శ :-

దీనినే సింహావలోకనం అని కూడ అంటారు. బోధింపబడిన పాఠ్యాంశమంతటి మీద స్థాలీపులాక న్యాయంగా మరొక్క సారి చర్చించడం. అంత వరకూ అర్థం కాని విషయాలేమైనా ఉంటే వానిని కూడ అర్థమయ్యేటట్లు చేయడం దీని ఉద్దేశం. ఇది ప్రధానంగా భావానికి, అందలి సౌందర్యానికి, రసానుభూతికి సంబంధించినదిగా ఉంటుంది.

### 5. పునఃపఠనం :-

పద్య బోధనంతా సంపూర్ణమైన పిదప చివర్లో కొంత మంది ఉపాధ్యాయులు పద్యాన్ని

విద్యార్థుల చేత పఠింప చేస్తారు. కాని ఆధునిక బోధనను అనుసరించి బోధించేటపుడు ఉపాధ్యాయుడు పఠించిన వెంటనే విద్యార్థులచేత పఠింపచేయటం సరైన పద్ధతి. అయితే పద్యం క్లిష్టంగా ఉండి, అన్వయించుకోటం కష్టమనుకొన్నపుడు మాత్రం చివర్లో పఠింపచేయవచ్చు. కాని కొంత మంది ఉపాధ్యాయులు పద్య బోధనకు పూర్వమే కాక తరువాత కూడ పఠింప చేస్తుంటారు. కష్టమైన పద్యాల విషయంలో ఇది సరిపోవచ్చునేమోకాని సులభమైన పద్యాల విషయంలో మాత్రం కాలం వృధా అవుతుంది.

**6. గృహకం :-**

ఇంటి పని, నియోజనం అనేవి కూడ దీనికి పేర్లు. నేర్చుకొన్న అంశంలోని ప్రధానమైన విషయాలు విద్యార్థుల మనస్సులో స్థిరంగా ఉంచడం కోసం, లిఖితనైపుణ్యాన్ని అభివృద్ధి పఱచటం కోసం, సృజన - విమర్శకాది శక్తుల్ని పెంపొందిచడం కోసం, జ్ఞాన - అవగాహనాదులను మెఱుగు పఱచడం కోసం ఉపాధ్యాయుడు విద్యార్థులకు కొన్ని ప్రశ్నలిచ్చి సమాధానాల్ని ఇంటి దగ్గర నుంచి రాసుకరమ్మనవలెను. ఈ ప్రశ్నలు ఒకే రకంగా కాక రకరకాలుగా ఉండవలెను.

**వివిధ దశలలో బోధింపదగు పద్యాలు**

పద్యాలు రకరకాలైన రచనా భేదాలతో, శైలీ వైవిధ్యాలతో, ఛందో భేదాలతో, భిన్న కూర్పులతో, విభిన్న శయ్యలతో పాకములతో ఉంటున్న కారణాన వానిని వర్గీకరించుకొని ఏయే దశలలో వేనిని బోధింపవలెనో క్రింది విధంగా నిర్ణయించుకోటం చాలా ముఖ్యం.

**1. ప్రాథమిక దశ :-**

1 వ తరగతిలో లయబద్ధంగా బాల - అభినయగేయాలను బోధింపవలెను.2 వ తరగతిలో సులభమైన గీత పద్యాలను ( ఆటవెలది - తేటగీతి ) బోధింపవలెను.3 వ తరగతిలో సరళమైన కంద పద్యాలకు, ద్విపదలకు ప్రాధాన్యమీయ వలెను. 4వ తరగతిలో గేయ -గీతాలకంటే కంద - ద్విపదాది పద్యాలకే ఎక్కువ ప్రాధాన్యమీయవలెను. 5వ తరగతిలో సులభంగా ఉండే వృత్తాలకు ప్రాధాన్యమీయవలెను.

**2. మాధ్యమిక దశ :-**

ఈ దశలో శైలిలో వైవిధ్యముండే పద్యాలను బోధింపవలెను. వివిధ కవులు రచించిన పద్యాలను పాఠాల రూపంలో బోధింప వలెను. ఇవి కథా రూపంలో ఉండడం మేలు. అంతే కాక సరళంగా ఉండవలెను.

**3. ఉన్నత దశ :-**

ఈ దశలో శైలిలో బాగా వైవిధ్యమున్న పద్యాలను, వివిధ రకాలైన కాలాలకు - వివిధ రకాలైన కవులకు సంబంధించిన పద్యాల్ని బోధింపవలెను. అవి వివిధ రకాలైన వృత్తాలకు సంబంధించినవిగా, వర్ణనాత్మకంగా ఉండవచ్చు. గేయం పద్యం వంటి రచనా భేదాలుగా ఉండవచ్చు. శయ్యా - పాకములలో తేడాలున్న వానిని కూడ గ్రహింప వచ్చు. అయితే ఈ పద్యాలన్నీ విద్యార్థులకు ఆసక్తిని, అనురక్తిని కలిగిస్తూ దేశ సమైక్యత, జాతి సమగ్రత, మత సామరస్యం,. మొ..న వానికి సంబంధించినవిగా ఉండడం మేలు.

# 2. గద్యబోధన

## ఆవశ్యకత

ఒకనాటి సాహిత్యం పద్యం కోసమే ఆవిర్భవించినా గద్యాన్ని కూడ కాదనలేక పోయింది. మధురమైన భావాన్ని మహోన్నతంగా అందించటానికై ప్రత్యేకమైన నడకతో కూడిన ఛందస్సుపై ఆధారపడి అనేక మంది కవులు కవిత్వాన్ని చెప్పారు. అదే పద్య కవిత్వం. అయితే కొందరు కవులు మాత్రం ఛందస్సు సహాయం లేకుండానే మధురమైన భావాల్ని కవితారూపంలో వ్యక్తీకరించటాకి ప్రయత్నించారు. ఆ ప్రయత్న ఫలితమే గద్య కవిత్వ ఆవిర్భావం. ఈ గద్య రచన ఛందో రహితంగా ఉండటం వలన ఛందస్సు వలన కలిగే ప్రయోజనాలు దీనికి కలుగలేదు. దానితో ఛందో బద్ధమైన పద్యం అనేక మంది శ్రోతల్ని ఆకర్షించి ప్రజాబాహుళ్యాన్ని పొందినట్లుగా గద్యం పొందలేక పోయినది. అందువలన ఎక్కువ మంది కవులు దీనివైపు మొగ్గు చూపలేదు. అయితే కొద్దిమంది మాత్రం తమ మేధాశక్తిని, రచనా కౌశలాన్ని ఉపయోగించి ఛందస్సు వలన కలిగే ప్రయోజనాలు ఛందో రహితమైన గద్యానికి కూడ కలిగే విధంగా గద్యంలో అద్భుతంగా కవిత్వం చెప్పారు. ఇది అత్యంత కష్టమైన పనే. అయినప్పటికి కొంత మంది సాధించారు. ఉదా:- సంస్కృత - సాహిత్యంలో భట్టబాణుడు 'కాదంబరి' అనే గద్యకావ్యాన్ని తలదన్నే విధంగా రచించాడు. తెలుగు సాహిత్యంలో కేతన దశకుమార చరిత్ర అటువంటిది. ఈ విధంగా పద్యంలో కవిత్వం చెప్పడం కంటే గద్యంలో కవిత్వం చెప్పడం చాలా కష్టమై పోయింది. అందుకే "గద్యం కవీ నాం నికషం వదని"( కవి ప్రతిభకు గద్యమే గీటురాయి)అనే నానుడి వ్యవహారంలో వచ్చినది.

అయితే ప్రాచీన కాలంలో అచ్చంగా గద్య కావ్య నిర్మాణం స్వల్పంగానే సాగినా పద్య కావ్య నిర్మాణంలో మాత్రం ఇది విరివిగానే చోటుచేసుకొన్నది. ఈ రకమైన పద్య గద్య నడకలతో సాగిన కావ్య మార్గాన్ని "చంపు మార్గం" గా పిలిచారు. దాదాపు ప్రాచీన సాహిత్యమంతా ఈ మార్గంలోనే నడిచింది. ఇలా పద్యంలో చోటు చేసికోడమే కాకుండా పద్య కావ్యాన్ని వ్యాఖ్యానం చేయటానికి ,విమర్శించటానికి, టీకా - తాత్పర్యాలు రాయటానికి గద్యమే ఆవశ్యకమైనది. ఇంక శాస్త్రీయాంశరచనకు గద్యమే శరణ్యమైనది. అంతే కాక వాగ్రూప భాషా వ్యవహారమంతా ఈ గద్యానికి సంబంధించినదే. ఈ విధంగా పద్యం కేవలం సాహిత్యానికే పనికివస్తే గద్యం సాహిత్యంతోపాటు, సాహిత్యేతరాంశాలన్నింటికీ, సమస్త భాషా వ్యాపారానికంతటికీ అత్యంత ఆవశ్యమైనది. ఈ నాటి సాహత్యమంతా దాదాపు గద్యమే కావడం మరో విశేషం. ఇట్టి గద్య ఆవశ్యకతను గుర్తించి, దానిని విద్యార్థుల్లో అభివృద్ధి పరచవలసిన బాధ్యత ఉపాధ్యాయునిపై ఎంతైనా ఉన్నది.

## గద్య బోధనా లక్ష్యాలు.

1. భాషాజ్ఞానాన్ని పెంపొందించడం. 2. విషయజ్ఞానాన్ని అభివృద్ధి పరచడం. 3. పఠన శక్తిని వృద్ధి చేయడం. 4. సంస్కృతి, సంప్రదాయాల్ని, ఆచారవ్యవహారాల్ని తెలియచేయడం. 5. జాతీయాల్ని ప్రయోగించే తీరును నేర్పడం. 6. నుడికార సౌందర్యాన్ని గ్రహింపచేయటం. 7.

లోకోక్తుల్ని సూక్తుల్ని వివరించడం. 8. సామెతల్ని ప్రయోగింపచేయడం.9. శైలి వైవిధ్యాన్ని గుర్తింప చేయడం. 10. సారస్వతాభిలాషను కలిగించడం.11. విమర్శక -సృజనాది అంతర్గత శక్తుల్ని అభివృద్ధి పరచడం. 12. భాషను ప్రయోగించే తీరును నేర్పడం. 13. నానార్థాల్ని, పర్యాయపదాల్ని గ్రహింపచేయడం.14. వ్యుత్పత్త్యర్థాల్ని తెలియచేయడం.15. ఆనందానుభూతిని ఎక్కువ చేయడం. 16. విషయ వ్యక్తీకరణ పదజాలాన్ని అభివృద్ధి పఱచడం.

## గద్య బోధనా విధానాలు పద్ధతులు

### విధానాలు

పద్యబోధలో ఉపయోగించే పఠన విధానం, వాక్య ప్రయోగ విధానం, ప్రశ్నోత్తర విధానం, సామ్య విధానం, వివరణ విధానం, ప్రశంసనా విధానం, సారంశ విధానం, చర్చా విధానం, ఆకాంక్ష విధానం మొ..న వానిని గద్య బోధనా సమయంలో కూడ ఉపయోగిస్తారు.

### పద్ధతులు

పద్యం లాగానే గద్యాన్ని కూడా బోధించటానికి పూర్ణ ఖండ పద్ధతుల్ని ఉపయోగిస్తారు.

### పూర్వ పద్ధతి

పద్య బోధనలో పద్యాన్ని ప్రమాణంగా తీసికొన్నట్లే గద్య బోధనలో పేరాగ్రాఫ్‌ను ప్రమాణం (Unit) గా తీసికొంటారు. ఒక్కొక్కసారి సంపూర్ణమైన విషయం ఒక పేరాగ్రాఫ్ లో కాక రెండు మూడు పేరాగ్రాఫ్‌లలో ఉన్నపుడు ఆ రెండు మూడింటిని ఒక ప్రమాణంగా తీసికోడం జరుగుతుంది. బోధనంతా పద్యం లాగానే ఇక్కడ కూడా ఉంటుంది. అయితే రసానుభూతికి అక్కడ ప్రాధాన్యమిస్తే భాషాజ్ఞానానికి ఇక్కడ ప్రాధాన్యమిస్తారు.

### ఖండ పద్ధతి

పద్యంలో లాగానే ఇక్కడకూడా మొత్తం పేరాగ్రాఫ్‌ను కాక ఒక్కొక్క వాక్యాన్ని ప్రమాణంగా (unit) తీసికొని బోధించడం జరుగుతుంది. బోధనంతా అక్కడి లాగానే ఇక్కడ ఉంటుంది. అయితే భాషాజ్ఞానానికి ఇక్కడ ప్రాధాన్యమెక్కువ.

## సాంప్రదాయికంగా గద్య బోధన

సాంప్రదాయికంగా పద్యాన్ని బోధించనట్లుగానే గద్యాన్ని కూడా బోధించేవారు. ఉపాధ్యాయుడు తరగతి గదిలో ప్రవేశించి ఉన్ముఖీకరణ - పూర్వజ్ఞాన పరిశీలనాదులు ఏమీ లేకుండానే ఆకాలవ్యవధిలో బోధించవలసిన అంశంలో ఒక్కొక్క వాక్యాన్ని ప్రమాణంగా తీసికొని కఠిన పదాలు, నానార్థాలు, మొ..న వానినన్నింటిని విద్యార్థుల ప్రమేయం లేకుండానే తనకు తానే వివరిస్తాడు. అలాగే వ్యాకరణాంశాల్ని సూత్ర సహితంగా బోధిస్తాడు. వీనిని నల్ల బల్ల మీద రాసి విద్యార్థుల చేత తమ నోటుపుస్తకాల్లో రాయింపచేస్తాడు. అలా బోధిస్తూ కాల వ్యవధి(period) ముగియగానే మరుసటి రోజు ప్రవేశించి మిగిలిన దానిని మాత్రమే బోధిస్తాడు.

ఇట్టి ఈ బోధన వల్లన బోధనాలక్ష్యాలు సాధింపబడక పోవడమే కాక అనేక లోపాలు క్రింది విధంగా ఉన్నాయి.

**లోపాలు**

సాంప్రదాయిక పద్య బోధనలోని లోపాలన్నీ ఇక్కడ కూడ కనిపిస్తున్నాయి. 1. వాక్యాన్ని ప్రమాణంగా తీసికోవడం వలన సారాంశాన్ని గ్రహించడం కష్టం. 2. ఉన్ముఖీకరణ - పూర్వ జ్ఞాన పరిశీలనలు లేకపోవడం వలన విద్యార్థులు బోధనాంశాన్ని వెంటనే గ్రహింపలేరు. 3. బోధనలో విద్యార్థులు పాల్గొనకపోవడం వలన వారిలో ఉత్సాహం, ఉల్లాసం సన్నగిల్లును. 4. ఇది ఉపాధ్యాయ కేంద్రంగా సాగడం వలన ఉపాధ్యాయుడు చెప్పుకోటానికి పనికి వస్తుందే తప్ప విద్యార్థులు నేర్చుకోటానికి పనికొచ్చేదిగా లేదు. 5. ఉపాధ్యాయుడు తాని చెప్పే దాని మీదనే దృష్టిని కేంద్రీకరించడం వలన విద్యార్థులు దానిని గ్రహించిందీ లేనిదీ తెలిసికోలేడు. 6. విద్యార్థుల్లో పఠన సామర్థ్యం సన్నగిల్లుతుంది.7. విద్యార్థుల విమర్శన సృజనాది అంతర్గత శక్తులు బహిర్గతం కావు . 9. గద్య బోధనా లక్ష్యాలు సంపూర్ణంగా నెరవేరవు. 10. మధ్యలో వ్యాకరణాంశాదుల్ని బోధించడం వలన విషయాన్ని చక్కగా గ్రహించవలేరు. 11. గ్రహించిన అంశాల్ని ప్రయోగింపచేయక పోవడం వలన గర్తుంచుకోడం కష్టం. 12. భాషణ శక్తి పెరిగే అవకాశం కూడా లేదు. 13. మూల్యాంకనం లేకపోవడం వలన బోధనాంశంపై విద్యార్థులు సరిగా దృష్టిని కేంద్రీకరించక పోవచ్చు.

**ఆధునిక గద్య బోధన (గద్య బోధనా సోపానాలు )**

సాంప్రదాయిక గద్య బోధనలోని లోపాల్ని సవరిస్తూ, గద్య బోధనా లక్ష్యాలన్నింటినటీ సాధిస్తూ, మనస్తత్వ శాస్త్రానుకూలంగా ఆధునికి కాలంలో గద్యాన్ని బోధిస్తారు. ఈ బోధనంతా పద్యంలో లాగానే ఒక క్రమంలో కొన్ని సపానాల ఆధారంగా సాగుతుంది. ఆయాసోపానాల ఆధారంగా గద్యాన్ని ఇటీవలికాలంలో క్రింది విధంగా బోధిస్తారు.

**I. ఉన్ముఖీకరణం పూర్వజ్ఞాన పరిశీలనం :-**

ఇవి పద్య బోధనలో మాదిరే ఇక్కడ కూడా ఉంటాయి. అక్కడి మాదిరే ఇక్కడ కూడా ఉపాధ్యాయుడు వీనిని చేయవలసి ఉంటుంది.

**II. శీర్షికా ప్రకటన :-**

పద్యబోధనలో లాగానే ఇది కూడా ఉంటుంది.

**III. ప్రదర్శన (presentation) :-**

పద్య బోధనలో లాగానే ఇక్కడ కూడ ఇది క్రింది ఉప సోపానాలుగా విభక్తమై, వాని ఆధారంగానే ఇది నిర్వర్తింపబడుతుంది.

1. **కవి కాలాదులు**

పద్య బోధనలో మాదిరిగానే ఉపాధ్యాయుడు ఈ కవి కాలాదుల్ని ఇక్కడ కూడ పరిచయం చేస్తాడు.

2. **సందర్భం**

అక్కడి లాగానే ఇక్కడ కూడ సందర్భాన్ని ఉపాధ్యాయుడు చెప్పవలసి ఉంటుంది.

3. **ఆదర్శ పఠనాలు :-**

పద్య బోధనలో మాదిరిగానే ఇక్కడ కూడా ఉపాధ్యాయుడు ఆదర్శ పఠనాన్ని నిర్వర్తింపవలసి ఉంటుంది. అయితే పద్య బోధనలో భావానికి ప్రాధాన్యమిస్తే ఇక్కడ భాషా జ్ఞానానికి ప్రాధాన్యమిస్తారు.

బాహ్య పఠనం :- పద్య బోధనలో లాగానే ఇక్కడ కూడ ఇది సాగుతుంది.

మౌన పఠనం :- దీనిని కూడ అక్కడి లాగానే ఇక్కడ కూడ సాగింప వలెను.

4. **బోధనాంశ విశదీకరణం (విషయ వివరణ)**

పద్య బోధనలో మాదిరిగానే ఇక్కడ కూడ విషయాన్ని వివరించవలసి ఉంటుంది. అయితే పద్య బోధనలో భావాన్ని గ్రహింప చేసి తద్వార ఆనందానుభూతిని అనుభవింపచేయడం అనేది ప్రధాన లక్ష్యం. కాబట్టి బోధనంతా దానికనుకూలంగానే సాగుతుంది. దీని వలన విద్యార్థుల్లో కేవలం 'విషయ గ్రహణ పదజాలం' (passive vocabulary) మాత్రమే పెంపొందుతుంది. కాని గద్య బోధన ప్రధాన లక్ష్యం విద్యార్థుల్లో భాషా జ్ఞానాన్ని పెంపొందించడం. భాషాజ్ఞానాన్ని పెంపొందించడం అంటే విషయాన్ని గ్రహించే శక్తిని, అలాగే విషయాన్ని వ్యక్తీకరించే శక్తని పెంపొందించటమని అర్థం. అందువలన విషయ గ్రహణ పదజాలంతో పాటు 'విషయ వ్యక్తీకరణ పదజాలాన్ని' (Active vocabulary) కూడా పెంపొందించ వలసి ఉంటుంది. అందుకోసం గద్య బోధనలో ఉపాధ్యాయుడు నూతన పదాలకు అర్థాలు, వ్యుత్పత్తులు, ప్రకృతి -వికృతులు, నానార్థాలు, పర్యాయపదాలు, జాతీయాలు, సామెతలు, పలుకుబళ్ళు, లోకోక్తులు, సూక్తులు, సంధులు సమాసాలు మొ..న వానిని విద్యార్థులకు బోధించటమే కాక వానిని వారిచేత తమ స్వంత వాక్యాల్లో ప్రయోగింపచేయడంలో ఎక్కువ దృష్టిని కేంద్రీకరింపవలసి ఉంటుంది. ఆయా అంశాల్ని ఉపాధ్యాయుడు క్రింది విధంగా విశదీకరిస్తాడు.

**నూతనపదాలకు అర్థాలు**

పద్యంలో మాదిరిగానే ఇక్కడ కూడ ఉపాధ్యాయుడు వాక్య ప్రయోగం చేసి నూతన పదాలకు అర్థాల్ని విద్యార్థుల నుండి రాబట్ట వలెను. కొన్ని ముఖ్యమైన వానిని విద్యార్థుల చేత వాక్య రూపంలో ప్రయోగింపచేయవలెను. ఉదా:- సుగంధమనే పదానికి అర్థాన్ని చెప్పటానికి ఉపాధ్యాయుడు "సహజంగా పూవులన్ని సుంగంధాన్ని వెదజల్లును" అనే వాక్యాన్ని ప్రయోగింపవచ్చు. దీని వల్ల "సువాసన" అనే అర్థాన్ని గ్రహిస్తారు. దీనిని వాక్యంలో ప్రయోగింపుమని ఉపాధ్యాయుడు కోరినపుడు విద్యార్థులు "కృత్రిమాలైన ప్లాస్టిక్ పూవులలో సుగంధం ఉండదు"

అని ప్రయోగించవచ్చు.

**వ్యుత్పత్తి అర్థాలు**

పదాల పుట్టుక ఆధారంగా అర్థాన్ని ఏర్పఱచడాన్ని వ్యుత్పత్త్యర్థమంటారు. ఇటువంటి వానికి ఉపాధ్యాయుడు ప్రత్యక్షంగా అర్థాన్ని బోధించక పదాన్ని విడగొట్టి వాని సహాయంతో పరోక్షంగా అర్థాన్ని బోధించవలెను. ఉదా:- 'అంభోనిధి' అనే పదానికి దాని వ్యుత్పత్తి అర్థాన్ని బోధించటానికి ఉపాధ్యాయుడు దానిని 'అంభట్', 'నిధి'అని రెండుగా విడగొట్టి అంభట్ అనగా నీరని, నిధి అనగా నిలయమైనదని బోధించి "నీటికి నిలయమైనదేమిట"ని ప్రశ్నించవలెను. సరైన సమాధానం విద్యార్థుల నుండి రానపుడు "భారతదేశానికి ఉత్తర దిక్కు తప్ప తక్కిన మూడు దిక్కులా అంభోనిధులున్నాయి" అని వాక్య ప్రయోగం చేయాలి. దాని వలన విద్యార్థులు "సముద్రమనే" అర్థాన్ని గ్రహిస్తారు. దీనిని వాక్యంలో ప్రయోగించమని కోరినపుడు "దక్షిణ దిక్కు అంభోనిధి తక్కిన రెండు దిక్కుల అంభోనిధుల కంటే పెద్దది " అని విద్యార్థులు వాక్య ప్రయోగం చేయవచ్చు.

**జాతీయాలు**

ఒక జాతి ఆచారవ్యవహారాలకు, సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించినదే జాతీయం. ఇటువంటి వానికి కూడ అర్థాన్ని ప్రత్యక్షంగా బోధించకూడదు. వాని ప్రత్యేకమైన అర్థం ముఖ్యంగా భావం తెలిసే విధంగా ఉపాధ్యాయుడు వానిని వాక్యంలో ప్రయోగించవలెను. భావం స్పష్టం కానపుడు సంధర్భాన్ని బట్టి రెండు - మూడు వాక్యాల్ని కూడా ప్రయోగించవచ్చు. ఉదా:- 'ముద్దుమురిపం' అనే జాతీయాన్ని బోధించవలసి వచ్చినపుడు ఉపాధ్యాయుడు "లేక లేక పుట్టిన బిడ్డను తల్లిదండ్రులు ముద్దుమురిపాలతో పెంచెదరు" అనే వాక్య ప్రయేగం చేయడం వలన 'ప్రేమానురాగమనే' భావాన్ని విద్యార్థులు గ్రహించెదరు. తిరిగి వానిని ప్రయేగింపుమని కోరినపుడు "సహజంగా పెద్దలు పిన్నలను ముద్దు మురిపాలతో పెంచకొందురు" అని ప్రయోగించవచ్చు. అలాగే పలుకుబళ్ళని, సామెతల్ని, సూక్తుల్ని, లోకోక్తుల్ని బోధించవలసి ఉంటుంది.

**పర్యాయపదాలు**

ఒకే అర్థాన్ని ఇచ్చే అనేక పదాల్ని పర్యాయపదాలంటారు. అనగా ఒకే అర్థానికి అనేక పదాల్ని ఉపయోగించుకోవచ్చు. ఇలాంటి వాటిని బోధించవలసి వచ్చినపుడు ఉపాధ్యాయుడు ఒకే వాక్యంలో అనేక పదాల్ని ఒకే అర్థంలో ప్రయోగించవలెను. ఉదా:- అర్జునుని అర్థాంగి, ధర్మరాజు సహధర్మచారిణి, భీముని ఇల్లాలు, నకులుని పత్ని, సహదేవుని భార్య ద్రౌపదియే. ఈ వాక్య ప్రయోగం వలన అర్థాంగి, సహధర్మచారిణి, ఇల్లాలు, పత్ని, భార్య అనేవి పర్యాయ పదాలని విద్యార్థులు గ్రహిస్తారు. కుమారుడు అనే పదానికి పర్యాయపదాలతో వాక్యాన్ని ప్రయోగించమని విద్యార్థుల్ని కోరినపుడు "అర్జునుడు పాండురాజు పుత్రుడు, కుంతీదేవి మూడవ కొడుకు, ఇంద్రునికి కూడ సుతుడు" అని ప్రయోగించవచ్చు.

**నానార్థాలు**

ఒకే పదం ఇచ్చే అనేకార్థాల్ని (నానాకార్థాల్ని) నానార్థాలంటారు. అనగా ఒకే పదాన్ని

అనేకార్థాల్లో ఉపయోగించుకోవచ్చు. ఇలాంటి వానిని బోధించేటపుడు ఉపాధ్యాయుడు ఒకే పదాన్ని అనేకార్థాల్లో ఒకే వాక్యంలో ప్రయోగించవలసి ఉంటుంది. ఉదా:-'శ్రీకలవాడు ధనవంతుడు, శ్రీవిష్ణువు భార్య, శ్రీ బ్రహ్మపత్ని, విషాన్ని కంఠమందు ధరించి శివుడు శ్రీకంఠుడయ్యాడు, సాలెపురుగు -పాము- ఏనుగు మూడింటికి ముక్తిని కలిగించి శివుడు శ్రీ కాళహస్తీశ్వరుడయ్యాడు' అని ఉపాధ్యాయుడు ప్రయోగించడం వలన 'శ్రీ' అనే పదానికి ధనం, లక్ష్మి, సరస్వతి, విషం, సాలెపురుగు అనే నానార్థాలున్నాయని విద్యార్థులు గ్రహించెదరు. అలాగే విద్యార్థుల చేత కూడ ప్రయోగింపచేయవలెను.

### సంధులు సమాసాలు

వ్యాకరణాన్ని బోధించడం ఉద్దేశం కాదు కాని విషయానుకూలంగా, భాషా జ్ఞానానుకూలంగా సంధి సమాస పరిజ్ఞానాన్ని ఉపాధ్యాయుడు కలిగింపవలెను. సంధివంతాలైన పదాలు మధ్యలో వచ్చినపుడు, వానికి సంబంధించిన పరిజ్ఞానం విద్యార్థులకు ఉంటుదనుకొన్నపుడు వానిని వారిచేతనే విడదీయించి విషయాన్ని గ్రహింపచేయవచ్చు. ఉదా:- 'ప్రేమాయణం' అనే సంధి పదం వచ్చినపుడు దీనిని విడదీయించుటకు అంతకుముందు అలాగే విడదీసిన పదాన్ని విద్యార్థులకు గుర్తుకు తేవలెను. ఆ జ్ఞానంతో ఈ పదాన్ని విడదీయించవచ్చు. అంటే 'రామాయణం ' అనే పదాన్ని ఇంతకు ముందెలా విడదీశామని అడిగినపుడు ' రామ+ అయణమని' విద్యార్థులు చెబుతారు. దానిలాగానే ప్రేమాయణాన్ని విడదీయ మన్నపుడు 'ప్రేమ + అయణం' అని విడదీస్తారు. ఒకే వేళ అంతవరకు రాని క్రొత్త సంధి పదాలు వచ్చినప్పుడు ఉపాధ్యాయుడే వానిని విడదీయవలెను. ఉదా:- తన్మయమనే క్రొత్త పదం వచ్చినప్పుడు ఉపాధ్యాయుడు దానిని 'తత్ + మయం' గా విడదీసి బోధింపవలెను. ఈ సంధుల లాగే సమాసాల్ని కూడ బోధింపవలసి ఉంటుంది. అలంకార బోధన విషయంలో కూడ పద్య బోధనను అనుసరింపవచ్చు.

### ప్రకృతి వికృతులు

తెలుగు భాషలో కనిపించే సంస్కృత పదాలే తత్సమాలని, వీటిని అపభ్రంశం చేసి పలకడం వలన అనగా వాటి నుండి పుట్టేవే తద్భావాలని, ఈ తత్సమాలే ప్రకృతులని, తద్భవాలే వికృతులని వివరించి అవి ఏర్పడటంలోని సాధారణ లక్షణాల్ని సూచనగా బోధించి తరువాత పాఠ్యాంశంలోని ప్రకృతి వికృతుల్ని విద్యార్థుల చేత గుర్తింపచేయవలెను. అవసరమైనపుడు ఉపాధ్యాయుడే వానిని గుర్తించి విద్యార్థులకు చెప్పవలెను. ముందు వివరించినవి తరువాతి పాఠ్యాంశంలో వచ్చినపుడు ప్రశ్నల రూపంలో వాటిని విద్యార్థులకు గుర్తుకు తేవలెను.

అవసరమైనపుడు ఆయా అంశాలకు సంబంధించిన పూర్వ గాథల్ని, విశేషాంశాల్ని బోధింపవలెను. ఇలా బోధన సంపూర్ణమయ్యే సమయానికి బోధన సారాంశాన్నంతటినీ విద్యార్థులే వారి స్వంత మాటల్లో చెప్పగలగాలి.

### IV. మూల్యాంకనం

ఇక్కడ కూడ మూల్యాంకనాన్ని చేయించే తీరు పద్య బోధనలాగానే ఉంటుంది. ఈ మూల్యాంకనంలో భాగాలైన 1. ప్రశ్నలడగడం 2. సారాంశ (భావ ) సంగ్రహణ చేయడం 3.

నూతన శీర్షికా నిర్ణయం 4. పునర్విమర్శ 5. పునఃపఠనం 6. గైహికం అన్ని కూడ పద్య బోధనలో లాగానే ఇక్కడ కూడ సాగుతాయి. అయితే గద్య పాఠ్యాంశం సరళమైన శైలిలో, ఉన్నపుడు పునః పఠనం అవసరంలేదు. అలాగే ప్రమాణంగా తీసికొని బోధింపబడిన పేరాగ్రాఫ్ చిన్నదైన పుడు పునర్విమర్శ కూడ అవసరం లేదు.

## వివిధ దశలలో బోధింపదగు భాషాంశాలు

ప్రాథమిక దశలో కఠిన పదాలతో పాటు నామవాచకం, సర్వనామం, కర్త -కర్మ- క్రియ, భూత -భవిష్యత్ -వర్తమానకాలాలు, లింగాలు, వచనాలు, విశేషణం, అవ్యయం మొ..న వానిని, ఒకే రచయిత రచించిన పాఠాల్ని బోధింపవచ్చు. మాధ్యమిక దశలో కఠిన పదాలతో పాటు నానార్థాలు, పర్యాయ పదాలు, వ్యుత్పత్తులు, నుడికారాలు, పలుకుబళ్ళు, సమెతలు, లోకోక్తులు, మొ..న వానిని అనేక రచయితల పాఠాలను బోధింపవలెను. ఉన్నత దశలో శైలి భేదమున్న వివిధ పాఠాల్ని, సమన్వయరూపంగా సంధులు సమాసారు జాతీయాలు మొ..న వానిని బోధింపవలె.

### పద్య - గద్య బోధనల మధ్య భేదాలు

| | పద్య బోధన | | గద్య బోధన |
|---|---|---|---|
| 1. | ఆనందానుభూతిని,. సాహిత్యాభి రుచిని కలిగించడం ప్రధాన లక్ష్యం | 1. | భాషా జ్ఞానం కలిగించడం ప్రధాన ధ్యేయం. |
| 2. | భావ గ్రహణకు అనుకూలమైన వ్యాకరణాంశాల్ని మాత్రమే బోధించడం జరుగును. | 2. | భాషాషాజ్ఞానాన్ని పెంపొందించటానికి అనుకూలమైన వ్యాకరణాంశాల్ని బోధించడం జరుగును. |
| 3. | భావానుకూలంగా, స్వరానుకూలంగా, లయబద్ధంగా చదవడం జరుగును. | 3. | భావానుకూలంగా చదివితే సరిపోతుంది. |
| 4. | మౌన పఠనానికి ప్రాధాన్యం లేదు. | 4. | మౌన పఠనానికి ప్రాధాన్యముంది. |
| 5. | కొన్నింటిని కంఠస్థం చేయించవలసి ఉంటుంది. | 5. | కంఠస్థం చేయించనవసరం లేదు. |
| 6. | శైలి కష్టంగా ఉండడం వలన ఎక్కువ కఠిన పదాలకు అర్థాల్ని బోధించవలసి ఉంటుంది. | 6. | శైలి సులభంగా ఉండడం వలన కఠిన పదాలు తక్కువగా ఉండవచ్చు. |
| 7. | వాక్య నిర్మాణం క్లిష్టంగా ఉంటున్న కారణాన ఎక్కువ దృష్టి అవసరం. | 7. | వాక్య నిర్మాణం సులభంగా ఉంటుంది. |
| 8. | విద్యార్థుల్ని కవులుగా తీర్చవచ్చు. | 8. | విద్యార్థుల్ని రచయితలుగా తీర్చవచ్చు. |
| 9. | భావానుకూలంగా మాత్రమే వ్యుత్పత్తి అర్థాల్ని బోధింప వలసి ఉంటుంది. | 9. | భాషాజ్ఞానాం కోసం వ్యుత్పత్తి అర్థాల్ని బోధించవలెను. |
| 10. | జాతీయాలు, సూక్తులు, లోకోక్తులు, సామెతలు, పలుకుళ్ళు, అలంకారం మొ..న వానిని భావానుకూలంగానే బోధింపవలెను. | 10. | వీనినన్నింటినీ భాషాజ్ఞానానుకూలంగా బోధింపవలెను. |

# 3. ఉపవాచక బోధన

## ఆవశ్యకత

విశాలమైన విజ్ఞానాన్నంతటినీ తరగతి గదిలోనే తెలియచేయాలన్నా, తెలిసికోవాలన్నా చాలా కష్టం. తెలిసికోగలిగినంత తరగతిలో తెలిసికొన్నా, మిగిలిన దానిని విద్యార్థి బాహ్య ప్రపంచం నుండే తెలిసికోవాలి. ఎన్నో కాలాల నుంచి ఎందరో మహానుభావులు ఎన్నో విజ్ఞానాంశాల్ని గ్రహించి గ్రంథస్థం చేసి ఉంటారు. ఆయా గ్రంథాలన్నింటినీ గ్రంథాలయాల్లో భద్రపఱచి ఉంటారు. అందువలన విద్యార్థులు తమకు కావలసిన జ్ఞానాంశాల్ని పొందటానికై గ్రంథాలయాలకెళ్ళి గ్రంథాల్ని పఠింపవలసి ఉన్నది. అయితే గ్రంథాలయాలు అనేక మంది పఠించటానికి వీలుగా ఉంటాయే తప్ప ఒక్కొక్కరు మాత్రమే పఠించటానకి వీలుగా ఉండవు. పైగా ఈ గ్రంథాలయాలు అన్ని వేళలా పనిచెయవు. అందువలన అనేక మంది ఒకే సమయంలో గ్రంథాలయంలో గ్రంథాల్ని పఠింపవలసి వస్తుంది. అటువంటి సమయంలో అందరూ ఒకే సారి బాహ్యంగా లేక గట్టిగా (బిగ్గరగా) పఠిస్తే ఎవరేమి పఠించేది ఎవరికీ అర్థం కాదు. పైగా గ్రంథాలయ నిర్వహణ కూడ చాల కష్టం. అందువలన గ్రంథాలయంలో అందరూ ఒకేసారి పఠించాలన్నా, ఎవరు చదివింది వారికే తెలియాలన్నా, పఠన సమయంలో ప్రక్క వారికి ఇబ్బంది లేకుండా ఉండాలన్నా మౌనంగా చదువుకోవలసి వస్తుంది. అందుకోసం విద్యార్థులకు మౌన పఠనం తెలిసి ఉండాలి. అలాగే గ్రంథాలయం అన్ని వేళలా పని చేయక పోవడం వలనా, పనిచేసే సమయంలోనే అనేక గ్రంథాల్ని పఠింపవలసిన అవసరం ఉండడం వలనా గ్రంథాల్ని వేగంగా పఠింపవలసి వస్తుంది. వేగంగా పఠించటమంటే విషయాన్ని అత్యంత వేగంగా గ్రహిస్తూ పఠించటమని అర్థం. ఇలా పఠించటాన్ని 'విస్తార పఠనం' అంటారు. ఇలాంటి విస్తార పఠనం విద్యార్థులకు బాగా వచ్చి ఉండాలి. ఇట్టి ఈ మౌన విస్తార పఠనాలు ఒక్క గ్రంథాలయ విషయంలోనే కాక నిత్య జీవితంలో ఎపుడైనా, ఎక్కడైనా ప్రాధాన్యాన్ని కలిగే ఉంటాయి. అందువలన విద్యార్థులు వీనిని అభివృద్ధి పఱచుకోవాలి. కాని తరగతి గదిలో పద్య బోధన ఆనందానుభూతిని, గద్య బోధన భాషాజ్ఞానానికి ప్రాధాన్యమివ్వడం వలన విద్యార్థుల్లో మౌన -విస్తార పఠనాలు సరియైన స్థితిలో అభివృద్ధి చెందటానికి వీలు లేదు. ఇట్టి స్థితిలో ఈ రెండు పఠనాలకు అత్యధిక ప్రాధాన్యమిచ్చి, వాని అభివృద్ధికై పాటుపడే ఏకైక సాధనం కేవలం ఉపవాచకం మాత్రమే.

## ఉపవాచక బోధనా లక్ష్యాలు

1. పఠన సామర్థ్యాన్ని ఎక్కువ చేయడం. 2. ముఖ్యంగా మౌన పఠనాన్ని బాగా అభివృద్ధి పఱచడం. 3. వేగంగా పఠింపచేయడం. 4. ముఖ్యంగా వేగంగా విషయాన్ని గ్రహింపచేయడం. 5. సారస్వత పఠనాభిలాషను పెంపొందిచడం. 6. విషయజ్ఞానాన్ని ఎక్కువ చేయడం. 7. భాషా జ్ఞానాన్ని అభివృద్ధి పఱచడం. 8. కథను సామర్థ్యాన్ని పెంచడం. 9. విమర్శన శక్తిని అభివృద్ధి పఱచడం. 10. సంక్షిప్తరచనను అభివృద్ధి చేయడం. 11. మూర్తిమత్వాన్ని పెంపొంధిచడం. 12. ఆలోచనా శక్తిని ఎక్కువ చేయడం. 13. సాహిత్యాభిరుచిని పెంపు చేయడం.

## ఉపవాచక బోధనా విధానాలు - పద్ధతులు

ప్రశ్నోత్తర -ప్రశంస -చర్చా -సారాంశ -పఠన విధానాలకు ప్రాధాన్యమెక్కువ. పద్ధతుల్లో పూర్ణ పద్ధతిని ఉపయోగిస్తారు. అయితే పద్య- గద్యాల్లో పద్యాన్ని- పేరాగ్రఫ్‌ను ప్రమాణాలుగా తీసికొన్నట్లే దీనిలో పరిచ్ఛేదాన్ని ప్రమాణంగా (unit) తీసికంటారు.

## సాంప్రదాయికంగా ఉపవాచక బోధన

బోధనా సంవత్సరంలో కొన్ని కాలవ్యవధుల్ని (Periods) ఉపవాచక బోధనకై కేటాయిస్తారు. ఉపవాచక బోధనకై ఉపాధ్యాయుడు తరగతి గదిలోకి ప్రవేశించి ఆ కాల వ్యవధిలో ఎంత వరకు బోధించాలో లేక ఏ పాఠాన్ని బోధించాలో దానినంతటినీ విద్యార్థులచేత చదివిస్తాడు. తరువాత దానినుండి విద్యార్థులు ఏమి గ్రహించారో దాని మీద ఉపాధ్యాయుడు ఉపన్యసిస్తాడు. కొంతమంది మాత్రం తరగతి గదిలో కాక ఇంటి దగ్గరే విద్యార్థులు చదుకవుకొనేటట్లు చేసి తరగతి గదిలో దాని మీద ప్రశ్నలు వేసి గ్రహించవలసిన విషయాన్ని రాబడతారు. కథా రూపంలో విద్యార్థుల చేత చెప్పిస్తారు. ఇంకొందరు మాత్రం ఉపవాచకాన్ని బోధింపకూడదని, విద్యార్థులే దానిని చదువుకొని విషయాన్ని గ్రహించాలని తరగతి గదిలోనే చదివిస్తారు. ఇట్టి బోధన వలన బోధనా లక్ష్యాలు నెరవేరక పోవటమే కాక క్రింది లోపాలు కనిపిస్తున్నాయి.

### లోపాలు

1. ఉన్ముఖీకరణ -పూర్వజ్ఞాన పరిశీలనలు లేక పోవడం వలన విద్యార్థులు బోధనాంశాన్ని ఆకర్షించలేరు. 2. విద్యార్థులే చదువుకోవడం వలన అది అర్థం కాక విసుగుదల, విరక్తి ఏర్పడుతుంది. 3. ఇంటి దగ్గర తీరిక లేని వారు దీనిని చదువుకోలేరు. 4. ఇంటి దగ్గర చదువుకొన్న అంశాన్ని అందరి ముందు వ్యక్తీకరించడం కూడ కష్టం. 5. ఎక్కువ కాలం, ఎక్కువ శ్రమ అవసరమైన ఉపవాచకం మీద కంటే తక్కువ కాలం తక్కువ శ్రమతో సరిపోయే గైడు మిదకు విద్యార్థులు మనస్సు మళ్ళుతుంది. 6.తెలివైన వారికి ఇది సరిపోయినా మధ్యరకం వారికి అంతకన్నా మందమతులకు ఇది చాల కష్టం.7. ఒక్కొక్క సారి మూల్యాంకనం కూడ లేక పోవడం వలన విద్యార్థులేమి గ్రహించారో వారికి కాని ఉపాధ్యాయునికి కాని తెలియదు.

## ఆధునికంగా ఉపవాచక బోధన (ఉపవాచన బోధన సోపానాలు )

### ఉన్ముఖీకరణం

పద్య -గద్య బోధనలలో మాదిరిగానే ఇక్కడ కూడ ఉన్ముఖీకరణం ఉంటుంది. అయితే దానికి దీనికి కొంత భేదముంది. ఉపవాచకంలోని పఠనాంశాన్ని ఖచ్చితంగా చదవాలనే ఉత్సాహం

-ఉత్సుకత - ఉత్కంఠత విద్యార్థులకు కలిగే విధంగా ఉన్ముఖీకరణ జరగ వలెను. ఒకవేళ పఠనాంశంలోని కథ ముందుగానే విద్యార్థులకు తెలిసినదై ఉంటే దానిలో ఏ అంశాల్ని జ్ఞాపకం చేస్తే తిరిగి దానిని చదవటానికి విద్యార్థులు ఉత్సుకతను చూపుతారో ఆ అంశంపై ప్రశ్నలు వేసి సమాధానాల్ని రాబట్టవలెను. సమాధానాలు రాకపోతే ప్రధానమైన అంశాల్ని అత్యంత ఆసక్తికరంగా కథా కథన రూపంలో చెప్పవలెను. ఇందుకోసం పద్య - గద్యాల్లో లాగా కాకుండా అవసరమనుకొన్నపుడు 30 ని॥ల సమయాన్నైనా, ఇంకా ఎక్కువైనా తీసికోవచ్చు. అదే సమయంలో ఆ పఠనాంశంలోని పాత్రల గుణ - శీలాదుల్ని, స్వరూప -స్వభావాల్ని, విశేషాల్ని సూచన రూపంలో చర్చించవచ్చు.

**చర్చా రూపంలో వివరణ**

తరగతి స్థాయిని బట్టి ఒక కాల వ్యవధిలో ఉపవాచకంలోని ఎన్ని పుటల్ని (మాధ్యమిక దశలో 3 నుంచి 5 వరకు, ఉన్నత దశలో 5 నుంచి 8 వరకు) లేద ఎంత అంశాన్ని (ఒక ఘట్టం సమగ్రమయ్యేటట్లు) బోధింపవలెనో నిర్ణయించుకోవలెను. అలా నిర్ణయింపబడిన అంశంలో ఏవైనా క్రొత్త పదాలు, జాతీయాలు మొ..న ఉంటే వాని అర్థాల్ని, భావాల్ని సంధర్భాన్ని బట్టి విద్యార్థులే ఊహించి తెలిసికొనేటట్లు చేయవలెను. అలాగే వాచ్యంగా కాక గూఢంగా ఉంటే విద్యార్థుల ఊహకు అందని ముఖ్యాంశాలుంటే వాటిని ఉపాధ్యాయుడు సూచన రూపంలో తెలియచేయవలెను. ఇలా చేసిన తరువాత ఆ అంశాన్ని ఇంటి దగ్గర చదువుకొని రమ్మని విద్యార్థుల్ని ఆదేశించవలెను.

తరువాత ఉపవాచక బోధనకై కేటాయింపబడిన కాలవ్యవధిలో విద్యార్థులు చదువుకొని వచ్చిన దానిలో ముఖ్యాంశాల పై ప్రశ్నింపవలెను. ఈ ప్రశ్నల సమాధానాలు విద్యార్థుల విషయ గ్రహణను తెలియచేసేవిగా ఉండవలెను. ఆ విషయ గ్రహణ సరిగా లేదనిపించినపుడు, ఏమైనా సందేహాలు ఉన్నాయనిపించినపుడు ఉపాధ్యాయుడు వాటిని విద్యార్థులతో చర్చింపవలెను. ఇలా విషయగ్రహణకు, చర్చలకు సంబంధించి కాల వ్యవధిలో కొంత భాగాన్ని కేటాయించి మిగిలిన కొంత భాగాన్ని తరువాతి కాలవ్యవధికి చదువుకొని రావలసిన బోధనాంశంపై సూచనలు నివ్వటానికి కేటాయింపవలెను. ఇదే క్రమంలో ఉపవాచకాన్నంతటినీ బోధింపవలెను.

**ఇంటి పని (గృహకం)**

విద్యార్థులు విషయం గ్రహించిన అంశంలోని ప్రధానమైన సన్నివేశాల్ని కాని, కథను కాని వారిచేతనే సంక్షిప్త రూపంలో లిఖిత వ్యాసరచన చేయించవలెను. ప్రశ్నలిచ్చి సమాధానాల్ని కూడ రాయింపవలెను.

## వాచక ఉపవాచక బోధనల మధ్య బేధాలు

| వాచకం | | ఉపవాచకం | |
|---|---|---|---|
| 1. | ఆనందానుభూతి, భాషా జ్ఞానాలు ప్రధానాంశాలు. | 1. | శీఘ్రంగా విషయాన్ని గ్రహింప చేయడం, విస్తారంగా విషయాన్ని అందించడం ప్రధానాంశాలు. |
| 2. | క్షుణ్ణపఠనం పెంపొందును. | 2. | విస్తార పఠనం పెంపొందును. |
| 3. | ప్రకాశ పఠనానికి ప్రాధాన్యం. | 3. | మౌన పఠనానికి ప్రాధాన్యం. |
| 4. | ఉన్ముఖీకరణకు అతితక్కువ సమయం, ( 2 లేక 3 నిముషాలు) సరిపోతుంది. | 4. | ఉన్ముఖీకరణకు ఎక్కువ సమయం (30 లేక 40 నిముషాలు ) అవసరమౌతుంది. |
| 5. | భాషాభివృద్ధిని పెంపు చేస్తుంది. | 5. | భాషాభివృద్ధిలో వాచకానికి సహాయపడుతుంది. |
| 6. | ప్రశ్నోత్తర వివరణ పద్ధతులకు ప్రాధాన్యం. | 6. | చర్చా పద్ధతికి ప్రాధాన్యం. |
| 7. | ఉపాధ్యాయునికి శ్రమ ఎక్కువ. | 7. | ఉపాధ్యాయునికి శ్రమ తక్కువ. |
| 8 | బోధనా సోపానాలెక్కువ. | 8. | బోధనా సోపానాలు తక్కువ |
| 9. | నల్ల బల్ల పాత్ర ఎక్కువ. | 9. | నల్ల బల్ల పాత్ర తక్కువ. |
| 10. | బోధనోపకరణాలకు ఎక్కువ ఆవశ్యకత. | 10. | బోధనోపకరణాలకు తక్కువ ఆవశ్యకత. |
| 11. | ఎక్కువ కాలవ్యవధులు అవసరమౌతాయి. | 11. | తక్కువ కాల వ్యవధులు సరిపోతాయి. |

## 4. నాటక (సంభాషణ )బోధన

### ఆవశ్యకత

ప్రత్యక్షం పరోక్షం (Direct - Inderect) అని భాష రెండు రకాలుగా ఉంటుంది. చెప్పే వ్యక్తి (మాట్లాడే వ్యక్తి) వినే వ్యక్తి ( గ్రహించే వ్యక్తి) ఎదురెదురుగా (ముఖాముఖిగా ) ఉంటే ప్రత్యక్షంగా జరుపుకొనే భాష ప్రత్యక్ష భాష. అలాకాక చెప్పే వ్యక్తికి వినే వ్యక్తికి మధ్య ఇంకొక వ్యక్తి ప్రవేశించి పరోక్షంగా జరుపుకొనే భాష పరోక్ష భాష. అనగా ఎవరో ఎక్కడో ఏదో చెప్పినట్లు ఇంకొక వ్యక్తి చెప్పడం, సాహిత్యంలో ఈ పరోక్ష భాషే ఎక్కువ స్థానాన్ని ఆక్రమించినా ప్రత్యక్ష భాషకు కూడా స్థానం లేకపోలేదు. సాహిత్య పరిభాషలో ఇలాంటి పరోక్ష భాష ఉన్నట్టి కావ్యాన్ని స్థూలంగా

శ్రవ్యకావ్యమనీ, ప్రత్యక్ష భాష ఉన్నట్టి కావ్యాన్ని స్థూలంగా దృశ్య కావ్యమనీ (నాటకమని) వ్యవహరించారు. అనగా శ్రవ్య కావ్యంలో ఎవరో ఎపుడో చెప్పినదానిని ఇంకొక వ్యక్తి ప్రత్యక్షంగానే శ్రోతలకు (ప్రేక్షకులకు) చెబుతాడు. ఇందులో ఎవరో చెప్పిన దానివైపు కంటే ప్రత్యక్షంగా చెప్పిన దానివైపే శ్రోత మొగ్గు చూపుతాడు. ఇలా శ్రోతను అధికంగా ఆకర్షించే ప్రత్యక్ష భాష ప్రధానంగా ఉన్నట్టి దృశ్య కావ్యానికి ఆంధ్ర సాహిత్యంలో ప్రాచీన కాలంలో ప్రాచుర్యం లేకపోయినా ఇటీవలి కాలంలో విశ్వరూపం తాలుస్తున్నది. అంతే కాక నిత్య వ్యవహారంలో ఈ ప్రత్యక్ష భాషకే ఎక్కువ ప్రాముఖ్యమున్నది. అందువలన విద్యార్థులు ఈ ప్రత్యక్ష భాషను, దాని వాక్య నిర్మాణాన్ని తెలిసికోవలసి ఉన్నది. ఇటీవలి కాలంలో మానవునికి ఆనందాన్ని వినోదాన్ని చేకూర్చే అనేక సాధనాల్లో నాటకం, నాటిక, సినిమా ప్రధానమైనవి. వీటిల్లో వాచికాంగికాభినయాలకు అత్యధిక ప్రాధాన్యమున్నది. కాబట్టి ఈ అభినయాన్ని గురించి కూడ విద్యార్థులు తెలిసికొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అందుచేత ఉపాధ్యాయుడు తరగతి గదిలో విద్యార్థులకు నాటకాన్ని బోధించవలసి ఉన్నది.

### నాటక బోధన లక్ష్యాలు

1. విద్యార్థులకు ప్రత్యక్ష వాక్య నిర్మాణాన్ని తెలియచేయడం. 2. విద్యార్థుల అభినయాల్ని ముఖ్యంగా వాచికాంగికాభినయాల్ని అభివృద్ధి పరచడం. 3. భాషణ శక్తిని పెంపొందించడం. 4. భాషాజ్ఞానాన్ని ఎక్కువ చేయడం. 5. ఆనందానుభూతిని పెంపు చేయడం. 6. అంతర్గతంగా ఉండే ఆలోచన -సృజన - విమర్శకాది శక్తుల్ని బహిర్గతం చేయడం. 7. శైలి వైవిధ్యాన్ని తెలియచేయడం. 8. పాత్రల స్వరూప స్వభావాలను అంచనావేయించడం. 9. సంఘీ భావాన్ని వృద్ధి చేయడం. 10. సిగ్గు, భయం మొ..న వానిని తొలగించడం. 11. విద్యార్థులకు నాటకీకరణాన్ని అలవాటు చేయడం.

## నాటక బోధనా విధానాలు - పద్ధతులు

బోధనా సంవిధానాల్లో పఠన విధానం, (ఆయా అంశాల్ని వాచికాభినయంతో పఠించడం) అభినయ విధానం (వాచికాలతో పాటు వానికనుకూలంగా శరీరక కదలికతో బోధించడం) చర్చావిధానం, నాటకీకరణ విధానం (వేష భూషణాదులు లేకుండా విద్యార్థుల చేత ఆయా పాత్రల్ని తరగతి గదిలో నటింపచేయడం) ముఖ్యమైనవి కాగా ప్రశ్నోత్తర -వివరణ -సారాంశ విధానాలు కూడ వాడబడతాయి.

పద్య గద్యాల్లో మాదిరిగానే నాటకాన్ని కూడ పూర్ణ పద్ధతిలోనే బోధించవలసి ఉంటుంది.

### బోధనా విధానం

#### ఉన్ముఖీకరణం.

బోధింపబోయే నాటకంలోని లేదా సంభాషణ పాఠంలోని పాత్రలకు, సన్నివేశాలకు సంబంధించిన సమాచారాన్ని ఉపాధ్యాయుడు విద్యార్థులనుంచి ప్రశ్నల రూపంలో రాబట్టవలెను.

వారికి తెలియనపుడు ఉపాధ్యాయుడు కొంతవరకు వివరణ రూపంలో తెలియ చేయవలెను. అలాగే ఆయా పాత్ర ... ప స్వభావాలను, విశేషాలను గురించి కూడ విద్యార్థులు తెలిసికొనేలా చేయవలెను. దీనితో ...లు బోధింపబోవు నాటకాంశం వైపు దృష్టి మరల్చుదురు. అలా వారి దృష్టిని మరల్చే ...స్మృతీకరణానికి ఉపాధ్యాయుడు పద్య గద్యాల్లోలాగా రెండు మూడు నిముషాలు కాక ఎక్కువ సమయాన్ని తీసికోవచ్చు. అదే రీతిలో శీర్షికను కూడా ప్రకటింపవలెను.

**పఠన - పాఠనాదులు**

గద్య పద్యాల్లో లాగే ఇక్కడ కూడ కవికాలాదుల్ని, సందర్భాన్ని ప్రశ్నల రూపంలో కాని, వివరణ రూపంలో కాని తెలియ చేయవలెను. తరువాత అక్కడలాగే ఇక్కడ కూడ పఠనం చేయవలెను. అయితే ఇక్కడ సన్నివేశం అర్థమయ్యే విథంగా తగుమాత్రపు వాచికాంగికాభినయాలతో ఉపాధ్యాయుడు చదువవలెను. అదే రీతిలో విద్యార్థుల చేత బాహ్య పఠనం చేయింపవలెను. అయితే ప్రాథమిక మాధ్యమిక దశల్లో మాత్రం బోధనానంతరం దీనిని చేయింపవచ్చు. అయితే సర్వసాధారణంగా నాటకాలన్ని లేదా సంభాషణ పాఠాలన్ని గద్య రుపంలోనే ఉన్నా కొన్ని సందర్భాల్లో పద్యాలు కూడా ఉంటాయి. ఆ పద్యాల్ని పద్య బోధనలో లాగా పఠించనవసరం లేదు. పఠిస్తున్నామనే స్ఫురణ కలుగకుండా ముఖాముఖి మాటాడుతున్నారనే స్ఫురణతో పఠించటయే నాటక పఠనం. మౌన పఠనానికి నాటక బోధనలో అవసరం లేదు.

**విశదీకరణ**

నాటకంలో లేదా సంభాషణ పాఠంలో పాత్రల స్వరూప స్వభావాలను ఆయా పాత్రలు తమను గూర్చి తాము చెప్పుకొనే మాటలబట్టి ఇతర పాత్రలు చెప్పే మాటల బట్టి, సంధర్భాన్ని - సన్నివేశాన్ని బట్టి, అర్థం చేసికోవలసి ఉంటుంది. అందుకు ఆలోచనాశక్తి ఊహాశక్తి అవసరమౌతాయి. విద్యార్థుల్ని అలా ఆలోచింపచేసే, ఊహింపచేసే ప్రశ్నల్ని వేస్తూ సమాధానాల్ని రాబట్టవలెను. అలా వీలుకాని అంశాల్ని ఉపాధ్యాయుడే వివరింపవలెను. ప్రత్యక్ష వాక్యాల్ని పరోక్ష వాక్యాలుగా విద్యార్థుల చేత మార్పిస్తూ అందలి విషయాన్ని గ్రహింపచేయవలెను. కఠిన పదాలకు అర్థాలు, జాతీయాలు మొదలైన వానిని గద్యంలో మాదిరిగా బోధింపవచ్చు. అయితే ఇందులోని పద్యాన్ని గాని గద్యాన్ని గాని పద్య గద్యాల్లో లాగా కాక సన్నివేశం అర్థమయ్యే విథంగా, పాత్ర స్వరూప స్వభావం తెలిసే విధంగా, రసానుకూలంగా మాత్రమే బోధింపవలెను. ఇలా బోధన సంపూర్ణమైన తరువాత ఆయా పాత్రలకు విద్యార్థుల్ని ఎంపిక చేసి వారి చేత నాటకాన్ని నాటకీకరింపవలెను. అనగా నటింపచేయవలెను. ఇక్కడ నాటకీకరణ నాటకాన్ని బోధింపచేయటం కోసమే కాని నాటకాన్ని మామూలుగా నటింపచేయటం కోసం కాదని గుర్తుంచుకోవాలి. బోధనానంతరం మూల్యాంకనం కూడ చేయవచ్చును. అలాగే ఇంటి పని కూడ ఇవ్వవచ్చు.

# 5. వ్యాకరణ బోధన

## ఆవశ్యకత

సమాజంలో మనిషిని మనిషిని కలుపుతూ, వారి మధ్య్య సహసంబంధ బాంధవ్యాలను ఏర్పరుస్తూ సమాజాన్ని అభివృద్ధి మార్గం వైపు నడిపించేది భాష. అట్టి భాషకు మూలం శబ్దం, అదిచ్చే అర్థం. అర్థవంతమైన శబ్దాలు ఒక సమూహంగా (వాక్య రూపంలో) ఏర్పడి భాషా వ్యాపారాన్ని నిర్వర్తిస్తాయన్నమాట. అటువంటి భాషా సమూహాలైన వాక్యాల్ని, అందులో ఇమిడి ఉన్నట్టి శబ్దాల్ని, వాని అర్థ నిర్ణయాన్ని వివరించేదివ్యాకరణం. అనగా శబ్దం ఏర్పడే రీతిని, దానిని వింగడించే తీరును, దాని అర్థాన్ని నిర్ణయించే మార్గాన్ని వివరించడం వ్యాకరణ కర్తవ్యం. అందుకే "వ్యాకరించేది వ్యాకరణం" అన్నారు. వ్యాకరించడం అనగా విడదీయడం, వింగడించడం అనిఅర్థం. అనగా గూఢంగా కలిసిపోయి అయఃపిండంలాగా తయారైన శబ్దాల్ని లేదా వాక్యాల్ని వింగడించి అర్థాల్ని లేదా భావాల్ని తెలియచేయడం. భాషోత్పత్తి విషయంలో మౌఖిక రూపంలో వ్యక్తమయ్యే ధ్వనులను శాశ్వతంగా నిలపటం కోసం అక్షరాల్ని ఏర్పాటు చేసికొన్నాం. కొన్ని కొన్ని అక్షరాల్ని కలుపుకొని పదాల్ని (శబ్దాల్ని) ఏర్పాటు చేశారు. ఆ శబ్దాలకు అర్థాల్ని నిర్ణయించారు. వాక్యాల్ని తయారు చేశారు. ఈ విధంగా అశాశ్వతంగా గాలికి కొట్టుకపోయే ధ్వనికి ఒక ఆకారాన్ని, శాశ్వతత్వాన్ని, స్థిరత్వాన్ని వ్యాకరణమూలంగా ఏర్పాటు చేశారు. అందుకే కొంతమంది వ్యాకృతికి సంబంధించి నది వ్యాకరణమన్నారు. అనగా శబ్దం దాని పుట్టుక, దాని అర్థనిర్ణయం, దాని వింగడింపు మొ..న వానిని వివరించేది వ్యాకరణం. అట్టి ఈ వ్యాకరణమే లేకపోతే భాషాజ్ఞానమే లేదు. అందుచేత వ్యాకరణాన్ని విద్యార్థులు తెలిసికోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అందుకోసం ఉపాధ్యాయుడు తరగతి గదిలో వ్యాకరణాన్ని బోధించవలసి ఉన్నది. అయితే పాఠశాల దశలో ఉపాధ్యాయుడు ఈ వ్యాకరణాన్ని బోధించనవసరం లేదని, విద్యార్థులే గ్రహిస్తారని నేటి కాలంలో కొంత మంది వాదిస్తున్నారు." భాష అనుకరణం వలన అబ్బుతున్న కారణాన భాషలో భాగమైన వ్యాకరణం కూడ ప్రత్యేక బోధన వలన కాక అనుకరణం వలననే సిద్ధిస్తుందన్న" ది వీరి వాదన. ఎవరిని అనుసరించి (ఉపాధ్యాయుడు కాని, వాచక ఉపవాచకాలు కాని) విద్యార్థి భాషను నేర్చుకొంటున్నడో వారి భాష సల్లక్షణంగా ఉన్నపుడు విద్యార్థి భాష కూడ సల్లక్షణ భరితంగానే ఉంటుందనేది వీరి భావన. అందువలన భాషను బోధించే వారికి వ్యాకరణం అవసరమౌతుంది కాని విద్యార్థులకు అవసరం లేదని వీరి తీర్పు. అంతే కాక పాఠశాలలో నేర్చుకొన్న వ్యాకరణం నిత్య జీవితంలో ఉపయోగపడక పోవడం వలన కూడా ఇది విద్యార్థులకు అనవసరమని వీరి విశ్వాసం.

అయితే త్వామరతంపరగా ఆవిర్భవిస్తున్న పదాల్లో ఏది సాధువో ఏది కాదో గుర్తించటానికి, శబ్దం యొక్క తీరుతెన్నుల్ని తెలిసికోటానికి, పదికాలాల పాటు దానిని అదే రీతిలో నిలపటానికి, వ్యాకరణ బద్ధంగా సృజింపబడిన భాషను అర్థం చేసికోటానికి, భాషలో ఒక ప్రామాణికతను సాధించటానికి వ్యాకరణం అవసరమౌతున్నది. అందుచేత విద్యార్థులకు దానిని బోధించవలసి ఉంటుంది.

## వ్యాకరణ బోధన లక్ష్యాలు

1. విద్యార్థుల్లో సల్లక్షణ భరితమైన భాషాజ్ఞానాన్ని పెంపొందించడం. 2. భాషా స్వరూపాన్ని తెలియచేయడం. 3. నూతన పదజాలాన్ని లక్షణ భరితంగా స్పష్టం చేయడం. 4.విద్యార్థుల్లో తార్కిక శక్తిని పెంపొందించడం. 5. విద్యార్థులకు శాస్త్రీయ దృక్పథాన్ని అలవాటు చేయడం. 6. విద్యార్థుల్లో హేతువాద దృష్టిని రేకెత్తించడం. 7. వ్యాకరణ బద్ధంగా నిర్మింపబడిన భాషను అధ్యయనం చేయడం. 8. సూత్రీకరణ సామర్థ్యాన్ని పెంపు చేయడం.

## వివిధ దశలలో వ్యాకరణ బోధన

విద్యార్థుల స్థాయిని బట్టి వ్యాకరణాన్ని మూడు రకాలుగా బోధిస్తారు. అవి 1. ప్రాయోగిక వ్యాకరణ బోధన. 2. నైమిత్తిక వ్యాకరణ బోధన. 3.రూపాత్మక వ్యాకరణ బోధన.

### ప్రాయోగిక వ్యాకరణ బోధన (Teaching o fFunctional Grammer)

సర్వసాధారణంగా ప్రాథమిక దశలో ప్రత్యేకంగా వ్యాకరణమంటూ బోధింపబడదు. దానికి కారణం విద్యార్థుల మానసిక స్థితి అందుకు సన్నద్ధంగా లేకపోవటయే. అయితే భాషణంలో కాని, లేఖనంలో కాని విద్యార్థులు శిష్టరూపాల్ని వాడేటట్లు చూడవలెను. దుష్ట రూపాలను వాడితే వానిని సవరించి సాధురూపాల్ని తెలుపవలెను. ఉదా.. రాముడు కుక్కను కొట్టింది. అని విద్యార్థి భాషిస్తే అలా కాదని 'రాముడు కుక్కను కొట్టాడు' అని సవరిస్తే సరిపోతుంది. అంతే కాని కర్త ఏకవచనంలో పుంలింగంలో ఉంది కాబట్టి క్రియ కూడా అదే వచనంలో అదే లింగంలో ఉండాలనే వ్యాకరణ నియమాన్ని చెప్పనవసరం లేదు. ఇలా వ్యాకరణ నియమాలను బోధించకుండా సరైన ప్రయోగాలను మాత్రం చేయిస్తూ బోధించే ఈ వ్యాకరణ బోధనకు ప్రాయోగిక వ్యాకరణ బోధన అంటారు. క్రమంగా అచ్చులు -హల్లులు - ఉభయాక్షరాలు, భాషాభాగాలు, విభక్తి ప్రత్యయాలు మొ..న వానిని నియమాలేవీ లేకుండానే బోధింపవలెను. తరువాత వాక్యాన్ని ప్రమాణంగా తీసికొని అందులోని లింగ - వాచక - కాల బేధాలను, పురుషలను నియమరహితంగా ప్రయోగాల ఆధారంగానే బోధింపవలెను. ఆ బోధన క్రీడా మార్గంలో సాగవచ్చును. ఉపకరణాల్ని కూడా ఉపయోగింపవచ్చు. ఈ విధంగా ప్రాథమిక దశలో ప్రాయోగిక వ్యాకరణ బోధన విధానాన్ని ఉపయోగిస్తారు.

### నైమిత్తిక వ్యాకరణ బోధన

మాధ్యమిక ఉన్నత దశల్లో వ్యాకరణాన్ని బోధించటానికి నైమిత్తిక వ్యాకరణ బోధనను ఉపయోగిస్తారు. ప్రాథమిక దశలో మాదిరిగా కాకుండా మాధ్యమిక ఆరంభదశ నుంచి నియమాలతో కూడిన వ్యాకరణాన్ని బోధింప వలసి ఉంటుంది. అందుకు రెండు పద్ధతులున్నాయి. 1. నిగమోపపత్తి పద్ధతి. 2. అనుమానోపపత్తి పద్ధతి.

**నిగమోపపత్తి పద్ధతి (Deductive Method)**

దీనికే 'సూత్ర పద్ధతి' అనేది మరొక పేరు. సంప్రదాయికంగా వ్యాకరణాన్ని బోధించే పద్ధతి ఇది. దీని ద్వారా వ్యాకరణాన్ని బోధించవలసిన ఉపాధ్యాయుడు ముందుగా ఆయా వ్యాకరణ సూత్రాలను, అందులోని పారిభాషిక పదాలను చక్కగా వివరించి ఆ తరువాత కొన్ని ఉదాహరణలను తీసికొని వీనిని ఆ సూత్రాలతో లక్ష్య లక్షణ సమన్వయం చేస్తాడు. ఆ రకంగానే వ్యాకరణాన్నంతటినీ బోధిస్తాడు. ఉదా :- ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు. అనే సూత్రాన్ని తీసికొని అందులోని ఉత్తు, అచ్చు, పరమగుట, సంధి అనే వానిని వివరిస్తాడు. తరువాత 'రాముడతడు' వంటి పదాలను తీసికొని రాముడు + అతడు అని విడదీసి అందులో సూత్రంలోని ఉత్తు, అచ్చు, సంధి ఏమిటో సమన్వయం చేస్తాడు. ఇదే విధంగా తీసికొన్ని పదాలన్నింటినీ ఆ సూత్రానికి సమన్వయం చేస్తాడు. అదే విధంగా మరొక సూత్రాన్ని తీసికొని అదే రీతిలో వివరిస్తూ వ్యాకరణాన్ని బోధిస్తాడు. అయితే తెలిసిన దాని ఆధారంగా తెలియని దానిని తెలుసుకోడం సులభమనే మనస్తత్వ శాస్త్ర నియమానికిది ప్రతికూలం కావడం వలన దీనిని ఆధునికులు అంగీకరించడం లేదు. పైగా వ్యాకరణ బోధనా లక్ష్యాలు కూడా దీని ద్వారా నెరవేరడం కష్టం.

**అనుమానోపపత్తి పద్ధతి (Inductive Method)**

దీనికే "ఉదాహరణ పద్ధతి" అనేది మరొక పేరు. ఆధునికంగా వ్యాకరణాన్ని బోధించే పద్ధతి ఇది. దీని ద్వారా వ్యాకరణాన్ని బోధించే ఉపాధ్యాయుడు ముందుగా సూత్రాలను కాక ఉదాహరణాల్ని తీసికొని వాని స్వరూప స్వభావాల్ని విద్యార్థుల చేత బాగా పరిశీలింపచేసి వాటిల్లో అత్యంత సహజంగా కనిపించే ధర్మాల్ని గ్రహింపచేసి వాని ఆధారంగా వాటి సాధారణ లక్షణాల్ని లేదా సూత్రాల్ని విద్యార్థుల చేతనే నిర్మింపచేస్తాడు. అదే విధంగా సూత్రాలన్నింటినీ రాబడుతూ వ్యాకరణాన్ని బోధిస్తాడు. ఉదా:-రాముడతడు, సోముడతడు, రంగడతడు, భీముడతడు మొ..న ఉదాహరణల తీసికొని విద్యార్థులచేత పరిశీలింపచేస్తూ వీటన్నింటినీ విడదీయింపవలెను. ఆ తరువాత సంధి జరుగుతున్నపుడు వాటన్నింటిలో సమానంగా జరుగతున్న మార్పుల్ని వారిచేతనే వారి స్వంత మాటల్లో చెప్పించవలెను. ఆ మాటల్నే వారిచేత సూత్రాల్లాగా నిర్మింపవలెను. అదే విధంగా వేరే మరికొన్ని ఉదాహరణల్ని తీసికొని వాటి ఆధారంగా మరో వ్యాకరణ సూత్రాన్ని నిర్మింపవలెను. ఈ విధంగా వ్యాకరణాన్ని బోధింపవలెను. ఇది మనస్తత్వ శాస్త్ర నియమానుకూలంగా సాగుతున్న బోధన. అంతేకాక వ్యాకరణ బోధనా లక్ష్యాలన్నింటినీ దీని ద్వారా సాధించడం సులభం. అంతే గాక ఈ బోధన విద్యార్థి కేంద్రంగా సాగుతూ వారిలోని ఆలోచన -తార్కిక - హేతువాద - సృజనాత్మకాది అంతర్గత శక్తుల్ని బహిర్గతం చేస్తుంది.

## నిగమ అనుమానోపపద్ధతుల మధ్య బేధాలు

| నిగమోప పద్ధతి | | అనుమానోప పద్ధతి | |
|---|---|---|---|
| 1. | సూత్రాన్ని వివరించడం జరుగుతుంది. | 1. | సూత్రాన్ని రాబట్టడం జరుగుతుంది. |
| 2. | ఉదాహరణలను సూత్రంతో సమన్వయ పరచడం జరుగుతుంది. | 2. | ఉదాహరణలతో సూత్రాన్ని నిర్మించడం జరుగుతుంది. |
| 3. | ఉపాధ్యాయ కేంద్రంగా సాగుతుంది. | 3. | విద్యార్థి కేంద్రంగా సాగుతుంది. |
| 4. | సిద్ధాంతాత్మకంగా సాగుతుంది. | 4. | ప్రయోగాత్మకంగా సాగుతుంది. |
| 5. | సూత్రీకరణ సామర్థ్యం అలవడదు. | 5. | సూత్రీకరణ సామర్థ్యం అలవడును. |
| 6. | విద్యార్థుల ఆలోచనకు తావులేదు. | 6. | విద్యార్థుల ఆలోచన ప్రధానం. |
| 7. | తార్కిక శక్తి హేతువాద దృక్పధాలు అభివృద్ధి చెందవు. | 7. | తార్కిక శక్తి హేతు వాద దృక్పధాలు అభివృద్ధి చెందును. |
| 8. | ఇది ప్రాచీన పద్ధతి. | 8. | ఇది ఆధునిక పద్ధతి. |
| 9. | మనస్తత్వ శాస్త్ర నియమానికి వ్యతిరేకం. | 9. | మనస్తత్వ శాస్త్ర నియమానికి సానుకూలం. |
| 10. | సూత్రానికి ప్రాధాన్యం. | 10. | ఉదాహరణకు ప్రాధాన్యం. |

### రూపాత్మక వ్యాకరణ బోధన

భాష యొక్క స్వరూప స్వభావం తెలిసే విధంగా సమగ్ర దృష్టితో, శాస్త్రీయదృక్పధంతో, సూత్ర పద్ధతిలో బోధించటాన్నే రూపాత్మక వ్యాకరణ బోధన అంటారు. దీనిని సాధారణంగా కళాశాల దశలో ఉపయోగిస్తారు.

### సాంప్రదాయికంగా వ్యాకరణ బోధన

వ్యాకరణాన్ని ప్రత్యేక కాలవ్యవధిలో కాక పద్యాన్ని లేదా గద్యాన్ని బోధిస్తూ మధ్యలో వ్యాకరణకార్యం వచ్చినపుడు దానిని బోధించడం జరుగుతుంది. ఈ బోధనంతా నిగమనోప పత్తిపద్ధతి ద్వారానే సాగుతుంది. ఉదా:- " అటజనిగాంచె భూమి సురుడంబరచుంబి శిరస్సరఝరీ" అనే పద్యాన్ని బోధిస్తున్నపుడు 'అటన్' అనే శబ్దానికి అర్థం చెప్పి తరువాత 'అటజని' శబ్దాన్ని విడదీయమంటాడు. విద్యార్థులు విడదీయలేకపోతే 'అటన్+చని' అని తనే విడదీసి 'దృత ప్రకృతికంబు మీది పరుషంబులకు సరళంబలగు' అని సూత్రాన్ని చెప్పి దీనితో దానిని సమన్వయం చేస్తాడు. తరువాత 'చనిగాంచే' అనే పదాన్ని కూడ వివరించి మరల 'భూమి సురుడంబర' అనే శబ్దాన్ని విడదీయమంటాడు. విడదీయలేకపోతే తానే 'భూమి సురుడు + అంబరగ 'విడదీసి "ఉత్తునకచ్చు పరంబగునుపుడు సంధియగు" అనే సూత్రాన్ని చెప్పి దీనితో దానిని సమన్వయం చేసి క్రమంగా చుంబి శబ్దానికి అర్థం చెప్పి మరల 'శిరస్సర' శబ్దాన్ని 'శిరః + సర' అని విడదీసి సూత్రం చెప్పి

సమన్వయం చేస్తాడు. ఈ విధంగా పద్య బోధనా మధ్యలోనే వ్యాకరణాన్నంతటినీ బోధిస్తాడు. కొంత మంది మాత్రం పద్యాన్ని బోధించి కాలవ్యవధి చివర్లో అందలి వ్యాకరణాంశాల్ని బోధిస్తారు. ఈ వ్యాకరణాంశాలన్నింటినీ నల్లబల్ల మీద రాసి విద్యార్థుల చేత నోటు పుస్తకాల్లో రాయిస్తారు. ఆయా సూత్రాల్ని కంఠస్థం చేయిస్తారు.

**లోపాలు**

1. ఉన్ముఖీకరణ - పూర్వ జ్ఞాన పరిశీలనాదులు లేక పోవడం వలన విద్యార్థులు బోధనకు సిద్ధం కాలేరు. 2. పద్య గద్య పాఠబోధనల మధ్యలో దీనిని బోధించడం వలన ఇది సమగ్రంకాలేక పోవటయే కాక వాటికి అడ్డంకిగా ఉంటుంది. 3. విద్యార్థులకు ఎక్కువ వినుగుదల, శ్రమ కలుగును. 4. ఉపాధ్యాయునికి కూడ శ్రమ ఎక్కువ. 5. మూల్యాంకనం లేకపోవడం వలన విద్యార్థులు ఏమాత్రం గ్రహించింది తెలియదు. 6. బోధనలో విద్యార్థులు పాల్గొనక పోవడం వలన వారికి ఆసక్తి, అనురక్తి ఉండదు. 7. విద్యార్థులు వ్యాకరణ సూత్రాల్ని గుడ్డిగా కంఠస్థం చేయటానికి ప్రయత్నిస్తారు. కాని అర్థం చేసికోటానికి ప్రయత్నించరు. 8. బోధన నిగమోప పద్ధతి ద్వారా సాగుడం వలన అందులోని లోపాలన్నీ ఇందులోకి వస్తాయి.

## ఆధునికంగా వ్యాకరణ బోధన (వ్యాకరణ బోధనా సోపానాలు)

## (సవర్ణదీర్ఘ సంధికి సంబంధించి)

పద్యగద్య పాఠబోధనల మధ్యలో కాక దీనిని ప్రత్యేక కాలవ్యవధుల్లో మాత్రమే బోధిస్తారు. అందుకోసం కొన్ని కాల వ్యవధుల్ని దీని బోధనకై కేటాయిస్తారు. బోధన అనుమానోప పత్తి పద్ధతి ద్వారానే సాగుతుంది. అది పద్య - గద్యాల్లో మాదిరిగా క్రింది విధంగా సాగుతుంది.

**ఉన్ముఖీకరణ**

పద్య గద్య పాఠాల్లాగానే దీనికి కూడా ప్రశ్నోత్తర లేద అవసరాన్నిబట్టి మరేయితర విధానాన్నైనా పాటించి ఉన్ముఖీకరణ చేయవలెను. వ్యాకరణానికే ఉన్ముఖీకరణ సాగిస్తూ దానిని సంధివైపుకు మళ్ళింపవలెను. ఆ తరువాత బోధింపబోవు సంధిని ప్రకటింపవలెను. ఇదే శీర్షికా ప్రకటన కూడ అవుతుంది.

**ప్రదర్శన**

అనుమానోప పత్తి పద్ధతిని అనుసరించి ఇది పదసేకరణ, పధ పరిశీలన, సామాన్యీకరణ, సూత్రీకరణ అనే భాగాలుగా సాగుతుంది. దేవాలయం, రామాలయం, మునీశ్వరుడు, శనీశ్వరుడు, భానూదయం, రామూదయం, పితౄణం, మాతౄణం, మొ..న ఒకే రకమైన మార్పులు జరగటానికి వీలైన పదాలను విద్యార్థుల నుండి కాని లేక పాఠ్యపుస్తకం నుండి కాని తీసికొని ఉపాధ్యాయుడు నల్లబల్లపై రాయవలెను. వీటిని విద్యార్థుల చేత బాగా గమనింప చేస్తూ విడదీయించ వలెను. అలా విడదీసి తిరిగి కలపడంలో జరుగుతున్న మార్పుల్ని సంధి మార్పులుగా విద్యార్థులచేత చక్కగా పరిశీలింపచేసి, వానిని వారి స్వంత మాటల్లో చెప్పిస్తూ క్రమంగా సూత్రాను

నిర్మింపచేయవలెను. ఇలా సూత్రాల్ని నిర్మించిన తరువాత మరికొన్ని నూతన పదాలను తీసికొని వానిని ఈ సూత్రాలతో నిగమోపపత్తి పద్ధతిననుసరించి సమన్వయం చేయించడం మంచిది. ఇలా చేయడం వలన పదాలతో సూత్రాల్ని నిర్మించడం, సూత్రాలతో పదాల్ని సమన్వయం చేయటం అనే రెండు పద్ధతులూ విద్యార్థులకు స్పష్టమౌతాయి.

**మూల్యాంకనం, నియోజనం**

ఆయా వ్యాకరణాంశాల్ని బోధించిన తరువాత, వాని బోధనా లక్ష్యాల్ని దృష్టిలో పెట్టుకొని ఆయా అంశాలపై ప్రశ్నలడుగుతూ దానిని మూల్యాంకనం చేయవలెను. అలాగే వానిపై నియోజనం కూడ చేయింపవలెను. సూత్రాల్ని నిర్మింపచేయడం, సూత్రాలతో సమన్వయింప చేయడం అనే రెండింటి మీద నియోజనం ఇవ్వవచ్చు.

పై విధంగా సంధులనే కాక సమాసాలు మొదలైన వ్యాకరణాంశాల్ని బోధింపవచ్చు.

## 6. అలంకార బోధన

**ఆవశ్యకత**

దీని సమాధానం కోసం అలంకార ప్రాధాన్యంలో చూడవలెను.

**లక్ష్యాలు**

1. భావాన్ని సౌందర్యోపేతంగా వ్యక్తీకరింపచేయడం. 2. భావ సౌందర్యాన్ని అనుభవింపచేయడం. 3. భావాన్ని సంక్షిప్తీకరింపచేయడం. 4. కవితాశైలిని అలవాటు చేయడం. 5. ఆయా మూర్తులను రూపింపచేసే తీరును తెలియచేయడం. 6. శబ్ద-అర్థ-మిశ్రమాది వివిధాలంకారాల పరిజ్ఞానాన్ని కలిగించడం. 7. భాషను శబ్దాలంకారమూలంగా లయబద్ధంగా ప్రయోగించే తీరును నేర్పడం. 8. చమత్కార వంతమైన, సౌందర్యోపేతమైన రచనను అలవాటు చేయడం. 9. చెప్పలేని అంశాన్ని చెప్పవీలుకాని అంశాన్ని అత్యంత మనోహరంగా ఆకర్షణీయంగా చెప్పే తీరును తెలపడం. 10. తార్కిక - సృజన శక్తుల్ని పెంపొందించడం. 11. విశ్లేషణ శక్తిని పెంపు చేయడం. 12. లక్షణ నిర్మాణాన్ని తెలియచేయడం.

బోధానావిధానాల్లో ప్రశ్నోత్తర - వివరణ - సామ్య - సమన్వయ విధానాలతో పాటు అవసరాన్ని బట్టి మిగిలిన వానిని కూడ ఉపయోగింపవచ్చు. అలాగే పద్ధతుల్లో నిగమ అనుమానోపపత్తి పద్ధతుల రెంటినీ ఉపయోగిస్తారు.

**సాంప్రదాయికంగా అలంకార బోధన**

పద్య గద్య పాఠాల్ని బోధిస్తూ మధ్యలో వ్యాకరణాన్ని బోధించినట్లుగానే అలంకారాన్ని కూడా బోధిస్తారు. ఉదా:- ఉపాధ్యాయుడు తరగతి గదిలో 'ఆపుర సౌధాలకాశాన్ని చుంబిస్తున్నవి' మొ..గా గల గద్య పాఠాన్ని బోధిస్తున్నపుడు సౌధాలు, చుంబించుట అనే పదాలకు అర్థాల్ని బోధిస్తూ 'సౌధాకాశం' అనే పదానికి వ్యాకరణాన్ని, సంధిని బోధించి వెంటనే అందులోని అలంకారాన్ని కూడ బోధిస్తాడు. దీనిని కూడా వ్యాకరణంలాగా నిగమోప పత్తి పద్ధతిలోనే

బోధిస్తాడు. అనగా ముందు అతిశయోక్తి అలంకార లక్షణాల్ని బోధించి ఆ తరువాత దీనిని ఆ లక్షణాలతో సమన్వయం చేస్తాడు. ఇదే రీతిలో మిగిలిన బోధనాంశాన్నంతటినీ బోధిస్తాడు ఈ విధంగా అలంకార బోధన వ్యాకరణలాగా మనస్తత్వ శాస్త్రనియమాలకు వ్యతిరేకంగా ఉండటమే కాక బోధనా లక్ష్యాల్ని సాధింపలేకున్నది. అంతే కాక ఇందులో క్రింది లోపాలు కూడా ఉన్నాయి.

**లోపాలు**

సాంప్రదాయిక వ్యాకరణ బోధనలో ఏ లోపాలున్నాయో ఇందులోనూ అవే లోపాలున్నాయి.

## ఆధునికంగా వ్యాకరణ బోధన (వ్యాకరణ బోధనా సోపానాలు)

## (ఉపమాలంకారాన్ని బోధించడం)

పద్య - గద్య పాఠబోధనల మధ్యలో కాక వ్యాకరణంలాగా దీని బోధనకు కూడ కొన్ని కాల వ్యవధుల్ని ఉపాధ్యాయుడు కేటాయించుకొని ఆ ప్రత్యేక కాలవ్యవధుల్లోనే దీనిని బోధిస్తాడు. వ్యాకరణం లాగా దీనిని కూడ అనుమానోప పత్తి పద్ధతిలోనే బోధిస్తాడు. ఆ బోధన క్రింది విధంగా సాగుతుంది.

**ఉన్ముఖీకరణం, శీర్షికా ప్రకటనం**

వ్యాకరణ బోధనలో లాగే వీనిని చేయవలసి ఉంటుంది.

**ప్రదర్శన**

వ్యాకరణం లాగానే ఈ అలంకార ప్రదర్శన కూడా వాక్య సేకరణ, వాక్య పరిశీలన, సామాన్యీకరణం, లక్షణీకరణం అనే భాగాలుగా సాగుతుంది. శిరీష ముఖం చంద్రబింబం వలె ఉన్నది, మనో హరి నడుం కందిరీగ నడుంవలె ఉన్నది. పద్మజ పాదాలు పద్మాల వలె ఉన్నవి. రమ్య సౌందర్యం రంభ సౌందర్యం వలె ఉన్నది. మొ..న ఒకే రకమైన నిర్మాణమున్నట్టి వాక్యాల్ని కాని పద్య భాగాల్ని కాని విద్యార్థుల నుండి లేద పాఠ్యపుస్తకాలనుండి కాని తీసికొని విద్యార్థులచేత చక్కగా గమనింపచేస్తూ రకరకాలైన ప్రశ్నల ద్వారా వానిలోని సర్వసాధారణంగా ఉండే అంశాల్ని, సామ్యాల్ని గ్రహింపచేయవలెను. పారిభాషిక పదాలైన ఉపమాన-ఉపమేయాదులను సందర్భాన్ని బట్టి పరిచయం చేయవలెను. ఈ జ్ఞానాన్ని ఆ వాక్యంలోని అంశాలకు సమన్వయింప చేస్తూ మొత్తం మీద ఆ వాక్యాల్లో ఉండే సాధారణ లక్షణాల్ని- పోలికల్ని విద్యార్థుల చేత వారి స్వంత మాటల్లో చెప్పింపవలెను. ఈ లక్షణాలతో మరికొన్ని ఉదాహరణ వాక్యాల్ని నిగమోప పత్తి పద్ధతి ద్వారా సమన్వయం చేయింపవవలె. ఇదే రీతిలో తక్కిన అలంకారాన్ని బోధింపవలెను.

**మూల్యాంకనం - నియోజనం**

వ్యాకరణ బోధనలో లాగే గ్రహించిన అంశాల పై మూల్యాంకనం చేయింపవలెను. కొన్ని నూతన వాక్యాల్ని ఇచ్చి వానిలోని అలంకాలాల్ని గుర్తించే విధంగా, లక్షణాల్ని చెప్పి ఆ లక్షణాలతో సమన్వయం పొందేట్లు నూతన వాక్యాల్ని నిర్మించే విధంగా నియోజనాల్ని ఇవ్వవలెను.

# ఛందస్సు బోధన

**ఆవశ్యకత**

దీని సమాధానం కోసం ఛందస్సు ప్రాధాన్యం లో చూడవలెను.

**ఛందస్సు బోధనాలక్ష్యాలు**

1. నియమానుగుణంగా అక్షరాల్ని వ్యక్తీకరింపచేయడం. 2. ఉపయోగమున్న అక్షరాల్ని మాత్రమే ఉపయోగింపచేయడం. 3. లయబద్ధంగా అక్షరాల్ని వ్యక్తీకరింపచేయడం. 4. స్వరానుకూలంగా అక్షరాల్ని పేర్పింపచేయడం. 5. నాద సౌందర్యంతో అక్షరాల్ని కూర్పింపచేయడం. 6. ఎక్కువ అర్థాన్ని తక్కువ అక్షరాల్లో నిక్షిప్తీకరించడం. 7. సంక్షిప్తీకరణను పెంపొందించడం. 8. కవితా రచననూ పెంపు చేయడం. 9. శైలి వైవిధ్యాన్ని గుర్తింపచేయడం. 10. ముఖ్యమైన భాగాల్ని సులభంగా కంఠస్థం చేయించడం. 11. పద్యనడకను గుర్తింపచేయడం. 12. పఠనను ఎక్కడ కుదించాలో, ఎక్కడ దీర్ఘీకరించాలో , ఎక్కడ ఆపాలో, ఎక్కడ ఆపరాదో తెలియచేయడం. 13. పద్య -గద్యాల మధ్య తేడాను స్పష్టం చేయడం.

**సాంప్రదాయికంగా ఛందస్సు బోధన**

ప్రత్యేకమైన కాలవ్యవధిలో కాక పద్య బోధనలో భాగంగానే అదే కాలవ్యవధిలో చివర్లో దీనిని బోధించేవారు. నిగమోప పత్తి ద్వారా బోధించేవారు. ముందుగా గురు లఘు నిర్ణయాన్ని, వివిధ గణాలను బోధిస్తారు. పద్య బోధనానంతరం అది ఏ ఛందస్సో, దాని పేరును తెలిపి దాని లక్షణాల్ని, నియమాల్ని బోధిస్తారు. తరువాత పద్యంలోని ఏదో ఒక పాదాన్ని తీసికొని దానిని నల్ల బల్ల మీద రాస్తారు. విద్యార్థులు చేయలేకపోతే ఉపాధ్యాయుడే దాని గురు లఘు నిర్ణయంతో పాటు గణ విభజన కూడా చేస్తాడు. తరువాత ఈ గణాల్ని, ఇందలి యతి ప్రాసల్ని ముందు చెప్పిన లక్షణాలతో సమన్వయం చేస్తాడు. అదే రీతిలో ఛందస్సునంతటినీ బోధించేవారు. ఈ రకమైన బోధనలో లక్ష్యాలు నెరవేరక పోవటమే కాక క్రింది లోపాలు కూడ ఉన్నాయి.

**లోపాలు**

వ్యాకరణ - అలంకార బోధనలలోని లోపాలే దీనికి కూడా వర్తిస్తాయి.

**ఆధునికంగా ఛందస్సు బోధన**

వ్యాకరణ - అలంకార బోధనలలాగా దీనిని కూడ పద్య బోధనలో భాగంగా కాక ప్రత్యేక కాలవ్యవధిలో బోధిస్తారు. అందుకోసం ప్రత్యేకంగా కొన్ని కాలవ్యవధుల్ని కేటాయిస్తారు. గురు లఘు నిర్ణయాన్ని నేర్పుతారు. అక్కడ లాగే ఇక్కడ కూడా ఉన్ముఖీకరణ శీర్షికా ప్రకటనాదులను చేస్తారు. వ్యాకరణ అలంకార పద్ధతుల్లో మాదిరిగానే అనుమానోపపత్తి పద్ధతిలోనే దీనిని బోధించటానికి ప్రయత్నిస్తారు. అలా వీలు కాని సందర్భాల్లో నిగమోప పత్తి పద్ధతిని కూడ ఉపయోగిస్తారు. చివర్లో మూల్యాంకన నియోజనాల్ని కూడ చేస్తారు.

# 8. ఆధునిక కవితా బోధన

**ఆవశ్యకత**

ఒకనాటి కవిత్వమంతా ఇంచుమించు ఒకే రూపంతో , ఒకే ధ్యేయంతో, ఒకే నడకతో సాగింది. అందుకు కారణం ఆనాటి సమాజం. అందలి ప్రజల ఆచారవ్యవహారాలు, సంస్కృతి సంప్రదాయాలు, అలవాట్లు, అభిరుచులు మొ..న . అయితే అనేక కారణాల వలనా, ప్రభావాల వలనా ఈ నాటి సమాజం మారింది. ఇప్పటి సమాజంలోని ప్రజల ఆచారవ్యవహారాదుల్లో విప్లవాత్మకమైన మార్పులు సంభవించాయి. తత్ఫలితంగా కవిత్వంలో కూడా పెను మార్పులు సంభవించాయి. ముఖ్యంగా రూపంలో, ధ్యేయంలో, నడకలో అనూహ్యరీతిలో మార్పులు వచ్చాయి. భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ, మినీ కవిత్వాలనే అనేక రూపాల్లో ఈనాటి కవిత్వం తాండవిస్తున్నది. ఆనందాన్ని ఇవ్వటంతో పాటు ఆకలి మంటల్ని చల్లార్చడం, వాస్తవాన్ని వివరించడం, సమానత్వాన్ని పాటించడం, అతి తక్కువ కాలంలో అత్యధిక అనుభూతిని అందించడం మొ..న వన్నీ ఈ నాటి కవిత్వానికి లక్ష్యాలు. ఈ లక్ష్యాలకు అనుకూలంగానే ఈ నాటి కవిత్వం వచనంలో, గేయంలో, మాత్రాఛందస్సులో సాగిపోతున్నది. ఆనాటి కవిత్వం, ఆనాటి సమాజాన్ని ప్రతిఫలించినట్లే ఈ నాటి కవిత్వం సమాజాన్ని ప్రతిఫలిస్తున్నది. అందుచేత ఆనాటి కవిత్వాన్ని సమాజాన్ని అర్థం చేసికోడం ఎంత ముఖ్యమో ఈనాటి కవిత్వాన్ని సమాజాన్ని అర్థం చేసికోడం కూడ అంతే ముఖ్యం. అందుకే ఆధునిక కవిత్వాన్ని కూడా అధ్యయనం చేయవలసిన బాధ్యత విద్యార్థిపై ఎంతైనా ఉన్నది. అందుచేత ఉపాధ్యాయుడు ఆధునికి కవితను బోధింపవలసి ఉన్నది.

**బోధనా లక్ష్యాలు**

1. ఆధునిక కవితా సౌందర్యాన్ని తెలియచేయడం. 2. ఆధునిక కవితా స్వరూప-స్వభావాల్ని వివరించడం. 3. ఆధునిక కవితా శైలిలోని వైవిధ్యాన్ని గుర్తింపచేయడం. 4. ప్రాచీన ఆధునిక కవితా వ్యక్తీకరణలలోని తేడాను గమనింపచేయడం. 5. ఆధునిక కవితలోని అనుభూతి తీవ్రతను తెలియచేయడం. 6. అతి నూతనంగా భావాన్ని వ్యక్తీకరించే తీరును చూపించడం. 7. ఆధునిక కవిత్వంలోని భావ తీవ్రతను అంచనా వేయించడం. 8. మాత్రాఛందస్సును పరిచయం చేయడం. 9. అతి నూతనమైన ఊహలను, కల్పనలను తెలియచేయడం. 10. విద్యార్థుల ఆలోచన -సృజన శక్తుల్ని పెంపొందించడం. 11. ఆధునిక కవిత ఉనికిని, ప్రాధాన్యాన్ని గుర్తింపచేయడం. 12. ఆధునిక కవితలోని వివిధ శాఖల్ని పరిచయం చేయడం.

ఆధునిక కవితను ప్రశ్నోత్తర-ప్రశంస-వివరణ చర్చా విధానాలతో పాటు అవసరమైనపుడు ఇతర సంవిధానాలను కూడా ఉపయోగించి బోధింపవలసి ఉన్నది. అలాగే పద్ధతి విషయంలో పూర్ణ పద్ధతినే ఉపయోగించవలసి ఉన్నది.

**బోధనా విధానం.**

ఆధునిక ఇవిత్వమంతా ప్రస్తుతానికి సంబంధించినది కావటం వలన దీనిని బోధించడంలో

సంప్రదాయిక విధానమంటూ లేదు. అయితే కొంత మంది ఉపాధ్యాయులు మాత్రం సంప్రదాయికంగా పద్యాన్ని బోధించినట్లుగానే దీనిని కూడా బోధిస్తున్నారు. ఇలా బోధించడం వలన దీని లక్ష్యాలు నెరవరక పోవటమే కాక సంప్రదాయిక బోధనలోని లోపాలన్నీ దీనికి కూడా వర్తిస్తాయి. అందుచేత దీనిని కొద్దిపాటి మార్పులతో ఆధునికంగా పద్యాన్ని బోధించినట్లుగానే క్రింది విధంగా బోధింపవలసి ఉంటుంది.

**ఉన్ముఖీకరణ - శీర్షికా ప్రకటనలు**

పద్య -గద్య పాఠ బోధనల్లాగే ఇక్కడ కూడా వీనిని నిర్వహించవలసి ఉంటుంది. అయితే ఈ ఆధునిక కవిత ఆవిర్భావం వెనుక ఎంతో సామాజిక దృక్పథం ఉండడం వలన దానిని విద్యార్థుల ముఖంగా రాబట్ట టానికి ప్రయత్నించటం వలన ఉన్ముఖీకరణకు ఎక్కువ సమయం పట్టటానికి వీలున్నది.

**పఠన - పాఠనాదులు**

పద్య - గద్య పాఠబోధనల వలెనే ఇక్కడ కూడ పఠన పాఠనాదుల్ని చేయవలసి ఉంటుంది. అయితే అక్కడ మాదిరిగా ఇక్కడ భావ కాఠిన్యం, సమాసజటిలత్వం, ఉత్కృష్ట పదబంధాలు, నిగూఢ పదాలు మొ..వి తక్కువగా ఉండడం వలన ఉపాధ్యాయుడు దీనిని ఒక సారి చదివితే సరిపోతుంది. బోధనానంతరం ఇంక విద్యార్థులచేత చదివింపవలసిన అవసరం అసలు లేదు.

**విషయ విశదీకరణ**

పద్య - గద్య పాఠబోధనల్లాగా కేవలం భావసంగ్రహణ కోసం, భాషాజ్ఞానం కోసమే కాక ఆయా భావాల్ని వ్యక్తీకరించడంలో కవిఉద్దేశాన్ని, ఆ ఉద్దేశానికి సమాజంలో ఉన్న స్థానాన్ని, ఆ ఉద్ధేశాన్ని వ్యక్తీకతరించిన తీరును గ్రహింపచేయవలసి ఉన్నది. ఏ సమస్యను పరిష్కరించటానికి కవి ఆ కవితను సృజించాడో ఆ సమస్యను, దాని పరిష్కార మార్గాన్ని విద్యార్థులు గ్రహించేలా బోధింపవలసి ఉన్నది. ఆధునిక సమాజం కోసం ఆవిర్భవించిన కవితను ఆధునిక దృక్పథం తోనే బోధింపవలెననే దృఢ విశ్వాసం ఉపాధ్యాయునికి ఉండవలెను. బోధనను పూర్ణ పద్ధతిలోనే సాగింపవలెను. అవసరమనుకొన్నపుడు కఠిన పదాలు, జాతీయాలు, లోకోక్తులు, మొ..న వానిని పద్య - గద్య పాఠబోధనలోలాగే బోధింపవలెను. బోధనా నంతరం ఆయా విషయాల్ని సంగ్రహింపచేయవలెను.

**మూల్యాంకనం - నియోజనం**

బోధింప బడిన అంశాన్ని మూల్యాంకనం చేయవలెను. అయితే ఈ మూల్యాంకనం పద్య గద్య పాఠ బోధనల్లో లాగా భావ సంగ్రహానికి, భాషా జ్ఞానానికి సంబంధించినదిగానే కాక కవి ఉద్దేశానికి, అతని అనుభూతికి, వ్యక్తీకరణలకు సంబంధించినదిగా కూడ ఉండడం అవసరం. తరువాత ఆయా అంశాలపై నియోజనాల్ని ఇవ్వవలెను. ఈ నియోజనాలు విద్యార్థులు, సమాజ సమస్యల్ని అర్థం చేసికొనే విధంగా, వాని పరిష్కార మార్గాన్ని ఊహించే విధంగా అదే రీతిలో నూతన కవితలను సృజింపజేసే విధంగా ఉండడం మంచిది.

# VII. బోధనా సహాయకారులు

బోధన ఒక కళ అనేది ఈనాడు ప్రచారంలో ఉన్నది. అంటే బోధనాకళ కూడా అనేక ఇతర కళలమాదిరే నిర్మితమౌతూ ప్రయోజనాలను చేకూరుస్తున్నదని భావించవచ్చునన్నమాట. అదే నిజమైతే కళలన్నీ కళాకారుల నైపుణ్యం ఆధారంగా నిర్మింపబడి మాహ్యానందాన్ని ఇస్తున్నట్లుగానే బోధానా కళకూడ ఉపాధ్యాయుని నైపుణ్యం ఆధారంగా నిర్మింపబడి ఆనందాన్ని ఇవ్వగలగాలన్నమాట. దీనిని బట్టి ఉపాధ్యాయుడు జ్ఞానియే కాక కళాకారుడు కూడా కావాలని స్పష్టమౌతున్నది. అంటే ఉపాధ్యాయడు ప్రపంచ జ్ఞానాన్ని సంపాదించుకొని జ్ఞానియై ఆ జ్ఞానాన్ని విద్యార్థులకు అందించే సమయంలో (బోధనాసమయంలో) కళాకారుడు కావాలన్నమాట. అనగా సృజనాత్మకంగా, కళాత్మకంగా ఉపాధ్యాయుడు బోధించాలని తెలుస్తున్నది. ఇలా బోధించటానికి అతనికి బోధనలో అనేకం సహాయపడతాయి. ఉపాధ్యాయునికి బోధనలో సహాయపడే వాటికే "బోధనాసహాయకారుల" ని పేరు. భాషను బోధించే సమయంలో అట్టి బోధనాసహాయకారులుగా వాచకం, ఉపవాచకం, బోధనోపకరణాలు, గ్రంథాలయం, పాఠశాల పత్రిక, నిఘంటువులు, సాహిత్య సాంస్కృతిక కార్య కలాపాలు, భాషా వస్తు ప్రదర్శన శాలలు, నల్లబల్ల, పని అనుభవం వివిధ రకాలైన ప్రణాళికలు మొ..వి దోహదపడతాయి. వీటిల్లో వాచక ఉపవాచకాలు అత్యంత ముఖ్యమైనవి. ఇవిలేకపోతే భాషా బోధన నేటి కాలంలో సాగదు. వీనినే భాషా బోధనలో పాఠ్య గ్రంథాలని పిలుస్తారు.

## పాఠ్య గ్రంథాలు (వాచకాలు)

ఆయా తరగతుల విద్యార్థులు పఠించటానికి వీలైన గ్రంథాల్ని పాఠ్యగ్రంథాలు లేక పాఠ్యపుస్తకాలు అంటారు. భాషా పరంగా వీనినే వాచకాలంటారు. ఇక్కడ వచన మనగా మాట లేద పదం. మాటల గురించి లేదా పదాల గురించి చెప్పేది వాచకం. భాషేతరాంశాల్ని బోధించడంలో 'విషయాని' కి ప్రాధాన్యమిస్తారు. కాని భాషాంశాన్ని బోధించటమంటే 'భాషను బోధించటమనే అర్థం. అయితే భాష విషయాన్ని ఆశ్రయించి ఉండడం వలన విషయజ్ఞానాన్ని కలిగించటమనేది కూడా అనుకోకుండా ధ్యేయమౌతున్నది. అయినా భాషా జ్ఞానాన్ని కలిగించటమే దీని పరమ ధ్యేయం. ఇట్టి భాషా జ్ఞానమంతా మాటలకు లేద వచనాలకు సంబంధించినదిగా ఉండడం వలన వీనిని బోధించే వానికి " వాచకాల" నే పేరు వచ్చినది. వీటిల్లో వివిధ రకాలైన ధ్వనులు, వాని అక్షర నిర్మాణం, వివిధ రకాల పదాలు, వాని పుట్టుక, అర్థ నిర్ణయం, వాక్యాల తీరు భావ నిర్ణయం, భాషణం, పఠనం, లేఖనం మొ..న భాషకు సంబంధించిన సర్వాంశాల్ని సమగ్రంగా బోధించేది వాచకం. భాషాజ్ఞానాన్ని పొందాలనుకొనే ప్రతి వ్యక్తి దీనిని క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. కాబట్టే దీనికి 'క్షుణ్ణాధ్యయన పుస్తకమ' నేది మరొక పేరు. ఇలాగే భాషాంశాల్ని కొంత వరకు బోధిస్తూ విషయ బోధనకు, విస్తారపఠనానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చేది ఉపవాచకం. అలా వచనాన్ని సమగ్రంగా బోధించేది వాచకమైతే వచనాన్ని కొంతమేరకు బోధిస్తూ వాచకానికి దోహదపడేది ఉపవాచకమౌతున్నది.

**ఆవశ్యకత**

పాఠ్యగ్రంథాల (వాచకాల )ఆవశ్యకతను అటు ఉపాధ్యాయుని పరంగా ఇటు విద్యార్థుల పరంగా గుర్తింపవలసి ఉన్నది. ముందుగా ఉపాధ్యాయుని పరంగా వీని ఆవశ్యకతను క్రింది విధంగా చూడవచ్చు.

ఏయే తరగతులు ఏయే లక్ష్యాల్ని లేద ఉద్దేశాల్ని సాధించాలో, వానిని ఎలా సాధించాలో అనే అంశాలు "విద్యా ప్రణాళిక " (Curriculnm) లో నిర్దేశింపబడి ఉంటాయి. ఆయా లక్ష్యాలకు అనుకూలంగా ఆయా తరగతులకు తగిన పాఠ్యాంశాల్ని స్వయంగా తయారుచేసి వానిని తరగతి గదిలో బోధింటమనేది ఎంతటి మేధావియైన ఉపాధ్యాయునికైనా చాలా కష్టం. అట్టి సమయంలో అతనికి బాగా సహాయపడేవి కేవలం ఒక్క పాఠ్య గ్రంథాలే లేద వాచకాలే. ఎందుకంటే విద్యా ప్రణాళికలో నిర్దేశింపబడిన లక్ష్యాల్ని సాధించటానకి వీలైన పాఠ్యాంశాలే వాచకాల్లో రచింపబడి ఉంటాయి. అలాగే ఒక పాఠశాలలో బోధిస్తున్న ఉపాధ్యాయుడు మరొక పాఠశాలకు బదిలీ అయినపుడు ఆ పాఠశాలలో అంతకు ముందటి ఉపాధ్యాయుడు ఎంత వరకు బోధించినదీ, ఇంక తానేమి బోధించవలసిందీ సులభంగా తెలిసికోటానికి నిర్దిష్టమైన వాచకాలే (పాఠ్య గ్రంథాలే) లేకపోతే బోధించిన అంశాల్ని బోధించడం, బోధింపని అంశాల్ని అసలు బోధింపక పోవటం సంభవిస్తుంది.

బోధితాంశాల్ని సులభంగా బోధించటానికి అవసరమయ్యే చిత్రపటాల్ని తయారుచేయాలన్నా, బోధన సంపూర్ణమైన తరువాత చేయించవలసిన అభ్యాసాల్ని చేయించాలన్నా ఉపాధ్యాయునికి అధిక శ్రమ కలుగుతుంది. అట్టి సమయంలో అతనికి బాగా బోహదపడేవి పాఠ్యగ్రంథాలే. ఎందుకంటే వాటిల్లో ఆయా చిత్రపటాలు, అభ్యాసాలు తయారు చేయబడి ఉంటాయి. అలాగే విద్యార్థుల్లో బాహ్య - మౌన పఠనాల్ని పెంపొందించటానికి నిర్దిష్టమైన పఠనాంశం ఉండాలి. దానిని ఉపాధ్యాయుడే తయారుచేయడం కష్టం. వాచకంలో నిర్దిష్ట పఠనాంశాలు ఉంటాయి. కాబట్టి ఉపాధ్యాయుడు వాటిపై ఆధారపడక తప్పదు. ఇంకొక విషయమేమంటే వివిధ లక్ష్యాల్ని నిర్వర్తించటానికి, విద్యార్థుల వివిధ మానసిక శక్తుల్ని అభివృద్ధి చెందించటానికి, వివిధ రకాలైన పాఠ్యాంశాల్ని అనగా పద్య - గద్య - సంభాషణ - వ్యాకరణాదుల్ని బోధింపవలసి ఉన్నది. వీనిని కూడ ఒకదాని తరువాత మరొక దానిని కాకుండా ఇంచు మించు ఒకే సమయంలో అన్నింటిని కొంచెం కొంచెం బోధింప వలసి ఉంటుంది. అనగా పద్య పాఠం తరువాత గద్య పాఠం తరువాత సంభాషణ పాఠం తరువాత వ్యాకరణ పాఠం అలా బోధింపవలసి ఉన్నది. ఇట్టి పరిస్థితుల్లో ఈ పాఠ్యాంశాల్ని ఉపాధ్యాయుడు తయారు చేయాలన్నా, కొంచెం కొంచంగా అన్నింటిని బోధించాలన్నా వీలు కాదు. అట్టి సమయంలో అతనికి బాగా దోహదపడేవి కేవలం పాఠ్య గ్రంథాలే.

విద్యార్థుల పరంగా వీని ఆవశ్యకతను క్రింది విధంగా చూడవచ్చు. తరగతి గదిలో అధ్యయనాంశాల్ని క్రమ పద్ధతిలో అభ్యసించాలన్నా, అభ్యసించిన అంశాల్ని మననం చేసికోవలన్నా వాచకాలు ఉండక తప్పదు. అంతేకాక అననుకూల పరిసితుల వలన పాఠశాలకు వెళ్ళినపుడు ఉపాధ్యాయుడు బోధించిన అంశాన్ని గ్రహించడం కష్టం. పాఠ్యగ్రంథాలుంటే వాని

సహాయంతో ఇంటి దగ్గరనే ఆయా అంశాల్ని గ్రహించటానికి వీలున్నది. అలాగే విద్యార్థుల తల్లిదండ్రులు ఉద్యోగస్తులైనపుడు, వారు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి బదిలీ (Transfer) అయినపుడు విద్యార్థులు కూడా ఒక పాఠశాలనుండి మరొక పాఠశాలకు మారవలసి ఉంటుంది. అటువంటి సమయంలో ముందటి పాఠశాలలో విద్యార్థులు ఎంతవరకు అధ్యయనం చేసినదీ, తరువాతి పాఠశాలలో ఇంకే విషయాల్ని అధ్యయనం చేయవలసినదీ ఉపాధ్యాయుడు తెలిసికోటానికి పాఠ్యగ్రంథాలే శరణ్యం.

## వాచక (క్షుణ్ణాధ్యయన పుస్తక) లక్షణాలు

భాషా బోధనలో వాచకానిదే అగ్రపీఠం. భాషా బోధన ఆరంభం నుంచి అంతం వరకు ఇది కొనసాగుతూనే ఉన్నది. భాషా జ్ఞానాన్నిది సక్రమ రీతిలో, సమగ్ర రూపంలో బోధిస్తున్నది. ఇది వివిధ కరాలైన భాషాంశాలకు, శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాలకు, భాషాబోధనోద్దేశాలకు, విద్యార్థుల్లో అంతర్గతంగా ఉన్న అనేకరకాలైన మానసిక శక్తుల అభివృద్ధికి సంబంధించినదిగా ఉంటుంది. ఈ విధంగా ఇంతటి ప్రాధాన్యమున్న వాచకం సశాస్త్రీయంగా సప్రమాణంగా రచింపబడవలెను. అందుకు అది బాహ్య అంతర రూపాల్లో క్రింది లక్షణాల్ని కలిగి ఉంటుంది.

## బాహ్య లక్షణాలు

భాష తెలియని వారితో పాటు చదువురాని వారు కూడా పుస్తకాన్ని ఆకర్షించే విధంగా ఉండే ఆకర్షణ లక్షణాలివి. వీటిలో ముఖ్యంగా 1. పై అట్ట అత్యంత ఆకర్షణీయంగా రంగులతో, చిత్రాలతో బలిష్ఠంగా, గట్టి కుట్లతో ఆహ్లాదకరమైన ముద్రణతో ఉండవలెను. క్రింది స్థాయి వాచకాలకిది ప్రధానమైన లక్షణం. 2. అక్షరాలు ఆకర్షణీయంగా ముత్యాల్లాగా పెద్ద పరిమాణంలో ఉండవలెను. తరగతి స్థాయి పెరిగే కొద్దీ ఈ అక్షరాల పరిమాణం తగ్గుతూ రావలెను. 3. అట్ట మీదనే కాక పుస్తకం లోపల కూడ ఆహ్లాదకరంగా ఉండే చిత్రాలుండవలెను. క్రింది స్థాయి తరగతుల్లో ఈ చిత్రాలకు అధిక ప్రాధాన్యముంటుంది. ఈ బొమ్మలు కూడా పుట పేజి లో పై భాగంలో ఉండి క్రింది భాగంలో మాటలు ఉండవలెను. పై తరగతులకు పోయే కొద్దీ బొమ్మలన్ని ఆయా పాఠాలలో ఉండే ప్రధానమైన సన్నివేశానికి ప్రతిరూపంగా ఉండవలెను. ఇట్టి బొమ్మలు పుట అంతా ఆక్రమించి ఉండవలెను. అలా కానపుడు పుటకు పై భాగంలో కాని క్రింది భాగంలో కాని ఉండవలెను.4. ప్రతి పాఠానికి చివర్లో దానికి సంబంధించిన అభ్యాసాలుండవలెను. ఒకటి రెండు తరగతుల్లో వీనికి ప్రాధాన్యం లేకున్నా ఆ పై తరగతుల్లో వీనికి ప్రాధాన్యమున్నది. 5. విరామ చిహ్నాలను జాగ్రత్తగా పాటింపవలెను.6. ఉత్సాహంగా పఠించటానికై ఒకటవ తరగతిలో ఒక్కొక్క వాక్యాన్ని ఒక్కొక్క పేరాగాను, క్రమంగా రెండో తరగతి నుంచి చిన్న చిన్న వాక్యాల్ని చిన్న చిన్న పేరాలుగాను ఆ తరువాత పెద్ద పెద్ద పేరాలను కలిగి ఉండవలెను. 7. పుస్తకం వెల వీలైనంత తక్కువగా ఉండవలెను. 8. కాగితం తెల్లగా సముచితమైన మందంతో ఉండవలెను. 9. క్రిందిస్థాయి వాచకాలలోని అక్షరాల్ని రంగులతో ముద్రించడం మేలు.

## అంతర్లక్షణాలు

పుస్తకాన్ని ఆకర్షించటానికి ఉపయోగపడేది బాహ్య లక్షణాలైతే బోధనాలక్ష్యాల్ని నిర్వర్తింపచేసేవి అంతర్ల లక్షణాలు. వీనిని క్రింది విధంగా గమనింపవచ్చు.

### 1. నూతన పదజాలం

నూతన పదజాలాన్ని ప్రవేశపెట్టవలెను. ఒకటి రెండు తరగతుల్లో విద్యార్థులకు తెలిసిన పదజాలమే వాచకాలలో ఉంటే సరిపోతుంది. ఆ పై తరగతులన్నింటిలోనూ విద్యార్థులకు అంతవరకు తెలియని నూతన పదజాలాన్ని వాచకాల్లో ప్రవేశ పెట్టవలెను. అయితే ఈ క్రొత్త పదజాలంలో నిత్య జీవితంలో అవసరమయ్యే వానిని ముందుగా ప్రవేశ పెట్టవలెను. ఈ క్రొత్త పదజాలాన్ని పాఠంలోని పేరాలలో ఇంచు మించు సమానంగా ఇండేట్లు చూడవలెను.

### 2. శైలి వైవిధ్యం

నూతన పదజాలంతో పాటు మాధ్యమిక దశనుంచి శైలి వైవిధ్యాన్ని ప్రవేశపెట్టవలెను. వివిధ రచయితల వచన శైలులను పరిచయం చేయవలెను. 6వ తరగతిలో ఒకే రచయిత రచనలతో పాటు ఇతర రచయితల రచనలను కొద్దిమేర ప్రవేశ పెట్టి క్రమంగా వీటి పరిమాణాన్ని ఎక్కువ చేసి తొమ్మిదో తరగతి నాటికి ఏ ఒక్క రచయితవి రెండు పాఠాలు లేకుండా వివిధ రచయితల పాఠాలే ఉండేటట్లు చూడవలెను. ఆయా పాఠల్లో ప్రవేశ పెట్టిన నూతన పదజాలాన్ని పాఠం ముందుకాని లేక చివరకాని పట్టికగా ఇవ్వవలె లేదా ఆయా పదాల క్రింది గీతలు గీయవలె.

### 3. అభ్యాసాలు

ఆయా పాఠాల వెనుక అభ్యాసాల్ని ప్రవేశ పెట్టవలెను. ఈ అభ్యాసాలు విద్యార్థులతో పాటు ఉపాధ్యాయులకు కూడ సహాయపడవలెను. ఇవి ఆయా పాఠాలలోని విషయానికి అంతటికీ సంబంధించినవిగా ఉండవలెను.

### 4. పాఠాల ఎన్నిక

తరగతి స్థాయినిబట్టి పాఠాల్ని ఎన్నిక చేయవలెను. ఒకటవ తరగతిలో విద్యార్థుల మానసిక స్థితిని బట్టి పాడుకోటానికి వీలైన అభినయ గీతాల్ని, బాల గేయాల్ని ప్రవేశ పెట్టవలె. రెండో తరగతి నుంచి క్రమంగా వీనిని తగ్గిస్తూ పద్య పాఠాల్ని ప్రవేశ పెట్టవలె. అదే విధంగా ఒకే రకమైన పాఠాల్ని కాక స్థాయిని బట్టి గద్య -పద్య - సంభాషణ పాఠాల్ని ప్రవేశ పెట్టవలెను.

### 5. వ్యాకరణాంశాలు

ప్రాథమిక దశలో వ్యాకరణాంశాలు లేకపోయినప్పటికీ మాధ్యమిక దశ నుంచి వీనిని ప్రవేశ పెట్టవలెను. క్రొత్త వ్యాకరణాంశాల్ని బోధించిన తరువాత వాని ఉదాహరణలు తరువాత పాఠాల్లో ఎక్కువగా వచ్చే విధంగా జాగ్రత్త పడవలెను.

## 6. భాషా వైవిధ్యం

భాషా జ్ఞానాన్ని పెంపొందించే పాఠాలే ఎక్కువగా ఉంటాయి. కాబట్టి వాచకం సరళ గ్రాంథిక భాషలోనే ఉండాలి. అలాకాక విషయ ప్రధానాలైన పాఠాలు ఉంటే అవి వ్యావహారిక భాషలో ఉండవచ్చు. రెండు భాషలూ విద్యార్థులకు తెలియటం ముఖ్యం.

## 7. విషయ వైవిధ్యం

భాషాజ్ఞానాన్ని పెంపొందించటమే ధ్యేయమైనప్పటికి, భాష విషయాన్ని ఆశ్రయించి ఉండడం వలన ఆయా పాఠాలలో విషయాంశాలు ఉండక తప్పదు. ఇట్టి ఈ విషయాంశాలన్ని ఒకె రకంగా కాక వైవిధ్యంతో కూడి రక రకాలుగా ఉండవలెను. అంటే కొన్ని పాఠాలు మహాపురుషులకు సంబంధించినవైతే, కొన్ని కథలకు సంబంధించినవి, మరికొన్ని చరిత్రకు సంబంధించినవి, ఇంకొన్ని సంఘానికి సంబంధించినవిగా ఉండవలెను. క్రింది తరగతి పాఠాల్లో ఇంతటి వైవిధ్యాన్ని పాటింపకున్నా పై తరగతుల్లో మాత్రం ఖచ్చితంగా పాటింపవలెను. ఈ పాఠాలు కూడా దీర్ఘమైనవిగా నాలుగైదు ఉండడం కంటే చిన్నవి ఎక్కువ సంఖ్యలో ఉండడం మేలు. దాని వలన విషయవైవిధ్యాన్ని ఎక్కువగా పాటించినట్లౌతుంది.

## 8. రసవైవిధ్యం

పాఠాలలో రసవైవిధ్యాన్ని పాటించవలెను. ఉన్నత దశలో కరుణ - శాంతి రసాలకు అధిక ప్రాధాన్యమీయవవలెను. అద్భుత -హాస్యరసాలకు ప్రాథమిక మాధ్యమిక దశల్లో ప్రాధాన్యమీయవలెను. వీర - రౌద్ర -రసాలు కూడా ఉండవలెను. భయానక - బీభత్స రసాలు ఉండకపోవడం మేలు. శృంగార రసం మాత్రం ఉన్నత దశలో హద్దు మీరని రీతిలో ఉండడం మంచిది. పాఠం దీర్ఘంగా ఉన్నపుడు దీనిలో రెండు మూడు రసాలు కూడ ఉండవచ్చు.

## 9. సాహిత్యాభిరుచి

పాఠాలు ఆనందానుభూతిని కలిగిస్తూ, సాహిత్యాభిరుచిని పెంపొందించే విధంగా ఉండవలెను. క్రింది స్థాయినుంచి పై స్థాయికి పోయే కొద్ది వీరికి అధిక ప్రాధాన్యమీయవలసి ఉన్నది.

## 10. జాతీయాంశాలు

భాషా జ్ఞానాన్ని పెంపొందించేవిగానే కాక భారత జాతీయతను పెంపొందించే పాఠాలు కూడా ఉండవలెను. ముఖ్యంగా మత సామరస్యం, ప్రాంతీయ సమానత్వం, సంస్కృతి - సంప్రదాయాలు, మహా నాయకులు మొ..న వానికి సంబంధించిన పాఠాలు ఉండవలెను. వీనిని ముఖ్యంగా మాధ్యమికోన్నత దశల్లో ప్రవేశ పెట్టడం మంచిది.

## 11. సాహిత్యేతరాంశాలు

భాషా సాహిత్యాంశాలే కాకుండా ఇతరాంశాలు ముఖ్యంగా నదులు, అడవులు మొ. న విజ్ఞానాంశాలు ఉన్నట్టి పాఠాలు కూడా ఉండడం మంచిది. అయితే ఈ పాఠాలశైలి కథనాత్మకంగా

గాని, సంభాషణాత్మకంగా గాని, వర్ణనాత్మకంగా గాని ఉండవలెను.

**12. పాఠాలపూర్వరంగం**

ఆయా పాఠాలకు ముందు భాగంలో ఆయా పాఠాలకవుల రచయితల పరిచయాలు, ఆయా పాఠాల సందర్భాలు, విశేషాలు ఉండడం మేలు. అలాగే క్రొత్త రకం పాఠాలేవైనా ఉంటే వానిని బోధించే విధానం కూడా ఉంచడం మంచిది. అవసరమనుకొన్నపుడు పరిశీలనా గ్రంథాల్ని సూచించడం కూడా మంచిదే.

**13. భాషానైపుణ్యాలు**

శ్రవణ భాషణ పఠన లేఖనాలనే భాషా నైపుణ్యాలను పెంపొందించేవిగా పాఠాలు ఉండవలెను.

**14. ముద్రణ**

అక్షరాల్ని ఆకర్షణీయంగా, దోషరహితంగా, తగు మాత్రపు పరిమాణంతో నిర్దిష్టంగా ముద్రింపవలెను. కాగితం కూడా తగు మాత్రంగా ఉండవలెను.

**వాచక ప్రయోజనాలు**

1. బోధనా లక్ష్యాల్ని నెరవేరుస్తుంది.2. భాషానైపుణ్యాల్ని పెంపొందిస్తుంది.3. భాషాజ్ఞానంతో పాటు విషయ జ్ఞానాన్ని కూడ కలిగిస్తుంది. 4. సాహిత్యేతరాంశాలకు కూడా సహకరిస్తుంది.5. బోధనాంశాల్ని బోధించటానికి ఉపాధ్యాయునికి సులభంగా ఉంటుంది. 6. ఆయా అంశాల్ని నిర్దిష్టంగా గ్రహించటానికి విద్యార్థులకు సహాయపడుతుంది.7. నూతన పదజాలంతో పాటు, వ్యాకరణాంశాలు జాతీయాదులు మొదలగు వానిని అందిస్తుంది. 8. ఆయా అంశాల్ని అభ్యసింపచేయటానికి దోహదపడుతుంది. 9. బోధనాంశాన్ని వివిధ రకాలైన చిత్రపటాలతో సులభంగా గ్రహింపచేస్తుంది.10.భాషా - శైలి - వైవిధ్యాల్ని తెలియచేస్తుంది. 11. ఉపాధ్యాయులు కాని, విద్యార్థులు కాని ఒక చోట నుండి మరొక చోటుకు బదిలీ అయినపుడు బోధన - అభ్యసనల సమస్యల్ని తొలగిస్తుంది. 12. అనివార్య కారణాలవల్ల పాఠశాలకు వెళ్ళని సమయంలో బోధింపబడిన అంశాల్ని గ్రహించటానికి దోహదపడుతుంది. 13. అభ్యసించిన విషయాల్ని మననం చేసికోటానికి సహాయపడుతుంది. 14. ఆయా అంశాల్ని కంఠస్థం చేయటానికి చక్కగా ఉపయోగపడుతుంది. 15. బోధనలో క్రమాన్ని, నిర్దిష్టతను సాధింపవచ్చు. 16. బోధన శాస్త్రీయంగా సప్రమాణంగా సాగుతుంది.17. పద్య - గద్య -సంభాషణాది వివిధ రకాలైన పాఠాల్ని తగు మాత్రపు నిష్పత్తిలో బోధించటానికి వీలౌతుంది. 18. ఎక్కడెక్కడో ఉన్నట్టి బోధనాంశాల్ని వెతుక్కోకుండా ఒకేచోట సౌలభ్యంగా సమకూర్చిపెడుతుంది.19. ఆయా అంశాలకు సంబంధించిన విశేషాల్ని, నూతన బోధనా విధానాల్ని తెలియచేస్తుంది.

గాని, సంభాషణాత్మకంగా గాని, వర్ణనాత్మకంగా గాని ఉండవలెను.

**12. పాఠాల పూర్వరంగం**

ఆయా పాఠాలకు ముందు భాగంలో ఆయా పాఠాలకవుల రచయితల పరిచయాలు, ఆయా పాఠాల సందర్భాలు, విశేషాలు ఉండడం మేలు. అలాగే క్రొత్త రకం పాఠలేవైనా ఉంటే వానిని బోధించే విధానం కూడా ఉండడం మంచిది. అవసరమనుకొన్నపుడు పరిశీలనా గ్రంథాల్ని సూచించడం కూడా మంచిదే.

**13. భాషా నైపుణ్యాలు**

శ్రవణ భాషణ పఠన లేఖనాలనే భాషా నైపుణ్యాలను పెంపొందించేవిగా పాఠాలు ఉండవలెను.

**14. ముద్రణ**

అక్షరాల్ని ఆకర్షణీయంగా, దోషరహితంగా, తగు మాత్రపు పరిమాణంతో నిర్దిష్టంగా ముద్రింపవలెను. కాగితం కూడా తగు మాత్రంగా ఉండవలెను.

**వాచక ప్రయోజనాలు**

1. బోధనా లక్ష్యాల్ని నెరవేరుస్తుంది.2. భాషానైపుణ్యాల్ని పెంపొందిస్తుంది.3. భాషాజ్ఞానంతో పాటు విషయ జ్ఞానాన్ని కూడ కలిగిస్తుంది. 4. సాహిత్యేతరాంశాలకు కూడా సహకరిస్తుంది.5. బోధనాంశాల్ని బోధించటానికి ఉపాధ్యాయునికి సులభంగా ఉంటుంది. 6. ఆయా అంశాల్ని నిర్దిష్టంగా గ్రహించటానికి విద్యార్థులకు సహాయపడుతుంది.7. నూతన పదజాలంతో పాటు, వ్యాకరణాంశాలు జాతీయాదులు మొదలగు వానిని అందిస్తుంది. 8. ఆయా అంశాల్ని అభ్యసింపచేయటానికి దోహదపడుతుంది. 9. బోధనాంశాన్ని వివిధ రకాలైన చిత్రపటాలతో సులభంగా గ్రహింపచేస్తుంది.10.భాషా - శైలి - వైవిధ్యాల్ని తెలియచేస్తుంది. 11. ఉపాధ్యాయులు కాని, విద్యార్థులు కాని ఒక చోట నుండి మరొక చోటుకు బదిలీ అయినపుడు బోధన - అభ్యసనల సమస్యల్ని తొలగిస్తుంది. 12. అనివార్య కారణాలవల్ల పాఠశాలకు వెళ్ళని సమయంలో బోధింపబడిన అంశాల్ని గ్రహించటానికి దోహదపడుతుంది. 13. అభ్యసించిన విషయాల్ని మననం చేసికోటానికి సహాయపడుతుంది. 14. ఆయా అంశాల్ని కంఠస్థం చేయటానికి చక్కగా ఉపయోగపడుతుంది. 15. బోధనలో క్రమాన్ని, నిర్దిష్టతను సాధింపవచ్చు. 16. బోధన శాస్త్రీయంగా సప్రమాణంగా సాగుతుంది.17. పద్య - గద్య -సంభాషణాది వివిధ రకాలైన పాఠాల్ని తగు మాత్రపు నిష్పత్తిలో బోధించటానికి వీలౌతుంది. 18. ఎక్కడెక్కడో ఉన్నట్టి బోధనాంశాల్ని వెతుక్కోకుండా ఒకే చోట సౌలభ్యంగా సమకూర్చిపెడుతుంది.19. ఆయా అంశాలకు సంబంధించిన విశేషాల్ని, నూతన బోధనా విధానాల్ని తెలియచేస్తుంది.

# ఉపవాచక లక్షణాలు

భాషను బోధించడమంటే భాషాంశాల్ని బోధించటమని అర్థం. ఈ భాషాంశాల్ని విపులంగా విస్తృత పరిధిలో సమగ్రంగా వాచకం బోధించడం వలన దానిలో విస్తార పఠనానికి, వేగ పఠనానికి, మౌన పఠనానికి, విస్తృత విషయ పరిజ్ఞానానికి, శీఘ్రవిషయ గ్రహణకు అవకాశం తక్కువ. ఇలా వాచకంలో అవకాశం తక్కువగా ఉన్నట్టి ఈ అంశాల్నే ప్రధానంగా బోధించే దానిని ఉపవాచకమంటారు. ఈ అంశాలన్నీ కూడ భాషను ఆశ్రయించే ఉంటున్న కారణాన భాషాంశాల్ని కూడా ఇది కొంత మేరకు బోధిస్తూ వాచకానికి సహాయపడుతుండడం వలన దీనికి ఉపవాచకమనే పేరు సార్థకమౌతున్నది. అలా లక్ష్యాల్లో, వాని సాధన మార్గాల్లో తేడాలుండటం వలనరెండింటి మధ్య లక్షణాల్లో కూడా తేడాలున్నాయి. వానిని క్రింది విధంగా చూడవచ్చు.

ఉపవాచక లక్షణాల్ని కూడా వాచకంలాగే బాహ్య అంతర్లక్షణాలుగా వర్గీకరింపవచ్చు.

## బాహ్య లక్షణాలు

ఇవి వాచక బాహ్య లక్షణాలుగానే ఉంటాయి. అంటే 'అట్ట' ఆకర్షణీయంగా, బలిష్ఠంగా, దళసరిగా, గట్టి కుట్టుతో బొమ్మల్ని కలిగి ఉండడం. 2. అక్షరాలు ఆకర్షణీయంగా పెద్ద పరిమాణంలో ఉండడం.3. పుస్తకంలోపల ఆకర్షణీయమైన చిత్రాలుండడం. 4. చివర్లో అభ్యాసముండడం. 5. విరామ చిహ్నాలు ఉండడం 6. స్థాయినిబట్టి వాక్యాల, పేరాగ్రాఫ్‌ల నిడివి పెరగడం. 7. ధర తక్కువగా ఉండడం. 8. కాగితం తెల్లగా సముచితమైన మందంతో ఉండడం. 9. వాచకం కన్నా తక్కువ పరిమాణం.

## అంతర్లక్షణాలు

1. విస్తారపఠనాభిలాషను కలిగించేదిగా ఉండడం. 2. మౌన పఠన శక్తిని పెంపొందించేదిగీ ఉండడం. 3. విస్తృతమైన విషయాన్ని అందించేదిగా ఉండడం. 4. వేగ పఠనను అభివృద్ధి చేసేదిగా ఉండడం. 5. శీఘ్రంగా విషయాన్ని గ్రహింపచేసేదిగా ఉండడం. 6. సరళమైన శైలిలో నడవడం. 7. సద్గుణాల్ని పెంపొందించే ఇతివృత్తాల్ని కలిగి ఉండడం. 8. కథన, వర్ణన, సృజనాత్మకాది రచనా శక్తుల్ని పెంపొందించెదిగా ఉండడం. 9. సమైక్యతను, జాతి - మత - సామరస్యాల్ని పెంపొందించేదిగా ఉండడం. 10. శీలాన్ని అభివృద్ధి పరిచేదిగా ఉండడం. 11. మూర్తిమత్వాన్ని పెంపొందించేదిగా ఉండడం. 12. ముద్రణ ఆకర్షణీయంగా, దోష రహితంగా ఉండడం.13. సంక్షిప్తీకరణకు అనికూలంగా ఉండడం.

## ఉపవాచక ప్రయోజనాలు

1. విస్తార పఠనాన్ని పెంపొందించడం. 2. విషయ పరిజ్ఞానాన్ని కలిగించడం. 3.మౌన పఠనాన్ని అభివృద్ధి పరచడం. 4. శీఘ్ర విషయగ్రహణను పెంపొందించడం. 5. వేగ పఠనాన్ని వృద్ధి చేయడం. 6. సంక్షిప్తీకరణను అలవాటు చేయడం. 7. విమర్శనా శక్తిని పెంపొందించడం. 8. స్వయం కృషిని అభివృద్ధి పరచడం. 9. ఆత్మ విశ్వాసాన్ని వృద్ధి పరచడం. 10. శీలాన్ని పెంపు చేయడం. 13. రచనా శక్తిని అభివృద్ధి చేయడం. 14. పరిశీలనా శక్తిని, ఆలోచనా శక్తిని వృద్ధి పరచడం. 15. మూర్తిమత్వాన్ని కలిగించడం.

## వాచక ఉపవాచకాల మధ్య తేడాలు

| వాచకం | ఉపవాచకం |
|---|---|
| 1. భాషాంశాల్ని సమగ్రంగా బోధిస్తుంది. | 1. భాషాంశాల్ని బోధించడంలో వాచకానికి సహాయపడుతుంది. |
| 2. క్షుణ్ణ పఠనానికి ప్రాధాన్యమెక్కువ. | 2. విస్తార పఠనానికి ప్రాధాన్యమెక్కువ. |
| 3. విషయ జ్ఞానానికి సాధారణ ప్రాతినిధ్యం ఉంటుంది. | 3. విషయ జ్ఞానానికి ప్రాతినిధ్యం ఎక్కువ. |
| 4. ఉపాధ్యాయ పఠనానికి ప్రాధాన్యమెక్కువ. | 4. ఉపాధ్యాయ పఠనం ఉండక పోవచ్చు. |
| 5. మౌన పఠనం సాధారణంగా వృద్ధి చెందుతుంది. | 5. మౌన పఠనం వేగంగా వృద్ధి చెందుతుంది. |
| 6. విద్యార్థి స్వయం కృషికి ప్రాధాన్యం తక్కువ. | 6. విద్యార్థి స్వయం కృషికి ప్రాధాన్యమెక్కువ. |
| 7. విద్యార్థి ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించలేదు. | 7. విద్యార్థి ఆత్మ విశ్వాసాన్ని పెంపొందిస్తుంది. |
| 8. సంక్షిప్తీకరణ పెద్దగా అభివృద్ధి కాదు. | 8. సంక్షిప్తీకరణ బాగా అభివృద్ధి చెందుతుంది. |
| 9. వ్యాకరణాంశాలకు ప్రాధాన్యం. | 9. వ్యాకరణాంశాలకు అంతటి ప్రాధాన్యం ఉండదు. |
| 10. భాషా వైవిధ్యం ఉంటుంది. | 10. భాషా వైవిధ్యం దాదాపు ఉండదు. |
| 11. విషయవైవిధ్యం ఉంటుంది. | 11. దాదాపు ఒకే విషయం ఉంటుంది. |
| 12. అన్ని తరగతుల్లో వాచకం ఉంటుంది. | 12. కొన్ని తరగతుల్లో మాత్రమే ఇది ఉంటుంది. |
| 13. పద్య - గద్య సంభాషణాదులతో ఉంటుంది. | 13. సహహజంగా గద్య రూపంలో ఉంటుంది. |
| 14. విద్యార్థుల రచనా శక్తికి ప్రాధాన్యం తక్కువ. | 14. విద్యార్థుల రచనా శక్తికి ప్రాధాన్యం ఎక్కువ. |
| 15. విద్యార్థుల అంతర్గత శక్తులకు ప్రాధాన్యం తక్కువ. | 15. విద్యార్థుల అంతర్గత శక్తులకు ప్రాధాన్యం ఎక్కువ. |
| 16. బోధనలో ఉపాధ్యాయునికి శ్రమ ఎక్కువ. | 16. బోధనలో ఉపాధ్యాయునికి శ్రమ తక్కువ. |
| 17. బోధనకు ఎక్కువ కాలవ్యవధులు అవసరమౌతాయి. | 17. బోధనకు తక్కువ కాల వ్యవధులు సరిపోతాయి. |

# బహు పాఠ్యపుస్తక విధానం

తరగతిలో ఏదో ఒక పాఠ్య పుస్తాకాన్ని కాక అనేక పాఠ్య పుస్తకాల్ని అధ్యయనం చేసే విధానానికి 'బహుపాఠ్య పుస్తక విధానమని' పేరు. ఒకప్పుడు పాఠశాల విద్యా బోధన ఈ బహుపాఠ్య పుస్తక విధానమాధారంగానే సాగేది. అది క్రింది రీతిలో ఉండేది.

ప్రభుత్వం వారు తరగతికి సంబంధించిన పాఠ్య ప్రణాళికను (Syllabus) తయారు చేసిదాని కనుకూలంగా పుస్తకాన్ని తయారు చేయించే బాధ్యతను ప్రచురణ కర్తలకు అప్పచెప్పేవారు. ఈ ప్రణాళికననుసరించి వీరు సమర్థులైన రచయితల చేత పుస్తకాలను రాయించి ప్రభుత్వం వారు నియమించిన "పాఠ్య పుస్తక సంఘం" వారి ఆమోదానికి పంపేవారు. వాటిని వారు పరిశీలించి అన్ని విధాలుగా సరిపోయిన వాటిని పాఠశాలల్లో ఉపయోగించటానికి అమోదిస్తారు. ఇలా అమోదించడంలో ఒక్కొక్క తరగతికి ఒక్కొక్క పాఠ్యపుస్తకాన్నే ఆమోదించాలనే నియమేమీ లేక పోవడంతో బాగున్నాయనిపించిన అనేక పుస్తకాల్ని పాఠ్య పుస్తకాలుగా ఆమోదించేవారు. అలా ఆమోద ముద్రను పొందిన పాఠ్య పుస్తకాలలో దేనినైనా విద్యార్థులు అధ్యయనం చేయవచ్చు.

**ప్రయోజనాలు**

1.ప్రచురణ కర్తల మధ్య పోటీ ఉండడం వలన ఉత్తమ విలువలున్న పాఠ్యపుస్తకాలు తయారు కావడానికి వీలున్నది. 2.సమర్థులైన రచయితలే పుస్తకాల్ని రచించేవారు. 3.పుస్తక ముద్రణలో జాప్యం లేకుండా విద్యాసంవత్సరం ప్రారంభం నాటికి పుస్తకాలు సిద్ధమయ్యేవి. 4.పోటీ ఉండడం వలన పుస్తకాలు చక్కటి ముద్రణతో ఆకర్షణీయంగా, అందంగా ఉండేవి. 5.ధర కూడ వీలైనంత తక్కువ ఉండేది. 6.అనేక పాఠ్యపుస్తకాలుండడం వలన అన్ని విధాలుగా నచ్చిన దానినే ఎంపిక చేసికొని అధ్యయనం చేసే స్వేచ్ఛ ఉన్నది.7. అనేక పుస్తకాలుండడం వలన గైడ్స్ ఎక్కువ సంఖ్యలో రావడానికి వీలు లేదు. 8.ప్రభుత్వానికి నిర్వహణ వ్యయం తగ్గిపోతుంది.

**నష్టాలు**

1. విద్యార్థులు విద్యా సంవత్సరం మధ్యలో ఒక పాఠశాలనుండి మరొక పాఠశాలకు వెళ్ళటానికి వీలులేదు. దానికి కారణం అంతటా ఒకే పాఠ్య పుస్తకం లేకపోవడం. 2. ఉపాధ్యాయులు కూడా విద్యాసంవత్సరం మధ్యలో ఒక పాఠశాల నుండి మరొక పాఠశాలకు మారటానికి అవకాశం లేదు. 3. ప్రచురణ కర్తలు ధనార్జనతో అసమర్థుల చేత పుస్తకాల్ని రాయించి సమర్థులైన రచయితల పేరు మీదుగా ప్రచురించటానికి వీలుంది.4. పాఠ్యపుస్తక నిర్ణయ సంఘంలో అసమర్థులు, అవినీతి పరులున్నపడు విలువల్లేని పుస్తకాలు కూడ ఆమోదముద్రను పొందవచ్చు.5. కొందరు ప్రకాశకులు ఆయా పాఠశాలల యాజమాన్యాలతో లాలూచి పడి అయోగ్యులైన పుస్తకాల్ని పాఠ్యపుస్తకాలుగా నిర్ణయింపచేసికొనుటకు వీలున్నది. 6. పాఠ్య పుస్తకం ఒక్కటే కాకపోవడం వలన మూల్యాంకనంలో తేడా రావటానికి వీలున్నది. 7. ఒకే పాఠ్యపుస్తకం లేక పోవడం వలన విద్యార్థుల గ్రహించే విషయంలో కూడ తేడా ఉంటుంది. 8. ప్రచురణ కర్తలంతా ఏకమైనపుడు పాఠ్య పుస్తక ధరకూడ పెరగటానికి వీలున్నది. 9. పేద విద్యార్థులకు పుస్తకాలు లభించడం కష్టం.

## పాఠ్యపుస్తకాల జాతీయకరణ

బహుపాఠ్య పుస్తక విధానం గో ప్రయోజనాలు, నష్టాలు రెండూ ఉండడం వలన ప్రభుత్వం దానికి స్వస్తి చెప్పినది. తరువాత 1. సమర్థవంతమైన రచయితను నిష్పక్షపాతంగా ఎన్నిక చేసి మంచి ప్రతిఫలాన్ని, తగిన సమయాన్ని ఇచ్చి ఉత్తమ విలువలున్న పుస్తకాన్ని రయింపవచ్చుననీ. 2. అవసరానికి తగినట్లుగా ఎక్కువ సంఖ్యలో పుస్తకాల్ని ముద్రించినపుడు ధరతగ్గటానికి వీలుందని. 3. ఒకే పాఠ్య పుస్తకం ఉన్నపుడు విద్యా సంవత్సరం మధ్యలో పాఠశాలను మారిన ఉపాధ్యాయులకుగాని, విద్యార్థులకు గాని సులభంగా ఉంటుందనీ భావించి అంతటా ఒకే రకమైన పాఠ్యపుస్తకం ఉండే విధంగా ప్రభుత్వం స్వయంగా పాఠ్య ప్రణాళికను అనుసరించి తనకు తానే పాఠ్యపుస్తకాల్ని రాయించి ముద్రించినది. దీనినే "పాఠ్యపుస్తకాల జాతీయకరణ" మంటారు. ఇది తొలిరోజుల్లో కొంత వరకు విజయవంతమైన దేమోకాని ప్రస్తుతం మాత్రం విజయవంతం కాలేక పోతున్నది. దానికి క్రిందివి కారణాలుగా కనిపిస్తున్నాయి.

**కారణాలు**

1. పాఠ్యపుస్తకం ఒక్కటే కావటం వలన గైళ్ళు అధికంగా రావడం. 2. దుబార వలన నిర్వహణ వ్యయం ఎక్కువై పుస్తకం ధర పెరగటం. 3. విద్యాసంవత్సరం ఆరంభంనాటికి ఇవి లభ్యం కాకపోవడం. 4. ప్రభుత్వం చిత్తశుద్ధితో సమర్థవంతమైన రచయితను ఎన్నిక చేయలేక పోవటం. 5. ఎన్నిక చేయబడిన వ్యక్తిలో కూడా చిత్తశుద్ధిలోపించి సరిగా రచన చేయక పోవటం. 6. ఒకే రచయిత రాసిన పుస్తకంలో లోపాల్ని ఎత్తిచూపే వారు ఎక్కువ కావటం మొ..వి ఉన్నాయి.

## బోధనోపకరణాలు

**ఆవశ్యకత**

బోధనాంశాలను అత్యంత సరళంగా, సులభంగా, స్పష్టంగా, సమగ్రంగా, విద్యార్థుల హృదయాల్ని హత్తుకొనే విధంగా వారి మనస్సులో స్థిరంగా నిలిచి పోయే విధంగా బోధించటంలో ఉపయోగపడే ఉపకరణాలకే (సాధనాలకే) బోధనోపరణాలని పేరు. బోధించటానికి వీలుకాని అంశాల్ని, ఎంతబోధించినా అర్థంకాని విషయాల్ని ముఖ్యంగా అమూర్త (Abstract) విషయాల్ని బోధించడంలో వీని ప్రాముఖ్యత అత్యధికం సంప్రదాయిక బోధనా విధానాల్లో వీనికి స్థానం లేకపోయినాఆధునిక బోధనా విధానాల్లో ఇవి అగ్రపీఠాన్ని అధిరోహిస్తున్నాయి.ఆధునిక విద్యా విధానంలో ఉపాధ్యాయుడెంతటి మేధావి అన్నదానికంటే విద్యార్థి ఎంత గ్రహించాడన్నది ముఖ్యం. అనగా ఉపాధ్యాయుడెంతటి జ్ఞానసంపన్నుడైనా అతడు దానిని విద్యార్థులకు అందించలేకపోతే ఆ జ్ఞానమంతా బూడిదలో పోసిన పన్నీరౌతుంది. అందుచేత ఉపాధ్యాయుడు తనకు తెలిసి దానిని విద్యార్థులకు అందించడంలో అమిత జాగరూకుడు కావలెను. ఎన్నో ఉపకరణాల్ని అత్యంత నైపుణ్యంగా ఉపయోగించుకోవాలి. ఇలా బోధనను కళగా మార్చే ప్రక్రియలో బోధనోపకరణాలకు ఎనలేని ప్రాధాన్యమున్నది. ఇట్టి బోధనోపకరణాలను వాని

స్వరూప స్వభావాలను బట్టి 1. శ్రవణ ఉపకరణాలు (Audio Aids) ఉదా. రేడియో, టేపురికార్డర్, మొ..వి. 2. దృశ్య ఉపకరణాలు (Vedio Aids) ఉదా.. బొమ్మలు, చార్టులు, పట్టికలు, స్లైడ్స్(Slides), చిత్రాలు మొ..వి. 3. శ్రవణ దృశ్య ఉపకరణాలు (Audio - Visual Aids) ఉదా.. టెలివిజన్, సినిమా, వీడియో మొ..వి.

**ప్రయోజనాలు**

1. సులభంగా బోధింపవచ్చు. 2. స్పష్టంగా బోధింపవచ్చు. 3. తక్కువ సమయంలో బోధింపవచ్చు. 4. అమూర్త విషయాలను బోధింపవచ్చు.5. బోధింపరాని వానిని కూడ బోధింపవచ్చు. 6. బోధనను సంతృప్తిగా, సమగ్రంగా బోధింపవచ్చు. 7. ఆసక్తికరంగా, ఆహ్లాదకరంగా బోధింపవచ్చు. 8. బోధింపబడిన అంశాల్ని విద్యార్థుల మనస్సులలో స్థిరంగా నిలువవచ్చు. 9. బోధిస్తున్నామనే స్ఫురణ లేకుండా అత్యంత సహజంగా బోధింపవచ్చు. 10. విద్యార్థుల్లో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందింపవచ్చు. 11. విద్యార్థులకు శ్రమ తగ్గుతుంది. 12. ఉపాధ్యాయుని మీద గౌరవం పెరుగుతుంది. 13. అవధానంతో విద్యార్థులు వినగలుగుతారు.

**భాషాబోధనలో ఉపకరణాలు**

భాషేతరాంశాల్ని బోధించటంలో కంటే భాషాంశాల్ని బోధించడంలో ఉపకరణాలు తక్కువగా వినియోగింపబడతాయి. సాధారణంగా మాధ్యమికోన్నత దశల్లో కంటే ప్రాథమిక దశలోనే ఇవి ఎక్కువగా వినియోగపడతాయి. వివిధ దశల్లో అవసరమయ్యే బోధనోపకరణాలు క్రింది విధంగా ఉన్నాయి.

**ప్రాథమిక దశ**

1. భాషణాన్ని నేర్పటంలో చిత్రపటాలు (Drawings), బొమ్మలు (Figures), పఠనాన్ని నేర్పటంలో గుర్తింపు -స్వయం - నవరణపు - జతకూర్పు అట్టలనే మెఱపు అట్టలు(Flash Cards) .3. లేఖనాన్ని పెంపొందించటంలో కొన్ని బొమ్మలతో పాటు అక్షరాల ఆకారాల్ని కూర్చే పూసలు చింత గింజలు మొ..వి . 4. ఉపన్యాసాలు, వార్తలు మొ..న వానిని వినిపించటానికి రేడియో. 5. బాలగేయాలు, పద్యాలు మొ..న వానిని వినిపించటానికి టేపు రికార్డర్, వీడియోలు. 6. పదాలను బోధించటానికి రకరకాలైన అట్ట ముక్కలు చట్రాలు . 7. వివిధ వాక్యాల్ని బోధించటానికి గుర్తింపు - స్వయం - నవరణపు - జతకూర్పు పత్రాలనే వాక్య పత్రాలు, 8. కథల్ని బోధించటానికి కథా చిత్రాలు మొ..వి ఉపయోగపడతాయి.

**మాధ్యమికోన్నత దశలు**

1. శైలీ వైవిధ్యమున్న నాటకాల్ని, కథల్ని, భాషా సాహిత్యవిషయాల్ని వినిపించటానికి రేడియో, టెలివిజన్లు. 2. ప్రత్యేక ప్రయోజనం కోసం పుస్తకంలో ముద్రించిన బొమ్మల్ని స్లైడ్సుగా మార్చి ప్రదర్శించటానికి ప్రొజెక్టర్లు . 3. సాహిత్యాంశాలకు సంబంధించిన వీడియోలు, సినిమాలు. 4. పాఠ్యాంశాలకు సంబంధించిన వివిధ రకాలైన చిత్రపటాలు, పట్టికలు, నమూనాలు. 5. కవులకు

సంబంధించిన బొమ్మలు, పట్టికలు. 6. వ్యాకరణాంశాలకు సంబంధించిన పట్టికలు. 7. వివిధ పాఠ్యాశాలకు చెందిన బొమ్మలన్నింటిని తోడి ఆల్బమ్స్. 8. ఆయా పత్రికా కత్తిరింపులను ప్రదర్శించటానికి అవసరమయ్యే ఫ్లానల్ బోర్డ్స్.9. గోడలపై వివిధరకాలైన సూక్తులు మొ..వి ఉపయోగపడతాయి.

### బోధనోపరణాల తయారి - వినియోగం

స్వయంగా తయారు చేసికోటం, తయారు చేయబడిన వానిని సేకరించడం, విద్యార్థుల చేత చేయించడం, పాఠశాలలో ఉన్నవానిని గ్రహించడం అనే పద్ధతుల ద్వారా సాధారణంగా ఉపాధ్యాయుడు బోధన కవసరమైన బోధనోపకరణాల్ని సిద్ధంచేసి కొంటాడు.

ప్రాథమిక దశలో అవసరమయ్యే బోధనోపకరణాలైన మెఱపు అట్టలు, వాక్య పత్రాలు, కథా చిత్రాలు, చట్రాలు, బొమ్మలు మొ..న వానిని తయారు చేసే విధానం, ఉపయోగించే తీరు వాచిక చర్య, పఠనం, లేఖనం అనే అధ్యాయాలలో చర్చింపబడ్డాయి.

మధ్యమికోన్నత దశల్లో అవసరయ్యే వివిధ రకాలైన పట్టికల్ని ఉపాధ్యాయుడే తయారు చేసికోవలెను. ఆయా అంశాల్ని బోధించి తరువాత వానిని విద్యార్థుల మనస్సులో స్థిరం చేయడం కోసం ఉపయోగింప వలసి ఉన్నది. ఆయా పాఠ్యాంశాల్ని బోధిస్తున్నపుడు వాని ముఖ్యాంశాల్ని సూచించే బొమ్మల్ని ఉపాధ్యాయుడే తయాడు చేసికొని ఉపయోగింపవలెను. పుస్తకాలలోని బొమ్మల్ని స్లైడ్స్ చేయించి ప్రొజెక్టర్ల సహాయంతో చూపింపవలెను. కవులకు సంబంధించిన బొమ్మల్ని గీసికాని, కత్తిరింపులైతే ఫ్లానల్ బోర్డుమీద అతికించి కాని కవి పరిచయ సమయంలో చూపించవలెను. ప్రసిద్ధ సాహితీకారుల ఉపన్యాసాల్ని టేపు చేయించి విద్యార్థులకు వినిపింపవలెను. క్యాసెట్ల సహాయంతో కాని, టేపు రికార్డర్ సహాయంతో కాని వివిధ రకాలైన గేయాల్ని, పద్యాల్ని పఠించే తీరును వినిపింపవలెను. నాటికల్ని కాని, చిన్న భిన్న నాటకాల్ని కాని టెలివిజన్ సహాయంతో చూపింపవలెను. ప్రసిద్ధ వ్యక్తుల సాహిత్యోపన్యాసాల్ని, చర్చల్ని కూడ టెలివిజన్ సహాయంతో చూపింపవలెను. విద్యార్థులచే చిన్న చిన్న నాటికల్ని వేయించి వానిని వీడియోతీయించి వారికే చూపింపవలెను. పాఠ్యాంశాల్లో అక్కడక్కడా వచ్చే 'మహా సౌధాల్ని' నమూనా (Models) ల సహాయంతో ఆయా అంశాల్ని బోధిస్తున్న సమయంలో చూపింపవలెను. ఆయా పాఠ్యాంశాల్లో అతి సాధారణంగా కనిపించే ఆయా పాత్రల రూపాల్ని గీయించి కాని లేక ముద్రింపబడిన వానిని సేకరించికాని ఆయా పాత్రలను బోధిస్తున్న సమయంలో చూపింపవలెను. అలాగే ఆయా వర్ణనాంశాల్ని బోధిస్తున్న సమయంలో వానిని గీసి లేదా గీయించి లేదా సిద్ధంగా ఉన్నవానిని సేకరించి చూపించడం మంచిది. గోడలపై సూక్తుల్ని వివరింపవలెను.

పైన పేర్కొన్న వివిధ రకాలైన బోధనోపకరణాల్ని సిద్ధం చేసికోటం, వానిని సక్రమరీతిలో ప్రయోగించడం అనేవి ఎక్కువ వ్యయంతో, శ్రమతో కూడుకొన్నట్టివైనప్పటికీ బోధనలో సత్ఫలితాల్ని సాధించటానికి వీనిని తప్పక ఉపయోగించవలసిన బాధ్యత ఎంతైనా ఉన్నది.

# గ్రంథాలయం

## ఆవశ్యకత

ఉపాధ్యాయునికి బోధనలో సహాయపడే సహాయకారుల్లో ఇదొకటి. 'పుస్తకంలేని గది ఆత్మలేని శరీరంతో సమానమని' మహాభిజ్ఞుల అభివాక్కు. దీనిని బట్టి పుస్తకం జీవితంతో సమానమని తెలుస్తున్నది. ఇక్కడ పుస్తకం అంటే అందులోని జ్ఞానం. అనగా జ్ఞానానికి నిలయమైనదే పుస్తకం. ఇట్టి జ్ఞాన భాండాగారమైన గ్రంథాలకు (పుస్తకాలకు) నిలయమైనదే గ్రంథాలయం. భక్తుల భజనకు దేవాలయం ఎంత ముఖ్యమో విద్యార్థుల విజ్ఞానానికి గ్రంథాలయమంత ముఖ్యం. ఇక్కడ గ్రంథాలయం దేవాలయమైతే గ్రంథం దేవునితో సమానం. విద్యను ఆర్తితో అర్థించే విద్యార్థుల పాలిట నిజంగా ఇది దేవాలయం. ఎందుకంటే సమస్త రూపంలో విస్తృతపరిధిలో రాశీభూతమై ఉన్నట్టి జ్ఞానాన్నంతటినీ పాఠశాలలో బోధించాలన్నా, అధ్యయనం చేయాలన్నా అసంభవమైన విషయం. కారణం పాఠశాలలోని జ్ఞానం ఎన్నో పరిమితులకు, పరిధులకు లోబడినట్టిది. అలాంటి పరిధులను, పరిమితులను అతిక్రమించి అపారమైన జ్ఞానానికి ఆధార భూమిక కేవలం గ్రంథాలయం కావడం వలన ఇది విద్యార్థికి ఎంతగానో అవసరమగుచున్నది. అంతే కాక క్రొత్త జ్ఞానాంశాల్ని పొందడం కోసం, పొందిన జ్ఞానాంశాల్ని స్థిరపఱచుకోటం కోసం ఉపాధ్యాయునికి కూడ ఇది ఎంతగానో ఉపకరిస్తున్నది. ఇట్టి ఈ గ్రంథాలయాలను అనేక రకాలుగా ఏర్పాటు చేసికోవచ్చు. వీటిల్లో పాఠశాల దశ వరకు పాఠశాల గ్రంథాలయాన్ని, తరగతి గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసికొంటారు. ఇవి బోధనలో ఉపాధ్యాయునికి, అభ్యసనంలో విద్యార్థులకు ఎంతగానో తోడ్పడుతూ బోధనోపకరణాలౌతున్నాయి.

## పాఠశాల గ్రంథాలయం (School Library)

పాఠశాలలోని అన్ని తరగతుల విద్యార్థులు, ఉపాధ్యాయులు చదువుకోటానికి అవసరమైన గ్రంథాలతో, కేవలం ఉపాధ్యాయుల పరిశీలన (Reference) కు అవసరమైన గ్రంథాలతో పాఠశాల అవసరా కోసం ఏర్పాటు చేసికొన్న గ్రంథాలయానికి పాఠశాల గ్రంథాలయమని పేరు. ఇందులో వివిధ రకాలైన గ్రంథాల్ని సులభంగా గుర్తించడం కోసం వాని ప్రక్రియలకు సంబంధించిన శీర్షికలతో అమర్చుతారు. ఇలా గ్రంథాల్ని అమర్చుటమే కాక వీనిని పఠించడం కోసం గ్రంథాలయంలోనే ప్రత్యేక గదుల్ని (మందిరాల్ని) ఏర్పాటు చేస్తారు. వీనినే పఠన మందిరాలంటారు. (Reading Rooms)

పఠన మందిరాలు విద్యార్థులు చక్కగా కూర్చొని పఠించటానికి, రాసికొనటానికి అనుకూలంగా ఉండే కుర్చీలతో, బల్లలతో, గాలి వెలుతురు చక్కగా వచ్చే విధంగా నిర్మింపబడతాయి. వీటి గోడలు ఉచితమైన బొమ్మల్ని, సూక్తుల్ని కలిగి ఉంటాయి. వివిధ రకాలైన వైజ్ఞానిక పత్రికలు, బాల పత్రికలు, దిన - వార - పక్ష - మాస పత్రికలు మొ..న వానిని కూడ వీటిల్లో ఉంచుతారు. గ్రంథాలయాన్ని సక్రమ రీతిలో నిర్వర్తించటానికి గ్రంథపాలకుడుంటాడు. ఈ విధంగా ఇది పాఠశాల అవసరాల్ని తీరుస్తుంది.

## తరగతి గ్రంథాలయం (Class Library)

పాఠశాల గ్రంథాలయం నుండి తరగతికి అవసరమయ్యే గ్రంథాల్ని ఉపాధ్యాయుడు ఎంపిక చేసిన గ్రంథాలయానికే తరగతి గ్రంథాలయమని పేరు. ఆయా తరగతుల విద్యార్థులు ఆ విద్యా సంవత్సరంలో ఎన్ని పుస్తకాలు చదవటానికి వీలౌతుందో వానిని మాత్రమే ఉపాధ్యాయుడు ఎంపిక చేస్తాడు. వాటి శైలి ఆయా తరగతుల ఉపవాచకాల శైలితో సమానంగా ఉండవలెను. పరిమాణంలో కూడ ఇవి వాటికంటే చిన్నవిగా ఉండవలెను. అలాగే ఇవి దోష రహితంగా, చక్కటి ముద్రతో ఆకర్షణీయంగా ఉండవలెను. ఈ విధంగా ఇది తరగతి అవసరాలు తీరుస్తుంది.

**ప్రయోజనాలు**

1. బోధనలో ఉపకరణాలుగా సహాయపడును. 2. విద్యార్థుల విస్తార పఠనం పెంపొందును. 3. మౌన పఠనం అభివృద్ధి చెందును. 4. శీఘ్రంగా విషయాన్ని గ్రహించే శక్తి పెరుగును. 5. విజ్ఞానం వృద్ధి చెందును. 6. సాధారణ ప్రాపంచిక జ్ఞానం కలుగును. 7. సంఘీభావం అలవడును. 8. స్వయం శక్తి, ఆత్మాభిమానం పెరుగును. 9. మూర్తిమత్వం వికసించును. 10. గ్రంథాలయ నిర్వహణను నేర్చుకొందురు.11. కాలాన్ని సద్వినియోగ పరచుకొందురు.

## *పాఠశాల పత్రిక*

బోధనలో ఉపాధ్యాయునికి సహాయపడే అనేక సహాయకారుల్లో ఇదొకటి. పాఠశాల విద్యార్థుల చేత రచింపబడే పత్రిక పాఠశాల పత్రిక. విద్యార్థుల లిఖితరచనా శక్తని పెంపొందించడంలో ఉపాధ్యాయునికిది బాగా సహాయపడుతుంది. కథలు, వ్యాసాలు, గేయాలు, పద్యాలు, చిత్రాలు, హాస్యోక్తులు, మొ..న వానిని రాయిస్తూ ఉపాధ్యాయుడు విద్యార్థుల కథన, వర్ణన, విమర్శన, కల్పనాది శక్తుల్ని పెంపొందిస్తాడు.

పాఠశాల పత్రికను రచింపచేయటానికై కేటాయించిన రెండు కాల వ్యవధుల్లో ఒక దానిలో వివిధ రచనలకు సంబంధించిన స్థూల రూపాల్ని వచ్చే కాలవ్యవధి నాటికి తయారు చేసికొని రావలిసిందిగా విద్యార్థుల్ని కోరి వానికి సంబంధించి క్రింది విధంగా సూచనలనిస్తాడు.

1. రచనలు సారస్వతం -పాఠ్యాంశాలు - కల్పనలు - ఊహలు - భావనలు - వాస్తవాలు మొ..న వానికి సంబంధించినవిగా ఉండవచ్చును. 2. వాని వ్యక్తీకరణ కథన వర్ణన సంభాషణాది రూపంలో ఉండవచ్చును. 3. అవి సంక్షిప్తంగా, స్పష్టంగా ఉంటూ తమకు పాఠశాలకు గౌరవం తెచ్చేవిగా ఉండవలెను. 4. ఉపాధ్యాయులనుంచి కాని, ఇతరుల నుంచి కాని రచనకు సంబంధించి సహాయాన్ని పొందవచ్చును. 5. ఇవి వ్యక్తుల్ని- మతాల్ని - కులాల్ని - జాతుల్ని దూషించేవిగా ఉండకూడదు. 6. రచనల్లో అక్షర దోషాలుండకూడదు.

విద్యార్థులు తెచ్చిన వివిధ రచనలకు సంబంధించిన స్థూల రూపాల్ని తరువాతి కాలవ్యవధిలో చక్కగా పరిశీలిస్తాడు. అవసరమైతే ఇంకా ఏమైనా సూచనలు ఇస్తాడు. తరువాత వాని అన్నింటి మేలి ప్రతుల్ని తయారు చేయిస్తాడు. విద్యార్థుల రచనలతో పాటు ఉపాధ్యాయుల

రచనలను కూడ గ్రహిస్తాడు. ఇతర భాషల ఉపాధ్యాయులతో, విద్యార్థులతో కలిసి అతడు వానినన్నింటినీ పత్రికగా కూర్పిస్తాడు.

**ప్రయోజనాలు**

1. విద్యార్థుల రచనా సామర్థ్యం పెంపొందుతుంది.2. స్వయం శక్తి అభివృద్ధి చెందుతుంది. 3. విమర్శనా శక్తి అలవడుతుంది.4. ఆలోచనా శక్తి పెరుగుతుంది.5. విషయ పరిజ్ఞానం పెరుగుతుంది. 6. సంఘీభావం ఏర్పడుతుంది. 7. పఠన - లేఖన నైపుణ్యాలు బాగా అభివృద్ధి చెందుతాయి. 8. ఉత్సాహం, ఉల్లాసం పెరుగుతుంది. 9. ఊహ -కల్పన - భావనాది శక్తులు వృద్ధి చెందుతాయి. 10. వ్యక్తీకరణ సామర్థ్యం పెరుగుతుంది.

## సారస్వత సంఘాలు (Library Association)

ఉపాధ్యాయుని బోధనా సహాయకారుల్లో ఇదొకటి. ప్రణాళికాగతమైన లక్ష్యాల్ని సాధించటానికి ఉపాధ్యాయుడు వాచక - ఉపవాచకాలతో పాటు ఇతర కార్యకలాపాల్ని కూడ నిర్వర్తింపవలసి ఉంటుంది. ఆ కార్యక్రమాలు ఆనందం రసానుభూతి, జాతి సంస్కృతి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, అలవాట్లు, అభిరుచులు, కట్టుబాట్లు మొ..న వానికి సంబంధించిన వివిధ రకాలైన సాహిత్య సమావేశాలు, గోష్ఠులు - చర్చలు - విమర్శలు - కవి సమ్మేళనాలు, నాటికలు, నాటకాలు, అవధానాలు, ఉపన్యాసాలు, ఏకపాత్రాభినయాలు, పాటలు, నృత్యాలు, మొ..విగా ఉంటాయి. వీనినే 'సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు' అంటారు. ఒకప్పుడివి ప్రణాళికా తీతంగా ఉండం వలన వీనిని 'ప్రణాళికేతర కార్యక్రమాలు'( Extra Curricular Activities) గా గుర్తించారు. కాని నేడివి ప్రణాళికలో స్థానాన్ని పొందడం వలన వీనిని 'సహపకార్యప్రణాళికాకార్యక్రమాలు' (Co-Curricular Activities) గా పిలుస్తున్నారు. ఇట్టి ఈ సహపాఠ్య ప్రణాళికా కార్యక్రమాలైన సాహిత్య - సాంస్కృతిక కార్యకలాపాల్ని పాఠశాలలో సక్రమ రీతిలో నిర్వహించడంకోసం ఉపాధ్యాయుడు కొన్ని 'విద్యార్థి సంఘాల్ని' ఏర్పాటు చేస్తాడు. ఈ సంఘాలకు కార్యదర్శుల్ని, కోశాధికారుల్ని, కార్యవర్గ సభ్యుల్ని నియమిస్తాడు. వీరితో కలిసి ఉపాధ్యాయుడు వీటి నిర్వహణకై కేటాయింపబడిన కాలవ్యవధుల్లో ఏయే అంశాలపై ఏ విధంగా సమావేశాల్ని నిర్వహించాలో చర్చిస్తాడు. మొదటి సమావేశానికి ఉపాధ్యాయుడు కాని లేక ఆహ్వానింపబడిన వ్యక్తి గాని అధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు. తరువాతి కార్యక్రమాలన్నింటికీ విద్యార్థులే అధ్యక్ష భారాన్ని వహించేటట్లు చేస్తాడు. ఈ సమావేశాల్లో ఉపాధ్యాయుడు విద్యార్థులకు వక్తృత్వంలో శిక్షణ నివ్వటమే కాక అధ్యక్షులుగా, కార్యదర్శులుగా, వక్తలుగా, శ్రోతలుగా ప్రవర్తిచ వలసిన తీరును క్రింది విధంగా తెలియచేస్తాడు.

**అధ్యక్షుడు**

కార్యక్రమాన్ని ఒడుదుడుకులు లేకుండా సాఫీగా జరిగించడమే అధ్యక్షుని బాధ్యత. సమావేశాన్నిముందుగా ఇతడు 'తొలిపలుకుల' తో ప్రారంభిస్తాడు. చివర్లో సమావేశాన్ని ఇతడే 'మలిపలుకుల' తో ముగిస్తాడు. తొలిపలుకుల్లోసమావేశాన్ని, దాని ఉద్దేశాన్ని మాత్రమే

తెలుపవలెను. అంతేకాని వక్తగా దీర్ఘోపన్యాసం చేయకూడదు. అలాగే మలిపలుకుల్లో సమావేశ ఉద్దేశం నెరవేరిందోలేదో తెలుపుతూ దానిని ముగింపవలెనే కాని అక్కడ కూడ ఉపన్యాసం ఇవ్వకూడదు. ఒకవేళ ఉపన్యాసమివ్వాలనే కోరిక ఉంటే తనూ వక్తగా పాల్గొనవచ్చు. సమావేశంలో వివిధ వక్తలను ఒకరి తరువాత మరొకరిని శ్రోతలకు పరిచయం చేస్తూ వారి చేత ఉపన్యాసమిప్పించవలెను. ఉపన్యాసానంతరం అందలి సుగుణాలను ప్రశంసిస్తూ, ఏకీభవించలేని భావాల్ని వక్త కు బాధ కలుగని రీతిలో వెల్లడించవలెను.

**కార్యదర్శి**

సమావేశాన్ని ప్రారంభించే ముందు ఇతడు వేదిక మీదకు వెళ్ళి అధ్యక్షుణ్ణి అక్కడకు ఆహ్వానించి అతణ్ణి అధ్యక్ష భారాన్ని వహించవలసినదిగా కోరవలెను. అలా ఆహ్వానించే సమయంలో అతణ్ణి సభకు పరిచయం చేస్తూ అతని యోగ్యతల్ని గూర్చి నాలుగైదు వాక్యాల్లో చెప్పవలెను. అంతకు మించి ఉపన్యసించకూడదు. ఒకవేళ ప్రత్యేకంగా చెప్పేదేమైనా ఉంటే 'వక్త' గా పాల్గొనవచ్చు. చివర్లో సమావేశ సారాంశాన్నంతటిని 10 లేక 15 వాక్యాల్లో సంక్షిప్తీకరించవలెను. చిట్టచివర్లో అధ్యక్షునికి, వక్తలకు, శ్రోతలకు వందన సమర్పణ చేసి సమావేశాన్ని ముగింపవలెను.

**శ్రోతలు**

సమావేశంలో స్తబ్దులైనప్పటికీ వారి పాత్ర కూడ ముఖ్యమైనది. ముఖ్యంగా సమావేశం జయప్రదం కావడానికి వారి సహకారం ఎంతో అవసరం. ఎందుకంటే వక్తలందరూ అందరికి అనుకూలంగా ఆహ్లాదకరంగా మాట్లాడ లేక పోవచ్చు. అట్టి సమయంలో వారిసంయమనమే సభకు శ్రీరామ రక్ష.

పై విధంగా ఉపాధ్యాయుడు విద్యార్థుల్ని అధ్యక్షులు - కార్యదర్శులు - శ్రోతలు మొ..న వారిగా తీర్చి దిద్దుతూ వారిలో వక్తృత్వ శిక్షణను పెంపొందిస్తూ వివిధరకాలైన సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాల్ని నిర్వహించవలెను.

**ప్రయోజనాలు**

1. విద్యార్థులకు సభాకంపం తొలగును. 2. నిర్వహణ సామర్థ్యం పెరుగును. 3. వక్తృత్వ నైపుణ్యం అభివృద్ధి చెందును. 4. భాషణ -పఠనాదులు వృద్ధి పొందును. 5. సంఘీభావం పెంపొందును. 6. సాహిత్యాభిరుచి పెరుగును. 7. విషయ పరిజ్ఞానం పెరుగును. 8. ఆనందం కలుగును. 9. నటులుగా, కవులుగా, రచయితలుగా, వక్తలుగా, విమర్శకులుగా విద్యార్థులు తీర్చిదిద్దబడుదురు. 10. మూర్తిమత్వం అలవడును. 11. సహనం, ఓర్పు అనే గుణాలు వృద్ధి చెందును. 12. విద్యార్థుల మధ్య స్నేహవాతావరణం పెరుగును.

## *నిఘంటువులు* **(Dictionaries)**

ఉపాధ్యాయుని బోధనా సహాయకారుల్లో నిఘంటువులు కూడా ఉన్నాయి. భాషా

బోధనలో వీని ప్రాధాన్యం అత్యధికం. పదాలకు సంబంధించిన అనేకాంశాలు ఇందులో ఉంటాయి. ముఖ్యంగా వివిధ పదాల అర్థాలు, వాని వ్యుత్పత్తులు, సాహిత్యంలో వాని ప్రయోగాలు అర్థపరిణామాలు, శబ్ద రూపాంతరాలు, నానార్థాలు, పర్యాయ పదాలు, ఆయా శబ్దాల లింగ భేదాలు, వచన భేదాలు, జాతీయాలు, సామెతలు, పలుకుబళ్ళు , నుడికారాలు, కొన్ని పదాల వెనుక ఉండే జాతి ప్రజల ఆచారవ్యవహారాలు, వివిధ పౌరాణిక పాత్ర ల సంక్షిప్త పరిచయాలు, వివిధ భాషలకు సంబంధించిన గుర్తింపులు మొ..వి అన్నీ నిఘంటువుల్లో నిక్షిప్తమై ఉంటాయి. ఇవి ఇటు విద్యార్థులకు అటు ఉపాధ్యాయునికి ఉమ్మడిగా సహాయపడతాయి. వీరికే కాక సాహిత్య జిజ్ఞాసులందరికీ ఇవి తోడ్పడతాయి. శబ్దరత్నాకరం, ఆంధ్ర శబ్ద రత్నాకరం, సూర్యారాయాంధ్ర నిఘంటువులు, శబ్దార్థ చంద్రిక, విద్యార్థి కల్పతరువు, పూర్వ గాథల హారిలాంటివి ఈ నిఘంటువుల్లో ముఖ్యమైనవి. తెలుగు భాషకు తెలుగు అర్థాలతోడి పై నిఘంటువులే కాక తెలుగు భాషకు ఆంగ్లార్థాల నిఘంటువులు, సంస్కృతార్థల నిఘంటువులు, అలాగే తమిళ కన్నడార్థాల నిఘంటవులు కూడ ఈనాడు లభ్యమౌతున్నాయి. తెలుగు పదాలకు తెలుగర్థాల నిఘంటువుల వల్ల తెలుగు భాష వ్యవహారం తెలిస్తే, తెలుగు పదాలకు పైన పేర్కొన్న అన్యభాషార్థాల నిఘంటువుల వలన తెలుగు భాషతో పాటు ఆయా అన్య భాషల వ్యవహారం కూడా తెలియటానికి వీలున్నది.

ఈ నిఘంటువుల్లో అకారాది అక్షర క్రమంలో పదాలకు అర్థాలు రాయబడి ఉంటాయి. ఆయా అర్థాల్ని సాహిత్యంలో ఎవరు ఎలా ప్రయోగించారనే విషయాన్ని కూడ కొన్ని నిఘంటువులు పేర్కొన్నాయి. ఇవన్ని పాఠశాల గ్రంథాలయంలో భద్రపఱచబడి ఉంటాయి.

పై విధమైన నిఘంటువులేకాక వ్యాకరణాలంకార ఛందశ్శాస్త్రాది శాస్త్ర గ్రంథాలు కూడ విద్యార్థులకు అవసరమౌతాయి.

**ప్రయోజనాలు**

1. పద స్వరూపం తెలుస్తుంది. 2. పదాలకు సంబంధించిన అర్థాలు తెలుస్తాయి. 3. పద రూపాంతరాలు, అర్థరూపాంతరాలు స్పష్టమౌతాయి. 4. ఆయా పదాలు ఏ భాషా పదాలో గుర్తించటానికి వీలుంది. 5. వ్యుత్పత్త్యర్థాలు బోధపడతాయి. 6. భాషా జ్ఞానం పెరుగుతుంది. 7. పదాలు క్రమంలో ఉండడం వలన క్రమ ప్రాధాన్యం అర్థమౌతుంది. 8. తార్కిక, హేతువాద దృష్టులు పెంపొందుతాయి. 9. పదజాలం వృద్ధిచెందుతుంది. 10. ఆయా పదాలన్నింటిని ప్రయోగించే తీరు కూడ తెలియడానికి వీలున్నది. 11. ఆయా పదాల వెనుక దాగి ఉన్నట్టి సంస్కృతి - సంప్రదాయాలు తెలుస్తాయి.

## భాషా వస్తు ప్రదర్శన శాలలు (Language Museums)

బోధనా సహాయకారుల్లో ఇవికొన్ని. భాషా - సాహిత్యాలకు సంబంధించిన వివిధ వస్తువుల్ని పరికరాల్ని ప్రదర్శించే శాలలే భాషా వస్తు ప్రదర్శన శాలలు. చాల పురాతన కాలానికి సంబంధించిన వానిని, అరుదుగా లభించే వానిని, ఆసక్తిని , ఆహ్లాదాన్ని కలిగించే వానిని ఈ ప్రదర్శన శాలల్లో భద్రపరుస్తారు. భాషా - సాహిత్యాల బోధనకు అవసరమయ్యే రీతిలో వీనిని

పాఠశాలల్లో ఏర్పాటు చేస్తారు. పూర్వ కవుల చిత్రపటాలు, వీరిని ఆదరించిన చక్రవర్తుల చిత్ర పటాలు, వీరు రచించిన అరుదైన గ్రంథాలు, ఉపయోగించిన ఘంటములు (కలములు), తాళ పత్రాలు, వివిధ లిపి రూపాలు, లిఖించిన వివిధ శాసనాలు, వీరి అభిమాన విషయాలు, సూక్తులు మొ..న వానిని పాఠశాల భాషా వస్తు ప్రదర్శన శాలలో ఉంచుతారు. ఇదే రీతిలో ఆధునిక కవుల విశేషాలను కూడ ఉంచుతారు. వీనితో పాటు తెలుగు భాషా సాహిత్యాలతో దగ్గరి సంబంధమున్న కన్నడ - తమిళ - మలయాళ భాషా సాహిత్యాంశాల్ని కూడా ఉంచుతారు. అలాగే తెలుగు భాషా - సాహిత్యాల్లో జీర్ణించుకు పోయిన సంస్కృత భాషా సాహిత్యాంశాల్ని ఎలాగూ ఉంచవలసి ఉంది. వీని వలన ఆయా అంశాల్ని ఉపాధ్యాయుడు సులభంగా బోధింపవచ్చు. విద్యార్థులు కూడ సులభంగా గ్రహిస్తారు. ఉదా.. నన్నయ పాఠం చెబుతున్నపుడు అతని చిత్రపటాన్ని, వాడిన తాళ పత్రాన్ని, ఘంటాన్ని, చూపించనట్లైతే వాటి ప్రభావం విద్యార్థులపై బలంగా పనిచేస్తుంది. అదే రీతిలో మిగిలిన అంశాల్ని కూడ బోధింపవచ్చు.

**ప్రయోజనాలు**

1. ఆయా అంశాల్ని ప్రయోగాత్మకంగా తెలిసికోవచ్చు. 2. ఆయా కవుల చిత్రపటాలు, వాడిన పరికరాల్ని మొ..న వానిని చూడటం వలన వారిపై అనురక్తి ఏర్పడుతుంది. 3. ఆయా కవుల విశేషాల్ని తెలిసికోటం వలన వారి యెడల ఆసక్తి పెరుగుతుంది.4. ఆయా కాలాల్లోని లిపుల్ని (Scripts) తెలిసికోటం వలన లిపి పరిమాణాన్ని అంచనా వేయగలుగుతారు. 5.ఆయా కవులతో తాదాత్మ్యం చెందటానికి వీలున్నది. 6. సాహిత్యాభిరుచి పెంపొందుతుంది.7. ఆయా కవుల మాదిరే తాము కావ్యాల్ని వేయించాలనే కోరిక పుడుతుంది. 8. భాషా జ్ఞానం కలుగుతుంది.9. కవుల జీవిత విశేషాలు అర్థమౌతాయి. 10. మూర్తిమత్వం పెరుగుతుంది.

## నల్లబల్ల (Black Board)

నల్లబల్ల బోధనా సహాయ కారుల్లో ఒక ముఖ్యమైన పరికరం. బోధన సమయంలో ఎంతటి బోధనానైపుణ్యమున్న ఉపాధ్యాడైనా దీనిని ఉపయోగించక తప్పదు. కవిని పరిచయం చేసేటపుడు, కఠిన పదాలకు అర్థాల్ని - వ్యాకరణాంశాల్ని బోధించేటపుడు, భావాన్ని స్పష్టం చేసేటపుడు ఉపాధ్యాయుడు దీనిని ముఖ్యంగా ఉపయోగిస్తాడు. బోధన జరుగుతున్న సమయంలో ఆయా అంశాల్ని ఒకదాని తరువాత మరియొక దానిని బోధిస్తూ వానిని నల్లబల్ల మీద రాస్తారు. ఒక్కొక్క సారి మొత్తం నల్లబల్లను కొన్ని భాగాలుగా విభజించుకొని ఆయా అంశాల్ని ఆయా భాగాల్లో రాయడం జరుగుతుంది. ఈ పద్ధతే కొంచెం మేలైనది. ఎందుకంటే బోధన సంపూర్ణమయ్యేంత వరకు ఆయా అంశాలు ఆయా భాగాల్లో ఉంటాయి. కొంచం నిదానంగా రాసికొనేవారికి, దూరంగా ఉన్న వారికి, సరిగా వినపడని వారికి ఇది చక్కగా ఉపకరిస్తుంది. బోధనలోని అన్ని అంశాలకు కాక ముఖ్యమైన వానికి మాత్రమే దీనిని ఉపయోగించవలెను. నల్లబల్ల మీది రాత స్పష్టంగా,. అందంగా, దోషరహితంగా, తగుమాత్రపు పరిమాణంతో ఆకర్షణీయంగా ఉండవలెను. బోధనా సమయంలో అవసరమైన చిత్రాల్ని గీయటానికి కూడ ఇది ఉపకరిస్తుంది. కొంతమంది ఉపాధ్యాయుని బోధనకన్నా అతడుపయోగించే నల్ల బల్ల తీరును గమనిస్తుంటారు. దీనిని బట్టి

నల్లబల్లను ఉపయోగించడంలో ఉపాధ్యాయుడు కడు జాగరూకుడై ఉండవలెనని తెలుస్తున్నది.

**ఉపయోగాలు**

1. లేఖనం పెంపొందుతుంది. 2. దోష రహితంగా రాసికొంటారు. 3. దూరంగా ఉన్నట్టి విద్యార్థులైనా రాసికోగలుగుతారు. 4. కొంచెం చెవుడుగా ఉన్నవారికి తోడ్పడుతుంది. 5. నిదానంగా రాసికొనే వారికి దోహదపడుతుంది. 6. నల్ల బల్ల లేకపోతే పాఠాన్ని మౌఖికంగానే గ్రహింపవలసి వస్తుంది. అది చాలా కష్టం. 7. బోధనను, అభ్యసనను సులభతరం చేస్తుంది. 8. ఏయే అక్షరాల్ని ఎలా రాయాలో తెలిసికొంటారు. 9. భాషా జ్ఞానం పెరుగుతుంది. 10. వ్యాకరణాంశాల బోధనకు చక్కగా దోహదపడుతుంది.

## పని అనుభవం (Work Experience)

బోధనాసహకారుల్లో పని అనుభవం ఒకటి. పాఠశాలలో విద్యార్థులు నేర్చిన అంశాల్ని కేవలం సిద్ధాంతరూపంగానే కాక ఆచరణలో పెట్టే విధంగా ఆచరణాత్మకమైన సామాజిక ప్రయోజనాకరమైన కొన్ని పనులను (క్రియలను) పాఠశాలలో విద్యార్థుల చేత చేయిస్తూ కొంత అనుభవాన్ని పొందింప చేయటాన్నే 'పని అనుభవం' అంటారు. ఈ రకమైన పనుల్ని చేయించటానికి సాంఘిక - సామాన్య శాస్త్రాల్లో ఎక్కువ అవకాశముంది. భాషా విషయంలో అంతటి అవకాశం లేనప్పటికీ క్రింది వాని విషయంలో ఈ రకమైన పని అనుభవాన్ని కలిగింపవచ్చు.

1. వివిధ రీతుల్లో విద్యార్థుల్ని సంభాషింపచేయటం, సారస్వత సంఘాల్లో మాట్లాడింప చేయడం, శిశుగీతాలు అభినయ గీతాలు పాడేట్లు చేయడం, చూసిన సంఘటల్ని వర్ణింపచేయడం వంటి పనుల ద్వార భాషణకు సంభంధించిన పని అనుభవాన్ని కలిగింపవచ్చు. 2. తరగతి స్థాయికి తగిన వాటితో పాటు అపరిచితమైన పద్య - గద్యాల్ని పఠింపచేయటం వలన పఠన సంబంధమైన పని అనుభవాన్ని చేకూర్చవచ్చు. 3. లేఖా రచన, లిఖిత వ్యాస పచన మొ..న వాటి ద్వారా లేఖన సంబంధమైన పని అనుభవాన్ని కల్పింపవచ్చు. 4. పాఠశాల పత్రికను నడిపించడం, భాషా వ్యాకరణ జ్ఞానాల్ని క్రొత్త సందర్భాల్లో ఉపయోగింపచేయటం, పఠన మందిరాన్ని నిర్వహింపచేయడం మొ..న వాని ద్వారా పని అనుభవాన్ని కలిగింపవచ్చు. 5. కవిసమ్మేళనాలు, అవధానులు, చర్చలు మొ..న వానిని నిర్వహింపచేయడం. 6. పాఠశాలలో జరిగే వివిధ రకాలైన కార్యక్రమాలకు పెద్దల్ని ఆహ్వానించే భాద్యతలను అప్పచెప్పడం. 7. స్వతస్సిద్ధంగా పద్యాలు, గేయాలు, కవితలు, కథలు, నవలలు, నాటికలు, వ్యాసాలు మొ..న వానిని రచింప చేయటం. 8. ప్రజానమస్యల్ని గురించి ప్రభుత్వానికి, పత్రికా సంపాదకులకు లేఖలు రాయించడం. 9. బాలవాణి, యువవాణి, మొ..న రేడియో కార్యక్రమాల్లో పాల్గొనేటట్లు చేయటం మొదలైనవి.

**ప్రయోజనాలు**

1. సిద్ధాంతాత్మకమైనవి ఆచరణాత్మకమౌతాయి. 2. సమస్యా పరిష్కార మార్గం తెలుస్తుంది. 3. స్వయం ప్రతిపత్తి పెరుగుతుంది. 4. ఆత్మ విశ్వాసం ఎక్కువౌతుంది. 5. సంఘీభావం వృద్ధి చెందుతుంది. 6. సృజనాత్మక శక్తి ఎక్కువౌతుంది. 7. పరిశీలన - తార్కిక- హేతువాద దృక్పథాలు

పెరుగుతాయి. 8. సాహిత్యాభిరుచి పెరుగుతుంది. 9. భాషా జ్ఞానం అభివృద్ధి చెందుతుంది. 10. తెలిసిన జ్ఞానాన్ని వినియోగించకొనే తీరు తెలుస్తున్నది. 11. భాషా నైపుణ్యాలు చక్కగా పెంపొందుతాయి. 12. అనుభవం యొక్క ప్రాధాన్యం తెలుస్తుంది.13. సమాజంలో మెలగవలసిన తీరు స్పష్టమౌతుంది.14. విశాల దృక్పథం అలవడుతుంది. 15. ఆలోచనా శక్తి పెరుగుతుంది

# VIII. మూల్యాంకనం(Evaluation)

**ఆవశ్యకత**

నిత్యజీవితంలో వ్యక్తి ఏదైనా పనిని చేయాలనుకొన్నపుడు దాని ద్వార సాధింపదలచిన లక్ష్యాన్ని నిర్ణయించుకొని వానికనుకూలంగా ప్రణాళికను సిద్ధంచేసి కొంటాడు. దాని ప్రకారం ఆ పనిని పూర్తి చేస్తాడు. తరువాత నిర్ణయింపబడిన లక్ష్యాలు ఏ మాత్రం సాధింపబడ్డాయో శాస్త్రీయ మార్గంతో పరిశీలిస్తాడు. అవి సాధింపబడితే ఆ పని ఉత్తమ ఫలితాన్ని ఇచ్చినట్లు. ఒకవేళ సాధింపబడకపోతే ప్రణాళికలో మార్పులు చేస్తాడు. అక్కడికీ వీలుకాకపోతే లక్ష్యాల్నే మారుస్తాడు. ఈ విధంగా ఫలితాల్ని బట్టి ప్రణాళిక, దానిని బట్టి లక్ష్యాలు మారుతూ ఉంటాయి. ఆ పని సక్రమ రీతిలో జరిగి ఉత్తమ ఫలితాల్ని ఇవ్వటానికి ఈ మార్పులు తప్పదు.

విద్యా బోధన కూడా ఒక గొప్ప పనిలాంటిదే . దీనిని శాస్త్రీయ మార్గంలో చేయటానికి ఉపాధ్యాయుడు ముందుగా లక్ష్యాల్ని నిర్దేశించుకొంటాడు. ఆ లక్ష్య సాధనకు ప్రణాళికను సిద్ధం చేసికొంటాడు. ఈ ప్రణాళిక ప్రకారం తగిన పద్ధతులలో బోధన సాగిస్తాడు. బోధనానంతరం సాధింపదలచిన లక్ష్యాలు సాధింపబడిందీ లేనిదీ దానితో శాస్త్రీయ మార్గంతో సరిచూస్తాడు. దీనినే పూర్వం పరీక్షణ మన్నారు. తరువాత పరిగణనమన్నారు. ఇటీవల'మూల్యాంకొన మంటున్నారు.

ఇక్కడ మూల్యమనగా ధర లేద విలువ. అంకన మనగా గణించటం లేదా లెక్కగట్టడం. అనగా విలువ నిర్ణయించటమని అర్థం. అంటే బోధన ద్వారా సాధింపదలచిన లక్ష్యాలు సాదింపబడిందీ లేనిదీ తెలసికోటమనే. సాధింపబడితే బోధన సత్ఫలితాల్ని ఇచ్చినట్లు. అంటే లక్ష్యాల కనుకూలంగా ప్రణాళిక, దానికనుకూలంగా బోధన సాగినట్లు. సాధింపబడక పోతే ప్రణాళికను మార్చడం. అక్కడికీ వీలుకాకపోతే లక్ష్యాల్ని మార్చటం. అంటే వ్యవస్థ నంతటినీ మార్చటం. ఇలా వ్యవస్థనంతా మార్చటానికి కారణం కేవలం మూల్యాంకనమే. అలా బోధనను విలువకట్టే శక్తివంతమైన సాధనం మూల్యాంకనం. అందుచేత ఇది శాస్త్రీయ మార్గంలోనే సాగాలి. దానిలో పొరపాట్లు ఉంటే మొత్తం వ్యవస్థే మారిపోతుంది. -

**ప్రయోజనాలు**

1. బోధనా లక్ష్యాలు సాధింపబడిందీ లేనిదీ తెలిసికోవచ్చు. 2. ప్రణాళిక సరైందీ కానిదీ నిర్ణయింపవచ్చు.3. లక్ష్యాలు సాధించడానికి వీలుగా ఉన్నదీ లేనిదీ తెలిసికోవచ్చు. 4. బోధనా

పద్ధతులు సరిగా ఉన్నదీ లేనిదీ చూడవచ్చు. 5. విద్యార్థుల స్థాయిని నిర్ణయింపవచ్చు. 6. వారి లోపాల్ని తొలగింపవచ్చు. 7. ఉపాధ్యాయుడి లోపం ఉంటే సరిదిద్దు కోవచ్చు. 8. ప్రశ్న పత్ర నిర్మాణానికి దోహదపడును.

**పాత మూల్యాంకన విధానం (పాత పద్ధతి పరీక్షలు)**

పాత మూల్యాంకన విధానం లేక పాత పద్ధతి పరీక్షలు నశాస్త్రీయ పద్ధతులపై నిర్మింపబడక పోవటం వలన అందులో క్రింది విధంగా అనేక లోపాలున్నాయి.

**లోపాలు**

1. విద్యా సంవత్సరం మొత్తం మీద దాదాపు ఒకేసారి పరీక్షల్ని నిర్వహించడం వలన అవి ఒక్క జ్ఞాపకశక్తిని మాత్రమే పరీక్షించి తక్కిన ఆలోచన - విచక్షణ - విమర్శన - కల్పనాది ఇతర మానసిక శక్తులన్నింటినీ వదలి వేయటం జరిగేది.2. సంవత్సరం రోజులు చదివిన పాఠ్యాంశాలన్నింటినీ ఒకేసారి కేవలం 2 లేదా 21/2 గం..లు సమయంలో తక్కువ ప్రశ్నలలో పరీక్షించటం వలన ఎక్కువ భాగం (దాదాపు 90%) పరీక్షింపబడదు. 3. ప్రశ్నలన్నీ వ్యాసరూపంలో ఉండడం వలన వానిని నిక్కచ్చిగా విలువ కట్టడం, మూల్యాంకనం చేయటం చాలా కష్టం. 4. వ్యాస రూప ప్రశ్నలన్నీ నిర్దిష్టమైన సమాధానాలున్నట్టివి కాకపోవడం వలన వాటిల్లో ప్రామాణికత లోపిస్తున్నది. 5. దస్తూరుల (Hand Writing) లో తేడాలుండటం వలన మార్కులలో కూడ తేడాలు సంభవించును. 6. పరీక్షకుని మనఃప్రవృత్తి ఆధారంగా మార్కులు రావడం జరిగేది.7. ప్రశ్నలలో ఐచ్ఛికత ఎక్కువ కావటం వలన బాగా చదువుకొన్న వారు నష్టపోయెడివారు. 8. విషయాన్ని అర్థం చేసికోటం కంటే కంఠస్థం చేయటానికి ప్రయత్నించేవారు.9. ప్రశ్నలు వ్యాసరూపంలో తక్కువగా ఉండడం వలన బోధనా లక్ష్యాలన్నింటినీ అవి పరీక్షించేవి కావు. 10. ఎప్పుడూ, ఒకే రకమైన ప్రశ్నలు పరీక్షకు రావటానికి అవకాశం ఉండడం వలన బోధన వాటివరకే సాగేది. 11. వ్యాసరూప సమాధానాలను విలువకట్టటానికి అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులు అవసరం. అట్టి వారు దొరకనపుడు మూల్యాంకనం దెబ్బతింటుంది.

పై విధంగా పాత మూల్యాంకనంలో అత్యధికంగా లోపాలున్నప్పటికి క్రింది విధంగా సుగుణాలు కూడా లేకపోలేదు.

**సుగుణాలు**

1. సమాధానాలు వ్యాసరూపంలో ఉండటం వలన విద్యార్థుల్లో రచనా శక్తి పెరుగుతుంది. 2. సమాధానాలు పెద్దగా ఉండటం వలన చూసి రాయటం కష్టం. ఒకవేళ రాసిన దానిని గుర్తించడం సులభం. 3. జ్ఞాపకశక్తి బాగా పెరుగుతుంది.4. ధారణా శక్తి కూడ అభివృద్ధి చెందుతుంది. 5. లేఖన నైపుణ్యం పెరుగుతుంది.6. మంచి దస్తూరి అలవాటు కావటానికి వీలుంది.7. సృజనశక్తి పెరగటానికి వీలుంది.

# నూతన మూల్యాంకన విధానం

పాత మూల్యాంకన విధానంలోని లోపాలన్నింటినీ పరిహరిస్తూ, అందలి సుగుణాల్ని గ్రహిస్తూ, ఆధునిక మానసిక సూత్రాలకనుకూలంగా లక్ష్యాలకు - బోధనావిధానానికి - ప్రణాళికకు ముల్యాంకనానికి సంబంధం ఉండే విధంగా ఇటు విద్యార్థి అభ్యసనానికి, అటు ఉపాధ్యాయుని బోధనకు అనుకూలంగా, విద్యార్థి అభ్యసించిన అంశాలన్నింటినీ దాదాపుగా పరీక్షించే విధంగా నూతన మూల్యాంకన విధానం లో 1971 లో ప్రవేశ పెట్టబడింది. దీని ప్రకారం మౌఖిక పరీక్షలు(Interview Tests), ప్రయోగ పరీక్షలు (Practical Examinations), నియోజనాలు (Assingments), పాఠశాలలో విద్యార్థుల ప్రవర్తన (Observations) మొ...నవన్నీ మూల్యాంకన సాధనాలు. అంతే కాక సాంవత్సరిక (Annual) పరీక్షలతో పాటు ఆరునెలల (Halfyearly), మూడు నెలల (Quarterly), యూనిట్ (Unit) పరీక్షలు నిర్వహింపబడతాయి. ఇవన్నీ కలిసి విద్యార్థి ఉత్తీర్ణతను నిర్ణయిస్తాయి. అంతే కాక ప్రాథమిక దశలో 80%, మాధ్యమిక దశలో 90% హాజరుంటే సాంవత్సరిక పరీక్షా మార్కులతో ఉత్తీర్ణతకు సంబంధం ఉండదు. అయితే 7, 10 తరగతుల ఉత్తీర్ణతకు మాత్రం కేవలం సాంవత్సరిక పరీక్షల మార్కులే ఆధారం. పైన తెలిపిన వివిధ రకాల పరీక్షలద్వారా సేకరించిన సమాచారాన్ని (మార్కుల్ని) విద్యార్థుల్ప్రగతి పత్రాలలో (Progress Cards), కుమ్యులేటివ్ రికార్డులలో నమోదు చేయవలెను.

ఉపాధ్యాయుడు బోధనా లక్ష్యాలకనుకూలంగా బోధన (ప్రణాళిక బద్ధంగా) సాగిస్తాడు. లక్ష్యాలు సాధింపబడిందీ లేనిదీ తెలిసికోటానికి పై విధమైన మూల్యాంకనాన్ని చేబడతాడు. ఫలితాలు సరిగా లేకపోతే బోధనా విధానంలో కాని లక్ష్యాలలో కాని మార్పులు చేస్తాడు. ఈ విధంగా ఈ మూడు ఒక దాని మీద ఒకటి ఆధారపడి మార్పులు చెందుతూ ఉపాధ్యాయునికి 'బోధనా చక్రం'(Teaching Cycle) అవుతుంది. అదే విధంగా ఫలితాలు సరిగా లేనపుడు అభ్యసనంలో మార్పులు తేవడం, అక్కడికీ వీలుకాక పోతే లక్ష్యాల్లో మార్పులు తేవటం జరుగవలె. ఈ విధంగా ఈ మూల్యాంకనం - అభ్యసనం - లక్ష్యాలు ఒకదాని అంటిపెట్టుకొని మరియొకటి మార్పులు చెందుతూ విద్యార్థికి అభ్యసన చక్రం (Learning) అవుతుంది.

**ఆధునిక మూల్యాంకన స్వరూపం (సాధనాలు )**

ఉపాధ్యాయుని బోధనను, విద్యార్థుల అభ్యసనాన్ని బోధనా లక్ష్యాలతో సమన్వయం చేసి విలువకట్టే ఏకైక సాధనం మూల్యాంకనం కావటం వలన అది శక్తివంతంగా, దోషరహితంగా, ప్రామాణికంగా ఉండవలెను. ప్రాచీన మూల్యాంకనం అలా లేకపోవటమే కాక మూల్యాంకనమంతా ఒకే రకంగా కొద్ది పాటి వ్యాసరూప ప్రశ్నలతో ఉండేది. అందువల్ల అనేక లోపాలు అందులో చోటు చేసికొన్నవి. ఈ లోపాల్ని తగ్గించడం కోసం ఆధునిక మూల్యాంకనాన్ని అనేక రూపాలుగా (రకాలుగా ) నిర్మించారు. ఈ మూల్యాంకన వివిధ రకాలనే మూల్యాంకన సాధనాలుగా పిలుస్తున్నారు. అవి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

**I. రాత పరీక్షలు (Written Examinations)**

లిఖిత రూపంలో సమాధానాల్ని రాబట్టే పరీక్షలకు రాత పరీక్షలని పేరు. ఇవి అనేక రకాలుగా ఉంటాయి.

1. **లక్ష్యాత్మక ప్రశ్నలు** (Objective Type Questions)

లక్ష్యప్రాతిపదికపై ఖచ్చితమైన, నిర్దిష్టమైన, సంక్షిప్తమైన, సమాదానాల్ని రాబట్టే ప్రశ్నలే లక్ష్యాత్మక ప్రశ్నలు. ఇవి బహుళైచ్ఛికం (Multible Choice), తప్పొప్పుల (True or False) గుర్తించడం, ఖాళీలను పూరించడం (Fill up the Blanks), జతపఱచడం (Matching Type) మొ..న రూపాల్లో ఉంటాయి.

2. **అతి లఘూత్తర ప్రశ్నలు** (Small Answer Questions)

చిన్న వాక్యానికి లోపు ముఖ్యంగా ఒకటి లేద రెండు పదాల సమాధానాన్ని రాబట్టే ప్రశ్నలివి. ఒక్క మాటలో సమాధాన ప్రశ్నలన్నీ (One word answer questions) దీనికి సంబంధించినవే.

3. **లఘూత్తర ప్రశ్నలు** (Short Essay Type Questions)

దాదాపు రెండు మూడు వాక్యాల సమాధానాన్ని రాబట్టే ప్రశ్నలివి.

4. **దీర్ఘోత్తర (వ్యాస రూప) ప్రశ్నలు** (Essay Type Questions)

ఇవి దాదాపు ఆరేడు వాక్యాల సమాధానమున్నట్టి ప్రశ్నలు. ఇవి చాల తక్కువగా ఉంటాయి. ఇవి లిఖిత రూప వ్యక్తీకరణకు ప్రాధాన్యమిస్తాయి.

II. **ప్రయోగాత్మక (ఆచారణాత్మక) పరీక్షలు** (Practical Examinations)

సిద్ధాంతాత్మకంగా కాక ఆచరణ రీత్యా విద్యార్థులు గ్రహించిన దానిని రాబట్టే ప్రశ్నలివి. సాధారణంగా ఇవి ప్రయోగాల రూపంలో ఉంటాయి. భాషకు సంబంధించి సాహిత్య - సాంస్కృతిక కార్యక్రమాలు మొ..న వాని ఆధారంగా విద్యార్థుల ప్రతిభను పాబట్ట వచ్చు.

III. **మౌఖిక పరీక్షలు** (Interview Tests)

ఉపాధ్యాయుడు విద్యార్థుల్ని ముఖాముఖిగా ప్రశ్నలడుగుతూ సమాధానాల్ని రాబట్టే పరీక్షలివి. వక్తృత్వం, పఠనం మొ..న వానికి సంబంధించినవిగా ఇవి ఉంటాయి.

IV. **పరిశీలనా పరీక్షలు** (Observation Tests)

పాఠశాలలో విద్యార్థులు చదువుకొనేటపుడు, ఆడుకొనేటపుడు, పాఠశాలకు ఆవల బయట 'నిపించినపుడు వారి ప్రవర్తనను, వాని ఆధారంగా వారి అనక్తుల్ని, వైఖరుల్ని పరిశీలించటాన్ని పరీక్షలంటారు.

**నూతన మూల్యాంకన సుగుణాలు (ప్రయోజనాలు)**

1. ఎక్కువ సంఖ్యలో ప్రశ్నలుంటాయి. కాబట్టి ఎక్కువ బోధనాంశాల్ని పరీక్షించవచ్చు.

2. లక్ష్యాలన్నింటినీ పరీక్షించవచ్చు. 3. విషయ ప్రాధాన్యమైన చిన్న ప్రశ్నలకు ప్రాధాన్యమెక్కువ. 4. మానసిక శక్తులన్నింటినీ దాదాపుగా పరీక్షించ వచ్చు. 5. ప్రామాణికతను కలిగి ఉండటం వలన విలువ కట్టడం సులభం. 6. అధిక సంఖ్యలో ప్రశ్నలను ఇవ్వటానికి వీలుంది. 7. విద్యార్థుల స్థాయిని బట్టి (సులభ - కఠిన - మధ్యరకం) ప్రశ్నల నివ్వవచ్చు.8. ఏ అంశంలో, దేనిని ఎన్ని మార్కులకు మొదలుగా గల నిర్దిష్ట ప్రణాళికను తయారు చేసికోవచ్చు. 9. మూల్యాంకనం సప్రమాణంగా, శాస్త్రీయ దృక్పథంతో సాగుతుంది. 10. ప్రశ్నలకు తగిన సమాధానాలను తెలిపే Scoring Key ఉంటుంది. 11. సమగ్రంగా చదివిన విద్యార్థులకు అధిక మార్కులు రావడానికి అవకాశం ఎక్కువ. 12. మూల్యాంకనం చేసేవారి అభిరుచినీ బట్టి, వైఖరిని బట్టి, పరిస్థితిని బట్టి మూల్యాంకనం మారే అవకాశం లేదు. 13. నైపుణ్యాలన్నింటినీ పరీక్షించవచ్చు.14. ఒకే ప్రశ్నా పత్రాన్ని ఎంతమంది దిద్దినా మూల్యాంకనంలో సాధారణంగా మార్పుఉండదు. 15. విద్యార్థులకు గ్రుడ్డిగా కంఠస్థం చేయవలసిన అవసరం దాదాపుగా ఉండదు. 16. విద్యార్థులు పరీక్షను పెనుభూతంగా కాకసాధారణ క్రీడలాగా భావించే అవకాశం ఉంది. 17. ప్రశ్నచెప్పి సమాధానాన్ని బోధించడం కాక పాఠ్యాంశామంతా అర్థమయ్యే రీతిలో బోధింపవలసి ఉంది. 18. విద్యార్థులు బోధనాంశాల్ని సిద్ధాంతరూపంగానేకాక ప్రయోగాత్మకంగా కూడా తెలిసికొందురు. 19. విద్యార్థులు రకరకాలైన ప్రశ్నలకు రకరకాలుగా సమాధానాల్ని ఇచ్చే తీరును తెలిసికొందురు. 20. ఎప్పటికప్పుడు మూల్యాంకనం చేస్తూ విద్యార్థుల్లో అధ్యయనాసక్తిని పెంపొందించవచ్చు.

**పరిమితులు**

ఈ నూతన మూల్యాంకనానికి కూడా కొన్ని పరిమితులు లేక పోలేదు. అవి 1. దీని ద్వార విద్యార్థుల రచనాశక్తి పెద్దగా పెరగటానికి వీలు లేదు. 2. కంఠస్థం చేసే శక్తి తగ్గిపోవటానికి వీలుంది.3. కాపీ కొట్టటం సులభం. 4. మంచి దస్తూరికి ప్రాధాన్యం తక్కువ.5. గ్రుడ్డిగా చదివే వారికి అనుకూలంగా ఉండదు. 6. లేఖన నైపుణ్యం పెద్దగా పెరగదు. 7. ప్రశ్నలు అధికంగా ఉండడం వలన సమయం చాలదేమోనన్న శంక కలుగటానికి వీలున్నది.

**ఉత్తమ (ఆదర్శ) పరీక్ష ( ప్రశ్న) పత్ర లక్షణాలు**

1. **విశ్వసనీయత** (Reliability)

ఒకే పరీక్షను రెండు మూడు సార్లు కాని లేక రెండు మూడు సమయాల్లో కాని, ఒకే విద్యార్థి కాని లేక అనేక మంది కాని రాసినపుడు మార్కుల్లో వ్యత్యాసం పెద్దగా రాకూడదు. ఒకే రకమైన మార్కులు వస్తే ఇంకా విశ్వసింపదగినది.

2. **యోగ్యత** (Validity)

ఏ లక్ష్యాల్ని సాధించాలనుకొంటారో సరిగ్గా ఆ లక్ష్యాలనే సాధించేదిగా ప్రశ్న పత్రం ఉండాలి. విద్యార్థుల నుంచి దేనిని రాబట్టదలుస్తామో ప్రశ్న దానికి సంబంధించినదిగానే ఉండాలి.

3. **లక్ష్యాత్మ కత** (Objectivity)

గురిచూసి అమ్మును వదలిన రీతిలో ప్రశ్నా పత్రం లక్ష్యాత్మకంగా ఉండాలి. అంటే ఒక విద్యార్థి రాసిన సమాధాన పత్రాన్ని ఒక ఉపాధ్యాయుడు కాని, లేక అనేక మంది కాని, ఒకే సమయంలో కాని లేక అనేక సమయాల్లో కాని, ఒకే సారి కాని లేక అనేక సార్లు కాని దిద్దినపుడు మార్కులు ఒకే రకంగా ఉండాలి.

4. **వ్యాపకత** (Distribulability)

బోధనాంశాల్లోని అన్ని విషయాల్ని పరీక్షించేదిగా ఉండాలి.

5. **స్పష్టత** (Clarity)

ప్రశ్నలన్నీ స్పష్టంగా, సూటిగా ఉండవలెను. క్లిష్టమైనవి ఉంటే అర్థంకావటానికి తగిన సూచనలుండాలి.

6. **నిర్దిష్టత**

అక్షర - వ్యాకరణ - భావ - ముద్రణాది దోషాలు ఉండరాదు.

7. **ఆచరణ యోగ్యత** (Practicability)

ప్రశ్నాపత్రం ఆచరణ యోగ్యంగా ఉండవలెను.

8. **ప్రశ్నల తీరు** (Nature of the questions)

లక్ష్యాత్మక ప్రశ్నలు అధికంగా ఉంటూ, లఘూత్తర ప్రశ్నలు తక్కువగా ఉంటూ, అంతకన్నా తక్కువగా వ్యాస రూప ప్రశ్నలు ఉండవలెను.

9. **విద్యార్థుల స్థాయి**

ప్రశ్న పత్రం ప్రజ్ఞావంతుల్ని, మంద బుద్ధుల్ని కాక సాధారణ విద్యార్థుల్ని ఎక్కువగా దృష్టిలో పెట్టుకొనవలెను.

10. **సంపూర్ణ లక్ష్య సాధన**

బోధనాలక్ష్యాలన్నింటినీ సాధించేదిగా ఉండవలెను.

11. **ప్రశ్నల స్థాయి**

మధ్యరకం ప్రశ్నలు ఎక్కువగా ఉంటూ క్లిష్టమైన, సులభమైన ప్రశ్నలు తక్కువగా ఉండవలెను.

## యూనిట్ ప్రశ్న పత్రం (Unit Test Paper)

బోధించ వలసి పాఠ్యాంశాలన్నింటినీ కొన్ని యూనిట్లుగా (విభాగాలుగా) విభజించి, ఒక్కొక్క యూనిట్ లోని బోధనాంశాల్ని పరీక్షించటానికి నిర్వహించే పరీక్షను 'యూనిట్ పరీక్ష' (Unit Test) అంటారు. ఇట్టి పరీక్ష పత్రాన్నే'యూనిట్ ప్రశ్నా పత్ర' మంటారు. మొత్తం పాఠ్యాంశాల్ని ఒకేసారి పరీక్షించటం కంటే కొన్నికొన్ని భాగాల్ని పరీక్షించుకొంటూ పోవడం అన్ని విధాలుగా సానుకూలంగా ఉంటుందనేది యూనిట్ ప్రశ్న పత్ర లక్ష్యం. అయితే రెండు మూడు పాఠాలు కలిసి ఒకే అంశానికి సంబంధించినవిగా ఉండే భాషేతర పాఠ్యాంశాల్ల విషయంలో యూనిట్ విభజన సులభంగా ఉంటుంది. కాని భాషా పాఠాలన్ని వేనికవి ప్రత్యేకంగా ఉండడం వలన యూనిట్ విభజన కొంచెం కష్టమౌతుంది. అందుకోసం భాషల విషయంలో ధీర్ఘంగా ఉన్న పాఠాల్ని ఒక్కొక్కదానిని ఒక్కొక్క యూనిట్‌గాను, పొట్టిగా, చిన్నగా ఉన్న వానిని రెండు మూడింటిని కలిపి ఒక యూనిట్ గాను తీసికోటం జరుగుతుంది.

## యూనిట్ ప్రశ్న పత్ర నిర్మాణం

యూనిట్ ప్రశ్న పత్రాన్ని నిర్మించేటవుడు క్రింది జాగ్రత్తల్ని పాటింపవలెను.

1. బోధనా లక్ష్యాల్ని దృష్టిలో పెట్టుకోవలెను. 2. బోధనాంశాలన్నింటి మీద ప్రశ్నలుండవలెను. 3. దీర్ఘ సమాధాన; లఘు సమాధాన ప్రశ్నలు తక్కువగాను, లక్ష్యాత్మక ప్రశ్నలు ఎక్కువ గాను ఉండవలెను. 4. మరీ కష్టమైన - మరీ సులభమైన ప్రశ్నలు కాక మధ్యరకంగా ఉండే ప్రశ్నలు ఎక్కువగా ఉండవలెను. 5. రకరకాలైన ప్రశ్నల్ని రాయటానికి విడివిడిగా ఎంత సమయం (కాలం), కావాలో నిర్ణయించకోవలెను. 6. మొత్తం ప్రశ్న పత్రానికి అవసరమయ్యే కాలాన్ని గుర్తింపవలెను. 7. ఒక్కొక్క ప్రశ్నకు విడివిడిగా ఎన్ని మార్కులో, మొత్తం ప్రశ్నా పత్రానికి ఎన్ని మార్కులో నిర్దేశింపవలెను. 8. ప్రశ్నలు స్పష్టంగా, సూటిగా ఉండాలనే విషయాన్ని మరువకూడదు. 9. పైలక్షణాలన్నింటినీ ప్రతిబింబించే నిర్దిష్ట ప్రణాళిక (Blue Print) ను సిద్ధం చేయవలెను.10. సమాధానాల్ని సక్రమ రీతిలో సులభంగా, వేగంగా దిద్దటానికి Scoring Key ని తయారు చేసికోవలెను. 11. ఈ లక్షణాలన్నీ సంగమించే విధంగా ఏయే అంశానికి ఎంతెంత ప్రాధాన్యమీయవలెననే విషయానికి సంబంధించి వివిధ రకాలైన వివరణ పట్టికల్ని (భారత్య పట్టికల్ని) తయారు చేసికోవలెను.

## మాదిరి యూనిట్ ప్రశ్నా పత్రం (Model Unit Question Paper)

| | | | |
|---|---|---|---|
| సబ్జెక్టు | : తెలుగు | | |
| యూనిట్ (అంశం) | : | కాలం | : 30ని |
| తరగతి | : | మార్కులు | : |

# వివిధ రకాలైన వివరణ (భారత్య) పట్టికలు

## 1. ఉప విభాగ నిర్ణయ (విషయ భారత్వ) పట్టిక

| క్రమ సంఖ్య | సబ్‌యూనిట్ ఉప విభాగం | ప్రశ్నల సంఖ్య | | | మార్కులు | శాతం |
|---|---|---|---|---|---|---|
| | | లక్ష్యా. ప్ర | లఘూ ప్ర | వ్యా. ప్ర | | |
| 1. | పిల్లి జువ్వి వృక్షం కడకు వచ్చుట | 3 | 1 | | 5 | 20 |
| 2. | గ్రద్ద పిల్లి వచ్చిన పనిని అడుగుట | 3 | 1 | | 5 | 20 |
| 3. | పిల్లి గ్రద్దను నమ్మించుట | 4 | 1 | | 6 | 24 |
| 4. | పిల్లి పక్షి పిల్లలను భక్షించుట | 2 | 1 | 1 | 9 | 36 |

సూచన : లక్ష్యా. ప్ర : లక్ష్యాత్మక ప్రశ్నలు, లఘు. ప్ర : లఘూత్తర ప్రశ్నలు,
వ్యా. ప్ర. : వ్యాసరూప ప్రశ్నలు.

## 2. లక్ష్య వివరణ పట్టిక (లక్ష్య భారత్వ పట్టిక)

| క్రమ సంఖ్య | లక్ష్యం | మార్కులు | శాతం |
|---|---|---|---|
| 1. | జ్ఞానం | 10 | 40 |
| 2. | అవగాహన | 8 | 32 |
| 3. | నైపుణ్యం | 5 | 2 |
| 4. | వినియోగం (సమన్వయం) | 2 | 8 |

## 3. ప్రశ్నల వివరణ పట్టిక (ప్రశ్నభారత్వ పట్టిక)

| క్రమ సంఖ్య | ప్రశ్న రూపం | ప్రశ్నల సంఖ్య | మార్కులు | శాతం |
|---|---|---|---|---|
| 1. | లక్ష్యాత్మక ప్రశ్నలు | 12 | 12 | 48 |
| 2. | లఘూత్తర ప్రశ్నలు | 4 | 8 | 32 |
| 3. | వ్యాస రూప ప్రశ్నలు | 1 | 5 | 20 |

## 4. ప్రశ్న స్థాయి వివరణ పట్టిక (ప్రశ్న స్థాయి భారత్వ పట్టిక)

| క్రమ సంఖ్య | ప్రశ్న స్థాయి | మార్కులు | శాతం |
|---|---|---|---|
| 1. | సులభం | 4 | 14 |
| 2. | మధ్య రకం సామాన్యం | 16 | 64 |
| 3. | కఠినం | 5 | 20 |

## 6.నిర్దిష్ట ప్రణాళిక (Blue Print)

| క్ర.సం | సబ్‌యూనిట్ (ఉపవిభాగం) | జ్ఞానం | | | అవగాహన | | | నైపుణ్యం | | | వినియోగం | | | మొ.ప్ర | మొ.మార్కులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | లక్ష్యా.ప్ర | లఘు.ప్ర | వ్యా.ప్ర | లక్ష్యా.ప్ర | లఘు.ప్ర | వ్యా.ప్ర | లక్ష్యా.ప్ర | లఘు.ప్ర | వ్యా.ప్ర | లక్ష్యా.ప్ర | లఘు.ప్ర | వ్యా.ప్ర | | |
| 1. | [illegible] | 1(1) | 1(2) | | 2(1) | | | | | | | | | 4 | 5 |
| 2. | గ్రద్ద పిల్లి వచ్చిన పనిని అడుగుట | 1(1) | | | 1(1) | 1(2) | | | | | 1(1) | | | 4 | 5 |
| 3. | పిల్లి గ్రద్దను నమ్మించుట | 3(1) | | | 1(1) | 1(2) | | | | | | | | 5 | 6 |
| 4. | పిల్లి పక్షి పిల్లను భక్షించుట | 1(1) | 1(2) | | | | | | | 1(5) | 1(1) | | | 4 | 9 |
| | మొత్తం ప్రశ్నలు | 8 | | | 6 | | | 1 | | | 2 | | | 17 | |
| | మొత్తం మార్కులు | 10 | | | 8 | | | 5 | | | 2 | | | | 25 |

సూచన. : బ్రాకెట్లలోనివి ఆయా ప్రశ్నలకు కేటాయింపబడిన మార్కులు. బయటవి ప్రశ్నలు.
లక్ష్యా.ప్ర లక్ష్యాత్మక ప్రశ్నలు ఎ లఘు.ప్ర లఘూత్తర ప్రశ్నలు ఎ .వ్యా.ప్ర వ్యాసరూప ప్రశ్నలు.

6. **సమయ వివరణ పట్టిక (సమయ భారత్వ పట్టిక)**

| క్రమ సంఖ్య | ప్రశ్న రూపం | ప్రశ్నల సంఖ్య | సమయం |
|---|---|---|---|
| 1. | లక్ష్యాత్మక ప్రశ్నలు | 12 | 12 ని॥లు |
| 2. | లఘూత్తర ప్రశ్నలు | 5 | 10 ని॥లు |
| 3. | వ్యాస రూప ప్రశ్నలు | 1 | 8 ని॥లు |

## ప్రశ్నపత్రం (Question Paper)

పాఠశాల పేరు : తరగతి :

సబ్జెక్టు : తెలుగు కాలం : 30ని. లు

యూనిట్ (అంశం) : క్రొత్తగా వచ్చిన వారిని నమ్మరాదు మార్కులు : 25

సూచన : అన్ని ప్రశ్నలకు సమాధానాలను రాయవలెను.

**I.** క్రింది వానికి నాలుగేసి సమాధానాలీయబడినవి. వానిలో సరియైన దానిని కుండలీకరణం (బ్రాకెట్) లో గుర్తించుము. 3 x 1 = 3

1. జువ్వి వృక్షం ఈ తీరమందు కలదు ( )

ఎ. సరస్వతి బి. గంగ సి. యమున డి. భగీరథి

2. జరద్గవం ఎక్కడ నివశించుచుండెను ( )

ఎ. భాగీరథీ తీరంలో బి. వృక్షం తొఱ్ఱలో సి. వృక్షం కొమ్మల్లో డి. వృక్షం ఆకుల్లో

3. 'దయాళువు' పదానికి అర్థం ( )

ఎ. దయలేనివాడు బి. దయను ప్రసాదించువాడు

సి. దయకలవాడు డి. దయను పోగొట్టువాడు.

**II.** క్రింది వాని తప్పొప్పులను కుండలీకరణంలో గుర్తించుము : 3 x 1 = 3

4. 'వృక్షమెక్కి' విడదీయగా వృక్షము ఎక్కి ( )

5. పిల్లి మాంసంతో క్షుధ తీర్చుకొందుననెను ( )

6. ధనం లేని పక్షంలో చెడుమాటలతోనైనా సత్కరింపవలెను. ( )

**III.** క్రింది వానిని కుండలీకరణంలో జతపరుచుము 3 x 1 = 3

7. పాపం ఎ. కర్త

8. గృధం బి. క్రియ

9. అడిగెను    సి. పుణ్యం

IV. క్రింది వాని ఖాళీలను పూరింపుము    3 x 1 = 3

10. పిల్లి ..................................... వ్రతం చేయుచుండెను.

11. పక్షులు గ్రద్ధను ............................తో అక్కి చంపెను.

12. భూత దయ కలవాడే ............................చేసిన వాడు.

V. క్రింది వానికి లఘు (రెండు మూడు వాక్యాలలో ) సమాధానాలనిమ్ము.    4 x 2 = 8

13. గ్రద్ధను చూసిన పిల్లి ఏమనుకొనెను.

14. గ్రద్ధ దగ్గరకు పిల్లి ఎందుకు వచ్చెనని పలికెను

15. పిల్లి మాటలకు గ్రద్ధ ఏమనెను

16. పిల్లి గ్రద్ధను ఎలా నమ్మించినది

VI. క్రింది ప్రశ్నకు వ్యాసరూపంలో ఆరేడు వాక్యాలలో సమాధానాన్నిమ్ము.

17. క్రొత్తగా వచ్చిన వారిని నమ్మరాదు పాఠంలోని నీతిని వివరింపుము.

# Scoring Key & Marking Scheme

## I. లక్ష్యాత్మక ప్రశ్నలు

| ప్రశ్నలు | సమాధానాలు | మార్కులు | ప్రశ్నలు | సమాధానాలు | మార్కులు |
|---|---|---|---|---|---|
| 1 | D | 1 | 7 | C | 1 |
| 2 | B | 1 | 8 | A | 1 |
| 3 | C | 1 | 9 | B | 1 |
| 4 | ఒప్పు | 1 | 10 | చాంద్రాయణ | 1 |
| 5 | తప్పు | 1 | 11 | గోళ్ళ | 1 |
| 6 | తప్పు | 1 | 12 | సర్వధర్మములు | 1 |

## II. లఘూత్తర ప్రశ్నలు

మార్కులు

13. తప్పించుకొనుటకు ఉపాయాంతరం లేదు. కార్యం మించి పోయినది. ఇపుడు వెనుదీయరాదు. రోటిలో తలదూర్చి రోకటి పోటునకు వెరువ కూడదు. మంచితనం చూపి దీనికి నమ్మిక పుట్ట చేసెదను. 2

14. మీరు ధర్మజ్ఞులని, మంచివారని మీదగ్గరకు వచ్చాను. అంతే కాక మీరు వయో వృద్ధులు కాబట్టి మీ వలన ధర్మములు వినవలెననే మనసు కూడ కలదు. 2

15. పిల్లులకు మాంసమందు రుచి అధికంగా ఉండును. ఇక్కడ పక్షి పిల్లలున్నవి. అందుచేత ఆ విధంగా చెప్పితి ననెను. 2

16. చాంద్రాయణ వ్రతం చేయుచున్నాననీ, అడవిలో స్వచ్ఛందంగా ఆకుకూరలతో ఆకలి తీర్చుకొందుననీ, పాడు పొట్టకై పక్షిపిల్లలను భక్షించేంతటి పాపం చేయజాలనని పలికెను. 2

## III. వ్యాస రూప ప్రశ్నలు

17. 'క్రొత్తగా వచ్చిన వారిని నమ్మరాదు' పాఠంలో క్రొత్తగా వచ్చిన పిల్లిని చూసి గ్రద్ధ ముందుగా నమ్మక పోయినప్పటికీ, అది మాయమాటలతో అమాయకత్వాన్ని నటింపగా గ్రద్ద మోసపోయి దానికి తనదగ్గరే నివాసమిచ్చి దాని ప్రవర్తనపై సంపూర్ణంగా విశ్వాసముంచినది. దానిని బలహీనతగా తీసికొని పిల్లి తను వచ్చిన కార్యాన్ని గుట్టు చప్పుడు లేకుండా చేసికొని ఆ ఘోరకృత్యం గ్రద్ధయే చేసినట్లుగా నమ్మకం పుట్టే విధంగా ఋజువును కూడ చూపించి వెళ్ళి పోయినది. ఫలితంగా గ్రద్ధ శిక్షింపబడినది. అందువలన క్రొత్తగా వచ్చిని వారిని ఎట్టి పరిస్థితుల్లో నమ్మరాదు. 5

# మూల్యాంకన విశ్లేషణలు

ఉపాధ్యాయుని బోధనను, విద్యార్థుల అభ్యసనను విలువ కట్టే ఏకైక సాధనమే మూల్యాంకనమని తెలిసికొన్నాం. ఈ మూల్యాంకనం వివిధ సాధనాలతో, వివిధ రూపాల్లో ఉంటుందని కూడ తెలిసికొన్నాం. అనగా ఇది వివిధ లక్ష్యాలకు(Objects), వివిధ ప్రశ్నల (Questions) కు వివిధ విషయాలకు లేద ఉపవిభాగాలకు (Sub-Units), వివిధ అంశాలకు (Items) సంభందించినదిగా ఉంటున్నది. దీని వల్ల విద్యార్థి దేనిలో తక్కువగా ఉన్నాడో తెలిసికోవచ్చు. ఫలితంగా తగిన తర్ఫీదునివ్వవచ్చు. అందుకోసం విద్యార్థుల మూల్యాంకనాన్ని వివిధ రూపాలుగా విశ్లేషించి రికార్డు (నమోదు) చేయవలసి ఉన్నది. ఇట్టి వీటినే "మూల్యాంకన విశ్లేషణ"లంటారు. వీటిల్లో లక్ష్యానురూప విషయాను రూప ప్రశ్నాను రూప సమాధాను రూప అంశాను రూప విశ్లేషణలు పేర్కొనదగినవి. వీని విశ్లేషణా తీరు, పట్టికలు సాధారణంగా క్రింది విధంగా ఉంటాయి. ఈ వివిధ విశ్లేషణలు (Achievement Record) రాయటంలో దోహదపడగలవు.

## 1. **లక్ష్యానురూప విశ్లేషణ** (Objective Wise Analysis)

విద్యార్థులు వివిధ లక్ష్యాల్లో పొందిన పరిజ్ఞానాన్ని విశ్లేషించేదే లక్ష్యాను రూప విశ్లేషణ. దీని ద్వారా ఏయే విద్యార్థి ఏయే లక్ష్యాన్ని ఎంత మోతాదులో సాధించాడో అర్థమౌతుంది. ఇందుకోసం మూల్యాంకనం చేయబడిన లక్ష్యాల్ని గుర్తించాలి. సాధారణంగా అలక్ష్యాల జ్ఞానం (Knowledge) అవగాహన (Understand), సమన్వయం (Application), నైపుణ్యాలై (Skill) ఉంటాయి. వీటిల్లో నైపుణ్య - సమన్వయ స్థానాల్లో వ్యక్తీకరణ (Expression) ఉండవచ్చు( భాషకాబట్టి ). తరువాత ఏయే లక్ష్యంలో ఏయే విద్యార్థి ఎన్ని ప్రశ్నలకు సమాధానాలను రాశాడో తెలిసి కోవలెను. వీటిల్లో ఎన్ని ఒప్పులో, ఎన్ని తప్పులో, ఎన్ని వదిలివేయబడ్డాయో గుర్తించవలెను. మొత్తం మీద తప్పులు ఒప్పులు వదిలివేయబడ్డ వానిని కూడ గుర్తించటం మేలు. దీనికి సంబంధించిన నమూన పట్టిక (Model) క్రింది విధంగా ఉండవచ్చు.

| క్ర.సం. | విద్యార్థి పేరు | లక్ష్యాలు | | | | | | | | | | | | మొత్తం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | జ్ఞానం | | | అవగాహన | | | సమన్వయం | | | నైపుణ్యం | | | | | |
| | | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ |
| 1 | రమేష్ | - | 7 | - | 4 | 1 | - | 2 | - | - | 2 | 1 | - | 8 | 9 | - |
| 2 | | | | | | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | | | | | |

ఉదా :- పై పట్టికలో రమేష్ అనే విద్యార్థి మొత్తం ప్రశ్నలన్నింటినీ రాశాడనీ, అయితే వీటిల్లో 9 ఒప్పులు కాగా 8 తప్పులని తేలుతుంది. అంతే కాక ఆ విద్యార్థి జ్ఞానమనే లక్ష్యంలోని

ప్రశ్నలన్ని రాశాడనీ, అన్నీ ఒప్పులేననీ తెలుస్తున్నది. దీనిని బట్టి జ్ఞానమనే లక్ష్యం అతనిలో సంపూర్ణంగా సాధింపబడినదనీ, మిగిలిన వాటిల్లో, పరిజ్ఞానం దాదాపు శూన్యమని అర్థమౌతుంది.

## 2. విషయానురూప విశ్లేషణ (Content wise Anylisis)

ఆయా విషయాలకు సంబంధించి (సబ్ యూనిట్ )విద్యార్థుల పరిజ్ఞానాన్ని విశ్లేషించేదే విషయానురూప విశ్లేషణ. ఏయే విద్యార్థికి ఏయే విషయాల్లో (సబ్ యూనిట్స్) లో ఎంత మాత్రం పరిజ్ఞానం లభించింది తెలిసిపోతుంది. అందుకోసం ఎన్ని విషయాలు (Contents) మూల్యాంకనం చేయబడ్డాయో గుర్తింపవలెను. తరువాత ఒక్కొక్క విద్యార్థి ఒక్కొక్క విషయంలో ఎన్ని ప్రశ్నలకు సమాధానాలు రాశాడో, వాటిల్లో ఎన్ని తప్పులో , ఎన్ని ఒప్పులో, ఎన్ని వదిలివేయ బడ్డాయి. అలాగే మొత్తం రాసిన సమాధానాల్లో తప్పులు -ఒప్పులు - వదిలి వేయబడిన వానిని గుర్తించడం కూడ మంచిదే.

దీనికి సంబంధించి నమూనా పట్టిక క్రింది విధంగా ఉన్నది

| క్ర.సం. | విద్యార్థి పేరు | సబ్ యూనిట్ల లేద విషయాల పేర్లు లేద నెంబర్లు | | | | | | | | | | | | మొత్తం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | విషయం -1 | | | విషయం -2 | | | విషయం -3 | | | విషయం -4 | | | | | |
| | | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ |
| 1 | గణేష్ | 3 | - | 1 | 4 | - | - | 2 | 5 | - | - | - | 2 | 9 | 5 | 3 |
| 2 | | | | | | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | | | | | |

ఉదా:- పైపట్టికలో గణేష్ అనే విద్యార్థి మొత్తం ప్రశ్నలు రాయలేదని, రాసినవి కూడ ఎక్కువగా తప్పులని అయితే 'విషయం-3' లో మాత్రం ఎక్కువ ఒప్పులు రాశాడని దీనిని బట్టి అతనికి మిగిలిన విషయాలకన్నా విషయం-3 బాగా అర్థమైందని తెలుస్తున్నది.

## 3. ప్రశ్నానురూప విశ్లేషమ (Question Wise Analysis)

మూల్యాంకనానికి ఇవ్వబడిన వివిధ రకాలైన ప్రశ్నల్ని విశ్లేషించేదే ప్రశ్నాను రూప విశ్లేషణ. దీని వలవ విద్యార్థులు ఏరకమైన ప్రశ్నలకు సమాధానం రాసినదీ, వానిలో ఒప్పైనవీ, తప్పైనవీ, వదిలివేయబడినవీ ఏవనే విషయం తెలుస్తుంది. దీనిని బట్టి ఏ రకమైన ప్రశ్నలనైతే ఎక్కువ మంది విద్యార్థుల బాగా రాశారో వానికి కొంచెం ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతుంది. అందుకోసం మూల్యాంకనానికి ఇవ్వబడిన ప్రశ్నల రకాలన్నింటినీ లక్ష్యాత్మక - లఘూత్తర - వ్యాస రూప మొ..న రీతుల్లో గుర్తింపవలెను. ఆ తరువాత ఒక్కొక్క విద్యార్థి ఆయా వివిధ రకాల ప్రశ్నల్లో రాసిన వానిని, వాటిల్లో ఒప్పులైన వానిని, తప్పులైన వానిని, వదితివేసిన వానిని గుర్తింపవలెను. ఈ క్రింధిది దీనికి సంబంధించిన నమూన పట్టిక.

| క్ర.సం. | విద్యార్థి పేరు | లక్ష్యాత్మక ప్రశ్నలు | | | | | | | | | | | | లఘూత్తర ప్రశ్నలు | | | వ్యాసరూప ప్రశ్నలు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | బహుళైచ్ఛిక ప్రశ్నలు | | | తప్పొప్పులు | | | ఖాళీలు | | | జతపఱుచుట | | | | | | | | |
| | | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ |
| 1. | రాజేష్ | - | 3 | - | - | 3 | - | - | 3 | - | - | 3 | - | 1 | 2 | 1 | - | - | 1 |
| 2. | | | | | | | | | | | | | | | | | | | |
| 3. | | | | | | | | | | | | | | | | | | | |
| 4. | | | | | | | | | | | | | | | | | | | |

ఉదా:- పై పట్టికలో రాజేష్ అనే విద్యార్థి లక్ష్యాత్మక ప్రశ్నలన్నింటినీ రాశాడు. అన్ని సరైన సమాధానాలే. అయితే లఘూత్తర ప్రశ్నల్లో కొన్నింటిని వదిలి వేయటం, కొన్ని తప్పులు పోవటం జరిగింది. వ్యాసరూప ప్రశ్నల్ని అసలు రాయలేదు. దీనిని బట్టి ఆ విద్యార్థికి లక్ష్యాత్మక ప్రశ్నల పట్ల సరైన అవగాహన ఉందనీ, వ్యాస రూప ప్రశ్నల పట్ల అవగాహనే లేదని చెప్పవచ్చు.

## 4. **సమాధానురూప విశ్లేషణ** (Scrip Wise Analysis)

వివిధ రకాలైన ప్రశ్నలకు విద్యార్థులు రాసిన సమాధానాల్ని విశ్లేషించేదే సమాధాను రూప విశ్లేషణ. దీని వలన ఏ రకమైన ప్రశ్నకు ఏ రకమైన సమాధానం వచ్చిందనే విషయం తెలుస్తుంది. దీని ననుసరించి ప్రశ్న స్థాయిని కాని, రూపాన్ని కాని మార్చుకోటానికి వీలుంది. అలాగే విద్యార్థి స్థాయిని కూడ అంచనా వేయవచ్చు. అందుకోసం ఇవ్వబడిన ప్రశ్నల రూపాల్ని, వాని స్థాయిల్ని (సులభం, కఠినం, సామాన్యం) గుర్తించవలెను. ఆ తరువాత వాటికి ఒక్కొక్క విద్యార్థి రాసిన సమాధానాల్ని, వాటిల్లో తప్పొప్పుల్ని, వదిలివేసిన వానిని గుర్తింపవలెను. **అలాగే విద్యార్థులు** పొందిన మార్కుల్ని కూడ గుర్తించడం మేలు. దీనికి సంబంధించిన నమూన పట్టిక క్రింది విధంగా ఉండవచ్చు.

| క్ర.సం. | విద్యార్థి పేరు | ప్రశ్నల రూపం, స్థాయి | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | మార్కులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | లక్ష్యాత్మక ప్రశ్నలు | | | | | | | | | లఘూత్తరప్రశ్నలు | | | | | | | | | వ్యాసరూపప్రశ్నలు | | | | | | | | | |
| | | సులభం | | | కఠినం | | | సామాన్యం | | | సులభం | | | కఠినం | | | సామాన్యం | | | సులభం | | | కఠినం | | | సామాన్యం | | | |
| | | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | త | ఒ | వ | |
| 1. | సతీష్ | - | 3 | - | - | - | 2 | 2 | 5 | - | - | 1 | - | - | - | 1 | 1 | 1 | - | - | - | - | - | - | 1 | - | - | - | 11 |
| 2. | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 3. | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 4. | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |

ఉదా.. పై పట్టికలో సతీష్ అనే విద్యార్థి సులభంగా ఉండే ప్రశ్నల్ని బాగా రాశాడు. సామాన్యంగా ఉండే ప్రశ్నల్ని ఒక రకంగా రాశాడు. కఠినంగా ఉండే వాటిని అసలు రాయలేదు. దీనిని బట్టి అతడు మందబుద్ధి, మేధావి కాక సామాన్య ప్రజ్ఞావంతుడి చెప్పవచ్చు.

## 5. అంశాను రూప విశ్లేషణ (Item wise Analysis)

ఏదైనా అంశాన్ని గ్రహించి దానిని వివిధ రూపాల్లో విశ్లేషించటాన్నే సాధారణంగా అంశాను రూప విశ్లేషణ అంటారు. సాధారణంగా అంశం లక్ష్యమై ఉంటుంది. అనగా వివిధ లక్ష్యాల్ని గుర్తించి, వీనిలో ఒక్కొక్క లక్ష్యాన్ని తీసికొని దాని స్పష్టీకరణను, సబ్‌యూనిట్‌ను(Content), ప్రశ్నల రూపాన్ని (అనగా లక్ష్యాత్మకం, లఘూత్తరం, వ్యాసరూపం, ) వాని స్థాయిని అనగా (సులభం, సమాన్యం, కఠినం,) కేటాయించబడిన మార్కుల్ని , సమయాన్ని గుర్తించవలెను. దీని వలన మూల్యాంకన స్వరూపమంతా దాదాపుగా తెలుస్తుంది. దీనికి సంబంధించిన నమూనా పట్టిక క్రింది విధంగా ఉండవచ్చు.

| క్ర. సం. | లక్ష్యం పేరు | స్పష్టీకరణ | సబ్ యూనిట్ పేరు-ఉపవిభాగపు పేరు | ప్రశ్న రూపం | మార్కులు | సమయం | స్థాయి |
|---|---|---|---|---|---|---|---|
| 1. | | | | | | | |
| 2. | | | | | | | |
| 3. | | | | | | | |
| 4. | | | | | | | |

# IX. ప్రణాళిక రచన

ఆవశ్యకత

వ్యక్తి ఏదైనా పనిని చేయాలనుకొన్నపుడు దానిని చేయగల సామర్థ్యం ఉండవలెను. తరువాత దానిని చేయటంలోని ఉద్దేశాల్ని (లక్ష్యాల్ని) నిర్దేశించుకోవలెను. అయితే ఆ ఉద్దేశాలు నెరవేరే విధంగా అతడా పనిని చేయటానికి తన సామర్థ్యం ఒకటే సరిపోదు. దానికి తగిన ఆలోచన ఉండవలెను. అంటే ఆ పనిని ఎలా ప్రారంభించాలి ?ఎలా ముగించాలి? మధ్యలో ఎలా చేయాలి మొ..న వానినన్నింటినీ అతడు ఆలోచించాలి. అనగా తనకున్న సామర్థ్యాన్ని ఉపయోగించుకొంటూ లక్ష్య సాధన కనుకూలంగ నియమిత కాలంలో ఆ పనిని సంపూర్ణం చేయటానికి తగిన విధానాన్ని లేదా పథకాన్ని అతడు ఖచ్చితంగా నిర్ణయించుకోవలెను. ఈ పథకాన్నే 'ప్రణాళిక' (Plan) అంటున్నాం. విద్యాబోధన కూడా ఒక గొప్ప కార్యమే. ఈ కార్య సాధకుడు ఉపాధ్యాయుడు.. ఇతనికెంతటి సామర్థ్యమున్నా నిర్దిష్ట లక్ష్య సాధనకోసం బోధనా విధానాన్ని గూర్చి అతడు తప్పక ఆలోచించవలసి ఉన్నది. అంటే ఏయే బోధనాంశాల్ని, ఏయే సమయాల్లో, ఎంతెంత మోతాదుల్లో, ఏ విధంగా బోధించాలో మొ..న వానికి సంబంధించి బాగా ఆలోచించి ఒక పథకాన్ని తయారు చేసికోవలెను. దీని నే ' ప్రణాళిక రచన' అంటున్నారు. ఇది లేకుండా బోధనలో ప్రవేశించటమంటే మార్గం తెలియకుండా పద్మవ్యూహంలో ప్రవేశించటమన్నట్లే.

## ప్రణాళికా రచనలో గుర్తింపదగ్గ విషయాలు

1. ఆయా తరగతుల పాఠాలన్నిటినీ పరిశీలించి అందలి లక్ష్యాల్ని-స్పష్టీకరణల్ని నిర్ధారించుకోవలెను.2. ఆయా పాఠాలన్నింటినీ కొన్ని యూనిట్లుగా విభజించుకోవలెను.3. ఒక్కొక్క యూనిట్ ఒక్కొక్క సంపూర్ణాంశంగా ఉండవలెను. 4. యూనిట్లు మరీ చిన్నవి కాక, మరీ పెద్దవి కాక 20 నుంచి 30 కి (మొత్తం పాఠాలన్ని కలిసి) లోపుగా ఉండటం మంచిది.5. అన్ని యూనిట్లను కలిపి మొత్తం సంవత్సరానికి గాను వార్షిక ప్రణాళిక తయారు చేసికోవలెను. 6. పద్యం - గద్యం - ఉపవాచకం - వ్యాకరణం మొ..న వానికి సంబంధించి ఒక్కొక్క దానికి ఒక్కొక్కటి చొప్పున యూనిట్ ప్రణాళికలను తయారు చేసికోవలెను.7. యూనిట్‌లోని సబ్‌యూనిట్లకు (ఉపవిభాగాలకు) ఒక్కొక్క దానికి ఒక్కొక్కటి చొప్పున పాఠ్య ప్రణాళికలను తయారు చేసికోవలెను. ఈ వివిధ రకాలైన ప్రణాళికలను క్రింది విధంగా తయారు చేయవలెను.

### 1. వార్షిక ప్రణాళిక (Annual Plan)

సంవత్సర కాలంలో మొత్తం పాఠాల్ని బోధించటానికి తయారు చేసే ప్రణాళికనే వార్షిక ప్రణాళిక అంటారు. సంవత్సరమంతా బోధింపవలసిన పాఠాలన్నింటినీ కొన్ని యూనిట్లుగా విభజించుకొని, వాని నన్నింటినీ బోధించటానికి లభ్యమయ్యే కాల వ్యవధుల్ని (Periods) చూసి కోవలెను. తరువాత ఒక్కొక్క యూనిట్ బోధించటానికి అవసరమయ్యే కాలవ్యవధుల్ని గుర్తించవలెను. పాఠాలన్నీ పద్య - గద్య - ఉపవాచక వ్యాకరణ లిఖిత రచన సహప్రణాళికా కార్యకలాపాలకు సంబంధించినవిగా ఉండడం వలన వీనినన్నింటినీ ఒకదాని తరువాత మరియొక

దానిని (అనగా పద్య పాఠాలన్నింటినీ బోధించిన తరువాత గద్య పాఠాలు, వీటినన్నింటినీ బోధించిన తరువాత ఉపవాచకాలు అలా మిగిలిన అంశాలు..) బోధించేటట్లైతే అన్నింటికీ కలిపి ఒకే వార్షిక ప్రణాళికను తయారు చేసికోవచ్చు. అప్పుడు ఒక్కొక్క భాగాన్ని అనగా పద్య భాగం, గద్య బాగం ఇలా సంపూర్ణంగా బోధించటానికి అవసరమయ్యే కాలం ఆ ధారంగా వార్షిక ప్రణాళికను తయారు చేయవలెను. (అనగా పద్యానికి జూన్, జులై, ఆగష్టు, సెప్టెంబరు, గద్యానికి అక్టోబర్, నవంబర్, డిశంబర్, అలా..) ఈ రకమైన వార్షిక ప్రణాళికను తయారు చేసే నమూనా క్రింది విధంగా ఉండును.

**నమూన వార్షిక ప్రణాళిక -1**

ఉపాధ్యాయుని పేరు : పాఠశాల పేరు :

బోధించు తరగతి : కాలవ్యవధులు :

సబ్జెక్టు : యూనిట్లు :

నెలలు :

| క.సం. | యూనిట్ పేరు | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | పద్యం | గద్యం | ఉపవాచకం | లిఖిత రచనలు | సహ ప్రణాళికా కార్యక్రమాలు | నెల సం. | కాల వ్యవధీ |
| 1 | | | | | | | |
| 2. | | | | | | | |

అయితే పై వార్షిక ప్రణాళికకు అనుకూలంగా పాఠశాలలలో బోధన సాగటం లేదు. కారణం ఒకే అంశాన్ని దీర్ఘకాలంలో సంపూర్ణంగా బోధించి దానిని వదలి, రెండో అంశాన్ని మరలా మొదటి దాని మాదిరి దీర్ఘకాలంలో సంపూర్ణంగా బోధించే సమయానికి మొదటి దానిని సంపూర్ణంగా మఱిచిపోయే ప్రమాదం ఉన్నది. అందుకే నేమో పాఠశాలలలో ఆ విధంగా కాక పద్య గద్యాది ప్రక్రియలన్నింటినీ ఒక్కొక్కొ దానిలో కొంత కొంత ప్రకారం ఒకేసారి బోధించడం జరుగుతున్నది. ఉదా. 6 వారానికి కాలవ్యవధులు లభిస్తే అందులో 2 పద్యానికి, 2 గద్యానికి, 1 ఉపవాచకానికి, 1 వ్యాకరణానికి అలా కేటాయించుకొని బోధించటం. ఈ విధంగా పాఠాల్ని బోధిస్తున్నపుడు అన్నింటిని కలిపి ఒకదానిలో కాక ఒక్కొక్క ప్రక్రియకు ఒక్కొక్క వార్షిక ప్రణాళికను తయారు చేయవలసి ఉన్నది. అనగా పాఠాలన్నీ పద్యం, గద్యం, ఉపవాచకం, వ్యాకరణం, లిఖిత రచనలు, ఇతర సహ ప్రణాళికా కార్యకలాపాలు అనే ఆరంశాలకు (ఆరు ప్రక్రియలకు)సంబంధించినవిగా ఉండడం వలన ఒక్కొక్క దానికి ఒక్కొక్కటి చొప్పున విడివిడిగా 6 వార్షిక ప్రణాళికల్ని తయారు చేసికోవలెను. అయితే ఈ ఆరంశాలలో ఒక్కొక్క దానిని బోధించటానికి మొత్తం కాలవ్యవధుల్లో ఎన్ని అవసరమౌతాయో నిర్ణయించుకోవలెను. ఉదా.. పద్యానికి 60, గద్యానికి 60, ఉపావాచకానికి 20, వ్యాకరణానికి 10, లిఖిత రచనలకు 20, సహ ప్రణాళికా కార్యకలాపాలకు 10 (మొత్తం కాలవ్యవధులు180) కాలాలని అని సుమారుగా నిరయించుకోవలెను. తరువాత ఒక్కొక్క

అంశంలో ఎన్ని పాఠాలున్నాయో చూసుకొని ఒక్కొక్క దానికి ఎన్ని కాలవ్యవధులు అవసరమౌతాయో నిర్ణయికోవలెను. ఉదా.. పద్యభాగంలో 10 పాఠాలున్నాయనుకొంటే పదింటినీ బోధించటానికి 60 కాలవ్యవధుల్ని నిర్ణయించుకొంటే ఒక్కొక్క దానిని బోధించటానికి సగటున 6 లభిస్తాయి. అంటే ఒక్క యూనిట్‌ను (పాఠాన్ని) సబ్ యూనిట్లుగా (ఉపవిభాగాలుగా ) విభజించుకొని ఒక్కొక్క దానిని ఒక్కొక్క కాలవ్యవధిలో బోధింపవలసి ఉన్నది. వారానికి లభ్యమయ్యే 6 కాలవ్యవధుల్లో అనేక పాఠాల్ని (పద్యం, గద్యం, వ్యాకరణం)అలా బోధింప వలసి ఉండటం వలన ఒక్కొక్క పాఠం పూర్తి అయ్యే నాటికి నెల రోజులు దాటి పోవచ్చు. అందువల్ల నెలను కూడ గుర్తింపవలెను. పాఠానికి లక్ష్యాల్ని కూడ నిర్ణయించుకోవలెను. ఇదే రీతిలో అన్ని అంశాలలోని పాఠాలకు లక్ష్యాల్ని, సబ్ యూనిట్లను, కాలవ్యవధుల్ని, నెలలను నిర్ణయింపవలెను. తరువాత ఆయా అంశాలకు (పద్యం - గద్యం -వ్యాకరణం ము) సంబంధించిన వార్షిక ప్రణాళికల్ని తయారు చేయవలెను. విద్యా సంవత్సరం ప్రారంభం నాటికే వీటిని తయారు చేయవలెను. పద్య వార్షిక ప్రణాళికా నమూనా క్రింది విధంగా ఉండును.

**నమూనా వార్షిక ప్రణాళిక -2**

ఉపాధ్యాయుని పేరు : పాఠశాల పేరు :

బోధించు తరగతి : కాలవ్యవధులు :

సబ్జెక్టు : తెలుగు యూనిట్ల సంఖ్య :

ప్రక్రియ (భాగం) : పద్య భాగం

| క్ర. సం. | యూనిట్ పేరు/ పాఠం పేరు | లక్ష్యాలు | సబ్‌యూనిట్లు/ ఉపవిభాగం | కాలవ్యవధులు | బోధించే నెల | పాఠ్యపుస్తకం లోని పుటలు |
|---|---|---|---|---|---|---|
| 1. | | | | | | |
| 2. | | | | | | |

మిగిలిన వానికి కూడ ఇదే నమూనాలో వార్షిక ప్రణాలికల్ని తయారు చేయవలసి ఉన్నది.

## 2. యూనిట్ ప్రణాళిక (Unit Plan)

ఒక్కొక్క యూనిట్‌ను (దాదాపు పాఠాన్ని )బోధించటానికి తయారు చేసే ప్రణాళికనే యూనిట్ ప్రణాళిక అంటారు. సంవత్సరమంతా బోధింపవలసిన పాఠాలు పద్యం - గద్యం - ఉపవాచకం - వ్యాకరణం - లిఖిత రచనలు, సహ ప్రణాళికా కార్యకలాపాలు అనే అంశాలుగా విభక్తమై ఉంటాయి. వీటిల్లో ఒక్కొక్క దానిలో ఒక్కొక్క యూనిట్‌ను (దాదాపు పాఠాన్ని) తీసికొని యూనిట్ ప్రణాళికను తయారు చేయవలెను. యూనిట్ కు సంబంధించిన లక్ష్యాల్ని - స్పష్టీకరణల్ని గుర్తింపవలెను. యూనిట్‌ను కొన్ని సబ్ యూనిట్లుగా విభజించి, ఒక్కొక్క దానిని బోధించటానికి అవసరమయ్యే కాల వ్యవధుల్ని నిర్ణయించుకోవలెను. ఆయా అంశాల బోధనా సమయంలో ఉపాధ్యాయ విద్యార్థుల కార్య కలాపాల్ని గుర్తింపవలెను. అవసరమయ్యే ఉపకరణాల్ని,

మూల్యాంకనాన్ని కూడ నిర్ణయించుకోవలెను. వీటి అన్నింటి ఆధారంగా అన్ని యూనిట్లకు (లిఖిత రచనలకు, సహప్రణాళికా కార్యకలాపాలకు అవసరం లేదు) యూనిట్ ప్రణాళికలను తయారు చేయవలెను. నమూనా ప్రణాళిక క్రింది విధంగా ఉంటుంది.

**నమూనా యూనిట్ ప్రణాళిక**

ఉపాధ్యాయుని పేరు : పాఠశాల పేరు :

బోధించు తరగతి : సబ్ యూనిట్లు :

సబ్జెక్టు : కాలవ్యవధులు :

యూనిట్ : పాఠం పేరు

| క్ర. నం. | సబ్ యూనిట్ పేరు | లక్ష్యాలు స్పష్టీకరణలు | విషయ విశ్లేషణ | ఉపాధ్యాయ కార్యకలాపాలు | విద్యార్థి కార్యకలాపాలు | ఉప కరణాలు | మూల్యాంకనం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | | | | | | | |
| 2. | | | | | | | |

3. పాఠ్య ప్రణాళిక (Lesson Plan)

యూనిట్‌లోని సబ్ యూనిట్‌ను (ఉపవిభాగాన్ని) బోధించటానికి తయారుచేసే ప్రణాళికనే పాఠ్య ప్రణాళిక అంటారు. యూనిట్‌ను కొన్ని సబ్‌యూనిట్లుగా విభజించుకొని ఒక్కొక్క దానిని బోధించటానికి అవసరమయ్యే కాలవ్యవధుల్ని గుర్తింపవలెను. సాధారణంగా ఒక్క కాలవ్యవధి సరిపోతుంది. ఒక్కొక్క సబ్‌యూనిట్‌ను బోధించవలసిన లక్ష్యాల్ని స్పష్టీకరణల్ని గుర్తింపవలెను. అలాగే సబ్ యూనిట్‌ను ఒక క్రమంలో బోధించటానికి కొన్ని సోపానాల్ని ఏర్పాటు చేసికోవలెను. ఒక్కొక్క సోపానికి అవసరమయ్యే కాలాన్ని కూడా గుర్తించటం మంచిది. బోధనలోని ఉపాధ్యాయ, విద్యార్థుల కృత్యాల్ని తయారు చేసికోవలెను. అవసరమయ్యే ఉపకరణాల్ని, మూల్యాంకనాన్ని కూడ సిద్ధం చేసికోవలెను. నల్లబల్ల ప్రాధాన్యాన్ని గుర్తింపవలెను. బోధనను సాగించే సంవిధానాన్ని కూడ నిర్ణయించవలెను. వీటి అన్నింటి ఆధారంగా సబ్ యూనిట్లకు పాఠ్య ప్రణాళికల్ని తయారు చేయవలెను. నమూనా ప్రణాళిక క్రింది విధంగా ఉండును.

**నమూనా పాఠ్య ప్రణాళిక**

ఉపాధ్యాయుని పేరు : పాఠశాల పేరు :

బోధించు తరగతి : సబ్ యూనిట్ (శీర్షిక)

సబ్జెక్టు : కాలవ్యవధులు :

యూనిట్ :

| క్ర. నం. | సోపానాలు | లక్ష్యాలు - స్పష్టీకరణలు | ఉపాధ్యాయ కృత్యాలు | విద్యార్థి కృత్యాలు | బోధనా సంవిధానం | బోధనోప కరణాలు | నల్లబల్ల పని | మూల్యాంకనం. |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | |

# ఆధార భూమిక


1. ఆధునికాంధ్ర కవిత్వం - ఆచార్య సి. నారాయణ రెడ్డి
2. సమగ్రాంధ్ర సాహిత్యం - ఆరుద్ర
3. తెలుగు సాహిత్య సమీక్ష - ఆచార్య జి. నాగయ్య
4. తెలుగు సాహిత్యంలో దేశికవిత - ఆర్. వి. యస్. సుందరమ్
5. సాహిత్య సమీక్ష - ఆచార్య పి. లక్ష్మీకాంతం
6. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - డా. వి. నారాయణరావు
7. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర - డి. వేంకటావధాని
8. సంస్కృత సాహిత్య చరిత్ర - డా. ఎమ్. గోపాల రెడ్డి & డా. ఎమ్. సుజాతా రెడ్డి
9. బాల వ్యాకరణం - పరవస్తు చిన్నయ సూరి
10. ఆంధ్ర భాషా చరిత్ర - టి. భాస్కరరావు
11. లఘు కౌముది మార్గదర్శిని - ఆచార్య యస్. రఘునాథశర్మ
12. తెలుగు ఛందో వికాసం - డా. కె. సంపత్కుమారాచార్య
13. తెలుగు అలంకార శాస్త్ర వికాసం - డా. వి. బాలి రెడ్డి
14. కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్య - యస్. సూర్యనారాయణ శాస్త్రి
15. తెలుగు బోధనా సర్వస్వం - ఆర్. వేంకటశేషయ్య
16. తెలుగు బోధనా పద్ధతులు - తెలుగు అకాడమీ
17. తెలుగు బోధనా ప్రదీపిక - ఆర్. రంగారావు
18. తెలుగు భాష బోధనా పద్ధతులు - ఎమ్. జోసఫ్
19. మాతృ భాష బోధనా పద్ధతులు - బి. వెంకటప్పయ్య
20. Telugu Language & Methods of Teaching - Dr. S. Subrahmanyam

# ప్రశ్నలు

## I. భాష

1. భాషా నిర్వచనాన్ని తెలపండి
2. భాషోత్పత్తి వాదాల భాష (పుట్టుక వాదాల )గూర్చి రాయండి
3. భాషావశ్యకతను, ప్రయోజనాలను తెలవండి
4. ప్రపంచ భాషల వర్గీకరణను గూర్చి రాయండి
5. భారతీయ భాషల గుర్చి రాయండి
6. ద్రావిడ భాషల గూర్చి రాయండి
7. ద్రావిడ భాషల్లో తెలుగు ప్రాథాన్యాన్ని గణించండి

## II. తెలుగు భాష

8. ఆంధ్రం -తెలుగు -తెనుగు శబ్దాల (పదాల ) పుట్టుకను గూర్చి రాయండి
9. ఆంధ్ర శబ్దం దేశ పరంగా, తెలుగు శబ్దం భాషా పరంగా స్థిరపడటాన్ని గూర్చి రాయండి
10. తెలుగు భాష క్రమ వికాసాన్ని రాయండి
11. వివిధ కాలాలలో తెలుగు భాష పరిణమించిన తీరును రాయండి
12. తెలుగులో కావ్య -వాడుక భాషలు రెండూ కలిసి పోయిన రీతిని రాయండి
13. తెలుగు భాష పుట్టుకను గూర్చి రాయండి
14. తెలుగులోని అన్యదేశీయ పదజాలాన్ని రాయండి
15. తెలుగు ద్రావిడ భాషా జన్యం - వివరింపుము
16. తెలుగు సంస్కృత జన్యమా ? లేక ద్రావిడ జన్యమా? చర్చింపుము
17. తెలుగు పుట్టినిల్లు " ద్రావిడమైతే మెట్టినిల్లు సంస్కృతం" నిరూపింపుము
18. ద్రావిడ భాషలకు తెలుగుకు ఉన్న సంబంధాన్ని రాయుము
19. తెలుగు సంస్కృత జన్యమనే వాదనను వివరింపుము
20. ధ్వని ఉత్పత్తిని రాయండి
21. ధ్వనుల వర్గీకరణను రాయండి
22. తెలుగు అచ్చుల గురించి వ్రాయండి
23. తెలుగు హల్లుల గురించి వ్రాయండి
24. తెలుగు లిపి పరిణామాన్ని రాయండి

25. తెలుగు భాషా భాగాల గురించి రాయండి
26. తెలుగు క్రియల గురించి రాయండి
27. తెలుగు నామవాచకాల గురించి రాయండి
28. అవ్యయాల గురించి రాయండి
29. తెలుగులో భాషోద్యమాన్ని గురించి రాయండి
30. గ్రాంథిక భాషను గురించి,వివరించండి
31. వ్యావహారిక భాషను గురించి వివరించండి
32. మాండలిక భాషను గుర్చి రాయండి
33. ప్రామాణిక భాషను వివరించండి
34. అధికార భాషను గుర్చి రాయండి
35. తెలుగు భాషపై అన్య భాషల ప్రభావాన్ని గుర్చి వివరించండి
36. తెలుగు భాష పై సంస్కృత భాషా ప్రభావాన్ని అంచనా వేయండి
37. తెలుగు భాషపై ఆంగ్లభాషా ప్రభావాన్ని నిరూపించండి
38. తెలుగు భాషా బోధనపై అన్యభాషల బోధనా ప్రభావాన్ని రాయండి
39. తెలుగు భాషా బోధనపై సంస్కృత భాషా బోధనా ప్రభావం ఉందని ఎట్లు చెప్పగలవు
40. 'ఆధునిక తెలుగు భాషా బోధన ఆంగ్ల భాషా బోధనా ప్రభావంతో ముడిపడి ఉన్నది నిరూపించుము.

## III. తెలుగు సాహిత్యం

41. సాహిత్యమంటే ఏమిటి ? సమాజంలో దాని స్థానమేమిటి?
42. తెలుగు సాహిత్య క్రమవికాసాన్ని సమీక్షించండి
43. తెలుగు సాహిత్య ప్రారంభాన్ని రాయండి
44. 15 వ శతాబ్దంలోని తెలుగు సాహిత్యాన్ని గుర్చి వ్రాయండి
45. 16 వ శతాబ్దపు తెలుగు సాహిత్యంలోని విశేషాల్ని వివరించండి
46. తెలుగు సాహిత్య యుగ విభజనను గుర్చి రాయండి
47. మహాకవుల ఆధారంగా చేసిన యుగవిభజనను వివరించండి
48. ఆంధ్ర సాహిత్యంలోని వివిధ సాహిత్య ప్రక్రియలను సమీక్షింపుము
49. ఆంధ్ర సాహిత్యంలోని ప్రాచీన ప్రక్రియల్ని వివరింపుము
50. పురాణాన్ని గుర్చి వ్రాయండి
51. ఇతిహాసాన్ని తెలపండి
52. కావ్యాన్ని గురించి వివరించండి

52a. ప్రబంధాన్ని గురించి తెలపండి
53. శతకాన్ని గూర్చి రాయండి
54. నాటకాన్ని గుర్చి వివరించండి
55. ఆంధ్ర సాహిత్యంలోని ఆధునిక ప్రక్రియలను రాయండి
56. నవలను గూర్చి తెలపండి
57. కథానికను గుర్చి వివరించండి
58. జీవిత చరిత్రను గూర్చి రాయండి
59. స్వీయ చరిత్రను వివరించండి
60. వ్యాసాన్ని గూర్చి రాయండి
61. విమర్శను గురించి వివరించండి
62. పరిశోధనను గూర్చి రాయండి
63. తెలుగు సాహిత్యంలోని వివిధ కవితా ధోరణులను సమీక్షింపుము
64. సంప్రదాయ కవిత్వాన్ని గూర్చి రాయుము
65. భావ కవిత్వాన్ని వివరించండి
66. అభ్యుదయ కవిత్వాన్ని వివరించండి
67. దిగంబర కవిత్వంలోని విశేషాల్ని తెలపండి
68. విప్లవ కవిత్వాన్ని గూర్చి రాయండి
69. మినీ కవిత్వాన్ని వివరించండి
70. సంధిని నిర్వచించి, ప్రయోజనాలను రాయండి
71. తెలుగు భాషలోని సంధి విధానాన్ని వివరించండి
72. సమాసాన్ని నిర్వచించించి, ప్రయోజనాలను రాయండి
73. తెలుగులోని సమాస విధానాన్ని తెలపండి
74. అలంకార నిర్వచనాన్ని తెలిపి, ప్రాధాన్యాన్ని అంచనా వేయండి
75. ఛందస్సు ప్రాథాన్యాన్ని తెలపండి
76. తెలుగు ఛందో విధానాన్ని వివరించండి

## IV. మాతృ భాషగా తెలుగు

77. మాతృ భాషను నిర్వచించి, ప్రాథాన్యాన్ని వివరించండి
78. మాతృ భాష ప్రయోజనాలను రాయండి
79. విద్యా వ్యవస్థలో మాతృభాష స్థానాన్ని అంచనా వేయండి
80. మాతృ భాష బోధనా విలువల్ని వివరించండి
81. పాఠ్య ప్రణాళికలో మాతృ భాష స్థానాన్ని గూర్చి రాయండి
82. బోధనా మాధ్యంగా మాతృ భాషను చర్చించండి

84. మాతృభాషా బోధకుని లక్ష్యాల్ని - స్పష్టీకరణల్ని వివరించండి
85. మాతృ భాషా బోధకుని లక్షణాలను వివరించండి
86. మాతృ భాషా బోధకుని ప్రత్యేకతను గణించండి
87. మాతృ భాషా బోధకుడు జాతికి ప్రతినిధి - వివరించండి.
88. త్రిభాషా సూత్రాన్ని రాయండి
89. త్రిభాషా సూత్ర ప్రాధాన్యాన్ని తెలపండి
90. జాతీయ సమైక్యతలో త్రిభాషా సూత్ర స్థానాన్ని నిర్ణయించండి
91. ద్వితీయ భాషగా తెలుగు బోధనను గూర్చి రాయండి
92. ప్రాంతీయ భాషగా తెలుగు బోధనా తీరును రాయండి
93. అన్య భాషా ప్రాంతాల్లో తెలుగును ద్వితీయ భాషగా బోధించడమెలా?

## V. భాషా నైపుణ్యాలు

94. భాషా నైపుణ్యాలను గూర్చి రాయండి
95. భాషా చతుష్కమంటే ఏమిటో వివరించండి
96. భాషా నైపుణ్యాల ప్రాధాన్యాన్ని తెలపండి
97. 'భాషా నైపుణ్యాలు భాషా భవనానికి ' పునాదులు చర్చించండి
98. ఒక వ్యక్తి అక్షరాస్యుడో లేక నిరక్షరాస్యుడో నిర్ణయించటంలో భాషా నైపుణ్యాల స్థానాన్ని వివరించండి
99. పఠన లేఖనాల్లో ముందేదో సహేతుకంగా నిర్ణయించండి
100. భాషణ ఆవశ్యకతను గూర్చి రాయండి
101. వాచిక చర్యను నిర్వచించి, దానిని పెంపొందించే మార్గాలను వివరించండి
102. ప్రాథమిక దశల్లో వాచిక చర్యను పెంపొందించే తీరును రాయండి
103. మాధ్యమికోన్నత దశల్లో వాచిక చర్య నెలా పెంపొందస్తావో వివరించండి
104. సంభాషణల గూర్చి వివరించండి
105. శిశు గీతాలను గూర్చి వివరించండి
106. అభినయ గీతాలను గూర్చి రాయండి
107. భాషా క్రీడలను వివరించండి
108. కథా కథనాన్ని గూర్చి వివరించండి
109. నాటకీకరణాన్ని రాయండి
110. ఉక్త రచనను గూర్చి వివరించండి
111. వక్తృత్వ శిక్షణను తెలపండి
112. సారస్వత సమావేశాల గూర్చి రాయండి

113. వాచిక చర్య దోషాలను నివారణ మార్గాలను వివరించండి
114. పఠనావశ్యకతను తెలపండి
115. ఉత్తమ పఠన లక్షణాలను రాయండి
116. పఠన బోధనా పద్ధతుల గూర్చి వివరించండి
117. అక్షర పద్ధతిని తెలపండి
118. నవీనాక్షర పద్ధతిని గూర్చి రాయండి
119. పద పద్ధతిని వివరించండి
120. వాక్య పద్ధతి గూర్చి తెలపండి
121. పఠన పద్ధతుల్లోకథా పద్ధతి స్థానాన్ని నిర్ణయించండి
122. పఠనాభ్యసన పద్ధతుల గూర్చి రాయండి
123. సాముదాయిక పద్ధతిని రాయండి
124. వైయక్తిక పద్ధతిని తెలపండి
125. పఠన బేధాలు (రకాల) గూర్చి వివరించండి
126. ప్రకాశ పఠనాన్ని వివరించండి
127. ప్రకాశ పఠనాన్ని పెంపొందించే మార్గాలను రాయండి
128. మౌన పఠనాన్ని గూర్చి తెలపండి
129. మౌన పఠనాన్ని పెంపొందించే మార్గాలను వివరించండి
130. అధ్యయన భేదాలను గూర్చి రాయండి
131. క్షుణ్ణాధ్యయనాన్ని గూర్చి తెలపండి
132. విస్తార పఠనాన్ని వివరించండి
133. విస్తార పఠనాన్ని పెంపొందించే మార్గాలను వివరించండి
134. లేఖనావశ్యకతను రాయండి
135. లేఖన బోధనా విధానాన్ని రాయండి
135. ఆధునిక కాలంలో లేఖనాన్ని ఎలా పెంపొందింతురో తెలపండి
137. మంచి దస్తూరి లక్షణాలను తెలపండి
138. లేఖనాభ్యసనాలు గూర్చి రాయండి
139. దృష్టలేఖనాన్ని వివరించండి
140. ఉక్త లేఖనాన్ని రాయండి
141. వివిధ లిఖిత రచనలను సమీక్షించండి
142. లేఖారచనను గూర్చి రాయండి
143. వివిధ రకాలైన లేఖల్ని రచించే తీరును వివరించండి
144. వ్యాస రచనను గూర్చి రాయండి

175. పూర్ణ పద్ధతి గూర్చి వివరించండి
176. ఖండ పద్ధతిని గూర్చి రాయండి
177. సాంప్రదాయిక పద్య బోధనను వివరించండి
178. సాంప్రదాయిక పద్య బోధనలోని లోపాలను రాయండి
179. ఆధునిక పద్య బోధనా విధానాన్ని వివరించండి.
180. పద్య బోధనా సోపానాలను తెలపండి
181. బోధనలో ఉన్ముఖీకరణ స్థానాన్ని నిర్ణయించండి
182. వివిధ దశల్లో బోధింపదగు పద్యాలను గుర్తించండి
183. గద్యాన్ని ఎలా బోధించగలరో వోఇవరించండి
184. గద్య బోధన ఆవశ్యకతను తెలపండి
185. సాంప్రదాయికంగా గద్యాన్ని ఎలా బోధించగలరో వివరించండి
186. ఆధునికంగా గద్యాన్ని ఎలా బోధించగలరో వివరించండి
187. గద్య బోధనా సోపానాలను రాయండి
188. పద్య గద్య బోధనల మధ్య భేదాలను గుర్తించండి
189. ఉపవాచక బోధనను గూర్చి రాయండి
190. ఉపవాచక బోధన లక్ష్యాల్ని తెలపండి
191. ఉపవాచక బోధనా వశ్యకతను తెలపండి
192. సాంప్రదాయికంగా ఉపవాచకాన్ని బోధించే తీరును రాయండి
193. ఆధునికంగా ఉపవాచకాన్ని బోధించే విధానాన్ని తెలపండి
194. ఉపవ వాచక బోధనా సాపానాలను తెలపండి
195. వాచక ఉపవాచక బోధనల మధ్య బేధాలను పేర్కొనండి
196. నాటక బోధనను రాయండి
197. నాటక బోధనావశ్యకతను తెలపండి
198. నాటక బోధనా లక్ష్యాల్ని పేర్కొనండి
199. వ్యాకరణ బోధనను గూర్చి రాయండి
200. వ్యాకరణ బోధన ఆవశ్యకతను తెలపండి
201. వ్యాకరణ బోధనా లక్ష్యాల్ని రాయండి
202. వివిధ దశల్లో వ్యాకరాణాన్ని బోధించే తీరును రాయండి
203. ప్రాయోగిక వ్యాకరణ బోధనను తెలపండి
204. నైమిత్తిక వ్యాకరణ బోధనను రాయండి
205. నిగమోపపత్తి పద్ధతి ద్వారావ్యాకరణాన్ని బోధించే తీరును రాయండి
206. అనుమానోపపత్తి పద్ధతి ద్వారా వ్యాకరణాన్ని బోధించుటను వివరించండి

237. పఠన మందిరాన్ని గూర్చి వివరించండి
238. తరగతి గ్రంథాలయాన్ని గూర్చి వివరించండి
239 గంథాలయ ప్రయోజనాల్ని పేర్కొనండి
240. బోధనో పకరణలో పాఠశాల పత్రికను గూర్చి రాయండి
241. బోధనా సహాయకారిగా సారస్వత సంఘాల గూర్చి వివరించండి
242. బోధనా సహాయకారిగా నిఘంటువుల గూర్చి తెలపండి
243. భాషా వస్తు ప్రదర్శన శాలలు గూర్చి వివరించండి
244. భాషా బోధనలో నల్ల బల్ల స్థానాన్ని నిర్ణయించండి
245. పని అనుభవాన్ని గూర్చి తెలపం

## VIII. మూల్యాంకనం

246. మూల్యాంకనగానేమో తెలిపి, దాని ఆవశ్యకతను వివరించండి
247. పాత మూల్యాంకన విధానాన్ని రాయండి
248. పాత పద్ధతి పరీక్షల గురించి తెలపండి
249. నూతన మూల్యాంకన విధానాన్ని గూర్చి వివరించండి
250. ఆధునిక మూల్యాంకన స్వరూపాన్ని తెలపండి
251. ఆధునిక మూల్యాంకన సాధనాల్ని వివరించండి
252. నూతన మూల్యాంకన ప్రయోజనాల్ని పేర్కొనండి
253. ఉత్తమ ప్రశ్న పత్ర లక్షణాల్ని తెలపండి
254. యూనిట్ ప్రశ్న పత్రాన్ని గూర్చి రాయండి
255. యూనిట్ ప్రశ్న పత్ర నిర్మాణాన్ని వివరించండి
256. యూనిట్ ప్రశ్న పత్ర నిర్మాణంలో వివిధ రకాలైన వివరణ పట్టికల గూర్చి తెలపండి
257. నిర్దిష్ట ప్రణాళికను గురించి వివరించండి
258. వివిధ రకాలైన మూల్యాంకన విశ్లేషణలను సమీక్షించండి

## IX. ప్రణాళికా రచన

259. ప్రణాళికా రచన ఆవశ్యకతను వివరించండి
260. వివిధ రకాలైన ప్రణాళికలను సమీక్షించండి
261. వార్షిక ప్రణాళికను వివరించండి
262. యూనిట్ ప్రణాళికను వివరించండి
263. పాఠ్య ప్రణాళికను గూర్చి తెలపండి